ఓం

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# శక్తి ద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణ తత్త్వకందార్థ దరువులు

(భావ విశేష భావ సహితము)


రచయిత

**శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రులు**

భావ విశేష భావ రచయిత

**శ్రీ సమరస బోధానంద నేమాని వెంకటరామం**

శ్రీ శివరామదీక్షిత అచల గుర్వాశ్రమము

వానపల్లి - 533228



ప్రకాశకులు

శ్రీ చిర్రగోని పీరాస్వామి అండ్ అదర్స్

రాజుల కొత్తపల్లి

వరంగల్ జిల్లా

మూల్యము - రూ. 65-00

ఓం

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

శక్తి ద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణ తత్వకందార్థ దరువులు

(భావ విశేష భావ సహితము)

రచయిత

శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రులు

భావ విశేష భావ రచయిత

శ్రీ సమరస బోధానంద నేమాని వెంకటరామం

శ్రీ శివరామదీక్షిత అచల గుర్వాశ్రమము

వానపల్లి - 533228

ప్రకాశకులు

శ్రీ చిర్రగోని వీరాస్వామి అండ్ అదర్స్

రాజుల కొత్తపల్లి

వరంగల్ జిల్లా

మూల్యము - రూ. 65-00

శ్రీగురుభ్యోనమః ఓం శ్రీనిజగురవేనమః

# ముందుమాట

శ్రీ మద్రామడగు శివరామదీక్షితాచలగురుపరిపూర్ణ సంప్రదాయకులైన, శ్రీమత్పరశురామ సీతారామస్వాములవారి ప్రియశిష్యులైన, శ్రీమద్రాజాధిరాజ మహరాజ యోగీంద్రచంద్రులైన, శ్రీమద్భాగవతుల కృష్ణదేశికేంద్రులు శాలివాహనశకం 1765 సం॥రం, అనగా క్రీస్తుశకము 1843 సం॥రము, శోభకృన్నామసం॥ర మార్గశిర బ॥ చవితి నాటికి "శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులు" 292 యున్ను, క్రీస్తుశకము 1862 సం॥రం దుందుభినామ సం॥ర మాఘశుద్ధపౌర్ణమి నాటికి "క్షరా క్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కంద పద్యములు" 261యున్ను, స్వహస్తములతో రచించిరి. ఈస్వహస్తలిఖితమైన యీ గ్రంథము శ్రీమత్పిల్లానాలక్ష్మణ దేశికేంద్ర మందిరము హైదరాబాదు నందు, ఆమందిర ట్రస్టుబోర్డు వారిచే భద్రపరచబడియున్నది. నిజప్రతి చాలాకాలమై నష్టపోయెడి ప్రమాదమేర్పడుటచే, ఆ నిజప్రతికి ఫోటోస్టాట్ కాపీ తయారుచేయించి , ఆ మందిరమునందు భద్రముగావించబడినది. ఈ విషయము ఆ మందిర ట్రష్టుబోర్డు వారు ఈ గురుసంప్రదాయకులకు చేసిన మహోపకారము, గురసేవయని చెప్పకతప్పదు. శ్రీకృష్ణదేశికేంద్రులు క్రీ.శ. 1875 సం॥రం ధాతృనామ సం॥రకార్తీకశుద్ధ దశమి శుక్రవారం రోజున నిర్యాణము చెందిరి.

కాలక్రమములో అనేకమంది ఈ పద్యభావములను సరిగ అర్థము చేసికొనగల భాషా, శాస్త్రజ్ఞానములేనందున, వారికిష్టము వచ్చినట్లుగా పద్యములకు విపరీత భావములు కల్పించుచున్నారు. మరియు మరికొందరు నిజప్రతియొక్క శబ్దములనే మార్చి పుస్తకముల నచ్చొత్తించి విపరీత అర్థములు చెప్పుచున్నారు. ఉదా॥ "వారెరుగనిమరుగుండదన్నా" అన్న వాక్యమును "దారెరిగిన మరుగుండ దన్నా" ఈ విధముగ శబ్దములు, పద్య భావములను మార్పు జేయుచున్నారు. ఇది సంప్రదాయ విరుద్ధము. శ్రీకృష్ణ ప్రభువుల వారి వ్రాతప్రతి ప్రకారముగానే, మనము చదువుకొనుచు వారి మనోభావమునే అర్థము చేసుకొనవలయును.

పద్యములలో గణ, యతి, ప్రాసాది తప్పులేమైన ఉన్నచో కవిహృదయము నకు మార్పు లేకుండగ సరిదిద్దవలయునని శ్రీకృష్ణప్రభువులు తమ 10, 15

పద్యములలో చెప్పినారు. అట్లే అయిదు ఆరు పద్యములకు గణవిభజన తప్పులు ఉన్నట్లు తెలియబడుచున్నవి. ఆ తప్పులు భావవ్యతిరిక్తముగాకుండగ దిద్దుటకు వీలు కలుగదు. పెద్దల భావమునకే ప్రాధాన్యత గాని చిన్నచిన్న గణవిభజనలాంటి తప్పులను పట్టించుకోనవసరములేదు. అయినను నేను ఆ తప్పులు సరిదిద్దగల పండితుడను కాని కారణముచే ఆ తప్పులను నేను ముట్టుకొనలేదు.

ఈ పద్యభావములు చాలమంది తప్పుగా చెప్పుట నేను విన్నాను. అందుచే మన సంప్రదాయ పెద్దల మనోభావము వక్రీకరింపబడుచున్నదనే వేదన కల్గి, స్వగరు ప్రభువులైన శ్రీసమరసశర్మల ప్రజ్ఞానవిలక్షణ రామారాయ ప్రభువుల వారి కరుణచేతను, వారి మనః ప్రేరణచేతనే, ఈ పద్యములకు భావ, విశేష భావములు వ్రాయడమైనది. ఇది నాకు తగిన పనికాదు. సాహసమే యనదగును. ఎందుచేతననగా నేను సంస్కృతము చదువుకొనలేదు . తెనుగు కూడ బాగ చదివిన పండితుడను కాను. ఇది కేవలము నా గుర్వాజ్ఞగా స్వీకరించి భావములు వ్రాసితిని. అన్యవిధముగా తలంచవద్దని సంప్రదాయ భక్తకోటి నా అల్పజ్ఞతవలన కలిగిన తప్పులేమైన ఉన్నచో అవి విజ్ఞులైనవారు ఈ గ్రంథ ప్రకాశకులైన "శ్రీచిర్రగోని వీరాస్వామి అండ్ అదర్స్ వారికి తెలియపర్చినచో, స్వీకరించగల విషయమే అయినచో పునర్ముద్రణలో సవరించగలరని మనవి చేసుకొనుచున్నాను.

ఈ గ్రంథము యొక్క మొదటి భాగమైన "శుద్ధ నిర్గుణత్వ కందార్థ దరువులు" లో అచ్చుతప్పులు పడినవి. కనుక పాఠకులు మొట్టమొదటగా తప్పొప్పుల పట్టిక ననుసరించి అన్ని తప్పులను సరిదిద్దుకొని తరువాతనే చదువకొనలయుననియు, "బావము" అన్న పదము "భావము" అనియు "విశేషబావము" అన్న పదమును "విశేషభావము" అనియు చదువుకొనలసినదిగ కోరి ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమును అచ్చువేయించు ఆర్థిక శక్తి నాకు లేదు. అయినను వరంగల్ జిల్లా రాజుల కొత్తపల్లి, గున్నేపల్లి, తొర్రూరు, పరమటగూడెం, శీతారంపురం, వేమునూరు, గోదావరిఖని, తూర్పుగోదావరిజిల్లా గుత్తెనదీవి గ్రామ భక్తులు (పేర్లువిడిగా అచ్చు వేయించడమైనది) ముద్రణఖర్చులకు అయిన సొమ్మంతయు విరాళముగా యిచ్చిరి. ఈ గ్రంథమును ప్రకాశింపజేసి నందుకు, ఆ భక్తాగ్రగణ్యులకు కృతజ్ఞతా పూర్వక గురుజేజేలు చెప్పుకొనుచున్నాను.

ఈ గ్రంథమును పునర్ముద్రింపించుకొనుటకు, ఈ గ్రంథములను అమ్ముకొనుటకు వరంగల్ జిల్లా రాజుల కొత్తపల్లి వాస్తవ్యులు, శ్రీపరమశివా నందరాం పొదిని భద్రయార్యులవారికి సమర్పించుకొనుచున్నాను భావముతో, వారి ప్రియశిష్యులైన శ్రీసచ్చిదానంద చిర్రగోని వీరాస్వామి గార్కి సర్వహక్కులతో వారికి అధికారము ఇచ్చుచు, ఈ గ్రంథమును వారికి ఇచ్చుచున్నాను.

**ఈ గ్రంథమును మద్గురు ప్రభువులైన సీతామహాలక్ష్మీసమేత శ్రీసమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ, అష్టతమ నిరవనానంద ఆరట్ల రామారాయగురు సార్వభౌములపాద పద్మములకు సాష్టాంగ ప్రణామంబులతో అంకిత మొనరించుకొనుచున్నాను. గైకొనుము దేవా!**

ఈ గ్రంథమును హనుమకొండ వాస్తవ్యులు శ్రీ వాడపల్లి ఆగదార్యులవారి ప్రియశిష్యులు, శ్రీనిత్యానంద శ్రీవాడపల్లి ఆనందార్యుల వారి అమృత హస్తము లతో ది. 14-11-97వ తేదీని వరంగల్ జిల్లా రాజుల కొత్తపల్లి గ్రామములోని శ్రీపరమశివానందాశ్రమమునందు భక్తకోటి జేజేలతో ఆవిష్కరించి నందులకు శ్రీఆనందార్యులవార్కి కృతజ్ఞతలు తెలియపరచు కొనుచున్నాను.

ఈ గ్రంథములోని రెండవ భాగమైన కందపద్యములు, అనుష్ఠాన విధి వగైరా, పశ్చిమగోదావరి జిల్లా, కొవ్వూరు గ్రామములోని శ్రీ లక్ష్మీ గణపతి ప్రెస్ వారు అతి తక్కువ కాలములో తప్పులు లేకుండ అందముగ ప్రింటుచేసి, మరియు బైండింగు చేయించినందులకు వారికి కృతజ్ఞతలు తెలియపర్చుకొను చున్నాను.

వానపల్లి
శ్రీ శివరామదీక్షిత
అచల గుర్వాశ్రమము.

ఇట్లు
గురుపాద రేణవు,
నేమాని వెంకటరామం.
(శ్రీ సమరసబోధానంద)
గ్రంథకర్త.

ఓం సద్గురు పరబ్రహ్మణే నమః

## గ్రంథకర్త జీవిత సంగ్రహము :-

కందార్ధ భావ, విశేష భావ గ్రంథకర్త నయిన నేను, తూర్పుగోదావరిజిల్లా వానపల్లి గ్రామస్థుడను. నితుందినస గోత్రము, సూర్యనారాయణావధాని దత్తత పుత్రుడను, వెంకటరామ నామధేయుడను. **నేను S.S.L.C. మాత్రమే చదువుకొని**, గ్రామాభివృద్ధి అధికారిగా ప్రభుత్వ సర్వీసులో 36 సంవత్సరములు పనిచేసి ది. 30-11-1994న పదవీ విరమణ చేసినాను. మా స్వగురువులు తూర్పు గోదావరిజిల్లా తొస్సూడి గ్రామం భారద్వాజస గోత్రం, శ్రీసమరస నిర్మల ప్రజ్ఞానవిలక్షణ అరట్ల రామారావుగారు. నా తండ్రి గారు 1953 సం॥లోనే గతించుటచే మా అక్కగారైన శ్రీయదార్థ బోధోపదేశిక ఆచాళ్ళ మాణిక్యాంబ గారి పెంపకములో పెరిగి విద్యాబుద్ధులు బడిసినాను. వీరుకూడ మా గురువుగారి శిష్యులు అగుటచే వారి సంస్కారబలముచేతనే నేను కూడ ఈ పవిత్ర సంప్రదాయక గురుపుత్రుడ నయితిని. **మా గురుదేవుల వద్ద నేను ఉపదేశము పొందిన రెండు సంవత్సరములలోనే మా గురుదేవులు నిర్వాణము చెందుటచే ఈ పరిపూర్ణబోధ మర్మ ధర్మమంతయు, పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెం శ్రీ అవధూత ఆశ్రమ నిర్మాతలు శ్రీ బోధానంద సజ్జా రామమూర్తి గారి విశేష జ్ఞానముచేతను, మా గురుదేవుల అగ్రశిష్యులు వానపల్లిగ్రామ వాసులు, అయిన శ్రీ నిర్మల విచార్ దుప్పలపూడి నాగన్నార్యుల వారు, మరియు మా అక్క గారైన శ్రీయదార్థబోధోపదేశిక మాణిక్యాంబగార్ల బోధలచే సుశిక్షితుడనై, శ్రీ "సమరస బోధానంద" దీక్షానామధేయుడనైతిని.** నాకు 1953 సంవత్సరములో భారద్వాజస గోత్రములో జన్మించిన "సుందరాంబ" నామధేయవతితో వివాహము జరిగినది. అప్పటినుండి నాకు ఆమె సహధర్మచారిణియై ఆమె కూడ మా అక్కగారి శిష్యురాలై ఈ సంప్రదాయములో వర్తించుచు ఈగ్రంథమును వ్రాయుటలో అనేక విధములుగా సహకరించి నన్ను ఉత్సాహ పరచినది అని తెలియపర్చు కొనుచున్నాను. నాకు ఇద్దరు కుమార్తెలు ఒక్క కుమారుడు. వార్కి వివాహములై వారి కాపురములు వారు చేసుకొనుచున్నారు. మా పెద్ద కుమార్తె చి॥సౌ॥ నాగవెంకటలక్ష్మి 1996వ సం॥రములో నావద్దనే ఉపదేశ మర్యాదను పొంది ఈ సంప్రదాయకురాలైనది. ఇది నాకెంతయు ముదావహము.

నా అసలు తలిదండ్రులు (జనని - జనకులు) వెంకట రమణమ్మ, సుబ్బన్న నామధేయులు. నితుందినసగోత్రోద్భవులు. నా దత్తత తండ్రిగారు

నేమాని సూర్యనారాయణావధాని నితుందినసగోత్రము. వీరి సతీమణి నేను పుట్టక మునుపే గతించిరి. వీరి వలన మగ సంతతి లేని కారణముగా నన్ను నా మూడవ సం॥ర ప్రాయములోనే దత్తత చేసుకొనిరి. వీరు వేద పండితులు. ఆస్తికులు. వీరియొక్క ఆశీర్వాద పుణ్య సంస్కార బలముననే నాకు ఈ సద్గతి ప్రాప్తించినదని త్రికరణశుద్ధిగ నమ్ముచున్నాను. ఇంతటి గొప్ప అదృష్టము నాకు లభింపజేసిన మా పెద్దలైన తలిదండ్రులకు నమః సుమాంజలులర్పించు కొనుచున్నాను.

ఇట్లు
గ్రంథకర్త



**ప్రకాశకులు :-**

**శ్రీ చిర్రగోని వీరాస్వామి అండ్ అదర్స్,**

రాజుల కొత్తపల్లి (గ్రామం)

నెల్లికుదురు మండలం,

వరంగల్ జిల్లా.

**పిన్. 506 368**

శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంథమును అచ్చువేయించుటకు విరాళములు ఇచ్చిన దాతల పేర్లు.

I శ్రీ పరమశివానంద శ్రీరాం పాదిలి భద్రయార్యుల

వారి ప్రియశిష్యులు, రాజుల కొత్తపల్లి. రూపాయలు

1) శ్రీ అప॥ సచ్చిదానంద చిర్రగోని వీరాస్వామి దంపతులు

2) శ్రీ అప॥ బుర్రా రామనరసయ్య దంపతులు

3) శ్రీ అప॥ పెరుమాళ్ళ రాములు దంపతులు } 36,115

4) శ్రీ అప॥ పెరుమాళ్ళ యేకయ్య దంపతులు

II శ్రీ విమలానంద వెన్ను నాగయ్య గారి శిష్యులు

5) శ్రీ అప॥ వేల్పుల మల్లయ్య దంపతులు శీతారాంపురం 3,000

6) శ్రీమతి అప॥ మండవ సోమలక్ష్మి

W/o సోమనరసయ్య, వేమునూరు 3,000

III శ్రీ బోధానంద కాయిత వెంకట దాసుగారి శిష్యులు,

7) శ్రీ అప॥సచ్చిదానంద మద్దుల వెంకటరెడ్డి దంపతులు

గున్నేపల్లి 1,000

IV శ్రీ సచ్చిదానంద మద్దుల వెంకటరెడ్డి గారి శిష్యులు.

8) శ్రీ అప॥ బాదం బిక్షం దంపతులు, పరమటగూడెం 1,000

V శ్రీ అప॥ సమరస బోధానంద నేమాని వెంట్రామంగారి శిష్యులు

9) 1. శ్రీ అప॥ దారంకుమారస్వామి దంపతులు తొర్రూరు 3,000

10) 2. శ్రీ అప॥ నాళం కృష్ణమూర్తి దంపతులు తొర్రూరు 3,000

11) 3. శ్రీమతి అప॥ రమాదేవి శర్మ, గోదావరిఖని 2,000

12) 4. శ్రీ బందా సోమశేఖరం మరియు గుత్తెనదీవి భక్తమండలి 2,000

13) శ్రీ అల్లి ఏకసాయిలు దంపతులు, శ్రీ రామగిరి రాములు దంపతులు 1000

గుత్తెనదీవి (తూ॥గో॥జిల్లా)

14) అప॥ శ్రీమతి చామర్తి నాగవెంకట లక్ష్మి, వానపల్లి 500

15) శ్రీ అప॥ కర్ర చెన్నారెడ్డి గారి శిష్యులు

శ్రీ అప॥ నిజానంద కొండా సోమయ్య గారు, గున్నేపల్లి 500

# పుస్తకం హక్కుదారులు

ది. 14-11-1997 సం॥రం ఇందుకు సరియైన ఈశ్వరనామ సం॥ కార్తీక శుద్ధ పౌర్ణమి శుక్రవారం రోజున, వరంగల్ జిల్లా రాజులకొత్తపల్లి వాస్తవ్యులు శ్రీశ్రీశ్రీ పరమశివానంద శ్రీరాంపాదిలి భద్రయాచార్యులారి ప్రియశిష్యులు.

1) శ్రీ సచ్చినదానంద చిర్రగోని వీరాస్వామి దంపతులు,

2) శ్రీ బుర్రా రామ నరసయ్య దంపతులు,

3) శ్రీ పెరుమాళ్ళ రాములు దంపతలు,

4) శ్రీ పెరుమాళ్ళ ఏకయ్య దంపతులు,

అనువారితో ఏర్పడిన కమిటీ వార్కి, ఈకమిటీ అధ్యక్షులుగా నిర్ణయించుకొనిన శ్రీ సచ్చిదానంద చిర్రగోని వీరాస్వామి గార్కి ఈ పుస్తకమును సర్వహక్కులతో సమర్పించుకొనుచున్నాను.

ఈ గ్రంథమును విక్రయించుకొనుటకు, పునర్ముద్రణ చేసికొనుటకు, దీనిని అమ్మగా వచ్చు ఆదాయము, సైకమిటీవారు నిర్ణయించుకొనిన గురుకార్యము లేక మరియే యితర కార్యక్రమములకు ఖర్చుచేసికొనుటకు పూర్తి అధికారము హక్కులతో శ్రీ సచ్చిదానంద చిర్రగోని వీరాస్వామిగార్కి ఈ గ్రంథకర్తనైన శ్రీసమరసబోధానంద నేమాని వెంకట్రామం అను నేను ఈ గ్రంథమును ఇచ్చుచున్నాను.

ఇట్లు,

14-11-1997

నేమాని వెంకటరామం,

(శ్రీసమరసబోధానంద)

"సర్వం సద్గుర్వర్పణమస్తు"

ఈ గ్రంథము ప్రాప్తిస్థానము

శ్రీ చిర్రగోని వీరాస్వామి గారు,

గ్రామం - రాజులకొత్తపల్లి,

మండలం - నెల్లికుదురు,

జిల్లా - వరంగల్,

పిన్ - 506 368

# శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థ దరువులు

## అకారాది వర్ణమాలా ప్రకారముగా పద్య విషయసూచిక


| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| | **అ - 18** | |
| 1. | అప్పకవీయ్యాద్యాంధ్రము | 11 |
| 2. | అన్నియు తానై తన కవి | 49 |
| 3. | అనుమానము మదినుంచక | 60 |
| 4. | అహమనదుగదా అచలము | 79 |
| 5. | అన్నపుసూక్ష్మాంశము | 83 |
| 6. | అంటదుకలమేల్కను | 97 |
| 7. | అపరోక్షమౌనెమనుజుల | 101 |
| 8. | అంతటకలదీ యెరుకని | 125 |
| 9. | అన్నము శుక్లంబగు | 152 |
| 10. | అనహంకారుండ నిమిషుడు | 195 |
| 11. | అన్నము దిన్నను ఆకలి | 201 |
| 12. | అందముగ సద్గ్రంథము | 204 |
| 13. | అలభద్రాచల మనిన | 213 |
| 14. | అందముగు స్వాతి వర్షపు | 219 |
| 15. | అతివల రతిచతురత | 235 |
| 16. | అడవివుశిరికయు | 266 |
| 17. | అందముగ ఘనులు మెచ్చెద | 275 |
| 18. | అక్షయ బోధ స్థితి గల | 278 |
| | **ఆ - 7** | |
| 19. | ఆసాంతముయీగ్రంథము | 15 |
| 20. | ఆగామీకథయెట్లన | 19 |
| 21. | ఆకాశాదికభూతానీకాత్మ | 38 |
| 22. | ఆటాడియాడకుండును | 54 |
| 23. | ఆవరణమునాకసము | 80 |
| 24. | ఆకాశము శూన్యంబని | 81 |
| 25. | ఆమంత్రయుగముదెల్పెద | 223 |
| | **ఇ - 7** | |
| 26. | ఇదియాంధ్రకవిత్వంబని | 14 |
| 27. | ఇలుజొచ్చిగ్రామసింహము | 17 |
| 28. | ఇంతింతనియనరానిది | 37 |
| 29. | ఇది ఉన్నది ఇది ఉన్నది | 160 |
| 30. | ఇది దప్ప యేమిలేదని | 225 |
| 31. | ఇంగితమునెరిగి | 246 |
| 32. | ఇవి వినుమనినను | 271 |
| | **ఈ - 2** | |
| 33. | ఈ రీతి స్థితి గలిగిన | 197 |
| 34. | ఈతాపేక్షను మనుజుడు | 208 |
| | **ఉ - 3** | |
| 35. | ఉప్పెనచే చెడు తరువు | 105 |
| 36. | ఉన్నది పరిపూర్ణము | 189 |
| 37. | ఉపనయనము గానిదె | 210 |
| | **ఎ - 3** | |
| 38. | ఎరుకను కలలోపల | 5 |
| 39. | ఎరుకే కోశము | 165 |
| 40. | ఎరుక నెరుంగని | 292 |
| | **ఏ - 1** | |
| 41. | ఏ పురుషుడు గరువర్యుని | 291 |
| | **ఒ - 2** | |
| 42. | ఒరులొరులు నేను నేనని | 4 |
| 43. | ఒరులు నేనక నిండిన | 284 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| | **క - 20** | |
| 44. | కొంచెములో సరిపుచ్చక | 21 |
| 45. | కట్టెందు నిప్పు లేకనె | 74 |
| 46. | కనరానిదాన్ని శూన్యం | 76 |
| 47. | కనుపడెడుబయలు | 78 |
| 48. | కొందరు దశవిధ | 108 |
| 49. | కొందరు ముద్రలు | 109 |
| 50. | కొందరు భూతము | 114 |
| 51. | కొందరు కర్మమునే | 115 |
| 52. | కన్నులప్రక్కలవ్రేళ్లిడి | 117 |
| 53. | కలమేల్కొలెరుక | 127 |
| 54. | కనవచ్చియిట్టిదట్టిది | 137 |
| 55. | కనవచ్చు బయలులేదని | 138 |
| 56. | కనకమన భూషణంబులు | 153 |
| 57. | కలనెడబాసిన మనుజులు | 158 |
| 58. | కలమేలుకొన్న పురుషుడు | 196 |
| 59. | కుటిలాత్ముడైన శిష్యుడు | 238 |
| 60. | కాకంబులు సంపూర్ణ | 276 |
| 61. | కుత్సితమతియగు | 277 |
| 62. | కొట్టితి తిట్టితి శ్రమలన్ | 286 |
| 63. | కూడిగురుశిష్యులిద్దరు | 289 |
| | **గ - 17** | |
| 64. | గురువర పరిపూర్ణంబన | 25 |
| 65. | గురుడు పరిపూర్ణమును | 133 |
| 66. | గురుమూర్తి జూపకున్నను | 140 |
| 67. | గుడమేమధురము | 159 |
| 68. | గురుమంత్రముచే నిలువని | 166 |
| 69. | గురుతన కలలో నారీ | 170 |
| 70. | గురుడు గురుబోధ | 186 |
| 71. | గురుడచల చలములను | 193 |
| 72. | గూఢార్థమెరిగి | 206 |
| 73. | గురుశుశ్రూషనొనర్చుట | 231 |
| 74. | గురుమూర్తి కెదురహంకృతి | 240 |
| 75. | గురుచరణ జలము | 243 |
| 76. | గురుడు నరుడనుచు | 244 |
| 77. | గురుడాస వదలకుండిన | 249 |
| 78. | గురుగురుబోధలచేతను | 250 |
| 79. | గురుసూచనైన నరులను | 272 |
| 80. | గురువర మీనా సందున | 281 |
| | **ఘ - 1** | |
| 81. | ఘట మెదుట బెట్టి | 283 |
| | **చ - 11** | |
| 82. | చెట్టే మూలము విత్తుకు | 44 |
| 83. | చింతల తోటన మొరుకే | 48 |
| 84. | చులుకని యుక్తిగ | 63 |
| 85. | చిత్తరువు రంగు గోడల | 94 |
| 86. | చచ్చుట పుట్టుట మేలుక | 92 |
| 87. | చూపించ చూపరానిది | 184 |
| 88. | చక్కెర మెక్కక లోకులు | 215 |
| 89. | చూపులలో గల వస్తువు | 163 |
| 90. | చూచి మది దెలిసి | 253 |
| 91. | చెప్పదగు గురుడు బోధను | 270 |
| 92. | ఛందం బెరుగక పద్యము | 12 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| | **జ - 11** | |
| 93. | జనులార జనన మరణము | 1 |
| 94. | జనులాత్మానుభవంబైనను | 118 |
| 95. | జనులనిరి దేవుడెవ్వరికి | 124 |
| 96. | జగము వలన సంకల్పము | 182 |
| 97. | జనన మరణ ప్రవాహము | 202 |
| 98. | జారులకు లోకులందరు | 220 |
| 99. | జలము నెడబాయ నొల్లని | 233 |
| 100. | జపములు తపములు సల్పును | 239 |
| 101. | జ్ఞాన వైరాగ్య భక్త్య | 245 |
| 102. | జనులందరు గురుబోధను | 247 |
| 103. | జతనముగ దాచి చదువుము | 257 |
| | **త - 23** | |
| 104. | తప్పొప్పులు రెంట్నెరుగని | 16 |
| 105. | తన గొప్ప నెంచరేమో | 18 |
| 106. | తానే ననకను నిండిన | 30 |
| 107. | తండోపతండములుగ | 39 |
| 108. | తలిదండ్రులు జీవేశులు | 51 |
| 109. | తొలుకారు మెఱపు కైవడి | 73 |
| 110. | తనమూలము తలిదండ్రులు | 75 |
| 111. | తెలుపు మృదుత్వము | 90 |
| 112. | తలయెత్తి చూడ జాలునె | 99 |
| 113. | తొర్రలు తొమ్మిది గల | 103 |
| 114. | తనువుతో వచ్చిన విశ్వము | 104 |
| 115. | తనువెరుకల రెండొక్కటి | 116 |
| 116. | తనను తాగనిన మోక్షంబని | 119 |
| 117. | తనువా బహిరింద్రియములొ | 130 |
| 118. | తిప్పలగు రాక పోకల | 151 |
| 119. | తిమిరారియందు లేనిదె | 173 |
| 120. | తాబేటి తలపు చేతను | 207 |
| 121. | తొలుమంత్ర పర్ధమెక్కడ | 224 |
| 122. | తనుమన ధనములు | 232 |
| 123. | తనగురు బోధనుతా | 255 |
| 124. | తనశిష్యులు విని తన | 237 |
| 125. | తన భార్య రూపురేఖలు | 256 |
| 126. | తనకు శరణన్న వారల | 269 |
| | **ద - 11** | |
| 127. | దానము ధర్మము సగుణ | 36 |
| 128. | దేహమును జూచుకన్నులు | 55 |
| 129. | ద్వైతా ద్వైత విశిష్ఠులు | 103 |
| 130. | దేవుణ్ణి నిన్ను యెరుగవు | 110 |
| 131. | దేహా కారము గానిది | 144 |
| 132. | ధ్వని మొదలగు తన్మాత్రలు | 198 |
| 133. | దేశాటనంబు జేసితి | 215 |
| 134. | దృష్టాంత మెరుకకేదని | 229 |
| 135. | దేశికుని చరణ తీర్థము | 242 |
| 136. | దూరమున నుండి విన్నను | 252 |
| 137. | ధారుణి కొంత జరించి | 282 |
| | **న - 20** | |
| 138. | నను మిము నేగని | 3 |
| 139. | నే నెవ్వడ నను జీవుడు | 102 |
| 140. | నీ కలలో నిను నన్నును | 121 |
| 141. | నినునను ప్రపంచమును | 131 |
| 142. | నేనని బ్రహ్మ లోపల | 157 |
| 143. | నిను నను నివు కలగాంతువు | 171 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 144. | విను నీవు నన్ను నేనును | 172 |
| 145. | నానా విధావయవములు | 181 |
| 146. | నామము రూపము నటన | 185 |
| 147. | నా మాట లెస్స వినుమా | 199 |
| 148. | నే మొదట నిన్ను గనుగొని | 200 |
| 149. | నాలుగు శుశ్రూషణములు | 241 |
| 150. | నేనెంత లెస్స జదివిన | 259 |
| 151. | నన్నాశ్రయించినావని | 260 |
| 152. | నీ మానసమున సంశయము | 263 |
| 153. | నీ గురుబోధను నీచే | 264 |
| 154. | నిక్కముగ బీరపీచు | 265 |
| 155. | నా బుద్ధికి సరిపడ్డది | 285 |
| 156. | నీ వెంత కొట్టితి తిట్టిన | 287 |
| 157. | నా నోటి మాట వెంబడి | 288 |

## ప - 32

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 158. | పునరుక్తి గలిగి యుండిన | 13 |
| 159. | పుట్టుట గిట్టుట లేకను | 32 |
| 160. | పలుకున బలుకక రాకను | 34 |
| 161. | పిండ బ్రహ్మాండంబులు | 56 |
| 162. | పరిపూర్ణ మొకటి దక్క | 57 |
| 163. | పాపములు పుణ్యములు | 58 |
| 164. | పరిపూర్ణములో దోచుచు | 72 |
| 165. | పిల్లలు తాట్యాకులతో | 84 |
| 166. | పరిపూర్ణములో లేనిదె | 95 |
| 167. | పంచ దశాక్షరములు | 112 |
| 168. | పరిపూర్ణ మెరుకలెట్టివో | 122 |
| 169. | ప్రొద్దున నిద్దుర మేల్కొని | 132 |
| 170. | పరిపూర్ణ మనిన మెట్టిదో | 139 |
| 171. | పరమ పద మనిన | 141 |
| 172. | పరిపూర్ణములో దోచిన | 150 |
| 173. | పొరలరటి దుంప యనినను | 154 |
| 174. | పెను మాయను జాడుము | 155 |
| 175. | పెట్టియు లోపల గారడి | 156 |
| 176. | పరిపూర్ణమనెటి పల్కే | 183 |
| 177. | పరిపూర్ణమెరుక [illegible] | 177 |
| 178. | పరిపూర్ణ మెరు[illegible]నునే | [illegible] |
| 179. | పరిపూర్ణ మెరుక లి[illegible] గురువని | [illegible] |
| 180. | ప్రవిమలచిత్తుడు శిష్యుడు | 209 |
| 181. | పదిరెండక్షరములు గల | 222 |
| 182. | పరిపూర్ణ మిదిగోయిదిగో | 226 |
| 183. | పరిపూర్ణ బోధ నెరిగిన | 227 |
| 184. | పరిపూర్ణబోధ నె[illegible] | 228 |
| 185. | పరిపూర్ణ బోధదెల్పే | 236 |
| 186. | పతియైనను సతియైనను | 261 |
| 187. | పెద్దల నిందయొనర్చకు | 267 |
| 188. | పెత్తనమున యేమంగిల | 268 |
| 189. | పుట్టింట బిడ్డ బహుగా | 274 |

## బ - 6

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 190. | బిందువు తనువున బుట్టును | 122 |
| 191. | బయలాక సమని కొందరు | 126 |
| 192. | బలధన విద్యలు | 218 |
| 195. | బయలెరుకలు విష్ణ్యలకున్ | 221 |

## భ - 1

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 196. | భాగవతుల నారాయణ | 214 |

## మ - 20

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 197. | మనసిచ్చివినుడియిక | 9 |
| 198. | మొదమున వొద్దుపోకకు | 20 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 199. | మొదలచలము నెరిగించెద | 26 |
| 200. | మీరంత వారుగనుకనె | 27 |
| 201. | మొద్దులనైనను దొల్తురు | 28 |
| 202. | మీ రాజ్ఞ యిచ్చి వుంటిరి | 31 |
| 203. | మేలుక సుషిప్తి లోపల | 53 |
| 204. | మేనెరుకల రెండింటిలొ | 85 |
| 205. | మతముల వారలు | 106 |
| 206. | మానవుడు చేయబూనిన | 111 |
| 207. | మాయగదా లేని యహం | 120 |
| 208. | మరణ సుషుప్తులు జెందిన | 168 |
| 209. | మేనెరుకల రెంట్లో నొక | 175 |
| 210. | మరపు సుషప్తి మరణము | 178 |
| 211. | మరుపనతొలి మేనులు | 180 |
| 213. | మరుపుకు తన్మాత్రలు గల | 203 |
| 214. | మంత్రముచే సంతెట్లగు | 211 |
| 215. | మలయాద్రి చెంత చెంచులు | 251 |
| 216. | మంతనమున గురుబోధన | 254 |
| | **య - 28** | |
| 217. | యే సాధన నీకెందుకు | 24 |
| 218. | యెరుకైన రీతినుండును | 33 |
| 219. | యెరుక తొవచ్చిన విశ్వము | 40 |
| 220. | యెరుకైన భూతపంచకము | 42 |
| 221. | యెరుకే దేహేంద్రియములు | 45 |
| 222. | యెరుకే విద్యావిద్యలు | 46 |
| 223. | యెరుకే ఇహ పరసౌఖ్యము | 47 |
| 224. | యెరుకన్నను మరుపన్నను | 59 |
| 225. | యెరుకైన భూతముల నీ వెరుగు | 64 |
| 226. | యెరుకోత్పత్తిని దెలియగ | 65 |
| 227. | యెరుకోద్భవ మెట్లన్నను | 68 |
| 228. | యెరుక బయందులేమిని | 88 |
| 229. | యెరుక పని చేయదనకుము | 86 |
| 230. | యెరుకొక్కటుండె నేనియు | 89 |
| 231. | యెరుకను కలలో పురుషుని | 93 |
| 232. | యెరుగదు సుషుప్తిని జాగ్రత | 98 |
| 233. | యెరుక తనకు దావిడి పోవునె | 100 |
| 234. | యెరుక జడమ జడమ | 113 |
| 235. | యీ ఉత్త బట్ట బయలును | 135 |
| 236. | యే వస్తువు చేతను తానావిర్భ | 145 |
| 237. | యే పరిపూర్ణము మేనికి | 146 |
| 238. | యెరుకనగా యెరిగేటిది | 147 |
| 239. | యెరుగన నేటిది యెరుకే | 161 |
| 240. | యెరుకే చదువుట జేసును | 162 |
| 241. | యెరుకే యెరుకక కొడుకులు | 169 |
| 242. | యెరుకన విడనాడియా | 194 |
| 243. | యెరుక భ్రమ గల్గుశిష్యుని | 230 |
| 244. | యెవరుంటె యేమి భయమురా | 273 |
| | **ర - 5** | |
| 245. | రవిత మనమున్న దెరుగునె | 41 |
| 246. | రాకడ పోకడ లేకను | 70 |
| 247. | రానిది పోనిది బయలని | 188 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 248. | రతి కొఱకు గాదె సతి పతి | 262 |
| 249. | రమ్మని పిలువనిద | 279 |
| | **ల - 10** | |
| 250. | లేనెరుక బయలు లోపల | 66 |
| 251. | లేనెరుకను యెరుకని యన | 67 |
| 252. | లేనెరుక బయలందున | 82 |
| 253. | లేని కల కలిగి నప్పుడు | 87 |
| 254. | లేనెరుక బయలు లోపల | 91 |
| 255. | లేని యహము నన్న బయలును | 121 |
| 256. | లేదనకు యున్న దదిగో | 136 |
| 257. | లేదన్నను కనపడు గద | 148 |
| 258. | లేని లేదనుచు యెందరు | 174 |
| | **వ - 12** | |
| 260. | వినవలెనని కనవలెనని | 2 |
| 261. | వినిమీరివి దిద్దుండని | 10 |
| 262. | విత్తే చెట్టై పుట్టును | 43 |
| 263. | విను మూర్ధ నాభి | 49 |
| 264. | వొక దేహ ధారి తనువున | 52 |
| 265. | వన్నియలై దొకచోటను | 62 |
| 266. | వినుమితరులు యెరుకను | 61 |
| 267. | వనిగల్లు దకము లోపల | 71 |
| 269. | వినవేర్చి చెప్ప నేర్చిన | 258 |
| 271. | వటియించు చన్నులు గల | 280 |
| | **శ - 6** | |
| 272. | శ్రమించు నచల బోధను | 6 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 273. | శ్రీ మత్సాతారామ స్వామి కృపన్ | 7 |
| 274. | శివరా దీక్షితుల శిష్యవరుం | 8 |
| 275. | శరణాగతు డగు శిష్యుని | 23 |
| 276. | శత పత్రాప్తుని పొడగని | 164 |
| 277 | శరశాస్త్ర స్వరహిమ కర | 290 |
| | **స - 11** | |
| 278 | సాధన సంపత్తియుగల | 22 |
| 279 | సూటిగను బోధనా మది | 29 |
| 280 | సామర్థ్యమేమి జూపదు | 35 |
| 281 | సంతోషా సంతోషము | 69 |
| 283 | సంకల్పము లేనిదె | 99 |
| 283 | సత్యమగు బట్టబయలు | 149 |
| 284 | సతి కౌగిట తత్పతి | 187 |
| 285 | స్థితమగు పరిపూర్ణము | 192 |
| 286 | సంకల్పాదిక గుణముల | 212 |
| 287 | సకల జనుల సమ్మతిగ | 217 |
| 288 | సతి పోరు గూరికి పోయిన | 234 |
| | **హ - 3** | |
| 289 | హటమునకు టిలాత్ముని | 116 |
| 290 | హరి కర నఖముఖ విదళిత | 129 |
| 291 | హృదయ గ్రంధి విడుటకు | 248 |
| | **క్ష - 1** | |
| 292 | క్షితిలోన నరుడు పక్వాన్నము | 179 |

ఓం

శ్రీ గురుభ్యోనమః

# లఘుపూజా విధానము

ఆచమ్య :-

ఓం సద్గురుభ్యోనమః ఓం అచలాయనమః

ఓం పూర్ణాయనమః

శ్లో॥ ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవోమహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః ॥

ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో। వంశఋషిభ్యో । మహద్భ్యో । నమో గురుభ్యః సర్వోపప్లవరహిత, ప్రజ్ఞానఘనః, ప్రత్యగర్థో । బ్రహ్మైవాహమస్మి । అహం పదార్థ రహితః ।

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యా గురుం విష్ణుం । సూర్యం శ్రీయాజ్ఞవల్క్యం।
జనకం శుకంచ । సాందీపమీశం । శ్రీకృష్ణం చార్జు
న ముద్ధవంచ, నమామ్యహం ॥

శ్లో॥ శ్రీ ధరస్వామి సచ్ఛిష్యం । శ్రీ శివరామ దీక్షితం ।
తచ్ఛిష్యం రామలింగార్యం । శ్రీపరమారాధ్యం భజే ।
శ్రీ మల్లేశ దేశికాఖ్యం । శ్రీనాగన్నార్య సద్గురుం ।
శ్రీ బలరామపండితం । కృష్ణ, సన్యసార్యంభజే ॥
శ్రీ పంచదశీస్వామినం । దుర్గానంద దేశికేంద్రం ।
శ్రీ ప్రజ్ఞాన విలక్షణ । రామరాయగురుంభజే ॥
శ్రీరామ ప్రభుగురు చరణ సేవాదురంధరం ।
శ్రీ వేదవేదాంతాతీత పూర్ణబోధ ప్రబోధితం ।
శ్రీ సుందరాంబాఖ్య సహధర్మచారిణీ సమేతం ।
శ్రీ సమరస్బోధానంద వెంకట్రామార్యగురుంభజే ॥

అస్మద్గురు సమారంభం । కృష్ణ సాందీపమధ్యమాం ।
శ్రీ మహావిష్ణు పర్యంతాం । వందే గురుపరంపరం ॥
(ఎవరియొక్క పారంపర్యము వారు చదువుకొనవలెను)

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతం నమామి ॥

శ్లో॥ న గురో రధికం, నగురోరధికం । నగురోరధికం, నగురోరధికం।
శివశాసన తత్శివశాసనత । త్శివవ శాసన తత్శివ శాసనతః॥

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో । రూపాతీతోరుకారకః ।
గుణ రూపవిహీనత్వాత్ । సద్గురుత్వం సమాశ్రయేత్ ॥

శ్లో॥ హృత్పుండరీక మధ్యస్థం । సకలామ్నాయ సంస్థితం ।
ధ్యాయామ్యహం సదాభక్త్యా । సకలాభీష్టదాయకా ॥
ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః - ధ్యాయామి

శ్లో॥ ధ్యాన, మావాహనం, సింహా । సనం, పాద్యం తదైవచ ।
అర్ఘ్య మాచమనీయంచ । స్నానం పంచామృతైస్సహ ॥

శ్లో॥ శుద్ధోదకం, వస్త్రయుగ్మం । యజ్ఞసూత్రం విభూషణం ।
విలేపనం, చాక్షతాంశ్చ । పుష్పం స్వర్ణవినిర్మితం ।

శ్లో॥ ధూప, దీపంచ, నైవేద్యం । పానీయం, ఫలమేవచ ।
తాంబూలం, దక్షిణాధిక్యం । మంత్రపుష్పం, ప్రదక్షిణం ।

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదితం ।
కృపయా గృహ్యతాం స్వామిన్ । న్యూనాధిక్యేన చింతయా ॥

శ్లో॥ లఘుపూజావిధిన్ భాగవత కృష్ణ ద్విజన్మనా ।
రచితంశ్రోతృవక్తృణా । మిదం మోక్షకరంపరం ॥
॥సర్వం సద్గురు చరణారవిందార్పణ మస్తు॥

శ్రీ గురుభ్యో నమః (గ్రంథ ప్రభావము) శ్రీ నిజగురవే నమః

# 1. సభా విజ్ఞాపన 3

1) జనులార జనన మరణము 1 లను దొలగన్ ద్రోయు జాలు లక్షణ యుతమె వినువారికి కనువారికి 1 తవలా వెరిగించు దీన్ని తప్పక వింటె॥ అప్పుడే వారలెప్పుడు గంటె 1 కనుక విన బుద్ధైతే వినుడీ చదివెద మీకె। కనుగొన మనసైతే కనుడీ పుస్తకమంత॥ తప్పక వింటే। అప్పుడె వారలెప్పుడు గంటే॥

భావము : ఓ జనులారా ! జనన మరణములు లేకుండగ చేసుకొనవచ్చును. శ్రద్ధ, భక్తి, వినయ విధేయతలు మొదలగు సాత్విక లక్షణములు కలిగినే చెప్పే యీబోధ పూర్తిగా వినువారికి, తిరిగి జన్మ రాకుండగ జేసికొనవచ్చును. ఎప్పుడు వారు విన్న దంతయు కనుట జరుగునో అప్పుడే వారికి తనయొక్క గొప్ప తనమును తెలియవచ్చును. కనుక యిట్టి బోధను వినబుద్ధి కల్గినట్లయితే, నేను యీపుస్తకమంతయు జదివెదను. వినుడు లేదా మీకే చదువుకొను మనస్సు కల్గినచో, యీపుస్తకము అసాంతము విచారణ పూర్వకముగా మీరే చదువుకొనుడు.

విశేష భావము : జనులారా ! అని సంబోధన జన్మెత్తి, నశించు వారాలారా : అనగా పుట్టుట చచ్చుట అను కాలచక్రములో బడి, పుణ్యపాపకర్మలు చేయుచు, "పునరపి జననం, పునరపి మరణం" అను జనన మరణ ప్రవాహము లోబడి "నసపునరావర్తతే" అను పునర్జన్మ రహితమైన విధానమును గాన లేక ఉన్న ఓ జనులారా ! అని సంబోధించుచున్నారు. ఈ గ్రంథము పునరావృత్తి రహిత పద్ధతిని బోధించుచున్నది. కనుక జనన మరణ ప్రవాహమునుండి తప్పించుకొను మార్గమేదైనా కలదా ! అని తపించెడి వారికి మాత్రమే యోగ్యమైన గ్రంథము. ఇతరులకు

ఈ గ్రంథము పనికిరాదు. కనుక అట్టి జనులారా ! వినండి అని సంబోధించినారు.

"జనన మరణములను తొలగన్ ద్రోయుజాలు" అనగా జనన మరణములు లేకుండగ జేసికొనవచ్చును అని అర్థము. ఇక్కడ కొందరు "చావు పుట్టుకలు లేకుండగ జేసికొనవచ్చునన్నారు కదా ! యీ చెప్పుకొన్నవారు కాని వారి గురువులుగాని, గ్రంధకర్తగాని చావు పుట్టుకలలో మొదటి పదవైన చావును తప్పించుకొన్నారా ? లేదు. వారందరు చనిపోయినారు కదా ! ఇక నిర్దుష్టముగాని, పునర్జన్మ తప్పుననుట యేదార్థమెట్లగును ? ఎట్లు నమ్మగలము ? అని ప్రశ్నించుట వినియున్నాను. ఇందుకు సమాధానము కొద్దిలో.

జనన_మరణములు జంటపదములు, ఆకలిదప్పులు, శోక మోహములువలె, జనన మరణములు రెండును ఒకదానిని ఒకటి అనుసరించియే యుండును. పుట్టినవాడు గిట్టక మానడు. "జాతస్య హిధ్రువోర్మృత్యుః। ధృవం జన్మమృతస్యచ", కనుక యీ పుట్టిన వారు యీబోధ విని, వారు చావకుండగ ఉండవలెననుట చాల అవివేకము. జనన_మరణములు లేకుండుట అనగా తిరిగి జన్మించుట, తిరిగి చచ్చుట అను జనన మరణములు లేకుండ జేసెదను అని మాత్రమే అర్థసమన్వయము చేసి, కవిహృదయమును వివరించవలయును. కాని వికటార్థము చేయుట జ్ఞాని లక్షణము కానేరదు. విశేషార్థము చెప్పవలయునే కాని వికటార్థము చెప్పరాదు.

"లక్షణయుక్తమై వినువారికి" – లక్షణయుతము అనగా భగవద్గీతలో జ్ఞాని లక్షణములుగా 20 లక్షణములు చెప్పినారు. అట్టి లక్షణములు భక్తునకు ఉండవలెనని భావము. అవి ఏవనగా–" అమానిత్వ మదంభిత్వా। మహింసాక్షాన్తి రార్జవం। ఆచార్యో

పాసనం శౌచం । స్థైర్యమాత్మ వినిగ్రహః॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ । జన్మమృత్యు జరావ్యాధి । దుఃఖదోషానువర్తనం ॥ అసక్తిరనభిష్వంగః । పుత్రదారా గృహాదిషు । నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టో పపత్తిషు॥ మయిచానన్య యోగేన భక్తిరవ్య భిచారిణి । వివిక్త దేశ సేవిత్వ మరతిర్జన సంసది॥ అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం । తత్వజ్ఞానార్థ దర్శనం । ఏవం జ్ఞాత్వామితి ప్రోక్త్వా । మజ్ఞానం యదతోఽన్యథా॥అన్నారు.

1) అమానిత్వం = తన్ను తాను పొగడుకొనకుండుట, 2) అదంభిత్వా–దంభము లేకుండుట, 3) అహింస–మనోవాక్కాయ కర్మలచే పరులను హింసింపకుండుట, 4) క్షాన్తి–ద్వంద్వముల యందు ఓర్పు కలిగియుండుట, 5) ఆర్జవం–కుటిలత లేకుండుట, 6) ఆచార్యోపాసనం–గురువే పరమదైవమని భావించి గురువునే ఉపాసించుట, దీనికే "మామేకం శరణం వ్రజ" అన్నారు. 7) శౌచం–అంతరేంద్రియ,బాహ్యేంద్రియము శుచి కలిగియుండుట, 8) స్థైర్యం –చంచలత్వమును విడచి ఆధ్యాత్మిక జ్ఞానమునందు స్థిర బుద్ధి కల్గియుండుట, 9) ఆత్మ వినిగ్రహం–ఆత్మను బాగుగా నిగ్రహించుకొనుట, 10) ఇంద్రియార్థేషు వైరాగ్యం–ఇంద్రియములను విషయవాసనలనుండి బాగుగా నిగ్రహించుకొనుట, 11) అనహంకార మేవచ–నేను కర్తను అను అహంభావమును విడచి యుండుట, 12) జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానువర్తనమ్–పుట్టుక, చావు, ముసలితనము, రోగము, దుఃఖ మొదలగు దోషములను మాటి మాటికి స్మరించుచుండుట, 13) అసక్తి పుత్రదారా గృహాదిషు–పుత్రులు, భార్య, గృహము మొదలగు వాటి యందు అసక్తి లేకుండుట, 14) అనభిష్వంగః పుత్రదారాగృహాదిషు–పుత్రులు మొదలగువారికి కలిగిన దుఃఖములను తనవిగా

భావింపకుండుట, 15) నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు- యిష్టా అయిష్టములు రెంటియందు యెల్లప్పుడు సమభావము కలిగి యుండుట, 16) మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ-అనన్య భక్తియోగముచే నేనే (గురువే) తప్ప యితర మేమియు లేదని గురువునందు నిశ్చలభక్తి కలిగియుండుట 17) వివిక్తదేశ సేవిత్వం-ఏకాంత ప్రదేశమును ఆశ్రయించుట (ప్రతిబంధము లేని చోట) 18) అరతిర్జన సంసది-జనసమూహమునందు ఇష్టత లేకుం డుట. 19) ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం - నిత్యమైనది అధ్యాత్మ జ్ఞానమే అనుబుద్ధి కలిగియుండుట, 20) తత్త్వజ్ఞానార్థ దర్శనం- తత్వజ్ఞానముయొక్క గొప్ప ఫలితమును పొందవలెనను దృఢ భావము కలిగియుండుట, అను యీ ఇరువది లక్షణములు కలిగి యుండవలెనని కృష్ణదేశికేంద్రుల అభిప్రాయముగా గ్రహించ వలెను. కనుక యిట్టి లక్షణములు లేనివారికి యిట్టి ఆధ్యాత్మిక బోధ చేయరాదు.

వేదాంత విద్యయందు అమిత శ్రద్ధ, 2) గురువునందు-భక్తి 3) వినయవిధేయతలు ఉండవలెనని కూడ చెప్పవచ్చును

"వినువారికి, కనువారికి"- వినుట కనుట అన్నారు. బోధను ఏకాగ్ర బుద్ధితో వినవలెను. మరియు విన్నదంతయు మననము చేసికొనుచు ఆచరించవలెను. దీనికే శృతియు "ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్య" అన్నారు. శ్రవణ, మనన, నిధిధ్యాసలద్వారా బ్రహ్మతత్వము తెలియబడగలదు అన్నారు. శ్రవణము అనగా బోధను గురుముఖముగా వినవలెను. కనుట- అనగా, మనన నిధి ధ్యాసలు చేయుట. అనగా విన్నదం తయు మననము చేసికొనుచు, అట్టి విధముగా ఆచరణయుక్తులైన వారికి మాత్రమే బ్రహ్మవిద్య ఉపయోగము కాగలదు. రాజ్యపాల కుడు, ద్వారపాలకుడు అనుశబ్దములలో, రాజ్యపాలకుడు అనగా

రాజ్యమును పాలించువాడు అని అర్థము, కాని ద్వారపాలకుడు అనగా ద్వారమువద్ద కావలికాయువాడు అని అర్థము చెప్పవలెనే కాని ద్వారమును పరిపాలించువాడు అని చెప్పరాదు. అట్లే కనుట అనగా చూచుట, విచారించుట, అని రెండర్థములు. బ్రహ్మతత్వము చూడబడేది కాదుకనుక విచారించి తెలుసుకోవలయును అని అర్థము చెప్పవలెను. అయితే చెప్పిన విషయమును విచారణతో ఊరుకుంటే ఫలితములేదు. "ఏకంవేదాంత విజ్ఞానం స్వానుభూత్యా విరాజితే" అనియు "స్వానుభూత్యేకమానాయ" అనియు పెద్దలు చెప్పచున్నారు. కనుక వేదాంత జ్ఞానులు వట్టి విచారకులై గంభీరోపన్యాసములతోను, గొప్ప గొప్ప వ్యాఖ్యానములతోను చెప్పినంత మాత్రమున వారు బ్రహ్మవేత్తలు కాలేరు. ఆచరణయుక్తమైన విచారణచే మాత్రమే బ్రహ్మజ్ఞానము యొక్క ఫలితమును పొందగలరు. అదియే "నిధిధ్యాస" అనికూడ చెప్పవచ్చును. కనుక యీ పద్యములో కృష్ణ ప్రభువులు శ్రవణమునకు_వినుట అనియు మనన, నిధిద్యాసల రెంటికి - కనుట అనియు చెప్పినట్లుగా గ్రహించవలెను.

"తనలావెరిగించు"—తనలావు ఎరిగించును. లావు అనగా బలములేక గొప్పతనము అని అర్థము. అనగా తనయొక్క గొప్ప తనమును తెలియపర్చును. అనగా ఈ గ్రంథము జదువుటచే వానియొక్క గొప్పతనమెట్టిదో తెలియపర్చును. అని అర్థము. ఇదివరలో "అహం బ్రహ్మస్మి" నేనే బ్రహ్మను అనుకున్నాడు. ఈ గ్రంథమును చదివి "నేను" మూలము లేనిది అని తెలుసుకొనును కనుక తనెంత గొప్పవాడో తెలియపర్చును అని భావము.

"అప్పుడే వారలెప్పుడున్న దే" — వారలు ఎప్పుడున్నదే అప్పుడే తెలియపర్చును. అనగా దీనిని విని ఎప్పుడు కనుదువో

అప్పుడే తనలావు తెలియబడగలదు. అంతేకాని అన్ని మంత్రముల వలె ఇన్నిసెర్లు జపించిన తదుపరి సిద్ధించును అనికాదు. నీవు ఎప్పుడు విచారించెదవో అప్పుడే లేకుండా పోదువు. ఉండగానే "నేను" లేను అని తెలియబడగలదు అని అర్థము.

(గ్రంథ శ్రవణాధికారులు)

౭) వినవలెనని కనవలెనని। మనసందున కోర్కెగలుగు మనుజులె వినుడీ। వినజేసెద కనజేసెద। ఘనమగు యీబోధ విన కన నొల్లనట్టి॥ మనుజులు చనుదొచ్చిన త్రోవబట్టి॥ తినమంటె పులివలదని లోకులనవింటే। గనుకనెవినవలెనన నోరాడదువిన॥ కన నొల్లనట్టి। మనుజులు చనుదొచ్చిన త్రోవబట్టి॥

భావము : (కనుక ఓ సభాసదులారా ! అన్యాపదేశము) ఈ గ్రంథస్థ విషయము వినవలెనని, విన్నదంతయు ఆచరణ పూర్వక విచారణ చేయవలయుననియు, మనసులో ఎవరికి కోర్కె గలదో వారికి మాత్రమే యీగొప్పబోధ వినజేసెదను, కనజేసెదను. అట్టివిధముగా విన_కనలేనివారు వచ్చిన త్రోవనే వెళ్ళుడు. ఆవు పులి కథలో ఆవు తినవద్దు అన్నప్పుడు పులి తింటాననియు, ఆవు తిన మనినపుడు పులి తిననని యు చెప్పినట్లుగా, పులివలె రజోగణ ప్రవృత్తి గల వారికి నేను వినమని చెప్పినను వినరు. కనుక పదే పదే వినవలెనని చెప్పలేను.

విశేష భావము। ఈ చెప్పబడిన గొప్పదైన పరిపూర్ణ బోధ, ఆసాంతమువిని ఆచరణపూర్వకమైన విచారణ చేయుటకు మనస్సుగలవారు మాత్రమే వినండి అన్నారు. ఈ బోధయొక్క ఫలితము పునర్జన్మ బంధము నుండి తప్పింపబడుట, ఈ ఒక్క ఫలితమును సాధించుటకు దృఢమైన కోర్కెగల వారు మాత్రమే వినండి అనియు, ఇతరమైన ఇహ పరభోగ సంతతదలయందు

మనస్సు గలవారు యిందుకు అర్హులు కారనియు భావము." చను దొచ్చిన త్రోవబట్టి" అన్నారు. అనగా ఏలాగున వచ్చితిరో ఆలాగే వెళ్ళండి అని అర్థము. అనగా పూర్వమువలెనే వస్తూ పోతూ ఉండండి. పునరపి జననం. పునరపి మరణంతోనే ఉండండి అని అర్థము. "అనేక జన్మాని జ్ఞానం లభ్యతే, జ్ఞానమనంతాని పూర్ణ బోధావశిష్యతే" అన్నట్లుగా జన్మాంతర సుకృత కర్మ ఫల విశేష ముచే సత్వగుణ ప్రధానులైన వారికి మాత్రమే ఇట్టి పరిపూర్ణబోధ తెలుసుకొనుటకు తలంపు కలుగును. అట్టివారినిమాత్రమే వినమంటే వినగలరు విచారించగలరు. అట్టి సత్వగుణము లేనివారు, రజోగుణ ప్రధానులైనవారు పులివలె నేను చెప్పిన భావమునకు వ్యతిరిక్తులై యుందురు. జ్ఞానమునందు మనస్సు నిలబడదు. అందుచేతనే ఇందులో ఆవు-పులి కథను కేవలము ఉదాహరణ నిమిత్తమై గ్రంధ రచయిత ప్రస్తావించినట్లు గ్రహించవలెను. కనుక ఈపద్యభావము చేత రజోగుణ, తమోగుణ ప్రధానులైన వారికి యీ బోధ చెప్ప రాదనియు, సత్వగుణ ప్రధానులై జనన మరణ ప్రవాహము నుండి తప్పించుకొనవలెనని దృఢమైన కోర్కెగల వారికి, వెనుక పద్యములో చెప్పిన శిష్యలక్షణములో చెప్పినట్లు 20 లక్షణములు కల్గిన వారికి మాత్రమే యీగొప్పదైన బోధను చెప్పవలెనని కృష్ణ ప్రభువుల ఆదేశము. (గ్రంథకర్త నిస్వార్థము)

గీత WRONG *

3) కం॥ నను మిము నేగని పుస్తక । మునుజేసితి దీన్ని మీరు ముదమున వినుడం । చనుటయు మిమునను మీరలు । గనుగొని వినిపించుమనుట కలయిట్టిమాట ॥ బోధను మేల్కగనలే దెచ్చోట । ఘనులారా యిటువంటి కలలో ముచ్చటలాడి । గొన కొని మీరు మేల్కొని । మేల్కొల్పుడి నన్ను ॥ కలయిట్టిమాట । బోధను మేల్కగనలేదెచ్చోటా ॥

భావము : "నను"–"మిము" విచారణజేసి యీ గ్రంథ మును వ్రాసితిని. దీనిని మీకు చక్కగా వినండి, అనుటయు, మిము–నను విచారించి యీ గ్రంథమును చదివి వినిపించమను టయు–ఇదంతా ఒక కల. ఇట్టికల, "బోధ" అను మేల్కయందు ఎచ్చటనులేదు మహాజనులారా ! యిటువంటికలలోనే మనము ముచ్చటించుకొని, ప్రయత్నించి, మీరు కలనుండి మేల్కొని అవల నన్ను మేల్కొల్పండి.

విశేషభావము : ఈ పద్యములో "నను" అనగా నేను–"ఆత్మ" అని అర్థము చెప్పవలెను. మిము అనగా నేనుకు ఎదుటిది కనుక జగత్తు అనియు అర్థము. ఆత్మను, ఆత్మనుండి యేర్పడిన జగ తును విచారించి యీ పుస్తకమును చేసితిని అని కృష్ణ ప్రభువుల భావము. ఇట్టి గ్రంథమును వినుమనుటయు, మీరుకూడ ఆత్మ జగత్తులను విచారించిచుచు వినిపించుమనుటయు ఒకకల, స్వప్నము వంటిది, పరిపూర్ణ పరబ్రహ్మములో "నేను" కలవలె లేక తోచబడి నది కనుక "నేను" కల అని చెప్పబడినది. కనుక 'నేను' వల్ల యేర్పడిన జగత్తుకూడ స్వప్నమువంటిదే. నేనే కలయితే నేను చెప్పుట మీరు వినుట అనునది స్వప్నమేకదా. యీ కలలేకపోవుట మేల్కయగును. జాగ్రదవస్థయందు (మేల్క) కలలేకపోవు చున్నదికదా. కనుక "నేను" అనుకల పరిపూర్ణబోధ అను మేల్క యందు లేకపోవును. కనుక యీ బోధ విని తెలుసుకొన్నవారు, 'నేను' అనుకలనుండి మేల్కొన్నవారై లేకపోవుదురు. 'నేను' లేకపోవుటయే 'మేల్క', శిష్యులు మేల్కపొందినచో అనగా వృత్తి లేనివారైనచో వారికి తిరిగి గురుబోధ అవసరమురాదు. గురువు అవసరములేదు. అదే గురువును మేల్కొల్పుట అగును. అట్టి శిష్యులు మేల్కొనక తిరిగిపుట్టినచో గురువు కావలసిన

వారగుదురు. కనుక "మీరు మేల్కొనండి నన్ను మేల్కొల్పండి అన్నారు. అనగా మీరు తిరిగిరాని స్థితిని పొందినచో నన్ను మేల్కొల్పినవారగుదురని భావము.

(గాన కొని = ప్రయత్నము చేసి)
(గ్రంథ ఫలము)

4) కం॥ ఒరులౌదురు నేనునేనని । యొరులను తన నెన్న డెరుగకున్న భయములో । నరుదెంచితనను తాగని । పరులని గని తెప్ప నేను పరులౌనియుడుము॥ యెరిగే యెరుకే భయముండగనుచు। నిరతామునెందునిలువాకుండుటకాక్షై । విరచిస్తి దీన్నెరుకావినెనా నిల్వదు ॥ నేను పరులౌనియుడుము । యెరిగేయెరుకే భయముండగనుచు ॥

భావము : ఇతరులని నేను అని అనే "నేను", ఇతరమును తనను యెంతమాత్రము యెరుగని పరిపూర్ణ పరబ్రహ్మములో తనంతతానుగా యేర్పడి, తనను విచారించి, తనునుండి యేర్పడిన జగత్తును విచారించి, నేను "ఆత్మను, యితరమైన జగత్తంతయు జనించి గతించేదే అని తెలుసుకొనుచున్న "నేను"అను యెరుక. తనకు పరముగా తనకునుండే పరిపూర్ణమున్నదని తెలుసుకొన్నచో, తాను ఎప్పుడు ఎచ్చటాలేకుండాపోవును. అందుకే యీ గ్రంథమును రచించినాను. యీ గ్రంథమును నేను – యితరము అనిద్వంద్వముతో కూడిన యెరుక వినినచో పరిపూర్ణమె ఉన్నదని, తాను లేనని తెలిసి యెప్పటనులేకుండాపోవును.

విశేషభావము : "నేను" అనగా యెరుక, యెరుక అనగా తెలుసుకొనునది, తెలియుచున్నది. తెలివి అని అర్థము. నేను అను జ్ఞానముచే సమస్తము తెలిసికొనుచున్నాము. తెలియుబడిన సమస్తము నాయొక్క రూపమే. కనుక "నేను" అనునదే ఎరుక.

నేను ఆత్మ. దీనినుండి యేర్పడినదే జగత్తు. కనుక ఆత్మ-జగత్తులు రెండునూ యెరుకే. దీనికి వ్యతిరిక్తమైనది. అనగా 'నేను' లేనిది పరిపూర్ణము. కనుకనే పరిపూర్ణమును 'నేను' తెలిసికొనలేదు. కనుక పరిపూర్ణము 'నేను'కు అతీతము. నేను లేనిది. కనుక నేను అనుకలకు పరిపూర్ణమున్నదని తెలియుటే మేల్కొ. పరిపూర్ణమున్నదని తెలసి 'నేను' అను యెరుక లేకపోవుటకై యీ గ్రంధము రచింపబడినది. అదే పునరావృత్తి రహితము

(స్వప్న కారణాలు)

5) కం॥ ఎరుకనుకల లోపలనే। నరుదెంచితి మీరలట్లె యెరుదెంచితిరీ। యెరుక జననేను మీరలు। యెరుకతో జనువార మనుచు యెరిగేటికొరకు॥ గ్రంధము జేస్తి నెరిగి యీవరకూ। గురుబోధం చనుమేల్కొ నరులారచేకొంటే। యెరుకానెకలజోలినైరిగున్న నిల్వదం॥ చెరిగేటి కొరకు। గ్రంధముజేస్తి నెరిగి యీవరకూ॥

భావం : యెరుక అనే కలయందే నేను వచ్చితిని. మీరు కూడా అట్లే ఎరుకను కలలో వచ్చిరి. కనుక యెరుకలేకపోయినచో ఎరుకతోవచ్చిననేను, మీరుకూడ ఎరుకతోనే లేకపోవుదుము, అని మీరు తెలుసుకొనుటకై యీవిషయము ఇదవరకే నేను తెలుసుకొని యీ గ్రంధము వ్రాసితిని. ఓ నరులారా। ఈ గురుబోధనే మేల్కొ మీరుపొందినచో, యెరుకనే కలజోలి యెరిగిఉన్నా ఎరుక లేకపోవుటకై యీ గ్రంధమును వ్రాసితిని.

విశేష భావము : యెరుకవల్లనే నేను వచ్చితిని, నావలెనే మీరుకూడ ఎరుకవల్లనే వచ్చిరి. "జన్మాద్యస్య యతః" అను బ్రహ్మసూత్రములలో రెండవ సూత్రము చెప్పినట్లుగా, యీ సమస్తము దేనివలన యేర్పడుచున్నదో అదే బ్రహ్మ" అనిచెప్ప

బడినది. అబ్రహ్మనే యాబోధలో "యెరుక" అని చెప్పబడుచున్నది. ఇది కార్య, కారణరూపమైనది. ఇట్టి యెరుకవల్ల నేను, మీరు, జగత్తు అంతయు ఏర్పడుచున్నది. ఇట్టి యెరుక అనేది కల వలె పరిపూర్ణ పర బ్రహ్మములో లేక తోచబడినది. ఇట్టి కల లేకపోయినచో ఆపైన ఉన్నదే పరిపూర్ణము. ఎరుకలేనిచో యేమీ లేదు. కారణము లేకపోయినచో కార్యము లేదుకదా। అదే యీ గ్రంధములో విశదీకరించబడినది. ఈ పద్యములో నరులారా! అని సంబోధించిరి. నరులనగా అజ్ఞానులు, జీవులు అని అర్థము. తానే బ్రహ్మ అనే భ్రమలో ఉన్నవారు కనుక నరులు కలలోని వారు అని గ్రంధములో చెప్పబడినది. అట్టి కల నుండి మేల్కొల్పుటకే గురుబోధ కావలయును. కనుకనే "గురుబోధంచను మేల్కనరులారా చేకొంటె" అని చెప్పబడినది. అనగా గురుబోధ అనే మేల్కవలన ఎరుక అనే కల లేకపోవును.

"యెరుకానెకల జోలి యెరుగున్నా నిల్వదు. అనగా గురుబోధను పొందిన తరువాత ఎరుక కలవంటిది అనియు, పరిపూర్ణమె శాశ్వతమైనదనియు, దానియందు యీయెరుక లేనే లేదనియు తెలిసి, ఎరుకయందు భ్రాంతి రహితులై యుండుదురు. అట్లుయెరుక లేనిదని తెలిసి యెరుకలో పనులు చేయుచున్నా యెరుక ఉన్నదనే భ్రాంతి ఎంతమాత్రము ఉండదు అని భావము.

"ఎరిగే వరకు" — అనగా యీ బోధ తన గురుపరంపరగా గురుకరుణ సుశిక్షితుడై తెలిసికొనిన తరువాత యీగ్రంథము వ్రాసినట్లు చెప్పుకొనుట. అంతియేకాని తన తెలివిచే గ్రహించిన అప్రమాణమైనది కాదని తెలియపర్చుచున్నారు.

(అచలబోధ సాంప్రదాయక గురుస్తోత్రము) 12



6) కం॥ శ్రీమించు నచల బోధను । యీమహనీయుండు జేసి యెగజల్లెనొయీ । భూమిన్ సుజనుల కొరకా । రాముడగన్వయజ శివరామా దీక్షితులన్ ॥ తలచి యప్పారావ్ గుణ తతులన్ । ప్రేమతో బొగడినే భూమి నిర్జర పరశు । రామ సీతారామస్వామికి మ్రొక్కి "శివరామాదీక్షితులన్ । తలచి యప్పారావ్ గుణ తతులన్ ॥

భావము : శ్రీమించిన యీపరిపూర్ణ బోధ, యీభూమిపై సుజనుల కొఱకు శ్రీరాముడుగు శివరామదీక్షితుల వారి వలన, వీరి నుండి శ్రీకంబాలూరి అప్పబ్రహ్మంగారు, వీరినుండి బ్రాహ్మణోత్తములైన పరశురామ సీతారామస్వాముల వారి యీబోధ యెగజల్లబడినది. అట్టి వారందరికి నేను నమస్కరించుచున్నాను.

విశేష భావము : "శ్రీమించు నచలబోధ". గ్రంథారంభమున "శ్రీ" కారము చుట్టి ప్రారంభించుట సత్సాంప్రదాయము.

శ్రీ అనగా_లక్ష్మి, సంపద, వృద్ధి, శోభ, కీర్తి, బుద్ధి, విషము, త్రివర్గము, అని ఇట్లు చాల అర్థములు కలవు. ఇచ్చట శ్రీమించు నచల బోధ అన్నారు. అచలబోధ ఎట్టిదనగా శ్రీమించునది అని విశేషించి చెప్పబడినది. అనగా అచలము బుద్ధిగోచరము కానిది. తెలివికి అందరానిది, నేను అను తెలివి లేనిది. కనుక బుద్ధికి మించినది ఈ అచలబోధ అని చెప్పుటైనన్ను, [illegible] ట్టి ఆరంభించిన సత్సాంప్రదాయమును పాటించినట్లుగను కూడ రెండు విధములుగ నొప్పుచున్నది. ఇట్టి 'శ్రీమించు నచలబోధ' ప్రయోగము "నభూతో నభవిష్యతి", అదే శ్రేష్ఠ [illegible] వులయొక్క సామర్థ్యమును చాటుచున్నది. [illegible]రికి వీరి స్తోత్రము అనుట అతిశయోక్తి కానేరదు.

మూలము, ఇది ఈ గ్రంథములో చెప్ప దలచుకొన్న పరిపూర్ణపర బ్రహ్మ మువంటిదే. కాని పరిపూర్ణంలో సత్ పదార్థముసుకాని అసత్ పదార్థముకాని లేదు ఏమీలేదు ఉత్తంది. ఈ ఒక్క లక్షణముతప్ప మిగతా అన్ని విషయ ములలోను పరిపూర్ణము, సదసత్పదార్థమైన రసము. సమముగా ఉండును. కనుక ఈ గ్రంథమును అర్థముచేసికొనుటలో పొర పాటుగా సదసత్ పదార్థము గురించి అనుకందురేమో? అదికాదు. అట్టి సదసద్రహితమైన పదార్థము పరిపూర్ణము గురించి ఈ పద్య ములు చెప్పినట్లుగా భావించవలెనని గ్రంథకర్త చెప్పుచున్నారు. కనుక యీ పద్యములలో చెప్పబడిన పరిపూర్ణము ఆత్మ-జగత్తుల కారణమైనది ఎంతమాత్రము కాదని గుర్తించి అర్థము చేసుకోవల యును "ఓ జనులారా యిటు గనరయ్యా! "ఓ జనులారా! జన్మ-పుట్టి, -మరణ చెందువారలారా. యిటు గనండి. ఇంతవరకు మీరు అద్వైత పరబ్రహ్మతత్వముగా చెప్పబడిన సదసత్ పదార్థముపై మీ దృష్టి ఉన్నది. ఇప్పటి నుండి ఈ పద్యభావము ప్రకారముగా అట్టి పదార్థము కాని పరిపూర్ణ భావముపై మీ దృష్టిని త్రిప్పండి అని చెప్పటయే "యిటుగనరయ్యా!" అని సంబోధించిరి.

బ్రహ్మ విద్యా సులు అయిన గురుమూర్తి దయాసముద్రుడు. "దయ" అనగా అందరు తనవలెనే ముక్తిపొందవలెనను భావమే దయ అను శబ్దమునకు లో అర్థముకనుక కృష్ణప్రభువులు అట్టిదయా సముద్రులగుటచే అందరూ తనవలెనే జన్మరహితులుకావలయునని కోరికతో యీ బోధను వినమని "పలుమార్లు నే మిమ్ము వేడెదింతియ సుమ్మీ" అని చెప్పుకున్నారు.

(గ్రంథకర్త స్వపరిచయాభివర్ణనము)

8) శ్రీ శివరామదీక్షితుల శిష్య వరుండప్పయమంత్రి యుతని శిష్యుడు భువిపరశురామవంశో ద్భవ సీతారాములతని భక్తుడ సుమ్మీ ॥ తద్బోధ ప్రయుక్తుడసుమ్మీ । స్తవనీయులగు

మీరుత్సాహముతో యీ గాథ । వినఁడీనేకందార్థములచే వినిపింతు॥
భక్తుడనుమ్మీ । తద్భోధ ప్రియుఁడనుమ్మీ ॥

భావము : శ్రీ శివరామదీక్షితులవారి శిష్యులు కంబాలూరిఅప్ప బ్రహ్మ మంత్రిప్రభృతులు. వీరిశిష్యులు పరశురామ సీతారామస్వామి ఇట్టి శ్రీసీతారామస్వామి వారి శిష్యుడు (యీగ్రంథరచయిత) శ్రీ భాగవత కృష్ణభట్టు. వీరు చెప్పిన ఈ కందార్థములుగా వారి గురువు గారు చెప్పిన బోధను ప్రకటించినారు. అట్టి కందార్థరూపముగా వినిపింతును ఈ పరిపూర్ణ బోధను, మీరందరూ ఉత్సాహముతో వినండి అని గ్రంథకర్త చెప్పుకొనినారు.

( సుకవి ప్రశంస )

9) కం॥ మనసిచ్చి వినుఁడి యికనొక । మనవిది నాపాలిగురుని మదిలోపలనే । నునుచుకొని పెద్దలాజ్ఞను । పనిబూనుక జేస్తినిట్టి పద్యములిన్నీ ॥ తప్పొప్పులేర్పడ బుద్ధుండన్ని । ఘనమతిమంతులు గనుకనే ప్రార్థిస్తి । నను మీ కటాక్షములతో వీక్షింపుము ॥ పద్యములిన్నీ । తప్పొప్పులేర్పడ బుద్ధుండన్నీ ॥

భావము : అయ్యా : మనస్సు యిచ్చట ఉంచి వినండి అని మనవిచేసుకొనుచున్నాను. నాపాలిటి గురుమూర్తిని మనస్సులో తలచుకొని, పెద్దల యొక్క ఆజ్ఞానువర్తునుడనై యీ బోధను పద్యరూపములోచేసినాను. మీరు గొప్ప బుద్ధిమంతులు కనుక, నన్ను మీ దయాదృష్టితో చూసి, యీ పద్యములలో ఏమైన తప్పుబున్నయెడల, అవి ఒప్పులు అగునట్లు దిద్దవలసినదిగా ప్రార్థించుచున్నాను.

10) కం॥ విని మీరివి దిద్దుండని । పనిబడి ప్రార్థించనేల పరుసము నినుమి । ట్లను నె స్వర్ణముగా మని । తనకై తానేను సన్నిధానమందుంటే ॥ తెల్పుడియను నామిందుంటే । మనవీ జేసునె పాలిమ్మనితే గతల్లికి । తనకై తానిచ్చును దయజేసితా ॥ సన్నిధానామందుంటే । తెల్పుడియనుమానమిందుంటే ॥

భావము : పరుసవేది సన్నిధానములో నున్న యినుము తన్ను బంగారము చేయుమని కోరకనే, దాని సన్నిధిలో ఉన్నందున బంగారముగా అగుచున్నది. బిడ్డ లేగదూడ తల్లివద్దకు వెళ్ళగానే అడగకనే పాలిచ్చుచున్నది. కనుక యీపద్యములను మీరు విని యిందున్న తప్పులు దిద్దవలసినదిగా నేను పనిబడి ప్రార్థించనవసరములేదు. యిందులో తప్పులు అనుమానము యున్నచో సరిదిద్దవలయును.

11) అప్పకవీ యూద్యాంధ్రము । లొప్పగు మాఘాది కావ్యమొగిజదివికృతిన్ తప్పనెకవులను సమముగ తప్పులు లేకుండ జెప్పతరమౌనాకృతినీ ॥ ఊహను జేసి మరనేనీకృతినీ । గొప్పౌ పక్షులతోటి కొదువా పక్షులసాటె । కుప్పారవీధిని మవ్యాడేటందుకు॥ తరమౌనాకృతినీ । ఊహనుజేసి మరినేనీకృతినీ :

భావము : గొప్పవగు అప్పకవీయము మొదలగు ఆంధ్ర కావ్యములను, మాఘము మొదలగు కావ్యములను జదివి తప్పులెంచగల అట్టి మహాకవులకు సమముగా తప్పులు లేకుండగ ఈ గ్రంధము వ్రాయుటకు నాతరమౌనా ? ఈ కృతిని నా ఊహకు తోచిన విధముగా చేసితిని. ఆకాశవీధిని పెద్దపక్షులతో సమానముగా చిన్నపక్షులు ఎగురలేవుకదా ।

విశేష భావము : అస్వకథీయము, మాఘము మొదలగు కావ్యరచయితలు అయిన గొప్ప కవులతో సమానముగా ఈ పద్యరచన చేయలేనని చెప్పినంతమాత్రమున కృష్ణ ప్రభువుని తక్కువ పండితునిగా మనము ఎంచరాదు. అది వీరి అనహంకారత్వమును సూచించుచున్నది. వీరి రచనలో భావగంభీరత, గ్రాంధిక, గ్రామ్యశబ్దముల మేళవింపుతో చేసిన పద్యరచన, చాల గొప్పది. "ఉపమాకాళిదాసస్య" అన్నట్లుగానే ప్రతిపద్యములోను ఉపమాన, ఉపమేయములు కల్గియుండుట క్రమాలంకారాది విశేషములు వీరి కవిత్వములో చాల ఎక్కువుగా గ్రహింపనగును.

12) కం॥ ఛందం బెరుగక పద్యము/లెందుకు జేసితివటంచు యెందరనిననే/సందేహించక జేసితి/నిందుల తప్పుంటెమీరలివిదిద్దేరనుచూ॥నే జదివితె చెవియొగ్గివినుచూ/అందముగ చిత్తమందిట్లు తలపోసి/కందార్థములను మీముందారబెట్టితి॥యివి దిద్దేరనుచూ/నే జదివితే చెవియొగ్గి వినుచూ॥

భావం : ఛందశ్శాస్త్రము వగైరాలు తెలియక పద్యములెందుకుజేసితివి అని యెందరడిగెనరోయని సందేహములు లేకుండగ మీరు వీనిని విని తప్పులుంటె మీరు దిద్దెదరుకదాయని యీ విధముగా మనస్సులో తలపోసి కందార్థములను రచించి తప్పులుంటె దిద్దవలసినదిగా మీముందు పెట్టుచున్నాను.

13) కం॥ పునరుక్తి కలిగియుండిన/విని కోపము శాయవలదు వేడుకొనియెదన్/వినువారు దూరవర్గము/గనపతె దగ్గర నటంచు గ ఎంచినాను॥ తెలియక కాదీ గ్రంధములోను॥ జననీ

జనకులు తమ తనయుల పునరుక్తి / వినగోరుదురు తప్పించక
ననేనది తెలిసీ॥ కల్పించినాను/తెలియక కాదీ గ్రంధములోను.

భావము : ఈ గ్రంధములో పునరుక్తి దోషముకలదు. విని మీరు కోపపడవద్దు. పునరుక్తి దోషము తెలియక చేయలేదు. తెలిసియే కల్పించినాను. ఎందు చేతననగా యీ పద్యములను వినువారు దూరపర్థము దగ్గరగా చూడవలెనని భావించి అట్లు వ్రాసినాను. తలిదండ్రులు చిన్నపిల్లలమాటలు, ముద్దుముద్దుగా వచ్చీరాని మాటలను తిరిగి తిరిగి చెప్పించుకొనుచు ఆనందముగా వినెదరు కదా ! కోపగించుకొనరు. అట్లే నాపునరుక్తి విషయమై పెద్దలైనమీరు కోపగించుకొనక అందలిభావమును చక్కగా గ్రహించమని, దీని భావము.

విశేషభావము : గ్రంధములో పునరుక్తిదోషము కలదనియు ఆ విషయము తెలియక చేసినది కాదనియు, తెలిసియే చెప్పబడినట్లుగా గ్రంధకర్త స్వయముగా చెప్పుకొనెను. భావగర్భితము, బుద్ధికి ఒకింతలో దొరకని పారమార్థిక విషయములు ఒక్కపద్యములో చెప్పినచో, అల్పబుద్ధులమైన మనము గ్రహించలేకపోవుదుమని, చెప్పినవిషయమునే రెండుమూడు పద్యములలో చెప్పినటుగా గ్రహించవలెను.

"వినువారు దూరపర్థము కనవలెదగ్గరనటంచు"_దూరభావము తేలికగా తెలియవలెనని ఒక అర్థము. మరొక అర్థము_దూరపర్థము అనగా దూరములోనున్న వస్తువు. "అలవైకుంఠపురంబులో "అన్నపద్యములో" పోతనామాత్యులు దేవుడు ఎక్కడో చాలదూరమునన్నట్లు, సాధారణముగా తెలియబడేవి కనబడేది కాదనియు అనేకపురాణములలో చెప్పియున్నారు. అట్టి దేవుడు దూరముగా

లేడు. అతిదగ్గరగానే, ఎదుటనే, ప్రత్యక్షముగా ఉన్నాడని తెలియ బడుటకై, ఒక్కపద్యములో చెప్పిన భావమే పునరుక్తిగా రెండు మూడు పద్యములలో చెప్పినట్లుగా గ్రహించవలెను.

14) ఇది ఆంధ్రకవిత్వంబని । మదిరోయందగదు దీని మర్మమరయుడీ । పదియూరు వన్నె పసిడిని । ముదమునతోల్పెట్టె నుంచముట్టాకుందుర ॥ లోకులు చాతబట్టాకుందురా । ఇదిగాక కుల హీనుడిచ్చిన ద్రవ్యము । విదితముగ యెంతవేత్తలైనను బాన్ని ॥ ముట్టాకుందుర । లోకులు చాతబట్టకుందుర ॥

భావము : ఇది ఆంధ్రకవిత్వమేకదాయని మనస్సులో దీనియందు తక్కువభావము చేయవద్దు. యిందులోని మర్మమును గ్రహించండి. పదహారు వన్నె బంగారమును తోలుపెట్టిలో పెట్టిన మాత్రముచే బంగారముయొక్క విలువ, పవిత్రత తగ్గిపోదుకదా ! అదియునుంగాక కులహీనుడిచ్చిన ద్రవ్యమును ఎంతటి పండితు లైనను ముట్టుకొనకుండెదరా ?

విశేషభావము : తెనుగుభాష పురాతనమైనది కాదు. అందుచేతన మన గ్రంధములు శాస్త్రములు పురాణములు వగైరా అన్నియు పురాతన భాషయైన సంస్కృతములో వ్రాయబడి యున్నవి. కనుక తెనుగులో చెప్పిన ఈ ఆధ్యాత్మిక భావ గ్రంథ మును ఋషిప్రోక్తము కాదని తక్కువ భావము, నిరసనభావము చేయవద్దని కృష్ణప్రభువులు మనలను హెచ్చరించినారు అందరకు సంశయరహితముగా తె[illegible]బడవలెననే పెద్ద మనస్సుతో ఈ గ్రంథమును తెనుగుభాష[illegible] వ్రాసినట్లుగా గ్రహించవలెను. ఇం[illegible]లి వార్[illegible]గుగా [illegible]ంచిన[illegible] ఋషి[illegible]క్త[illegible] [illegible] తెనుగుభా[illegible]ములో చెప్పి[illegible]ట్లు[illegible] తెలియబడ[illegible]దు.

కాదుగదా : కనుకతప్పుడు నరుని మాటలను మనము లెక్కచేయు నవసరము లేదని భావము.

విశేషభావము : తప్పు అనగా యెరుక ఒప్పు అనగా పరిపూర్ణము. ఎందుచేతననగా జననమరణములతో కూడియుండుట "తప్పు". జనన మరణములు లేకుండుట "ఒప్పు" అని ఆధ్యాత్మిక భావము. కనుక జననమరణములతో ఉన్నది "ఎరుక" – తప్పు. జననమరణములు లేనిది "పరిపూర్ణము" – ఒప్పు. మానవజన్మకు వచ్చినందులకు, ఎరుక–పరిపూర్ణములను తెలిసికొని జన్మరహితము నకు పాటుపడవలయును. అట్లు ఎరుక పరిపూర్ణములను ఎరుగని మనుజుడు–తప్పుడు మనుజుడు, అట్టివాడు మాత్రమే ఈ గ్రంధ మును, తెలియక దీనిని తప్పు అంటాడు. అట్టివాడుతనతప్పెరుగక దీనినితప్పు అనికూయుచున్నాడు తప్పు అని పెద్దలు అంగీకరించురా గున వానిని మాటాడనీయునని కృష్ణప్రభువులు ఈ పద్యములో చెప్పి నారు. అయినా మూర్ఖుడుచెప్పినా వినకుండక ఇది తప్పు గ్రంధము అని దీని భావము తెలిసికొన గలిగిన సంస్కారము లేనివాడు అన్నచో వాడు తప్పుడుమనిషి కనుక వాని మాటలను లెక్కగొనక అట్టివారితో వాదించరాదని గ్రంథకర్త భావముగా గ్రహించ వలెను. (సజ్జన దుర్జన నిర్ణయము)

11) కం॥ ఇలుజొచ్చి గ్రామ సింహము। కలదొంతులు గూల్చినింటి గరితలొరుగుదొం। తులుజక్కజేతురట్లనె। యిలనుక విజనోక్తి తప్పులెంచు దుర్జనుడూ॥ తప్పొప్పుగావించు సజ్జనుడూ॥

తులలేని బుధులెంతులు సర్వజ్ఞులు మీరు। తెలుసునా తలపునే దెలిపెదేమిక తప్పు॥ ఎంచు దుర్జనుడు తప్పొప్పుగావించు సజ్జనుడూ॥



భావము : కుక్క యింటిలోదూరి గృహిణులు సర్దిపెట్టు కొన్న కుండదొంతరలను కూల్చివేయును (నీచబుద్ధిచే). గృహిణులు అట్లుకూల్చిన దొంతరలను తిరిగి సరిచేసుకొందురు. అట్లే మంచి కవులు చెప్పిన మంచిమాటలతో కూడిన యిట్టి గ్రంథములయందు దుర్జనులు లేనితప్పులు చూపెదరు. సజ్జనులైనవారు తప్పులున్న యెడల వాటిని ఒప్పులుగా చక్కదిద్దెదరు. మీరు సాటిలేని బుద్ధి మంతులు, సర్వజ్ఞులు, కనుక నాభావమును గ్రహించగలరు. యింతకన్నా నేచెప్పేదేమికలదు? అనగా నా భావమునకు సరిపడు నట్లుగా తప్పులను ఒప్పులుగాసరిదిద్దమని భావము.

విశేషభావము : దుర్జనులైన వారు కుక్కలవలె పిలువనిదే యింటిలోదూరి పాత్రదొంతులను కూలదోసినట్లుగా, యిట్టి గ్రంథములో లేని తప్పులు వెదకి ఇది తప్పు గ్రంథము అని ఎంచుదురు. కాని సజ్జనులు ఒకవేళ తప్పులున్ననూ వాటిని కవి హృదయ భావ మునకు సరిపడునట్లుగా దిద్ది చక్కజేయుదురు. ఈ పద్యములో "మీరు తులలేని బుద్ధిమంతులు, సర్వజ్ఞులు" అని పద ప్రయోగము చేసినారు. అనగా సాటిలేని బుద్ధిమంతులు, సర్వము ఎరిగినవారని భావము. పరిపూర్ణ సిద్ధాంతభావులు వారిబుద్ధికి సాటి మరేదీ ఉందన రాదు. మరియు సమస్తము ఉన్నవస్తువు ఎరుక (బ్రహ్మము) దానిని పూర్తిగా యెరుగుట సర్వజ్ఞమనబడును. అట్టి పరిపూర్ణభావము చక్కగా గుర్తించిన వారు మాత్రమే యీ గ్రంథములో యేమైన తప్పులున్నచో సరిదిద్ది చక్కజేయమని గ్రంథకర్త యొక్క భావము.

18) కం॥ తనగొప్ప [illegible]ంచరేమో। జనులనితలపోసి సాధు జనకృత [illegible]లో। [illegible] ంలు వినగోరిన వినతనరా[illegible]నుచు మనసు విర[illegible] దుర్జనుడూ। [illegible] వినిపించువేడ సజ్జనుడూ। కన

వొచ్చే ముంజేతి కంకణాలకువేరె। ఘన నిల్వుటద్దము గావలెనా
మనసు॥ విరచు దుర్జనుడూ । విని వినిపించువేడ్కసజ్జనుడు ॥

భావము : సాధుజనులైనవారుచెప్పెడుయీలాంటి గ్రంథస్థ విషయమును, దుష్టజనులైనవారు తమ గొప్ప తగ్గిపోవునేమోయని తాము వినరు. ఇతరులను వినకనవద్దని మనస్సు విరచివేయుదురు. సజ్జనులైతే, తాము విని సంతోషించి యితరులనుకూడ వినమని ప్రోత్సహించెదరు. ఎదురుగా కనుపించే ముంజేతి కంకణములు చూచుటకు అద్దమెందుకు అన్నట్లుగా యీ గ్రంధము మంచిదో చెడుదో మీరే చూచెదరుగాక.

(గ్రంథ నిర్మాత విధానము)

19) కం॥ ఆగామికథయెట్లన । బాగుగవివరింతు చెవుల
పండువుగాగన్ । ఆగమనిగమోపనిష । త్సాగరమధితార్థమవల
సాంగోపాంగముగన్॥ దయతో వినుడీసాంగోపాంగముగన్। ప్రాగర
చరమార్గయోగములకు సం। యోగము గావించి నేగురైరిగినదంత॥
సాంగోపాంగముగన్ । దయతో వినడీసాంగోపాంగముగన్ ॥

భావము : ముందు జెప్పబోవు విషయమేమనగా_ఆగమములు, నిగమములు, ఉపనిషత్తులు అనెడు గొప్ప సముద్రమును మధించగా తేలిన సారమునకు అవలి పదార్థమును గురించి, మీకు శ్రవణానందముగా విశదీకరించెదను. దయజేసి ఆసాంతమువినండి. వెనుకనున్నదానికి, ముందు ఉన్నదానికి జంటచేసికొనుచు, నేను గురుముఖతా తెలుసుకొన్న సమస్తము ఆసాంతము తెలియపరచగలను.

విశేషభావము : వేదములు, శాస్త్రములు, ఉపనిషత్తులు అను మహాసముద్రమును మధించగా తేలినది ఈసమస్త ప్రపంచసృష్టి

మూలమైనది పరబ్రహ్మమనియు, అదియే కారణ కార్యరూపము లుగా ఉన్నదని అట్టి బ్రహ్మము నిర్గుణ స్వరూపమైనను సగుణ గర్భితమై ఉన్నదని తెలియబడినది. ఇట్టి బ్రహ్మవల్లనే జగదుత్పత్తి స్థితిలయములు కలుగుచున్నవి. ఇది రస, బల సమన్వితము. పిండాండమందలి "నేను" అను చైతన్యము. దీనికి ఆపై పదార్థము నేను లేనిది. పరిపూర్ణము. ఇవి కారణ కార్యములు, రస-బలములు కానిది. ఇట్టి పరిపూర్ణమును గురించి ఈ గ్రంధములో చెప్పదలచి నట్లు గ్రంధకర్త చెప్పుచున్నారు. పూర్వగర్భమనగా - ముందున్నది అనగా పరిపూర్ణమనియు, చరమార్థమనగా నీవెనుక ఉన్నది. అనగా నీకు కారణమైనది ఎరుక అనియు అర్థము చెప్పవలెను. ఇట్టి పరి పూర్ణ మెరుకలను జంటగావేసి అంటే పరిపూర్ణ నిరూపణము, ఎరుక నిరసన చేసుకుంటూ గ్రంధము వ్రాయబడినట్లుగా ఈ పద్యములో చెప్పబడినది.

(గ్రంధ రచనోద్దేశము)

20) కం॥ మొదమున ప్రొద్దుపోకకు। వాది ప్రతివాదిగుచు వరగురు శిష్యుల్ । వాదించిరనుచు నొకసం। వాదము గల్పిస్తి కలగ వదలాకవినుడి ॥ మొదటనుంచి తుదవెళ్ళగనుడీ । వేదాం తార్థాతీత వేత్తలు మీరిందు । యేదేది సవరించుడిదె నావిజ్ఞాపన ॥ వదలాకవినుడి । మొదటినుంచి తుదవెళ్ళగనుడి ॥

భావము : సరదాగా కాలక్షేప నిమిత్తమై గురుశిష్యులే వాది ప్రతివాద రూపముగా వాదించికొనినట్లుగ ఒక సంవాద రూపముగ కలవలె కల్పించినాను. దీనిని మొదటి నుండి చివరవరకు విని విచారించండి. వేదాంతార్థ అతీతవేత్తలు అయినమీరు యిందులో యేదేది సవరించవలెనో అది సవరించవలసినదిగా విజ్ఞాపన చేయు చున్నాను.

విశేషార్థము : శ్రీకృష్ణ ప్రభువులే గురుశిష్యరూపముగా వాది ప్రతివాదులవలె వాదించుకొని తెలుసుకొన్నట్లుగా ఈ గ్రంథము వ్రాయబడినది. ఇదంతయు కలవలె మురిపించుకొన్నట్లుగా తెలిసికొనవలెను అనగా చెప్పినది విన్నది సమస్తము పరిపూర్ణ మను మెరుపుయందు ఏమీలేదని అర్థము. వేదాంతార్థాతీతవేత్తలు- వేదాంత అర్థ అనగా ఆత్మ లేక బ్రహ్మము. దానికి అతీతమైనది పరిపూర్ణ, వేత్తలు తెలిసినవారు. పరిపూర్ణ పర బ్రహ్మమును గుర్తెరిగినవారు మాత్రమే ఈ గ్రంథములో యేమైన తప్పు లున్నచో దిద్దవలెను. ఇతరులు దీనిని దిద్దగలవారు కారు అని గ్రంథకర్త ఆదేశము. (గ్రంథ విస్తరణా విశేషము)

21) కం॥ కొంచెములో సరిపుచ్చక । పెంచినవీ గ్రంథ మనుచు పెద్దలుగకన్ ॥ మించిన వేడ్కతొవినుడీ । పెంచినయర్థం బునె చెప్పెదలోకులెల్ల ॥ అర్థము దెలిసి మదినుల్లసిల్ల ॥ పెంచితి పెంచితిగొంచెము వెడలుపు। పొంచుండెనది లోతంచెంచినా మదిగదె॥ ల్పెదలోకులెల్ల । అర్థముదెలిసి మదినుల్లసిల్ల ॥

భావము : గ్రంథమును కొద్దిలో సరిపుచ్చక ఎందుకింతగా పెంచితివని పెద్దలైనవారు కోపించవద్దు. ఆనందముగా వినుడు కారణము చెప్పెదను. లోకులకు ఈపరిపూర్ణ భావమును విశదముగా చెప్పినచో బాగుగ దృఢముగ తెలుసుకొని ఆరూఢులు కావలెననియు కొంచెము వెడల్పు ఉండే నదిలోతు ఎక్కువగా ఉండునని తెలిసి, ఈ గ్రంథమును భావము లోతుగా కాకుండగ తేటతెల్లముగా తెలి యుటకై ఎక్కువగా పెంచితిని.

విశేష భావము : ఈ గ్రంథకర్త సభాప్రార్థనలో తను వ్రాసిన ఈ కందార్థములలోని పరిపూర్ణ మెరుకల భావము సర్వులకు తేట

తెల్లముగా తెలియవలెననియు, సంశయమెంతమాత్రము కలుగ కూడదని భావించి వ్రాసినట్లుగా ఈ అధ్యాయములోని 13, 14 మరియు 21 పద్యములలోని భావము వల్ల తేట తెల్లమగుచున్నది. అయినను కవియొక్క సహజ లక్షణముగా మొత్తముమీది 4 లేక 5 పద్యములకు మాత్రము భావగంభీరత, లోతైన అర్థములు కలవు అయినా కవిహృదయము రహస్యభావము లేకుండగ, అందరికి తెలియబడులాగున వ్రాయవలెనను భావముతోనే ఈ గ్రంథరచన జరిగినదనుట నిస్సందేహము.

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వ
సభా విజ్ఞాపన నామ ప్రథమోధ్యాయమునకు
భావ. విశేషభావములు.

సమాప్తము.

శ్రీ గురు

— ౦ —

పూర్ణ గురుదీక్షనసంసిద్ధి కారణావు (10)

# గురుశిష్య అన్యోన్య దర్శనము

22) కం॥ సాధన సంపత్తి యుగల । సాధకుడొకనరుడు
ఘోరసంసారమునన్। బాధపడలేక తనపు । ణ్యోదయమున గురుని
గాంచి యురుతరభక్తిన్ ॥ శరణని మ్రొక్కి మరిమరి యుక్తిన్ ।
బోధజేయుము పుణ్య పురుషామాంబోంట్లకు । సాధించదగు ముఖ్య
సాధనని పల్కె యురుతరభక్తిన్ । శరణని మ్రొక్కి మరిమరి
యుక్తిన్ ॥

భావము : సాధన సంపత్తిగల సచ్ఛిష్యుడు ఒకడు ఘోర సంసారమున బాధపడలేక సద్గురుమూర్తి సద్బోధకొరకై తిరుగుచుండగా, అతనిపూర్వపుణ్యవశమున శ్రీఅశరీరసద్గురుమూర్తి దర్శనభాగ్యము కలుగగా ఆసద్గురుమూర్తి పాదపద్మములపై బడి సాష్టాంగ ప్రణామముజేసి, హే సద్గురోత్తమా! పరమపురుషా! నేను సాధన చతుష్టయపరుడను. బ్రహ్మమనగానేదో, జనన మరణ ప్రవాహమునుండి తరించు మార్గమేదియో యెరుగజాలకున్నాను. నేను తమకు శరణాగతుడనగుచున్నాను. నేను ఇంకను సాధింప వలసిన ముఖ్యసాధనలేవో తెలియజేసి సందేహరహితపరచి, కృతార్థునిగ జేయవలసినదని ప్రార్థించెను.

విశేషభావము : ఈ అధ్యాయము "సాధన సంపత్తియుగల సాధకుడు" అను పద్యముతో ప్రారంభించబడినది. బ్రహ్మవిద్య తెలుసుకొనుటకు సాధన సంపత్తిపరుడైన వాడే అధికారి. "అథాతో బ్రహ్మజిజ్ఞాస" అను బ్రహ్మసూత్రములోని "అథ" అనగా అటుపైన ని అర్థము. అనగా సాధన చతుష్టయ సంపత్తిపరుడైన

తరువాత అని శ్రీ శంకర భగవత్పాదులు వ్యాఖ్యానించియున్నారు. కనుక కృష్ణదేశి కేంద్రులవారు కూడ సాధన చతుష్టయ సంపత్తి పరుడైన పిదప మాత్రమే పరిపూర్ణబోధ నెరిగింపవలయును. అని నిష్కర్షచేస్తూ ఈ గ్రంథారంభవాక్యము "సాధన సంపత్తియు గల సాధకుడొకనరుడు" అని మొదలుపెట్టిరి. కొంతమంది వనవారు సాంఖ్యతారక మహావాక్య విచారణ ద్వారా ఆత్మబోధ గనవారికి అవసరమే లేదనియు, అదంతయు వమనభోజనమువలె పనికిరాని దనియు. కృష్ణప్రభువులు అట్టి బోధను తమ కందార్థములలో ప్రారంభించలేదనియు కలవిమర్శను చేయుచున్నారు. ఇట్టివాదన సరికాదు. కృష్ణప్రభువులు తమ కందార్థ రచన ఆత్మబోధపరుడైన వానికి అంతటితో జన్మరహితము కానేరదనియు, పరిపూర్ణబోధనెరిగి ఎరుకను విడచినప్పుడు మాత్రమే జన్మరహితస్థితి ఏర్పడగల దనియు చెప్పిరి. అందుకే సాధనసంపత్తి పరుడైనవాడు, "ఘోర సంసారమునను బాధపడలేక" అన్న పద ప్రయోగము చేసినారు. నిత్యానిత్యవస్తు వివేకముకల్గి బ్రహ్మసత్యమైనది. జగత్తు మిథ్యయను విషయ పరిజ్ఞానము కల్గియుండుటయే కాక, ఏది బ్రహ్మము ? సత్యమైన బ్రహ్మము యెట్టి వికార జగత్కల్పనకు కారణమైనది. బ్రహ్మవస్తువు ఒకటా లేక రెండింటి సమన్వయమా ? మాయయొక్క స్వరూపము ? మొదలగు సంశయములతో, సరియైన సమాధానము దొరక వ్యాకులపడుటకే "ఘోరసంసారమున" అన్న పదమునకు అర్థముగా గ్రహించవలెను. అనగా ఆత్మబోధ చక్కగా నెరిగినవాడని అర్థమగుచున్నది. అట్టివానికి దానిపై బోధ అయిన పరిపూర్ణబోధ చెప్పవలసియున్నందున అట్టి పరిపూర్ణబోధ చెప్పుటయే లక్ష్యార్థముగా ఈ గ్రంథమును వ్రాసిరి. అంతేగాని సాంఖ్యతారకాది ఆత్మబోధ చెప్పనవసరము లేదని ఎంతమాత్రము భావించరాదు. అట్టి ఆత్మబోధపరునికి

మోదము, ముప్పిరిగొన    కరుణా/గన్నులా/దృష్టి





మాత్రమే ఈ బోధయొక్క మర్మ ధర్మములు బాగుగ తెలియగలవు అందుకే "సింధువు చెలరేగినట్లు" అన్న పద్యము చెప్పబడినది. అధికజలాశయమైన సముద్రము చంద్రోదయమును జూచి పొంగుచున్నదే కాని, అల్పజలాశయములైన చెరువులు నూతులు పొంగవు అట్లే అధిక విద్యాసంపన్నులైనవారు చంద్రకిరణములవంటి చల్లని ఆహ్లాదకరమైన వాక్యములు సిద్ధాంతములుగల ఈ పరిపూర్ణబోధనువిని పొంగగలరే కాని అల్పవిద్యావంతులు పూరించలేరని భావము. విద్య అనగా చదువు అని కాదు ఆత్మైక విషయ పరిగ్రహణముగా అర్థముచేసికొనవలెను.

తన పుణ్యోదయమున న్నారు. ఈ బోధ కేవలము తన పూర్వజన్మ సంస్కార విశేషమున మాత్రమే లభ్యము కాగలదు. "అనేక జన్మ సిద్ధానాం అభ్యస్తే జ్ఞానసంతాని పూర్ణబోధావశిష్యతే" అన్నారు గావున శిష్యుని యొక్క పూర్వజన్మల పుణ్యవిశేష సంస్కారమున సశరీర గురుమూర్తి లభించునని అర్థము.

శరణని మ్రొక్కి - అనగా కురుక్షేత్రములో అర్జునుడు వికల మానసుడై దిక్కుతోచక కృష్ణునికి "శరణాగతుడను నాకు కర్తవ్యము బోధించుము. అని అడిగిన పిదపనే జ్ఞానబోధ చేసినట్లు వ్యాసమహర్షి వ్రాసియున్నాడు. అట్లే పునర్జన్మ భయముచే కంపితుడై అది తప్పించుకొను మార్గము శాస్త్రములలో లభ్యము కానందున పునర్జన్మ తప్పించుకొనుటకు దిక్కుతోచని స్థితిలో గురుమూర్తికి శరణాగతుడై జన్మసంసారము నుండి తరింపజేయవలసినదిగా శిష్యుడు ప్రార్థించి సాష్టాంగ నమస్కారము గావించుటయే "శరణని మ్రొక్కి" అన్నపదమునకు భావము.

(ఉపదేశ సారము)

29) కం॥ శరణాగతుడగు శిష్యుని। కరుణాపూర్ణ దృష్టిచేత
గని మోదము ముప్పిరిగొన మృదువాక్యములను పరమదయా

సంశయము





ఉండు గురుడు భక్తా వినుమనెను॥ సంశయమింక బాధింపదనెను॥ పరిపూర్ణ మొకటి లేనెఱకనెదొకటుండు । పరిపూర్ణమెరుకల నెరిగి యెఱుకనుమాను ॥ భక్తా వినుమనెను । సంశయమింక బాధింప దనెను ॥

భావము : శరణుజొచ్చిన ఆశిష్యుని, పరమదయామూర్తి యైన గురుమూర్తి దయామృత దృష్టితో చూచినవాడై, సంతోషము వెల్లువికే మధుర వాక్యములతో "ఓ భక్తా ! వినుము. ఇక నీవు సంశయముచే బాధపడనవసరములేదు. నీ సంశయములన్నియు తీర్చెదను. పరిపూర్ణ పరబ్రహ్మమనునదొకటి, లేనెరుకనునదొకటి కలవు యీ పరిపూర్ణ మెరుకలనెరిగి, యెఱుకను విడిచినచో, నీకే సంశయబాధలుండవు" అని చెప్పెను.

విశేషభావము : దయామృత దృష్టిచేత గురుమూర్తి శిష్యుని చూచెను. అని ఈ పద్యములో చెప్పబడినది. శిష్యుడు అజ్ఞాని. గురుమూర్తి జ్ఞాన స్వరూపుడు కనుక గురుమూర్తి తన శిష్యుని తనంతటి జ్ఞానస్వరూపునిగా చేయవలెను. అట్లుచేయుటకు గురుమూర్తి త్రివిధ దీక్షలచే తయారుచేయవలెనని శాస్త్రప్రశస్త్యం. "వీక్షణ ధ్యాన సంస్పర్శయైః । మత్స్యభృంగ విహంగమాః । పోషయాంస్వేన పుత్రాన్" ॥ అన్నట్లుగా చేపలు–చూపుచేత, భృంగములు–వాక్ చేత (ధ్యాన), పక్షులు–స్పర్శ చేత తమ పిల్లలను తమవంటి వారిగా పోషించుకొనునట్లు, గురుమూర్తి దృక్ దీక్ష (చూపు) వాక్ (బోధ) స్పర్శదీక్ష (హస్తమస్తకసంయోగము) అను మూడు దీక్షలచే శిష్యుని తనంతటిజ్ఞానిగా చేయవలయును. అందుచే ఈ పద్యములో శిష్యుని మొట్టమొదటగా శరణాగతుడైన వానికి హస్తమస్తక సంయోగముచే అభయ ప్రదానముచేసి,

కరుణామృత దృష్టిచే చూచి, మృదువాక్యములచే బోధపరచెను అని చెప్పబడినది.

"పరమానందయామళుండు గురుడు-"-గురుమూర్తి దయార్ద్రహృదయుడు,కోపముతోనుండరాదు.పరుషవాక్యములు పలుకుట,శపించుట పనికిరాదు. శిక్షణ, ఉపదేశములు రెండును ఆత్మాన్నములుగనుక, శిష్యుని మందత్వ నివారణకై అవసరము వెంబడి శిక్షించినను అది కోపముకాదు. శిష్యుని సంస్కరించుటకే కనుక అది కూడకరుణయే అని గ్రహించవలెను. కోపము అనగా ప్రతీకారము దీర్ఘకాలము మనస్సునందు క్రోధముండుట ఇది పనికిరాదు.

24) కం॥ యేసాధననీకెందుకు। వీసానికిపనికిరాదు వినుమామయుయ్యా। నీ సాధులచే విన్నది। యేసాధనలేక బోధనెరింగించుతుబోకు॥ సాధనలందుమరిగితెరాకూ॥ యేసాధనలజోలియే నొల్లననినీవు। బ్రాసకొసితివేనిపరిపూర్ణబోధనే॥నెరిగించుతుబోకు।సాధనలందు మరిగితేరాకు॥

బావము : శిష్యా : యే సాధన నీకు అవసరములేదు. పరిపూర్ణమెరిగి నెరుకను విడచుటకు సాధనలతో పనిలేదు. ఈ బోధకు సాధనలు కొంతవర్కు అభ్యంతరమేకనుక, నీవు సాధలయందే మరిగి ఉండెదవా - యీ బోధకురావద్దు. యీబోధ సాధనల కతీతమైనది కనుక యే సాధనలు జోలికి వెళ్ళను అని ప్రమాణముచేసినట్లయితేనే యీ బోధ నేను నీకు తెలియపర్చెదను.

విశేషబావము : సాధనలు అనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ సమాధులను అష్టాంగయోగములు, ముద్రలక్ష్యభావములతో కూడినవని అర్థము. [illegible]తత్వమును గుర్తించుటకు అంతరంగిక ఇంద్రియశుద్ధి

ఉద్భవము,





చిత్తస్థైర్యము అవసరము. ఆ రెంటిని సాధించుటకు మాత్రమే పైన చెప్పిన సాధనలు ఉపకరించును. ఇంద్రియశుద్ధి చిత్తస్థైర్యము కలిగినపిదప, సాధనలతోపని లేదు. సాధనరహితమైన పరబ్రహ్మము "బ్రహ్మజిజ్ఞాస" "తద్బ్రహ్మవిజిజ్ఞాసస్వ" అనియు శృతులు చెప్పినట్లుగా, బ్రహ్మను విచారించి గురుకరుణచే తెలుసుకొనదగినదే కాని చేరగలిగినది, చూడబడునది ఎంతమాత్రము కాదు. అందుచేతనే ఈ పద్యములో సాధనలు మానినట్లయితేనే సంపూర్ణబోధ బోధించగలము, అన్నారు. సాధనలలో మరిగినవారికి సహస్రారమందు, లయమైపోయే లక్షణము కల్గినవారు గనుక, యిట్టి విచారణ అట్టి యోగాభ్యాసుల వలన కాదని నిష్కర్ష.

(శిష్య ప్రశ్నావళి)

25) కం॥ గురువర పరిపూర్ణంబన । నెరుకన నివి రెండు
యెట్టి వెరుకోద్భవమెం । దెరుకజను చోటు యెయ్యది । యెరుకను
నేనెట్లు విడిచే దెరిగించుమనెను ॥ అట్లనెగురుడెరిగింతుననెను ॥
చరణధూళిని రెండు కరములగొని తన శిరమున ధరించి శరణని
యా శిష్య ॥ డెరిగించుమనెను । అట్లనెగురుడెరిగింతుననెను ॥

భావము : హే గురుప్రభో । పరిపూర్ణమనగా యెట్టిదో, ఎరుక అనగా ఎట్టిదో నాకు వివరముగా తెలియపర్చుడు. మరియు ఎరుక యెక్కడ పుట్టుచున్నది ? ఎచ్చటకు పోవుచున్నది ? ఆ యెరుకను నేను ఏవిధముగా విడువగలను ? ఈ విషయములు నాకు వివరముగా తెలియపరచవలెను. అని శిష్యుడు కోరగా, గురుమూర్తి అట్లే యెరిగించెదను "అని పల్కెను. అంతశిష్యుడు పరమానంద భరితుడై గురుపాదధూళిని రెండుచేతులతోను గ్రహించి తన శిరస్సున ధరించుచు నమస్కారము చేసెను.

విదితము, చంచలబుద్ధి,





విశేషభావము : ఈ పద్యములో "గురువర" అనుపదము ప్రయోగించబడినది. గురువు అనగా విద్యచెప్పేవాడు అని సాధారణ అర్థము అయినను, యిచ్చట విద్యచెప్పే గురువు మాత్రమే కాదు. పునర్జన్మ దుఃఖమును నశింపజేయగల శాస్త్రజ్ఞుడు, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురువు కనుక శ్రేష్ఠవాచకము అయిన "వర" శబ్దము ప్రయోగించి "గురువర" అనుపదముచే సంబోధన చేయబడినదని భావము.

(గురుమూర్తి అతనియందు ప్రసాదము)

28) కం॥ మొదలచలమునెరిగించెద । విదితముగా లేని యెరుక వివరింతువయిన్ । తుదకెరుకను విడిపించెద । మదిలో నా మాట నమ్మి మరివింటివేని ॥ చంచలబుద్ధి మానుంటివేని ॥ పదుగురు నినుజూచి భళిశభాసి త్రోవ । కెదురుతేదనెటటు యిదిగో నేజేసెద ॥ మరివింటివేని : చంచలబుద్ధిమానుంటివేని ॥

భావము : శిష్యా : చంచల బుద్ధిమాని, నేచెప్పేటి బోధయందు నమ్మకముంచి నీవు వింటివేని, నీకు మొట్టమొదటగా పరిపూర్ణము గురించి ఎరిగించెదను. తరువాత లేని యెరుక గురించి వివరముగా చెప్పెదను. ఆ పయిన ఎరుకను విడిపించెదను. అంతే కాదు నీవు చంచలత్వము మాని నమ్మిక కల్గి ఉన్నచో పదిమంది నినుజూచి "నీవు చెప్పుకొనే బోధ చాలా మంచిది. దీనికి సమానమైనది మించినది మరేది లేదని "శభాస్" అని మెచ్చుకొనే విధముగా తయారుచేయగలను.

విశేషభావము : శిష్యునకు మొట్టమొదటగా సర్వత్ర ఉండిన పరిపూర్ణ పరబ్రహ్మమును ఆ తరువాత లేని యెరుకను గురించి సవివరముగా వస్తునిశ్చయముగా తెలియపరిచి ఆ తరువాత లేని యెరుకను విడిపించెద అన్నారు. పరిపూర్ణమును, ఎరుకను ఎరుక

చేతనే గుర్తించాలి. అట్లు గుర్తించిన గుర్తే ఎరుక అయొరుకనులేని దని విడిచిపెట్టవలెను.

) చంచలబుద్ధి మానుంటినేని" - అన్నారు. గురువునందు, శాస్త్రమునందు అంచలమైన విశ్వాసము నమ్మిక కలిగియుండాలి. మరియు గురువుకన్న అధికమైన తత్వము, జ్ఞానస్వరూపములేదు కనుక, గురువుకన్న మించిన దైవము లేదను నమ్మికకల్గి, ఇతర దేవతలు క్షేత్రయాత్రలయందు చంచలత్వముమాని శ్రద్ధబోధందు నిలిపి విన్నట్లయితేనే పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడును. కనుకనే "శ్రద్ధావాన్‌లభతేజ్ఞానం" అన్నారు. కనుక శిష్యుడు చంచలత్వముగుమాని గురువాక్యమును నమ్మినప్పుడే జ్ఞానము తెలియబడుట అట్టి జ్ఞానమైన ఎరుకను విడుచుట జరుగును.

శ్రీ శివరామ దీక్షితులువారు తమ బృహద్వాశిష్ఠముతో "ఏ సిద్ధాంతమును నమ్మినా మూలంలేని ఈ గుర్తెరిగే శరీరంలేని రాజమార్గములేదు. మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం నిలిపి యేమి చెప్పినా మునుపటి గాడిదవలె వాలకముపోదు. అందుకే మొట్ట మొదటగా బయలున్నదికదా! అవి నిత్యం నూరుమార్లు పది దినాలు చెప్పవలె అని వ్రాసినారు. కనుక కృష్ణప్రభువులు" మొదలచలము నెరిగించెద" అన్నారు.

పదుగురు నినుజూచి భళిశభాస్"అనగా ఇచ్చట పదిమంది అన్నపదమును బహుళ వాచకముగా గుర్తించవలెను. అందరూ చూచి నిన్ను మెచ్చుకొనేలాగున అని అర్థము. అలాకాకుండా పది మంది అని సంఖ్యావాచకమే అనినచో - సృష్ట్యాదిలో మహర్షులు ఈ సృష్టికి మూలమేది ? అని తర్కించుట విచారించుట చేసిరి. అప్పుడు ఈ సృష్టికి మూలము సత్ పదార్థము, అసత్ పదార్థము,

ఆస్తిక, లోకముల





సదసత్ పదార్థము, అహోరాత్రము, అమృతము, మృతము, ఆకాశము, జలము—అగ్ని సమ్మేళనము, మృతామృతము, దైవము ని ట్లు పదివాదములు చెప్పిరి. దీనికే దశవాదములని పేరు. ఈ దశవాదముల నుండియే షడ్దర్శనములు వచ్చినవి. షడ్దర్శనము వలన షణ్మతములు పుట్టినవి. కనుక ఆ పదివాదస్థు లయిన వారు కూడ నీసిద్ధాంతమునుజూచి, నీసిద్ధాంతమే సరియైనది మా పదిసిద్ధాంతములు నీసిద్ధాంతము ముందు తీసికట్టే అని ఆ పదు గురు నినుజూచి మెచ్చుకొనేలాగున తయారుచేసెదనని గురు ప్రభువులు అన్నట్లుగా తెలిసికొనవలయును. త్రోవకెదురులేదు అనుటలో ఈ మార్గమున కెదురులేదు అని అర్థము మార్గము అనగా నడచివెళ్ళే దారి అని అర్థము కనుక ఈ బోధను తెలిసికున్నంత మాత్రముచేకాదు. ఆబోధలో ఉండవలసిన విధముగా నడుచువారికి ఆచరించువారికి అని విశేషభావము.

(శిష్యుని విజ్ఞప్తి)

27) కం॥ మీరంతవారు గనుకనె। చేరితి మీ పాదసేవ సిద్ధించుటకై । యేరింతవారు జగమున। లేరని నామదికి దోచె తెస్సగ వినుడీ ॥ ఆజ్ఞను మీరలేదుకనుగొనుడీ ॥ యేరీతి వినమంటె నారీతివినియెద । మీరానతివ్వండి తోరమౌ యీ బోధ ॥ తెస్సగ వినుడీ । ఆజ్ఞకు మీరలేదు కనుగొనుడీ ॥

భావము : స్వామీ ! మీరు పదిమంది జూచి భళి అని మెచ్చుకొనేలా చేయగలిగినంత వారనియు, మీ అంతటివారు ఈ జగత్తులో లేరనియు, నామనస్సులో గట్టిగాతోచి మీపాదసేవా భాగ్యము సిద్ధించుటకై మీ సాన్నిధ్యమునకు వచ్చితిని. యీగొప్ప దైన బోధ క్రమపద్ధతులలు చెప్పుటలో నన్ను ఏ విధముగా విను

మందురో ఏవిధముగా వినుమందురో ఏవిధముగా ఆచరించవలె నందురో మీ ఆజ్ఞకు బద్ధుడనై అట్లు ఉండివినగలను.

విశేషభావము : గురుపాదసేవాభాగ్యము దొరకుట చాల దుర్లభము. "దుర్లభం త్రిలోకేషు । కేవలద్వైవాను గ్రహ హేతుకం। మనుష్యత్వం, ముముక్షత్వం । మహాపురుష సంశ్రయః॥ అన్నారు మహఋషులు. కనుక మహాపురుషుల ఆశ్రయం దొరకటం, మనుష్యత్వము, ముముక్షత్వములకన్నా దుర్లభమైనది. అందుకే యల్ పాదరేణుర్వై నిత్యం । కోపి సంసారవారిధౌ । సేతుబంధా యతేచాథ । దేశికంతముపాస్మహే ॥ అని గురుగీతలో చెప్పబడినది. సంసార (జన్మ) సముద్రమును దాటుటకు, ఏగురువుయొక్క పాదరేణువే వారధిగా అగుచున్నదో, అట్టి సద్గురువును సేవించు చున్నాను. కనుక జన్మబంధమునుండి తప్పించుకొనుటకు ప్రయత్నముచేయు శిష్యునికి సద్గురు పాదసేవాభాగ్యమునకు మించినది మరేదిలేదు. అందుచేత ఈపద్యములో "మీపాదసేవ సిద్ధించుటకై" అన్నారు.

గుర్వాజ్ఞకు బద్ధుడై యుండవలెను."గురోరాజ్ఞాం ప్రకుర్వీత్" గురోరాజ్ఞాంతజారయేత్" అని గురువుయొక్క ఆజ్ఞపత్రికేరముగా శిష్యుడు నడచుకొనవలయునని శాస్త్రము చెప్పుచున్నది. కనుక ఇచ్చట "ఆజ్ఞకుమీరలేదు కనుగొనుడీ" అన్నారు.

"యేరింకవారు జగమునలేరని"– ఇంతటివారు జగత్తులో లేరని అర్థము అనగా గురువుకన్న గొప్పవస్తువుకాని వ్యక్తిగాని లేదు. అందుకే "నగురోరధికంతత్వం" అన్నారు. గురువుకన్న గొప్పది మరేదిలేదు. ఇట్టి నిశ్చయముకలవానికే బ్రహ్మతత్వము తెలియగలదు.

28) కం॥ మొద్దులనైనను దొల్తురు। బద్దుల బద్ధత్వమడవి పాల్జేతురుమీ। వద్దకు వచ్చిన గనివరి। శుద్ధపుబోధోక్తమైన సూక్తులు గుప్పీ ॥ అందుకు తగిన యుక్తులు జెప్పి ॥ పెద్దలచే మీ ప్రసిద్ధిని వినివస్తి। దిద్దుడి నేవట్టి బుద్ధిహీనుడనన్ను ॥ సూక్తులుగుప్పీ అందుకు తగిన యుక్తులు జెప్పి॥

బావము : ఓ గురుదేవా ! పరిశుద్ధమైన బోధయొక్క సూక్తులు చెప్పుచూ (అని అర్ధమగుటకొరకు) అందుకు తగిన యుక్తులు (ఉదాహరణలు) చెప్పుచూ, మివద్దకు వచ్చిన వారు అల్పజ్ఞులైనను వారియొక్క మందత్వమును లేకుండజేసి జ్ఞానవంతులుగా చేయగలరు. అట్టి మీకీర్తి ప్రతిష్ఠలు పెద్దలచే విని మీ వద్దకు వచ్చితిని. నేను బుద్ధిహీనుడను కనుక నాకు బోధజేసి సరిదిద్ది వలసినదిగా కోరుచున్నాను.

విశేషబావము : "మొద్దులనైనను దొల్తురు" - పనస మొద్దును చిన్న చిన్న ఉలిదెబ్బలచే ఆ మొద్దు యొక్క మధ్య భాగమంతయుదొలిచి దాని రెండుపైపులా చర్మముతో మూసినచో చక్కని శబ్దములను పలుకగల మృదంగముగా తయారుచేసిన విధముగా, అజ్ఞానములో ఉన్నశిష్యుని గురుమూర్తి సూక్తులు యుక్తులతో బ్రహ్మతత్వమును తెలియజేసి, బ్రహ్మజ్ఞానిగా ఆ శిష్యుని తయారుచేయును. ఆ తరువాత చక్కని వేదాంతసూక్తులు చెప్పగలవాడగుచున్నాడు. కనుక యీపద్యములో మొద్దులనైనను దొల్తురు అని చెప్పినారు, "మీవద్దకు వచ్చినగని"- అనగా శిష్యుడు గురుమూర్తిని సమీపించి నమస్కార పూజావిధులతో గురుమూర్తిని ప్రార్ధించగా గురుమూర్తి కరుణగలవాడై శిష్యుని చక్కని బ్రహ్మజ్ఞానిగా తయారుచేయును. అందుకే గురుగీతలో శ్లో॥ "అజ్ఞాన

 

వాహీనా గ్రస్తాః ప్రాణినస్తాన్ చికిత్సకః । విద్యాస్వరూపోభగవాన్। తస్మైశ్రీ గురువేనమః"॥ అన్నాడు. లోకమందలి జీవులు అజ్ఞానమను గొప్ప సర్పముచేత మ్రింగబడినవారినిగూర్చి అజ్ఞాననాశము చేసి, బాగుపరచెడు మహావైద్యుడగువాడు జ్ఞాన స్వరూపుడైన సద్గురువునకు నమస్కారము. కనుక శరణుజొచ్చిన శిష్యుని అజ్ఞానమునుండి ఉద్ధరించెడివాడు గురుమూర్తి.

(బోధ దృఢీకరణ విధానము)

29) కం॥ నాటిగను బోధనామది। నాటినదికచాలుచాలునని నీకైనీ । నోటనివు బలుకుదాకను । చాటువులను చెప్పుచుందుసరేనా నామాటా ॥ రాగోరుచు మరినేనీమాట। నూటికొక్కటి శెలుమాటాని తెలియుము । మాటిమాటికి వట్టి పాటాలేసుటికింక ॥ సరేనానామాట। రాగోరుచు మరినేనీమాటా ।

భావము : శిష్యా ! నే చెప్పుచున్న ఈ పరిపూర్ణబోధ చక్కగా నామనస్సున కతికినది. సందేహములన్నియు తీరినవి. ఇకచాలునని నీకైనీవు అనేపర్యంతము ఈ బోధచాటు పద్యరూపముగా చెప్పెదను. సరేనా : అంతేకాదు. ఈ చెప్పిన బోధంతయు తిరిగి నీవు చెప్పెలాగున చెప్పెదదను. అనేకమాటలతో పనిలేదు. నూరుమాటలకు ఒక్కమాట సరిపోవులాగున బోధ నీకు చెప్పెదను.

విశేషభావము : బోధ నీకైనీనోట చాలునని అనేదాక సందేహరహితముగా తిరిగి అ బోధ శిష్యుని నోటితో తిరిగి చెప్పేలాగున బోధ చెప్పెదను అని ఈపద్యభావము. అంతేకాదు. "నూటి కొక్కటి శెలుమాటాని తెలియుము." అనగా అనేక శాస్త్రిలలో అనేకవిధములుగా చెప్పిన నూరు మాటలకు ఒక్కమాట జవాబు అయేలాంటి సిద్ధాంత మాటలను చెప్పి బోధ దృఢపరచెదనని గురుమూర్తి జవాబుచెప్పినట్లుగా భావము.

(ప్రశ్నోత్తరములు)

30) కం॥ తానేనన । కనునిండిన । దానికి పేరేమి బయలు తానేననుచున్ । నేననియెదనేనెవ్వరు । లేనెరుకవు వుంటి.వుంటెలేనే లేననుమీ ॥ అంటిని, అంటే లేనేలేవుసుమీ ॥ లేనేలేవని నేను లేకా పోయిన వెనక । తానుండుగదన్నంటే దాన్నెట్లెరిగెదవీవు॥ లేవుసుమీ । అంటిని అంటె లేనేలేవుసుమీ ॥

భావము : ఈ పద్యమును శిష్యుని ప్రశ్న, దానికి గురుమూర్తి జవాబుగా వ్రాయబడినది.

| శిష్యుని ప్రశ్న. | గురుమూర్తి జవాబు. |
|---|---|
| 1. తాను, నేను అనక నిండియున్న .... దాని పేరేమిస్వామీ ? | .... బయలు. |
| 2. తాను నేను అనుచు నేను అనుచున్న .... నేనెవరిని స్వామీ ? | లెనెరుకవు (వుంటి) అయివున్నావు. |
| 3. వుంటేస్వామీ ? | లేనే లేననుము. |
| 4. ఆలాగే లేనన్నాను స్వామీ । .... | అంటే లేనేలేవుసుమీ ! |
| 5. లేనేలేవని నేను లేకపోయిన వెనుక తాను (బయలు) ఉండుగదాస్వామీ? .... | ఉంటే దాన్నెట్లెరిగెదవు ? ఎరుగుటకునీవులేవుకనుక దాన్ని ఎరుగవు. లేననుము. |

విశేషభావము : తాను, నీవు అనిగుర్తించే లక్షణము లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము పరపూర్ణమును, ఆత్మ జగములను

తనను గుర్తించే లక్షణముకలది ఎరుక. యీ యెరుక పరిపూర్ణములో లేక తోచబడునది కనుక లేనెరుక అన్నారు. అనగా లేనిదె ఉన్నట్లు తోచబడున్నది అని అర్థము. కనుకగురుమూర్తి శిష్యుడు "ఉంటే" అని అనగా ఉంటె నీకు జన్మతప్పదు. కాని విచారిస్తే యిది ఎచ్చటను లేదుకదా ! కనుక "లేనేలేననుమీ" అన్నారు. ఆ విధముగా ఎరుకలేకపోయిన వెనుక పరిపూర్ణము శాశ్వతమైనది కనుక అది అలాగే ఉండును. కాని ఎరుకలేకపోయిన పిదప, పరిపూర్ణమున్నదని చెప్పే యెరుకేది ? కనుక తాను (ఎరుక) లేక పోవుటయే పరిపూర్ణము ఉన్నదని ప్రత్యక్షముగుట.

(శంకా నివృత్తికి శిష్యుని ప్రశ్న)

31) కం॥ మీరాజ్ఞయిచ్చివుంటిరి ! నేరుపుతో బయలునెరుక నెరిగించిపయిన్ । పేరణతు యెరుకననియి। ట్లారీతిన యెరుకపరచుమయ్యా ప్రొమ్కెను॥ అనుమానము జెయ్యాకియ్యెడను ॥ సారెకు మీపాద జలజయుగ్మము నాహృత్ప్రారమున నిల్పి సల్పుచు పూజనో ॥ యయ్యా ప్రొమ్కెను । అనుమానము జెయ్యాకియ్యెడను ॥

భావము : తమరు మొట్టమొదటగా పరిపూర్ణమును ఆ తరువాత యెరుకను విశదపరచి, ఆ తరువాత యెరుకలేకుండ జేతునని తెలవిచ్చియున్నారుస్వామీ ! నాకు అదేవిధముగా విశదముగా తెలుపకోరుచున్నాను. మాటి మాటికి మీ పాదపద్మములను, నా హృదయపద్మమునందుంచుకొని పూజించి మొక్కుకొనుచున్నానుస్వామీ ! కనుక దయుజేసి ఆవిధముగా నాకు తెలియపరచకోరుచున్నాను. (అని శిష్యుడు వేడుకొనెను.)

విశేషభావము : గత పద్యములో అనగా 30 వ పద్యములో ఉన్నదని పరిపూర్ణము, నీవు లేనియెరుకవు, కనుక నీవు

లేనేలేవు అని చెప్పగా శిష్యునకు పూర్తిగా, సంశయరహితముగా అర్థము కాకపోవుటచే శిష్యుడు ఈ పద్యములో పరిపూర్ణమును, యెరుకను బాగుగావిశదపరచి ఆపై యెరుకలేకుండా జేయుమని ప్రార్థించెను. యీ గురుబోధయందలి మర్మధర్మములు పూర్తిగా తెలియుబడవలెనన్నచో కేవలము గురుకరుణచేమాత్రమే తెలియును. అన్యవిధముగా తెలియుబడదు, కనుక అట్టి గురుకరుణ ఏర్పడుటకు గురుపాద పద్మములను హృదయపద్మమునందు నిలబెట్టుకొని నిత్యము పూజించుకొనవలెను. అని చెప్పుటకే ఈ పద్యములో "మీ పాదపద్మము నాహృత్సారమున నిల్పి పూజను సల్పుదును" అన్నారు.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
గురుశిష్య అన్యోన్యదర్శనం నామ
ద్వితీయోధ్యాయమునకు
భావ-విశేషభావములు
సమాప్తము.

జై గురు

— • —

# 3. అచల లక్షణం

32) కం॥ పుట్టుట గిట్టుట లేకను । పుట్టీగిట్టేటి యెరుక పోడి
మెరుగకన్ । చుట్టవలె కదలకుండును, । బట్టబయల్ యిట్టి దెరిగి
భావింపదగును॥ యెరుకలేక సేవింపదగును॥ వట్టియాశలచేత
పట్టబడకనుయీ। గుట్టుదేశికునోట గట్టిగదెలుసూక ॥ భావింపదగును,
యెరుకలేక సేవింపదగును ॥

భావము : పరిపూర్ణ పరబ్రహ్మము జనన మరణములు లేనిదై, జననమరణములతో కూడిన యెరుకయొక్క జాడ ఎంత మాత్రము తెలియనిదై, చట్రాయివలెయున్నది. అని తెలుసుకొని భావింపుము. యెరుకలేకపోవడమే దీనిని సేవించుట అనబడును. ఈ రహస్యము వట్టిమాటలచేత శాస్త్ర మర్యాదలచేత పట్టబడదు. సద్గురుమూర్తి ముఖస్థముగా మాత్రమే తెలియబడును, తెలుసుకొనవలెను.

విశేషభావము : జనన మరణములు లేనిది, వికారము చెందనిది. ద్వంద్వరహితమైనది పరిపూర్ణపరబ్రహ్మము. దీనికి వ్యతిరిక్తమయినది యెరుక. యెరుక అనగా ఎగిరేది, ఎరుకబడునది. జ్ఞానము, తెలివి, జ్ఞేయము. ఇదంతయు యెరుకే. ఇదే ఆత్మ లేక పరమాత్మ అనుచున్నాము, '[redacted]' అను బ్రహ్మసూత్రములో చెప్పిన ఈ సమస్త బ్రహ్మాండము దేనినుండి పుట్టుచున్నదో, దేనివలన పోషింపబడుచున్నదో, తిరిగిదేనియందు లయమగుచున్నదో అదే బ్రహ్మ. దానినే యెరుక అని శ్రీ దీక్షిత సాంప్రదాయములో పేర్కొనబడుచుండును. ఇట్టిఆత్మకు అతీతమైనది కేవలాత్మ - పరిపూర్ణము. "ఆత్మాతీతం కేవలాత్మ" అన్నారు కదా!

ఈ పరిపూర్ణము ఆత్మ జగత్తులజాడ ఎంతమాత్రమెరుగనిది. యత్రనాన్యత్పశ్యతి, యత్రనాన్యచ్ఛృణోతి, యత్రనాన్యత్ విజానాతి, సభూమ" అని శృతి చెప్పుచున్నది. యెక్కడచూచుట వినుట, తెలుసుకొనుట అనునవిలేవో అది "భూమ" అనగా పరిపూర్ణము. ఇట్టి పరిపూర్ణమును శాస్త్రజ్ఞానముచే ఎంతమాత్రము తెలిసికొనలేరు, కనుక "దేశికునోట గట్టిగ దెలుసుకొనుము" గురు కరుణచే, గురుముఖముగా మాత్రమే తెలియబడగలదు. అన్య విధముగా తెలియబడదు.

బ్రహ్మము ఉపాస్యవస్తువుకాదు అని అద్వైత సిద్ధాంతము లోనే యున్నది. ఇక పరిపూర్ణమును ఎట్లు ఉపాసించుటగాని సేవించుటగాని చేయనగును? పరిపూర్ణము. యెరుక, మొత్తము రెండేకదా ఉన్నవి. అందులో ఎరుకను సేవించకుండుటయే, పరిపూర్ణమును సేవించుట అగును. ఇంతకన్న పరిపూర్ణమును పూజించుట, సేవించుట మరేవిధముగానుకానేరదు. పరిపూర్ణము ఉన్నదని గుర్తించిన యెరుకలేకపోవుటయే పరిపూర్ణమును సేవించుట. దీనికే ఈ పద్యములో "యెరుకలేకసేవింపదగును" అన్నారు. మరియు పరిపూర్ణము" చుట్టువలెకదలకుండును" అన్నాను. నీటిలో మునిగి ఉన్న చట్రాయి కనపడక ఉండును. కదలిక యెంతమాత్రము లేకుండును. అట్టి చట్రాయికిపైనున్న నీరు వేసవిలో యింకిపోగానే రాయి కనపడును. అట్లే ఎరుక భ్రమయందున్నవానికి పరిపూర్ణము తెలియబడదు. కానిగురుకరుణచేఎరుక భ్రమ నశించగానేపరిపూర్ణము ప్రత్యక్షమే. కదలక అంతటానిండియున్నది.

౩౧) కం॥ యెం [illegible] రీతినుండును। యెరుగగన శక్యం [illegible] మెన్నినయెరుక [illegible] యెరుగుదునని నను యెరుకకె। యెరుగుట తుల్లభ [illegible] యా [illegible] లు ॥ యెరుగనెయెరుగర్భుకనీ [illegible] లు॥

పెరుగదు విరుగదువొరుగదు తరుగదు । అరుగదు కఱుగదు తిరుగదు మొరుగదు ॥ యీ ఉత్తపైలు । యెరుగనె యెరుగదెరు కనీపై లు ॥

భావము : శిష్యా ! పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడినట్లుగా ఉండును. కాని తెలియబడినది అంటే అది యెరుకకే చెందును. కాని పరిపూర్ణము తెలియబడుట సాధ్యము కాదు యీ పరిపూరము యెరుకను యెరుగదు. మరియు పెరుగుట, విరుగుట, తరుగుట, తిరుగుట, మొదలగు యే వికారములులేనిది పరిపూర్ణము అని తెలిసికొనుము.

విశేషభావము : నాలో సమస్తమును తెలుసుకొనుచున్నది. జ్ఞానము. ఇదేయెరుక. యెరుకచే తెలియబడు సమస్తము యెరుకే. కనుక పరిపూర్ణమును తెలుసుకొనుట జరుగనిపని. ఎందు చేతననగా పరిపూర్ణములో ఎరుకలేదు. పరిపూర్ణము యెరుకకాదు. కనుకపరిపూర్ణము ఎరుకచే తెలియబడునదికాదు. గురుమూర్తి బోధచేసి తెలియపరిచినవనూ ఇట్టి లక్షణములతో కూడినది పరిపూర్ణము అని చెప్పలేదు. ఎరుకకే అన్ని లక్షణములు. అట్టి లక్షణములు ఎంతమాత్రములేనిది, అంతటా ఉన్నది ఏదో పరిపూర్ణము అనివ్యతిరేక లక్షణములచే శిష్యునికి బోధించుచుండెను. కనుక పరిపూర్ణము తెలియబడినట్లుగా ఉన్నను తెలుసుకొనేదికాదని తెలియబడేదికాదని గుర్తించవలెను. ఆదే ఈ పద్యములోని భావము.

(4) కం॥ పలుకున బలుకగ రాకను । తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్ । ములుగ్రుచ్చ సందులేకను । కలిగున్నది ఒక్కబయలుగదరమాయన్నా ॥ యిట్టిగో చూడుకదులాదో యున్నా । పలుకన్న బలుకక, తలచన్నదెరుగక ! చలియెండవానల యాక ని ండు ॥ గదరమాయన్నా . ఇట్టిగోచూడు కదులాదోయున్నా ॥

భావము : ఏవిధమైన శబ్దములేక, ఇట్టిదని ఊహించుటకు మనస్సుకు శక్యముగాక, ముల్లుగుచ్చుటకు కూడ సందులేకుండా సర్వత్రా నిండి నిబిడీకృతమైయున్నదీ పరిపూర్ణ పరబ్రహ్మము. అంతటా నిండియున్నది ఇదిగో నీ యెదుటనే ఉన్నది. కదిలించినా కదులుటలేదు. నీచెయ్యి కదులుచున్నది. కాని పరిపూర్ణము కదులుటలేదు. దానియందు శబ్దములేదు. ఏశబ్దముచేతను తెలియబడదు సంకల్పమునకందదు. చలి ఎండ వాన మొదలగు ప్రకృతి లక్షణములచే వికారము పొందక సర్వకాలము ఒక్కరీతిగ నున్నదే పరిపూర్ణము. యిదిగోచూడుము.

విశేషభావము : "యతో వాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ", మరియు "అప్రాణోహ్యమనాశ్శుభ్రః" అన్నట్లుగా మాటలకు మనస్సుకు అందనిది, ప్రాణము, మనస్సులేనిది. పరిపూర్ణము. కనుక యెరుకచే యిట్టిదని వచించుటకు ఊహించుటకు శక్యముకానిది." నైనంఛిందంతిశస్త్రాణి నైనందహతిపావకః" అన్నట్లు అగ్నిచేతకాల్చబడదు, వానచేతదడువదుఎట్టివికారములను పొందదు.

౨౯) కం॥ సామర్థ్యమేమిజూపదు। కామక్రోధాదికములగలయదనిశమే। కాముతెరుంగదు యితరులు। యేమనినను మూరుపల్కదీబట్టబైలు॥ దీనికి ప్రెుక్కెరితరజేజేలు। నామరూపక్రియునటనలన్నియు మీరి। యేమనియునరాక యేకమైయున్నది। యీ బట్టబైలు। దీనికి మెుృకే, రితజేజేలు॥

భావము :పరిపూర్ణపరబ్రహ్మమునందుశక్తిసామర్థ్యములు లేవు. కామక్రోధాది వర్గములులేవు. కష్టసుఖములనేద్వంద్వములు

లేనిది. యితరులుదీనినిపూజించిన,ద్వేషించినగుర్తించనిది. సమస్త దేవతలు దీనినే బ్రహ్మమని మ్రొక్కిరి. నామరూప క్రియారహితమై, ఇట్టిదనేలక్షణమేమియులేక, అది ఒక్కటి మాత్రమే యున్నది.

విశేషభావము : "సామర్థ్యమేమిజూపదు"- ఎరుకయందు సత్తాఉన్నది. ఈ జగత్తును సృష్టించుట, పోషించుటకు కావలసిన సత్తానూత్రమైనది ఎరుక. అదేరసము. అమృతము. అట్టి సత్తా ఎంతమాత్రములేనిది పరిపూర్ణము. కనుక ఇది సృష్టించదు. దీనిని ఎవ్వరూ సృష్టించలేరు. స్వతస్సిద్ధమై సనాతనమై యున్నది. కనుక సామర్థ్యమేమీయులేదని ఈ పద్యములో చెప్పిరి. ఉత్తది దీనందేమియులేదు. కామక్రోధాది గుణములులేవు కనుక పూజించిన ద్వేషించిన ఏమీ మారుపల్కదు.వికారముచెందదు అని భావము.
(ఉభయ వెరుకల యున్నంత విధి గ్రంతర్నాదు)

36) కం॥ దానము ధర్మము సగుణ। ధ్యానము ప్రతిమార్చ నంబు తజ్జపతీర్థ । స్నానములివిముక్తి దమని । మానవులొనరించ బయలుమాటాడదేమి ॥ యెరుకేలేదుమాటాడేదేమి ॥ ఔనుకాదనక నీవనకనేననకొక్క। మేనై నతాగాక మితిమీరియున్నది ॥ మాటాడ దేమి । యెరుకలేదు మాటాడేదేమి ॥

భావము : సప్తవిధమోక్షమార్గములని శాస్త్ర నిర్దేశము 1) దానము-ఇచ్చుట, 2) ధర్మము-సత్ప్రవర్తన కలిగియుండుట 3) సగుణధ్యానము-సాత్విక గుణముతో న్యాయబద్ధమైన జీవితమును నడుపుకొనుట, 4) ప్రతిమార్చనము-విగ్రహారాధన, 5) జపము-దేవుని మంత్రముచే ఉపాసించుట, 6) తపము-నియమ వ్రతముతో తపస్సు చేయుట, 7) తీర్థస్నానము-పుణ్యనదులలో స్నానము చేయుట అను ... మోక్షమార్గములని శాస్త్రములందు చెప్పబడినవి. ఇవన్నియు ఆచరించినను పరిపూర్ణము ఏమీ సడతో

షించదు. యెందుచేతనవగా పరిపూర్ణములో యెరుకలేదుగదా కొను,-కాదు, నీవు,-నేను, అనదు. యీ అనేక ఉపాధులలో ఒక్క! ఉపాధియందున లేక అన్నిటికి మితిమీరియున్నదీ పరిపూర్ణము అని భావము.

విశేషభావము : దానము, ధర్మము యీ రెండు పదములకు పైన భావములో తెలియపరచినదేగాక 'ఇచ్చుట' అనే అర్థముకలదు. దానము అనగా ఒకానొక కార్యము నిమిత్తమై పాత్రత, కాలము, ప్రదేశములలో నిర్ణయము కలిగి శాస్త్రోక్తముగా నిర్ణయించిన వస్తువును ఇచ్చుట అని అర్థము. దానిధర్మము అనగా అట్టి నిర్ణయములు ఏమియు లేకుండగా అడిగినవానికి అడిగిన వస్తువును ఫలాపేక్షలేకుండ ఇచ్చుట, ఇట్టి సప్తవిధ మోక్షమార్గములు అచరించినను పరిపూర్ణమందు ఎరుకలేని కారణముచే సంతోషించుట మొదలగు వికారములు ఏమియు ఉండదు.

37) కం॥ ఇంతింత నియవరానిది। వింతలు శాయనిది యన్నివిధములగనినన్। చింతలెరుంగనిదీబయ! తెంతనివినిపింతునే నీకేమిరవ్వృథుకా॥ తెల్పుట వినుట మిక పెద్దకథకా ॥ సంతాతమొక రీతి సకలాదేశములాయుం। దంతాట నిండున్నదదిగో పరిపూర్ణము మేమిర పృథుకా। తెల్పుట వినుటమిక పెద్దకథకా ॥

భావము : శిష్యా : పరిపూర్ణ పర బ్రహ్మము యింత అంత అని చెప్పుటకు వీలులేదు. ఏవిధమైన వింతలుచేయునిది. ఏవిధమైన సంకల్పములులేనిది. అట్టిపర బ్రహ్మమైనపరిపూర్ణమునుగురించి నీకు ఏవిధముగావినిపింపజేయుగలను? అలాగున చెప్పుట, వినుట పెద్దకథే కదా! సర్వకాల సర్వావస్థలయందు సర్వదేశములయందు వెల్తి లేకుండగనిండి ఉన్నది పరిపూర్ణము. ఓపృథకా : అదిగోచూడుము.

విశేషభావము : యెరుక "అణోరణీయాన్, మహతో మహీయాన్" అన్నారు. అణువులోను ఉన్నది కనుక అణువుకన్న అణువైనది. అన్ని బ్రహ్మాండములు దానియందే ఉన్నవికనుక మహతోమహీయాన్ పెద్దవాటికన్నా పెద్దది. అట్టి లక్షణములు లేనిది పరిపూర్ణము. 'సూక్ష్మాత్సూక్ష్మతరంనాస్తి । మహతో స్మహిత వర్జితం' అన్నారు. సూక్ష్మముకాదు. మహత్స్వరూపముకాదు ఎందువలన నగా రెండవది ఉన్నప్పుడే చిన్నది అనిగాని పెద్దది అనిగాని పోలిక యేర్పడును. పరిపూర్ణములో యేమీలేదు. ఉన్నదనుకొనుట భ్రాంతిమాత్రమే. రెండవదిలేనప్పుడు, చిన్నదనిగాని పెద్దది అని గాని అనుటకు వీలులేదుగదా! అందుకే శృతియును "అనణ్వస్థూల మహ్రస్వ । మదీర్ఘ మజమవ్యయం । అరూపగుణ వర్ణాఖ్యాం । తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥ అణువు, స్థూలము, పొట్టి, పొడుగు, కానిది, పుట్టనిది, నాశము లేనిది, రూప, గుణ వర్ణములు లేనిది బ్రహ్మమని తెలుసుకొనుము అన్నారు.

తెల్పుట వినుట పెద్దకథ అని పద్యములో చెప్పిరి. కథ, కల్ల కల ఈ మూడును ఒక్కటే, లేనిది అని అర్థము ఏమీలేని, ఏమీకాని ఊహించుటకు బుద్ధికికూడ శక్యముకాని పరిపూర్ణమునుగురించి తెలియ జేయుట, వినుట ఇదంతయు కథే. అబద్ధమే అవుతుంది. అని భావము.

పృథకా ! అని శిష్యునిసంబోధించిరి – పృథకా ! అనగా పిల్లవాడా ! అనియు అటుగ్గింజా । అనియు అర్థము. ఇచ్చట అటుగ్గింజా అనుట విశేషార్థము. ధాన్యపుగింజ బీజముకల్గి మొల కెత్తే లక్షణముగలది. అట్టి ధాన్యమును వేయించి మూడురోళ్ళ చే

దంచి పొల్లుతీసిన గింజకే అటుగ్గింజ అనిపేరు. అది తినుటకు రుచిగ నుండును. అటుగ్గింజ మొలకెత్తదు. ఇక్కడ శిష్యుడు వేదాంత జ్ఞానముచే వేయింపబడి, మూడుమంత్రములనే మూడురోకళ్ళచే దంచబడి, బోధదృఢీకరణముచే పొల్లు ఎగురగొట్టబడినవాడు కనుక వీడు తిరిగి మొలకెత్తడు, అనగా జన్మరహితుడు. అంతేగాక జనులందరికీ అదర్శప్రాయుడై మంచివాడనిపించుకొనును. అందుచే శ్రీకృష్ణప్రభువులు శిష్యుని ప్రేమతో పృథుకా-అటుగ్గింజా! అని సంబోధించుట విశేషము.

38) కం॥ ఆకాశాదికభూతా । నీకాత్మకమగుచు యెరుక
యీ జగమయ్యెన్ । దాకడపోకడ దీనికి । ప్రాకటముగ దేనిలోనా
బట్టబయలది ర॥ కాదనియంటె వట్టి పల్కది రా॥ లోకత్రయము
తనలోపల దిరుగగ । జోకతోడుత దాని జోలెరుగవిదియేదా॥ బట్ట
బయలదిర । కాదనియంటె వట్టిపల్కదిర ॥

భావము : శిష్యా : ఆకాశవాయు రగ్నిజల పృథ్వులను పంచభూతములకు ఆత్మయైన యెరుకయే పంచభూతాత్మక జగత్తు అయినది. ఈ ఆత్మ జగత్తులు రెండును దాకడ పోకడలు దేని యందు జరుగుచున్నదో అదే పరిపూర్ణము. "కాదు" అని అంటే అది వట్టిమాటయే. భూలోక, పితృలోక, దేవలోకములను మూడు లోకములతోకూడిన యీ బ్రహ్మాండము పరిపూర్ణమునందే ఉన్నప్పటికి బాగుగ దానిజోలి ఏమాత్రము యెరుగనిది యీపరిపూర్ణమని తెలుసుకొనుము. కాదని అంటే అది అసత్యభాషణయే.

విశేషభావము : శృ॥ "ఆత్మాన ఆకాశ స్సంభూతః" అనియు ఆత్మయందునసేక మాకాశముదయించె అని భద్రాద్రి రామ శతకములో జెప్పిరి. కనుక ఆకాశాది పంచభూతములను

ఆత్మ ఎరుక. ఈ ఎరుకయే సమస్త జగత్తుగ అయినది. సమస్త జగత్తు యెరుకయే, కనుక ఆత్మ_జగత్తులు రెండును ఎరుకయే ఈ ఆత్మ_జగత్తులు రెండును పరిపూర్ణములోలేక దోచబడినవి. అందుచే పరిపూర్ణమునకుగుర్తించేలక్షణములేదుకనుక, తనయందేలేక తిరుగుచున్న ఆత్మ_జగత్తుల స్వరూపమునుగాని, దాని ముచ్చట్లుగాని యేమియు ఎంతమాత్రము తనకు తెలియదు.

జోక_అనగా సామ్యము, బాగుగ, జత, విధము, ఉత్సాహము, మొత్తము, స్వరూపము అని అర్థములు కలవు. ఈ పద్యములో జోక అనుపదమునకు బాగుగ అనిగాని విధము అనిగాని, మొత్తము అనిగాని స్వరూపము అనిగాని చెప్పవచ్చును.

39) కం॥ తండోపతండములుగా దండిఝషాదికములన్ని తనలోపలను। ద్దండతనుండినపోయిన। నుండు సముద్రంబు యెరుగకుండూనెప్పటికి॥ పరిపూర్ణమిట్టుండునెప్పటికి॥ యెండామావులరీతినుండేటి బ్రిహ్మాండ। ముండిన పోయిన రెండూ గుర్తెరుగని॥ దుండునెప్పటికీ। పరిపూర్ణమిట్లుండు నెప్పటికీ॥

భావము: శిష్యా! గుంపులు గుంపులుగా అనేకమైన చేపలు మొదలగు జలచరములు సముద్రములో పుట్టుచు, పెరుగుచు తిరుగుచు, చచ్చుచున్ననూ యీ జలచర సమూహముయొక్క ఉనికి సముద్రమునకు యిసుమంతయు తెలియదు. అట్లే యెండమావులరీతిగా లేనిదే ఉన్నట్లు దోచుచున్న ఈ బ్రిహ్మాండము తనయందే ఉన్నా, లేకపోయినప్పటికి రెంటినిగుర్తెరుగక, శాశ్వతమై ఉన్నదే పరిపూర్ణము.

విశేషభావము: సముద్రమువంటిది పరిపూర్ణము, జలచరములవంటివి పిండ బ్రహ్మాండములు, సముద్రములో ఉన్న

జలచరములసంగతి సముద్రమునకు తెలియునట్లుగానే, పరిపూర్ణ ములో లేక ఉన్న పిండబ్రహ్మాండముల ఉనికి పరిపూర్ణము గుర్తించుట లేదు కనుక పరిపూర్ణములో యెరుక లేదని భావము.

40) కం॥ యెరుకతొ వచ్చిన విశ్వము । యెరుకతొ జను గాని నిల్వదీబైలైతే ! యెరుకతొరాదెరుకతొపో । దెరుకతసందేమి లేదు యిది నిశ్చయమురా ॥ వుండుంటెయీ యెరుకేలానౌరా ॥ యెరుకా యెరిగిన వస్తు వెరుకని తెలియుము । యెరుక యెరుగదు బయట నిట్టి దట్టి దియున ॥ నిది నిశ్చయమురా । వుండుంటెయీ యెరుకేలానౌరా ॥

బావము : యెరుక వలన యేర్పడిన జగత్తు, యెరుక తోనే లేకపోవును. కాని పరిపూర్ణము యెరుకతొ రాలేదు. యెరుకతో పోదు. యీయెరుక పరిపూర్ణములో యెంతమాత్రము లేదు. ఒక వేళ యెరుక పరిపూర్ణములో ఉన్నచో, పరిపూర్ణముయెరుకే అగును. (తెలియుబడును.) ఎరుకచే తెలియుబడిన వస్తువు ఎరుకే, ఎరుక కాని వస్తువు యెరుకకు తెలియుబడదు. యెరుక కానిది పరిపూర్ణము ఒక్కటే. కనుక పరిపూర్ణము యెరుకకు తెలియుబడదు. యిది నిశ్చయమైన మాట.

---

41) కం॥ రవితమమ మున్న దెరుగునె । ప్రవిమలె దావాగ్ని చదలు బట్టుటె రుగునా । దివమును రాత్రి రాత్రిని, దివమెరుగునె లేమి లక్ష్మిదేవి యెరుగునా ॥ అన్నమును భూదేవి యెరుగునా ॥ భవనాశ స్థితులు రాపాడేటి యెరుకను । భవనాశ స్థితిలేని బయలట్లెరుగదు । లక్ష్మిదేవి యెరుగునా । అన్నమును భూదేవి యెరుగునా ॥

భావము : సూర్యునకు చీకటి ఉన్నట్లు తెలియదు. ప్రచండ అగ్నికి చెదలు పట్టుట యెరుగదు. పగలు రాత్రిని, రాత్రి పగలును యెరుగదు. దరిద్రమును లక్ష్మీదేవి యెరుగదు. భూమి అన్నమును యెరుగదు. అట్లే సృష్టి స్థితిలయములతో కూడియున్న యెరుక, సృష్టి స్థితిలయములులేని పరిపూర్ణమును యెరుగదు.

విశేష భావము : భూమి అన్నమును ఎరుగదు అనగా అన్నము, అన్నాదము రెండు ఒక్కటే అన్నమును ఇచ్చు ఓషదులు అన్నాదము. ఓషధులు భూమిపైనే పెరిగినా భూమి యెరుగదు కదా ।

(బయలాకాశము (శ్రీ [illegible]))

42) కం॥ యెరుకైన భూత పంచక । మెరుకకు చరణములు కటియు హృదయము గళమున్ । శిరమును నయ్యెను క్రమమున । ధరణి మొదల్ జేసియిట్లు తనయా గుర్తెరుగు ॥ గగనము బయలంచన రాదీ మరుగు ॥ యెరుగాకాశమె పరిపూర్ణ మనుచు । కొందరు బల్కిరి దివిని గురిదప్పియుండేవు ॥ తనయా గుర్తెరుగు । గగనము బయలంచన రాదీ మరుగు ॥

భావము : యెరుకనుండి ఏర్పడిన పంచభూతములు ఆ యెరుకకు (ఆత్మకు) పృథ్వి-పాదములుగను, జలము-కటి ప్రదేశము, అగ్ని-హృదయము, వాయువు - కంఠము-, ఆకాశము- శిరస్సు ఏర్పడినని. ఆకాశము ఎరుకవల్లనే ఏర్పడినది మరియు ఎరుకకు ఒక అవరోధముగా గూడ ఉన్నది. కనుక ఆకాశమును [illegible] ఊహించగలక కొందరు [illegible] బయలు [illegible]. అది విని [illegible] పరిపూర్ణము కాదు.

విశేషభావము : నీ - నా మధ్య అంతటా నిండియున్నవి మూడు ఆకాశములు గలవు. 1) భూతాకాశము. ఇది పంచభూతములలో మొదటిది. ఆత్మనుండి పుట్టినది. శబ్దగుణము, నలుపు రంగు, చీకటి వెల్తురుతో కూడియున్నది. అవకాశరూపము 2) మహాకాశము :- భూతాకాశము బ్రహ్మకాదని బుద్ధిబలముచే అదిలేదని తీసివేసినచో ఉన్నది మహాకాశము. ఇదియే పరమాత్మ, బ్రహ్మము. ఇదియును అవకాశ రూపమే. శబ్దము - నిశ్శబ్ద శబ్ద రూపముగా ఉన్నది. చీకటి వెల్తురు కానిది. అమృత స్వరూపము. సత్తా ప్రధానమైనది. కనుక దీనినే ఈసాంప్రదాయకులు ఎరుకని వ్యవహరింతురు. కనుక ఇది కూడ లేకపోతే ఉన్నది పరాకాశము. ఇదే పరిపూర్ణము. అవకాశరూపము. చీకటి వెల్తురు కానిది శబ్దము ఎంతమాత్రము లేనిది. సత్తా లేనిది రసముకూడ కానిది. ఇట్టి పరిపూర్ణము అవకాశ రూపమే గనుక ఎదురుగా ఉన్న అవకాశరూపమైన భూతాకాశమునే చూపించి యిదే పరిపూర్ణము, బయట అని చెప్పుదురు. కాని భూతాకాశ మహాకాశములును బుద్ధి బలముచే లేనివని తీసివేసినచో ఉన్నటువంటిది పరిపూర్ణమని గ్రహించవలెను.

48) కం॥ విత్తే చెట్టై పుట్టును । విత్తే విత్తనము రీతి వెలయును ధరపై । విత్తుకు చెట్టుకు వేరే । విత్తనమొకటున్నదనిన వినగూడదోయీ ॥ తనకు దాబుట్టును వినవోయీ ॥ విత్తుచెట్టుల రెంటి విధమీ భూమెరుగన । ట్టుత్తా బయటెరుగదు సత్తు చిత్తుల రెంట్ని ॥ వినగూడదోయీ । తనకు దాబుట్టును వినవోయీ ॥

భావము : శిష్యా : విత్తనమే చెట్టుగను, తిరిగి చెట్టు విత్తనముగను ఏర్పడుచున్నది. ఆ విత్తు చెట్టులకు వేరే మరొక మూలము ఉన్నది. అను మాట వినగూడదు. అది నిజము కానే

రదు. తమకు దామే యేర్పడినవి. అవిత్తు చెట్టుల రెంటిని భూమి యెరుగనట్లుగనే, ఉత్తబట్ట బయలు అయిన పరిపూర్ణము సత్తు చిత్తుల రెంటిని ఎరుగదు.

విశేషభావము: విత్తనము సూక్ష్మ రూపము, చెట్టు స్థూల రూపము విత్తనములో చెట్టు ఉన్నది. చెట్టులో విత్తనము ఉన్నది. ఈరెండు ఒక్కటే. రెండు కావు. చెట్టు_జగత్తు విత్తనము_అధిష్ఠాన చైతన్యమైన ఎరుక. ఎరుకయే జగత్తుగా ఏర్పడుచున్నది. యీ యెరుక జగముల రెంటికి వేరుగా ఏమియు మూలము లేదు. తనంత తానుగా వచ్చినది. చెట్టు_విత్తనముల సంగతి భూమి యెరుగనట్లుగనే ఆత్మ_జగములు అనగా సత్తు చిత్తుల రెంటిని పరి పూర్ణమెరుగదు అని భావము.

---

44) కం॥ చెట్టే మూలము విత్తుకు। చెట్టుకు మూలంబు విత్తు క్షితిపై రెంటున్। పుట్టిన చచ్చిన రెంటిని। గట్టిగ తానెరుగ కుండుగదర యీనేలా॥ నీవీ రీతిగను గొనవేలా॥ పుట్టుచుగిట్టుచు పొలుపొందుతను వెరుక। లిట్టి విచిత్రము లెన్నడెరుగదు బయలు॥ గదరా యీనేల। నీవీ రీతి గనుగొనవేలా॥

భావము: శిష్యా! చెట్టుకు మూలము విత్తు, విత్తుకు మూలము చెట్టు. ఒకదాని కొకటి అన్యోన్యాశ్రయము. ఈవిత్తు చెట్టులు రెండు పుట్టిన, చచ్చినా భూమికి తెలియదు గదా! అట్లే తను వెరుకలు పుట్టుచు గిట్టుచు ఒప్పుచున్నను ఈ విచిత్రము

తెన్నడూ ఎరుగనిది పరిపూర్ణమని తెలియుము. అనగా తను వెరు కల సంబంధము పరిపూర్ణమున కెంతమాత్రము లేదని భావము.

---

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
అచల లక్షణన్నామ తృతీయోఽధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.

— ౦ —

# 4. యెరుక లక్షణం (20)

45) యెరుకే దేహేంద్రియములు । యెరుకే వర్ణాశ్రమ కులము, యెరుకే కృతులున్ । యెరుకే నీవును నేనును । యెరుకే సతిసోదరాదులెరుగుము వత్సా ॥ నేదీర్చె దనిదిగో నీయిచ్ఛా । హరిహర బ్రహ్మాది సురనరగిరిసరి । తరుమృగముఖచరాచరములు యెరుకని ॥ యెరుగుము వత్సా । నే దీర్చెదనిదిగో నీయిచ్ఛా ॥

భావము : వత్సా । అనగా ఓ ప్రియమైనకుమారా । యీ శరీరము, యింద్రియములు, వర్ణ, ఆశ్రమ, కుల, గోత్ర నామ రూపములు అన్నియు యెరుకే । సతి, సోదరులు మొదలగు సమస్త బంధువర్గము, యెరుకే అని తెలియుము. పరబ్రహ్మమనగా యెట్టిదో తెలుసుకొను కోరికతో ఉన్నావుకదా । యిదిగో నీకోరిక తీర్చెదను, విష్ణువు, బ్రహ్మ ఈశ్వరుడు మొదలగు దేవతలు, మానవులు, పర్వతములు, నదులు, చెట్లు, జంతుజాలము, పక్షులు ఇంకా అనేకమైన కదిలేవి, కదలనివి సమస్తమున్ను యెరుకేయని తెలియుము.

విశేషభావము : "యత్ర అన్యత్పశ్యతి, అన్యచ్ఛృణోతి అన్యత్ విజానాతి, తదల్పం" అన్న శృతిరీత్యా ఎంతవరకు విన గల్గుదుమో, చూడగలమో, తెలిసికొనగలమో అదంతయు అల్ప మైనది. అనగా నశించునది. బ్రహ్మముకాదు. ఎరుకే అని నిర్ణ యము, నేను_నీవు యెరుకే అనగా ఆత్మ_జగత్తులు రెండునూ యెరుకే, ఆత్మ జగత్తుల కతీతమైనది, ఏకమాత్రమై రెండోదిలేనిది, అదేభూమ. అదే పరిపూర్ణము. అది తప్ప మిగిలిన సమస్తము యెరుకయే !

46) యెరుకే విద్యావిద్యలు । యెరుకే ప్రణవంబునాద మెరుకేకళయున్ । యెరుకేబిందువుచిత్తు । త్తెరుకే ఆనందమివినీ, వెరుగు సద్బుద్ధీ ॥ నీనామాటలెరుకేనిబుద్ధీ। యెరుకే నిర్గుణ సగుణా లెరుకే యెరుకకుయంత ।యెరుకోనే నిదియంత యెరుకాజేసితినీవి । బ్లెరుగుసద్బుద్ధీ । నీనామాట లెరుకే నిబద్ధీ ॥

భావము : ఓ మంచిబుద్ధికలవాడా । సమస్తమైన విద్యలు అవిద్య, ఓంకార ప్రణవనాదము, బిందువు, కళ, మరియు సత్తు_ చిత్తు_ఆనందము, ఇవన్నియు కూడ ఎరుకే అని తెలియుము. నీ_నామాటలు ఇవన్నియును కూడ యెరుకే. సగుణ_నిర్గుణములు యెరుకే. యీ యెరుక అనగా యీ తెలుసుకొనే తెలివికి(జ్ఞానము నకు) ఎంతవరకు తెలియబడునో అవి అంతయు యెరుకే అని తెలియజేయుచున్నాను. ఈ విధముగా అంతయు యెరుకే అని తెలుసుకొనుము ఓ నిబద్ధీ ।

విశేషభావము : విద్య అనగా జ్ఞానము. సమస్త శాస్త్రి ములు అనికూడ అర్థము. షడ్విధవిద్యలు_ 1) ఆకర్షణ, 2)స్తంభన,

3) మారణ, 4) విద్వేషణ, 5) ఉచ్చాటన, 6) మోహనములు. ఇంకా చతుర్దశవిద్యలు, చతుర్వేదములు, షడంగములు. పురాణములు, మీమాంస, న్యాయశాస్త్రము, ధర్మశాస్త్రము, అయుర్వేదము ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము, వ్యాకరణము ఇత్యాది సమస్త విద్యల జ్ఞానస్వరూపమే. అనగా యెరుకే, ఇట్టి ఏవిద్య తెలియకపోవుట అవిద్య అజ్ఞానము అనబడును. మరియు బ్రహ్మ తత్వమును గుర్తించుట జ్ఞానము, బ్రహ్మము నెరుగకపోవుట అజ్ఞానము. ఇట్టి జ్ఞాన-అజ్ఞానములు రెండునూ ఎరుకయే. మరియు ఒక్కమాటలో ఎరుక అనగానేమో ఈ పద్యములో నిర్వచించినారు. యెరుకకు యెంతయెరుకోనేనది యంత యెరుకజేసితి". అనగా జ్ఞానముచే ఎంతవరకు తెలుసుకొనగలమో లేక, జ్ఞానముఎంతవరకు తెలుసుకొనగలదో, అది అంతయు జ్ఞానముయొక్క ప్రతిరూపమే. అనగా జ్ఞానమే. కనుక నీవు ఎంతవరకు తెలిసికొనగలవో అది అంతయు ఎరుకే. అందుకే శృతియును" యతోవాచో నివర్తండే" అప్రాప్యమనసాసహ" నీవాక్కు బుద్ధియుకూడ ఎంతవరకు గ్రహించినదో దానికి ఆవలగాయున్నదే పరబ్రహ్మము అన్నారు. కనుక బుద్ధికి అందరానిది, భావచన్యముకానిది. వచింపశక్యముకానిది పరమార్థమని గ్రహింపవలెను. తెలియబడు సమస్తము, తెలుసుకొనునది అంతయు యెరుకే. "నిబద్ధీ" అనగా నిజమును గ్రహించినవాడా అని సంబోధించిరి. నిబద్ధి అనగా నిజము అని అర్థము, నిజమైనది పరమార్థము. అట్టి పరమార్థమును గ్రహించిన వాడు కనుక శిష్యుని నిబద్ధీ అని సంబోధించినారు.

47) యెరుకే ఇహపర సౌఖ్యము। లెరుకే జ్ఞానంబు జ్ఞేయమెరుకే మోక్షం। బెరుకే భక్తివిరక్తులు। యెరుకే సంకల్పమని నీవెరుగు సత్కీర్తి॥ యెక్కడికేర యెరుక సంపూర్తి। యెరుకే

శివుండీశుఁ డేరుకై తదేకత । యెరుకే సర్వమునే గుర్తెరిగి చెప్పితి యాకీ ॥ తిరుగు సత్కీర్తి । యెక్కడి కౌరయెరుక సంపూర్తి ॥

భావము : ఓ మంచికీర్తిగలవాడా । ఇహపరసౌఖ్యములు, జ్ఞానము, జ్ఞేయము, మోక్షము, భక్తి, వైరాగ్యము, సంకల్పము. ఇవన్నియు యెరుకేయని తెలియుము. ఇలా చెప్పుచూ ఉంటే యెరుక యెక్కడికి పూర్తవతుంది ? అంతయూయెరుకే. పిండాండ చైతన్యమైన జీవుడు, బ్రహ్మాండ చైతన్యమైన ఈశ్వరుడు రెండునూ ఎరుకే. ఈ జీవశివ ఐక్యత అనునదియు యెరుకే. సమస్తము ఎరుకే. ఇది అంతయు నేను గురుముఖతా గుర్తించి నేను నీకు చెప్పుచున్నాను. ఈ రహస్యము నీవు తెలుసుకొనుము.

విశేషభావము ; ఇహలోక, పరలోకసౌఖ్యములు, అనుభవిస్తే నశించిపోయేవేకనుక ఎరుకయే. "యద్దృశ్యం తన్నశ్యం" అన్నట్లుగా కనబడునదంతయు, నశించునదే. కనుపించునది అనగా కేవలము నేత్రములకు కనుపించునది మాత్రమే అని అర్థముకాదు పంచతన్మాత్రలకు, బుద్ధికికూడ గోచరమగునదంతయు కనుపించునదియేయని తెలియవలెను. కనుక జ్ఞానముచే సమస్త జ్ఞేయము కూడ జ్ఞాన స్వరూపమే. కనుక జ్ఞాన జ్ఞేయములు రెండునూ ఎరుకే. మోక్షమనునది ఇచ్చిపుచ్చుకొనే వస్తువుకాదు. కారహితస్థితియేమోక్షము. కాని మోక్షము సంపాదించుటకై ఇలాంటి కర్మ భక్తి జ్ఞానములు కావాలియని మోక్షమునందాసక్తుడై అపేక్షతో ఉండుటకూడ మోక్షముకూడ (ఎరుకయే అని చెప్పుటలో గల భావము. "అవిద్యోపాధికో జీవః_మాయోపాధిక ఈశ్వరః అనియు "శివోబ్రహ్మైవనాపరా" అనియు చెప్పబడుచున్నది. కనుక జీవ శివులిద్దరు "నామరూప క్రియాసహితులే కనుక ఎరుకయే. "తదేకత" అనగా జీవ_శివ ఐక్యతకూడా ఎరుకయనియే గ్రహించవలెను. జీవబ్రహ్మలకు పరమైనదే పరిపూర్ణమని తెలియవలెను.

48) చింతలతోటన ఎరుకే। వింతలపుట్టిల్లనంగ వెలశివ దెరుకే। తంతులపేటన ఎరుకే। పంతములకుచూడమూలబలమన్న దెరుకే ॥ జగజ్జనన స్థలమన్న నెరుకే। భ్రాంతులకెల్లను పట్టణమన జెల్లి ॥ కాంతాదిరూపులు గల్పించుటకు మూల ॥ బలమన్న దెరుకే। జగజ్జననస్థలమన్న నెరుకే ॥

భావము : సంకల్పములకు, సమస్త దుఃఖములకు నివాస స్థానమయినదెరుకే. సమస్త చింతలు కల్పించుటకు మూలస్థానము ఎరుకే. ఏడుమెట్లపై నున్న పేట (సహస్రారము) అనునదియు ఎరుకే. సిద్ధాంత రాద్ధాంతములతో పంతములకు మూలబలమన్న దియు ఎరుకే. సమస్తమైన భ్రాంతులు, కోరికలకు మూలమైనది ఎరుకే. తనకన్న అన్యమైన రూపములతో కాంతాది వివిధరూప ములు కల్పించుకొని అనేక భ్రాంతులకు లోనగుచున్నది ఎరుకే అని తెలియుము.

విశేషభావము : "తంతులపేట" అనగా తంతులు అనగా మెట్లు అని అర్థము. మెట్లపైనున్న పేట. అనగా ఆధారాది షట్చ క్రములు మెట్లు. ఈ ఆరుమెట్లపై నున్న సహస్రారము అందలి చైతన్యము. అదే తంతులపేట అను పదమునకు అర్థము. అనగా అబ్రహ్మకూడా ఎరుకే అని చెప్పుటకే కృష్ణప్రభువు "తంతులపేటన నెరుకే" అని పదప్రయోగము చేసినారు.

49) అన్నియు తానై తనకవి। పన్నుగ వేరనుచు నోటబలుకుచు మరితా। నన్నిటి నెరిగే ఎరుకై। యున్నానని ఎరుకకెరుకే నూహింపుచుండూ ॥ తనలోతానే మోహింపుచుండూ। ఎన్నో విచిత్రిలీ ఎరుకాశాతలువింటే। పున్నాది లేదులేకున్నాది కలదాని ॥ హూహింపుచుండూ। తనలోతానె మోహింపుచుండూ ॥

భావము : ఓ శిష్యా ! సమస్త జగత్తు తననుంచే (ఎరుక నుంచే) అయినది. అయిననూ తాను బ్రహ్మనని జగత్తంతయు తనకన్న భిన్నమైన మాయాస్వరూపమని అంటూ, అట్టి సమస్తమును తెలుసుకొనే జ్ఞానస్వరూపమునై యున్నానని, తనకుతానే (ఎరుకే) ఊహించుకొనుచుండును. మరియు తానుశాశ్వతమనియు సమస్తము మిథ్యయని మోహము చెందుచున్నది. ఈ విధముగా ఎరుకయొక్క పనులు విచారిస్తే ఎంతో విచిత్రముగా ఉండును. ఉన్నవస్తువు పరిపూర్ణమును లేదని, లేనిదే తనంతతానుగా కలవలె తోచిన తాను (ఎరుక) శాశ్వతమని తనకుతానే ఊహించుకొనును.

50) వినుమూర్ణనాభితా ! బుట్టినమీదట సృజనజేయుదినము హరించున్ ! ఘనమగుపటశతకోట్లను ! తనలోపలి దారమునను తానట్టెవనునూ॥ అట్లనె ఎరుక తాబుట్టికనును ! పనిబూని బ్రహ్మాండ భాండనంతమూలాను ! క్షణములోపల ద్రుంచికనరాకవేవేగ ॥ తానట్టిచనుసూ ! అట్లనె ఎరుక తాబుట్టికనునూ ॥

భావము : ఓ శిష్యా ! సాలెపురుగు (లేక పట్టుపురుగు) తనుపుట్టి తనలోపలి జిగురుపదార్థముచే అనేకదారములుగా తయారు చేసి వాటితో గూడు అల్లుకొని దినము గడిపివేయును చివరకు ఆ గూడుతోసహా తాను లేకపోవును. అట్లనే ఎరుక ఒక్కటి ఏర్పడి అనేకవిధములైన జగత్తును తానే తయారుచేసుకొని, చివరకు ఒక్క క్షణములో బ్రహ్మాండమును నశింపజేసి తానుకూడ లేకపోవును. అనగా చివరకు అన్ని తననుండి ఏర్పడుచున్నవి. తిరిగి అన్నిటిని తనయందే లయింపజేసుకొని తానే లేకపోవును.

విశేషభావము : "సోకామయత, బహుస్యాం ప్రజాయతే" అనుశృతివచనానుసారముగా, ఆ పరబ్రహ్మమైన ఎరుక ఒంటరిగా

ఉండలేక తాను అనేకములుగా వాలి అనుకోరిక కల్పించుకొని తానే వెంటనే చిత్రించి త్రిగుణాలతో కూడిన జగత్తు (పిండ బ్రహ్మాండములుగా) తయారైనది తిరిగి రాత్రియొక్క సుషుప్తి అవస్థలో ఈ సమస్త జగత్తును తనయందే లీనము చేసుకొని చివరకుతాను ఏలా లేకవచ్చినదో అలాలేకపోవుచున్నది.

51) తల్లిదండ్రులు జీవేశులు । యిలవ్యోమమూ నేను మేను లెరుక మరుపులున్ । కలమేల్కొలు శుక్లశ్రోణంబులు నీరాన్నములు ప్రకృతి పురుషుడాల్మగడూ ॥ గానై ఎరుక కెరుకే కానబడూ । తెలసీ బయలున్నాదితెలసీ యీతెలివినీతెలివిచేతనెపట్టితీసివేయుము ప్రకృతి ॥ పురుషుడాల్మగడూ । గానై ఎరుక కెరుకే కానబడూ ॥

భావము : తల్లి-దండ్రి,జీవ-ఈశులు,భూమి,ఆకాశము,నీరు అన్నము ప్రకృతి-పురుషుడుఆలు-మగడు, నేను, మేను,ఎరుక-మరుపు కల-మేల్కొ, శుక్ల-శ్రోణితము, యీ విధముగా ఎరుకే ఒకదానికి మరొకటి భిన్నభావముగా ఎరుకే అయినది. అనగాఎరుకే యిట్టి ద్వంద్వ రూపముగా అయినది. కనుక యెరుక ఏకరూపమైనది కాదు. ద్వంద్వస్వరూపమైనదని తెలసి, గురుముఖతా పరిపూర్ణమున్నదని తెలసి, ఆ తెలసిన తెలివిని తెలివిచేతనే లేదని తీసివేయవలెను.

విశేషభావము : భ్రూమధ్యస్థానమందున్న తెలివి ఎరిగే ఎరుక. సహస్రారమందున్న తెలివి ఎరిగే లక్షణము లేనిది కనుక యెరుకలేనిఎరుక. అనగా ఎరుకే సహస్రారమందున్నప్పుడు స్వస్థానములో గుర్తించే లక్షణము లేక నిర్గుణ స్వరూపముగానున్నది. భ్రూమధ్య స్థానమునపై ఎరుక బుద్ధియందు ప్రతిబింబితమై ప్రత్యగాత్మ అని పిలువబడుచున్నది, ఇది ఎరుక యొక్క ప్రతిబింబము కనుక ఇదియును ఎరుకే. ఇచ్చట సమస్తము గుర్తించే లక్షణము కలదు. అనగా సగుణరూపముగా. కనుక అన్నిటిని గుర్తించే

యూ తెలివిచేతనే తనకు పైగా ఉన్న సహస్రారమందున్న నిర్గుణ స్వరూపమైన ఎరుక పరిపూర్ణములోలేదని తెలుసుకొని దానియందు భ్రాంతిరహితపడుటయే "తెలివిచేతనే తెలివినిపట్టి తీసివేయుట" అన్న పదమునకు భావము.

52) వొక దేహధారితనువున। సకలావస్థలు జనించి చనిన విధమునన్। అకళంకమైన బయలులో। ప్రకటంబై లేని ఎరుక బయలుండజూచి॥ తన ముచ్చట పరికించి లేచీ। వొక కొంతసేపైన వుండే టందుకులేక। సకలామును తనవెంట జనుదేర చనుజుట్టు॥ బయలుండజూచీ। తనముచ్చట పరికించిలేచీ॥

భావము: ఒక శరీరధారి యొక్క శరీరములో బాల్య యవ్వనాది సకల అవస్థలు ఏర్పడి, తుదకేమీ లేకపోయిన విధముగానే, కళంకరహితమైన పరిపూర్ణములో లేనిఎరుక ఒకటి తనకు తానుగా ఏర్పడి, పెంపొంది, గురుముఖతే పరిపూర్ణమున్నదని గుర్తించే సరికి తాను ఏమీ లేనని తెలసి మేల్కొనినదై, కొంత సేపుకూడ ఉండుటకులేక. వెంటనే తనతో యేర్పడిన సమస్తముతో ఏమీలేకుండాపోవుచున్నది. (సృష్టివిధానము)

53) మేలుక సుషిప్తిలోపల। నేవీలంతనకుదాను యేతెంచు నోగు। రాతీల బయలులోపల। వాలాయము తనకుదానెవచ్చునో యున్నా॥ వొచ్చి హెచ్చి చచ్చునోయున్నా। యీలోపలనే బట్ట బయలున్నా దెరిగితే। యేలోకమున నిల్వజాల దెరుగకుంటే॥ వచ్చునోయున్నా। వచ్చి హెచ్చి చచ్చునోయున్నా॥

భావము: గాఢ నిద్రావస్థనుండి మేలుక తనంతటతానుగా ఏవిధముగావచ్చినదో అట్టి పరిపూర్ణములోపల తనకుతానే ఎరుక పుట్టుచున్నది. అట్లు ఎరుకపుట్టి, పెరిగి, చచ్చుచున్నది. అవిధముగా

చచ్చేలోపలనే పరిపూర్ణము ఉన్నదని తెలుసుకుంటే, ఏలోకము నందు లేకుండా పూర్తిగా పోవును. అట్లు పరిపూర్ణమున్నదని తెలుసు కొనకపోతే తిరిగి భూమ్మీద జన్మకు రాకతప్పదు.

విశేషభావము : యెరుక స్వతస్సిద్ధముగా పరిపూర్ణ ములో తనకు తానుగాలేక తోచినది. పరిపూర్ణమువలన పుట్టలేదు. ఇట్టి యెరుక పుట్టి పెరిగి, చచ్చుచు అనేకకోట్ల జన్మలనెత్తుచున్నది. ఇట్లు జన్మ పరంపర పొందుచున్న యెరుక, పరిపూర్ణమున్నదని గురుముఖతా గుర్తించినచో, తాను లేనని తెలుసుకొని లేకుండగ పోవును. అట్లు పరిపూర్ణమును గుర్తించకపోయినచో తిరిగి జన్మకు రాకతప్పదని భావము.

---

54) ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేనుబొమ్మ యాటాడ తనే ! ఆటాడు నెరుకయనియెడి। యాటాడించేటివాడు ఉతడే రాకర్తా ॥ అంతటికి యీాయచలమాకర్తా। చేటుపాటుల రెంటిచే వొచ్చు ఫలము। మమ్మాటికనుభవించి మరణ జననములొంద ॥ నతడే రాకర్తా। అంతటికీ యీాయచలమాకర్తా ॥

భావము : ఓ శిష్యా ! జాగ్రదవస్థలో ఇరువదినాలుగు యింద్రియములచేత యీా ఎరుక సమస్త వ్యవహారములు చేయు చున్నది. ఆ ఎరుకయే సుషుప్తి అవస్థలో ఇంద్రియములు పని చేయక ఏవ్యవహారములు లేకుండగ పడియున్నది. ఆ ఎరుకయే స్వాప్నిక అవస్థలో శరీరము కదలకుండగనే, గత సంస్కార బల విశేషముచే భావనారూపముగా సమస్త వ్యవహారములు చేయు చున్నది. ఇట్లు జాగ్రద, సుషుప్తి, స్వప్న అవస్థలును పొందు చున్నది, ఎరుకయేగాని పరిపూర్ణమునకు ఏమీ సంబంధములేదు. అట్లే గతజన్మలలో చేసిన పాపపుణ్యకర్మల ఫలితములైన దుఃఖము

సుఖములను అనుభవించినది ఎరుకయే కాని, పరిపూర్ణము పరబ్రహ్మ మునకు ఎంతమాత్రము సంబంధము లేదని ఎరుగుము. పరిపూర్ణము కర్త గాదు.

విశేష భావము : జాగ్రదవస్థలో హృదయస్థానాలుమైన జీవుడు (ఎరుక) అను చైతన్యమే విశ్వుడను పేరుతో నేత్ర స్థానమున నుండి ఇరువదినాల్గు యింద్రియములతో కూడి స్థూల శరీరముచే సమస్త వ్యవహారములు చేయుచున్నాడు. ఆ ఎరుకయే కంఠస్థానమునకుచేరి తైజసుడను పేరుకలవాడై 17 ఇంద్రియములతోకూడి గతకర్మ సంస్కారవాసనలచే స్థూలశరీరము కదలకుండగా మనోరూపముగా సమస్త కర్మలను చేయుచున్నాడు. ఇది స్వప్నావస్థ. ఆ ఎరుకయే హృదయస్థానమునకు జేరి ప్రాజ్ఞుడను పేరుకలవాడై ఎట్టివ్యవహారములులేకుండగసుషుప్త్యవస్థను పొందుచున్నాడు. ఈ విధముగా ఎరుకయే కర్తగాను, కర్మగాను, క్రియారూపముగాను అగుచున్నది. ఇన్నిటికి వేరేకర్త మరొకటి యేదియునులేదు. సమస్తకర్మలు తానేచేస్తున్నాడు. తానే అనుభవించుచున్నాడు. సమస్త జీవరాశి రూపము ఎరుకయే శిలాపాషాణాదులు ధాతుజీవులు, ఇందులోని ఎరుక అచేతనరూపము. సుషుప్తి అవస్థవంటిది. వృక్షలతాదులలోని ఎరుక-అంతశ్చైతన్యరూపము మూలజీవులు. స్వప్నావస్థవంటివి. క్రిమికీటక మనుష్యాదులలోని ఎరుక చేతన జీవులు. చైతన్య స్వరూపము. జాగ్రదవస్థవంటిది. మొత్తముమీద ఇన్నిరూపములుగా ఉన్నది ఒక్క ఎరుకమాత్రమే సమస్తకర్మలనుతానే చేయుచు, తిరిగి సుఖదుఃఖరూపముగాను, జననమరణ రూపముగాను అనుభవించుచున్నది కాన ఆఎరుకయే కాని పరిపూర్ణ పరబ్రహ్మమునకే కర్తృత్వ సంబంధములేదు. పరిపూర్ణము కర్తకాదు, కర్మకాదు, క్రియ ఎంతమాత్రము కాదు.

"చేయించేవాడు పైన ఆభగవంతుడున్నాడు, నేను కేవలము పాత్రధారిని. నేను కర్తనుకాను" అనులోకోక్తిని ఖండించుటకై ఈ పద్యము చెప్పబడినది. పరమాత్మ చేయించేకర్త, జీవాత్మ చేసే కర్మ స్వరూపము. ఇది తప్పు. అజ్ఞానము. పరమాత్మ–జీవాత్మలు రెండునూ ఒక్కటే. కనుక కర్త–నేనే. కర్మ–నేనే, క్రియ–నేనే. పరిపూర్ణ పరబ్రహ్మము ఎంతమాత్రము కర్త, కర్మ, క్రియ కానేరదు. అని గ్రహించవలెను.

55) దేహమునుజూచు కన్నులు। దేహమునకు వేరులేని తీరున యెరుకే। సోహం తత్త్వంతపదా। సోహం సోహం ఒంటుచు చూచుచుండుసుమీ॥ తనకదానే తోచుచుండుసుమీ। దేహిదేహము లనే తెరగున ప్రసరించి। దేహమునానివి। దేహిగా తననూతా॥ చూచుచుండుసుమీ। తనకు తానె తోచుచుండుసుమీ॥

భావము : శిష్యా! నీశరీరమును చూచే నీకండ్లు, నీశరీరమునకు వేరుగాలేవు. కండ్లుకూడ నీశరీరములో ఒక అవయవమే కదా! అటులనే యీశరీరమందలి చైతన్యమైన యెరుక, నేనెవరిని! నీవెవరవు? నేను నీ యొక్క దాసుడను, నేనేనీవు అని ఈలాగున ద్వైతభావము, అద్వైతభావముతోటి తనకుతానే నేకవిధములుగ ఊహించుచుండును. తనలోతానే మోహించుచుండును.

విశేషభావము : శరీరమునంతనుజూచేకన్నులు శరీరమునకు వేరైనవికావు. కన్నులు శరీర ఇంద్రియభాగమేకదా! అట్లే నేను–మేనులు కలిసియే "నేను" అని చెప్పవలెను. పరిపూర్ణ విచారణలో "నేను" లేని మేనులేదు. మేను లేకుండగ 'నేను"కు ఉనికి

భవిష్యత్తులలోలేదు. వర్తమానమునందు మాత్రమే యున్నది. భూత భవిష్యత్తులలోలేనిది,వర్తమానమునందుమాత్రముండునా? ఉన్నట్లుగా మాత్రమే తోచబడుచున్నది. కనుక భ్రమస్వరూపము. అని తెలియపర్చినవారు అశరీరసాంప్రదాయకులు, సద్గురువులు, "నేను" లేనివారు. వారే నీజన్మను ఉద్ధరించినవారగుదురు.

— —

౨౭) పరిపూర్ణమొకటిదక్కని ! తరమైన ప్రపంచ మెల్లతగ తెలియుమునీ । వెరుకేనని మదిలోపల । యెరుకే పరిపూర్ణమెరిగె దెరుకానెరిగేదీ ॥ యింకొక్కటి లేదీ రెంటెరిగేదీ ॥ యెరుక పుట్టువు మూలమెరుగానిదీ యెరుకే । యెరుకతాబుట్టిన దెరుగబోయితె తేలదం॥ చెరుకానెరిగేదీ । యింకొక్కటి లేదీరెంటెరిగేదీ ॥

భావము ! ఓ శిష్యా ! పరిపూర్ణము ఒకటి తప్ప యితరమైన సమస్తము కూడ యెరుకేయని చక్కగా తెలిసికొనుము. పరిపూర్ణమును తెలిసికొనేదీ యీ యెరుకయే. మరియు యెరుకను తెలుసుకొనేదీ యీ యెరుకయే. పరిపూర్ణ మెరుకల రెంటినీ ఎరిగేది మరొక్కటి యేదీలేదు. అయితే యీ యెరుక తనమూలమును మాత్రము యెరుగదు. అట్లు తన మూలమును యెరుగబోతే తానే లేకుండగపోవును.

విశేషభావము ! యెరుక అనగా తెలుసుకొనునది, తెలివి జ్ఞానము అని అర్థము. జ్ఞానము—జ్ఞేయము రెండునూ ఒక్కటేగాని రెండుకాదు. కనుక తెలుసుకొనేది—యెరుక. తెలియబడునదియు—ఎరుకయే. కనుక అన్నిటిని తెలుసుకొనేది ఒక్క యెరుకెగాని మరొకటిలేదు. ఈ యెరుక ఏలావచ్చినది ? అని గురుముఖతా

మైన యెరుక రూపమని తెలుసుకొనుము. ఇట్టి అఖండ యెరుకను చక్కగా విచారణచేయుము. యీ నాల్గు భాగములతోకూడిన ఎరుక విచారణ ఆసాంతముచేసి నీకు తెలియబరచిన మహానుభావులే నీకు తల్లిదండ్రులుగా భావింపుము. ఖండముగాను, అఖండముగాను కనుపించే యెరుక దండిదా ? (గొప్పదా?) అనగా గొప్పదికాదు. అదిలేనిదే భ్రమరూపమైయున్నది॥ మాయాస్వరూపమే అది గుర్తించి వారిని కలలోకూడ మరువకుండగ ధ్యానించుము.

విశేషభావము : ఈ శరీరము పిండాండము. జగత్తుతో కూడినదంతయు బ్రహ్మాండము. ఈశ్వరపురుషుంబట్టి బ్రహ్మాండ మనియు, జీవపురుషునిబట్టి పిండాండమనియు పేరు. పిండాండ మందలి చైతన్యము జీవుడు. బ్రహ్మాండమందలి చైతన్యము ఈశ్వరుడు. అనగా పిండాండము - జీవుడు, బ్రహ్మాండము - ఈశ్వరుడు, ఈ నాలుగు ఖండములు కలిసి అఖండ ఎరుక స్వరూప మనబడును. ఇది అఖండ యెరుకయొక్క పూర్ణ స్వరూపము. ఇట్టి అఖండస్వరూపమును పూర్ణముగావిచారించినప్పుడు, ఒకప్పుడు ఖండస్వరూపముగాను, మరొకప్పుడు అఖండ స్వరూపముగాను ఉన్నది కనుక దీనిని మాయాశబలితమైనది, భ్రమరూపమైనది, లేనిదే ఉన్నట్లుగా తోచబడుచున్నది అని ఏమహానుభావులు చెప్పె దరో, వారే మనకు తల్లితండ్రిగా భావించవలెను. అనగా మన యొక్క జన్మను ఉద్ధరించువారుగా తెలుసుకొనవలెను. దీనికి "శ్రీ మద్భగవద్గీత"లో శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖో । అశ్వత్థం ప్రాహు రవ్యయం । ఛందాంసి యస్యపర్ణాని । యస్తంవేద సవేదవిద్ ॥ అన్నారు. ఈ బ్రహ్మాండమును అశ్వత్థవృక్షమన్నారు అశ్వత్థమనగా 'శ్వ' రేపు, "సత్థం" లేనిది. అనిభావము. ఈ బ్రహ్మాం డము నిన్నలేదు. ఇప్పుడు ఉన్నది. రేపులేదు. అనగా భూత,

లేదు. నేను మేనులు కలసియే వేననబడుచున్నది. అలాకానప్పుడు అనగా పూర్ణవిచారణ లేనప్పుడు, నేనెవరిని ? నీవెవరవు ? అని ఆత్మ పరమాత్మల విషయమై ప్రశ్నించుకొనినప్పుడు నేను – నీవు ఒక్కటే. జీవో బ్రహ్మైవనాపరా" అని అద్వైత సిద్ధాంతముగా కొన్ని చోట్ల, నేను జీవుడను, నీవు పరమాత్మవు. నేను "తవదాసో హం" నీయొక్కదాసుడను, నీవు రక్షకుడవు. అని ద్వైత భావము తోను, మరియు ఈ శరీరమునశించునది. నేను ఆత్మస్వరూపుడను అమృతుడను, కనుక ఈ శరీరము నేనుకాను. అని ఇట్టివిధముగా అనేకముగా తనకుతానే తర్కవితర్కములతో భాషించుచు ఊహించు చుండును. కాని నేను లేనిదే ఈ శరీరముగాని జగత్తుకాని లేదు. జగత్తులేనిదే నేను ఉండదు. ఈ రెండును అన్యోన్యాశ్రయమైనవి కనుక రెండుకాదు. దేహము_కన్నులు ఒకే దేహము యొక్క అవ యవభాగమే అన్నట్లుగా నేను_మేను, దేహి_దేహము. ఆత్మ_జగత్తు ఇవి రెండుగాతోచుచున్నప్పటికి, ఆసాంతము విచారి స్తే రెండు ఒక్కటేకాని రెండుకాదు. పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే శాశ్వత మైనది. అది ఆత్మ జగత్తులకు అతీతమైనది.

(యెరుక ~~స~~ ...)

58) పిండ బ్రహ్మాండంబులు। రెండును యీరెంటిలోని రెండహములుయీ। ఖండములు నాల్గుకూడియు। ఖండంబగు యెరుకరూపుగనరా మాతండ్రి ॥ యిది దెల్పినఘనుడె తలిదండ్రి। అండాఖండ ములగ గనుపించే యెరుకానే। దండిద నేటియుద్దంతుల కలనైక ॥ గనరామాతండ్రి। యిది దెల్పినఘనుడే తలిదండ్రి ॥

భావము : ఓ శిష్యా ! పిండాండము, బ్రహ్మాండము, మరియు పిండాండములోని అహము జీవుడు, బ్రహ్మాండములోని అహము శివుడు, ఈ నాలుగు ఖండములు గలసి, అఖండ స్వరూప

విచారించినచో యెరుక భ్రమరూపమైనదనియు, దీనికి మూల మేమియులేదనియు, మూలములేకుండ తనకుతానే "కల" వలె యేర్పడినదనియు, పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే శాశ్వత మైనది అనియు, అపరిపూర్ణములో యీ యెరుకలేదనియు తెలియ బడి, యెరుకలేకుండా పోవును.

——

(౬౪) పాపములు పుణ్యములు భువి । ప్రాపించును యెరుక చేత భ్రమసినవారిన్ । ప్రాపింపవెరుక సెడశిన । తాపసులను చిత్త మందు తగదెలుసుకొనుమీ ॥ ఆగామిబోధను లెస్స వినుమీ ॥ పాపా లలో శుద్ధస్ఫటిక సన్నిభమైన । అహోజ్యోతిని ప్రత్యగాత్మనీ మది లోనా ॥ తగదెలుసుకొనుమీ । ఆగామిబోధను లెస్స వినుమీ ॥

బావము : ఓ శిష్యా ! యెరుక భ్రమయందున్నవారికి మాత్రమే పాపములు పుణ్యములు కలుగుచున్నవి. యెరుక విడచిన మహాత్ములకు పాపపుణ్యములు కలుగవేరవు. అట్టి యెరుక విడచిన మహాత్ములయొక్కస్థితిని బాగుగగుర్తింపుము. ముందుచెప్పబోయే బోధను బాగుగ గుర్తించుము. కనుపాపలలోనున్న శుద్దస్ఫటిక సంకాశమైన అహాజ్యోతిని ప్రత్యగాత్మగా చక్కగా తెలిసికొనుము. అదియే యెరుక. అది పరబ్రహ్మమని భ్రమించకుము.

విశేసబావము : యెరుకచేత భ్రమసిన వారనగా_నేనే బ్రహ్మను, నేను దేహమునుకాను, జీవుడనుకాను, బ్రహ్మమునే అనే ఐక్యభావముతో అద్వైత స్థితియందున్నవారు అని అర్థము. అట్టివారికి పాప_పుణ్యములనే కర్మద్వయము నశించదు. కర్మలు జడమైనవే కాని మనసుచేయుచున్న సమస్తకర్మలుబీజరూపముగా వాసనారూపముగా, సూక్ష్మ, కారణశరీరములను అంటిపెట్టుకొని

యుండును. మనముచేయు కర్మలు స్థూల దేహముచే చేయుటలేదు. స్థూలదేహము జడము. సూక్ష్మ శరీరమే సమస్త కర్మలు స్థూలదేహముద్వారా చేయుచున్నది. కనుక స్థూలము తగులబెట్టబడినను, సూక్ష్మకారణశరీరములు రెండును ఆత్మను అంటిపెట్టుకొని ఉండుటచే అవి నశించక వానియందున్న బీజరూప కర్మలు కూడ నశించుటలేదు, అందుచేతనే తిరిగి పునర్జన్మకు కారణమగుచున్నది జ్ఞానియైనప్పటికి కర్మ నశించదు. జ్ఞానికూడ కర్మ చేయకతప్పదు. నిష్కామ్యముగా కర్మచేయును. నిష్కామ్యకర్మ బ్రహ్మజ్ఞాన సిద్ధికి ఉపకరించునేకాని, కర్మఫలితములేనిదిగా అపదు. కామ్య కర్మలవలన-ఇహలోక పరలోక భోగప్రాప్తి కలుగును. నిష్కామ్య కర్మవలన బ్రహ్మజ్ఞానము కలుగును. మరియు అని కర్మలు తనుకు పుణ్య జన్మలకు కారణమగునేకాని, కర్మ నశించిపోదు. అందుచే జ్ఞానికి కూడ జన్మతప్పదు. అయితే సద్గురుముఖతా తాను లేని పరిపూర్ణ పరబ్రహ్మను గుర్తెరిగి తానేమియులేనని గురు వాక్యముచేతను రహితస్థితిపొందినప్పుడు, కర్మలు ఆశ్రయించియున్న సూక్ష్మకారణ శరీరములు తనతోసహా రహితమగును కనుక అట్టివానికి కర్మ నశించి పునరావృత్తి కలుగనేరదు. ఇట్టివారికి మాత్రమే పాపపుణ్యములు లేవని గుర్తించవలెను: అంతేకాని వ్యాఖ్యార్థముగా "పరిపూర్ణమే ఉన్నది. ఈ ఎరుక ఎక్కడాలేదు. నేను లేనేలేనని అనుకొనేవారు ఎరుకను విడిచితిమికనుక మాకు పాపములులేవు పుణ్యములులేవని" నానావిధక్షుద్రకర్మలు చేయుచున్న ఈ బోధస్థులకు జన్మలేదు కర్మలేదనుట కేవలము అజ్ఞానము. అట్టివారు మహాపాపజన్మలకు రాకతప్పదు. పూర్ణస్థితి పొందిన వారికి మాత్రమే కర్మద్వయములేదని బాగుగా గుర్తించవలెను.

— ० —

౫౨) యెరుకన్నను మరుపన్నను । యెరుకకు యెరుకన్న దేహియనమాయయనన్ । గురుతన సాక్ష్య నజ్ఞప్తైన । స్ఫురణయునన్ ద్రష్టయనిన చూడు మొక్కటిగా ॥ యిదిలేకుంటే చూడ మొక్కటిగా ॥ మరి చలాచలముల మర్మ మెరిగేటిదన్నా : యెరిగి కాలేవని యెగిరిపొయ్యేటిదన్న ॥ చూడు మొక్కటిగా । యిదిలే కుంటే చూడమొక్కటిగా ॥

భావము : ఓశిష్యా! యెరుక, మరుపు, యెరుకకు యెరుక దేహి, మాయ, గుర్తు, సాక్షి, జ్ఞప్తి, స్ఫురణ, ద్రష్ట ఇవన్నియు ఒక్కటేయని తెలియుము. అనగా యెరుకే అని తెలియుము. ఇంకనూ పరిపూర్ణ మెరుకల మర్మ మెరిగేటిదన్నా, అట్లు తెలుసు కొని తానే లేకపోయేదియన్నా యెరుకే. ఇట్టి విచారణలేకుంటే వీటన్నిటిని ఒకటిగా చూడలేడు.

విశేషభావము : యెరుక అనగా సమస్తమును గుర్తిం చేది. మరుపు అనగా యెరిగే లక్షణములేనిది. ఇట్టి మరుపు రెండు రకములు, 1) సుషుప్తి అవస్థలో అక్కడ యెరుక యెరిగేలక్షణము లేదు కనుక అది మరుపు. ఇది అజ్ఞాన సంబంధమైన మరుపు. రెండవది సహస్రారమున యోగముచేత సమాధిస్థితిపొందినప్పుడు అప్పుడుకూడ యెరిగే లక్షణములేదు. ఇదియును మరుపే. కాని యిది జ్ఞానసంబంధమైనది. స్థానభేదముచే ఒక్కవస్తువుకే లక్షణము మార్పు జరుగుచున్నది. "యెరుకకు యెరుక" అనగా భ్రూమధ్య స్థానమందున్న యెరుక-ప్రత్యగాత్మ. యిది సహస్రారమందున్న ఆత్మ యొక్క ప్రతిబింబము. సహస్రారమందున్నది ఆత్మ. ఇది ఎరుక ఇచ్చుటఎరుకగుర్తించే లక్షణము లేనిదికనుకదీనినియెరుకలేని యెరుక అనికూడ అందురు. భ్రూమధ్యస్థానమందున్న ప్రత్యగాత్మ ఎరుక

గతిగిన ఎరుక. యిది గుర్తించే లక్షణములు కలవి. ఈ రెండునూ ఎరుకయే (బింబ-ప్రతిబింబములు) కనుక భ్రూమధ్యస్థానమందున్న ఎరుకకు-ఎరుక సహస్రారమందున్నది అని తెలియువలెను. మాయ ఆత్మయందే యున్నది. కనుక ఎరుకకే "మాయ" యనియు, "అవ్యక్తము"నియు, సమస్తమును గుర్తించునది కనుక "గుర్తు" అనియు జాగ్రత, స్వప్న, సుషుప్తి అవస్థలకు సాక్షిగాయున్నది కనుక "సాక్షి" అనియు, జరిగిపోయిన విషయములలో గట్టికర్మ ముద్రపరుపబడియుండుటచే జ్ఞప్తి" యనియు, సమస్త సంకల్పములకు మూలస్థానమయినందున "స్ఫురణ" అనియు అన్నింటిని చూచే సత్తాకలది కనుక "ద్రష్ట" యనియు పేర్లు ఈ ఎరుకకు కలిగినవి. ఇది సమస్తమును చూచునదే కాని చూడబడునది కాదు. 'దృగేవనతుదృశ్యతే' అన్నారు.



69) అనుమానము మది నుంచక । వినుమింకను ఎరుకపేర్లు వివరించెదను । ద్ధ్యన చిత్తంబన మానస । మనిన హంకారమనిన నంతఃకరణనినన్ ॥ సంకల్పమంచనిన యిచ్ఛనినన్ ॥ తనని తరులని తానని గుర్తెరిగేటిదన్నా ॥ తననే కాని తరులతననూ దెలిశేటిదన్న ॥ నంతఃకరణనినన్ । సంకల్పమంచనినయిచ్ఛనిన్ ॥

భావము : శిష్యా : ఎరుకయొక్క పేర్లు ఇంకను వివరించెదను అనుమానములేకుండగ వినుము. బుద్ధి, చిత్తము, మనస్సు అహంకారము, అంతఃకరణ, సంల్పము, యిచ్ఛ ఇవన్నియు ఎరుకయొక్క పేర్లే. మరియు తను ఇతరులు అంతా ఒక్కటానే అని తెలిసికొనేదనినను, తాను, ఇతరులువేరు (తాను అమృతము. ఇతరమంతయు జడము అని) తెలిసేటిదన్నా ఈరెండునూకూడ ఒక్కఎరుకే అని తెలియుము.

61) వినుమితరులు యెరుకను । సాక్ష్యనిపల్కిరి నేనుసాక్షిన హనుని నీతో వినజెప్పితీ నింతియె పే। రనకూడదు రెంటినినొక్కటని తెలుసుకోరా ॥ మాటల భేదమని కనుక్కోరా ॥ అనరాని వినరాని కనరాని బయలందు । తనకై తాజనునీ ॥ సాక్ష్యని తెలుసుకోరా । మాటల భేదమని కనుక్కోరా ॥

బావము : శిష్యా : ఇతరబోధస్థులు యీ యెరుకను సాక్షని చెప్పిరి. నేను ఆసాక్షినే అహంకారమని చెప్పితిని, అంతేకాని సాక్షివేరు, అహంకారమువేరు అని అనరాదు, రెండునూ ఒక్కటే. మాటల భేదముగా తెలుసు కొనుము. ఏరకమైన వర్ణనలుకాని (శబ్ధముచేగాని) చూచుటగాని శక్యముగాని పరిపూర్ణ పరబ్రహ్మ మందు యీ యెరుక తనంతతానుగా యేర్పడి తనంత తానుగానే లేకపోవుచున్నది.

— —

62) వన్నియలై దొకచోటను। పన్నుగ గలసినది హృదయ పద్మంబనుచున్ । యెన్నుదురు జనులు యెరుకం ॥ దున్నాదని శృతులు పల్కుచున్నా విసుమ్మి ॥ తెలసుటె మోక్షమన్నా విసుమ్మి ॥ వన్నెలన్నియు మీరియున్నా వస్తువుజాడ । నెన్నడెరుంగక ఎన్నో రీతులపల్కు । చున్నా వీసుమ్మి । తెలసుటె మోక్షమన్నా విసుమ్మి ॥

బావము : శిష్యా ! జనులు అయిదురంగులతో కూడిన హృదయపద్మము అదేచక్రరాజముని అందురు ఆట్టిహృదయపద్మము నందే ఎరుక (పరమాత్మ) ఉన్నదనియు, దానిని తెలుసుకొనుటయే మోక్షమనియు శృతులు చెప్పుచున్నవి. ఈ రంగులన్నిటినిమించి ఉన్న పరవస్తువు జాడ తెలియక, లేని యీ ఎరుకను గూర్చి అనేక రీతులుగా చెన్నారు.

విశేషభావము : "పద్మకోశ ప్రతీకాశగ్ం । హృదయం చాప్యధోముఖం । అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరితిష్ఠతి." హృదయపద్మము నాభికి ఎగువను, కంఠమునకు దిగునను, రెండు ఊపిరితిత్తులకు మధ్యగా అధోముఖమై ఉన్నదని నారాయణో పనిషత్తులో చెప్పబడినది. మరియు "తస్యాశిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః" నీవారధాన్యముల్లు అంతటి సూక్ష్మముగా హృదయ పద్మ అంతరమందు పరమాత్మ ప్రకాశించుచున్నది అని శృతులు చెప్పుచున్నవి. మరియు "అనాహతశబ్దస్య । తస్య శబ్దస్య యోర్ధ్వని । తధ్యనిరంతర్గతంజ్యోతిః తజ్యోతిర్గతం మనః । తన్మనో విలయ॥ యాంతి । తద్విష్ణోః పరమంపదం । సదా పశ్యంతి సూరయః ం అనాహత చక్రమధ్యమందు పరమాత్మ అయిన మహావిష్ణువు ఉన్నాడనియు, ఆతనిని పండితులు ఎప్పుడు చూచుచు, ధ్యానించుచున్నారనియు శృతులు చెప్పుచున్నవి. ఇచ్చట అనాహత చక్రమువద్దనే పద్మకోశము కలదు. కనుకనే దీనిని చక్రరాజమని కూడ చెప్పుదురు.

నామరూప క్రియారహితమైనది పరబ్రహ్మమని చెప్పుచూ ఒకదానిని ఆధారముగా (శరీరమును) చేసుకొనియుండి, మెరపు తీగవలె విద్యుత్ కాంతి సన్నిభమై, ఓంకార ప్రణవధ్వనితో. ఈ దేహమును ప్రకాశింపజేయు క్రియామయుడై యున్నాడని చెప్పబడునది నిజమైన పరబ్రహ్మమేనా ? కాదు. ఇది యెరుక. ఇట్టి రంగులు, క్రియలు, ఏమీ లేని పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క సంగతి ఇంచుకయు తెలియనివారి మాటలను కృష్ణ ప్రభువులు నిరసించుచున్నారు. పరిపూర్ణము శరీరమును ఆధారముగా చేసికొని యుండలేగు. కనుక ఈ శరీరమునందు లేక సర్వత్రా

నిండియున్నది పరిపూర్ణము అని కందార్థములో "జలధి జలచరము లోపల కలదా" యని తెలియిచ్చియున్నారు. ఆధార ఆధేయములు కానిది పరిపూర్ణము. ఆధార ఆధేయములతో కూడినది యెరుక (ఆత్మ).

— —

63) చులుకని యుక్తిగ నొక్కటి। తెలి పెద విను సంది యంబు దీరును దీనన్। పలుకున గలిగిన యర్థము। పలుకును విడనాడి నిల్వ బడు చోటింకేదీ॥ రెండును ఒక్క పలుకే అయినాది। తెలియు మీలాగున తెలివి దేహములయ్యె। తెలివి తనువు బాసి తెలివి స్థిరముగ నిల్వ॥ బడుచోటింకేదీ। రెండుగ ఒక్క పలుకే అయినాది॥

భావము : శిష్యా ! తేలికైన యుక్తితో నీకు తెలియ పరిచెదను వినుము. దీనిచే నీ సందేహము తీరగలదు. పలుకు-ఆపలుకునకు సంబంధించిన వస్తువు రెండును ఒక్క పలుకే కదా ! పలుకును విడచి వస్తువు, వస్తువును విడచి పలుకు లేదుగదా ! అట్లే జ్ఞానమే-జ్ఞానము, దేహముగా రెండుగా అయినది. దేహమును విడచి జ్ఞానము స్థిరముగా ఉండగలదా ? లేదు. కనుక దేహి-దేహములు రెండునూ ఒక్క తెలివియే (యెరుకయే) అని తెలియుము.

విశేషభావము : **అభిధాన, అభిధేయములకు భేదములేదని శ్రీ శంకరాచార్యులవారు వ్యాఖ్యానించి యున్నారు.** అభిధాన మనగా వస్తువు, అభిధేయమనగా పేరు. వస్తువు - పేరు రెండునూ ఒక్కటే అన్నారు. ప్రపంచోత్పత్తిలో అధిష్ఠానమైన ఓంకారమునుండి అకారాది ఏబది అక్షరములతో కూడిన శబ్ద ప్రపంచమున్ను, పంచభూతమయమైన వస్తు ప్రపంచమున్ను కలిగినవి. కనుక శబ్దమునకు (పలుకు, పేరు)ను, వస్తువునకు

(అర్థము) భేదము లేదు. రెండునూ ఒక్కటే. కనుకనే కాళిదాస మహాకవి రఘువంశ కావ్యరచనలో మొదటి మంగళాచరణ శ్లోకములో **"వాగర్థా వివసంప్రోక్తే । వాగర్థ ప్రతిపత్తయే। జగతః పితరౌ వందే। పార్వతీ పరమేశ్వరౌ"** ॥ అన్నారు. వాక్కు అర్థము ఈరెండును ఏలా కలసి ఉన్నవో అవిభక్తముగా ఒక్కటే అయిన వాగర్థ ప్రతిపాదకు డయిన జగత్పితురుడైన పార్వతీ పరమేశ్వరునకు నమస్కారము' అని చెప్పెను. కనుక పలుకును, పలుకును కలిగిన అర్థము. రెండునూ ఒక్క పలుకే అని కృష్ణ ప్రభువుల వారు శెలవిచ్చిరి. అట్లే యెరుకయే దేహి – దేహముగా అయినది కనుక దేహి–దేహములు రెండును ఒక్కటేకాని రెండు గాదు.



64) యెరుకైన భూతములనీ । వెరుగుము ఆకసము గాడ్పుయింగలముమనీ । క్షిరవంద నేల యనినే । నెరిగిన పద్ధతిని నీకు యెరిగించినాను ॥ ముజ్జగములయ్యె వీట్లతోనూ । పరిపూర్ణమందు కన్పడుచు తముకు దామె । మరికానరా విట్టి మార్గము కలవీటి ॥ నెరిగించినాను । ముజ్జగములయ్యె వీట్లతోనూ ॥

భావము : యెరుకవల్ల యేర్పడినవే యీ ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అను పంచభూతములున్ను, ఈ పంచభూతముల చేతనే సమస్త జగత్తు అయినదని (ముజ్జగములు–భూలోకము, పితృలోకము లేక భువర్లోకము, దేవలోకము) నేను తెలుసుకొని ఆవిధముగ నీకు తెలియపరచినాను. ఇట్టి పంచభూతములతో అయిన జగత్తు పరిపూర్ణములో ఉన్నట్లు ఒకప్పుడు కనపడి మరొకప్పుడు తముకు తామే లేకపోవును.

విశేషభావము : "ఆత్మాన ఆకాశస్సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయోరగ్నిః । అగ్నే ఆపః । అపః పృధ్వీ । పృధి వ్యోషధిభ్యః । ఓషధియో రన్నం । అన్నాత్ప్రజాయన్తే ॥ అనిశృతి వచనము. ఆత్మ నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృధ్వి, పృధ్వినుండి ఓషధులు, ఓషధులునుండి అన్నము, అన్నము నుండి సమస్త జీవజాలములు ఏర్పడినవి. అనగా యెరుక నుండియే పంచభూతములతో కూడిన సమస్త జగత్తు, జీవజాల మంతయు ఏర్పడుచున్నది, కనుక సమస్తము యెరుకయే యని గ్రహించవలెను.

——

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
యెరుక లక్షణన్నామ చతుర్థోఽధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.

——

## 5. యెరుకోత్పత్తి లక్షణము (19)

65) యెరుకోత్పత్తిని దెలియగ । సరసి జగర్భాదులైన చాలరనెడిచో । నరుడెంతవాడు వాడది। యెరుగుదుసనవట్టిమాటలివి వింతగాక॥ తప్పదు వానికికవ రాతపోక । అరమరలేక సద్గురుమూర్తి చరణ పం । క్కరుహాద్వయార్చన నెరుగనినరుమాట ॥ ఇవి వింత గాక । తప్పదు వానికిక రాతపోక ॥

భావము : శిష్యా యెరుకయొక్క ఉత్పత్తిని తెలియుటకు, ఆబ్రహ్మాదులకే సాధ్యముకాదు, అట్టిచో మానవుడెంతవాడు ? ఎవరైనను ఎరుక ఉత్పత్తి ఈవిధముగా ఫలానాచోటనుండి వచ్చినది అని అన్నచో అవి అబద్ధపుమాటలు, ఎరుగని మాటలు, ఆలా చెప్పిన వారికి జనన మరణముల ప్రవాహము తప్పదు. భేదము లేనివాడై సద్గురుమూర్తి పాదపద్మ ద్వయమును నిత్యము పూజ చేసిన వారికి మాత్రమే ఎరుకమూలము తెలిసినది. (మూలము లేనిదని) ఆలాపూజచేయని నరులకు ఎరుక పుట్టువు ఎంతమాత్రము తెలియదు.

విశేషభావము : యెరుకస్వయంభు అన్నారు. తనంతట తానే యేర్పడినది. కనుక దానికి మూలము లేదని చెప్పవలెను. బ్రహ్మాదులకే తెలియదనగా బ్రహ్మాదులందరు, ఆఎరుకవల్లఏర్పడినవారే. వీరు ఎరుకయొక్క స్థానమునకు పోవుసరికి వీరందరూ ఎరుకలో లయమైపోవుదురు. అందుచే దానిసంగతి అట్టిదని తెలుసుకొను రెండవవస్తువు ఏదియును ఉండదు. దానిని గుర్తించే మరొకటిలేదు. సద్గురుమూర్తి పాదపద్మముల పూజ నిత్యము జరుపుకొనే వారికి మాత్రమే ఆగురుకరుణ వలన యెరుక లేకిడ్డే కల్లవలె తోచబడినదను యదార్థము తెలియబడినది. మిగిలిన వార్కి బ్రహ్మరూపముగా తోచబడుచున్నది. భ్రమలోనివారే కనుక అట్టివారికి జననమరణములు తప్పవు. గురుమూర్తిని సేవించుటలో 'అరమరలేక' అన్నపదమువాడినారు. అంటే భేదములేకుండగ అని అర్థము. అనగా గురుడునరుడని తలువకుండుగ, అ పరబ్రహ్మమే ఈ గురువు అను ఉన్నతభావముతో నిత్యము పూజచేసుకోవలెను. అపరబ్రహ్మమే-ఈ గురువు. ఈ గురువే - అపరబ్రహ్మము అని

ఏకీభావము కల్గియుండవలెను. భేదభావము పనికిరాదు. ఇట్టివారికి మాత్రమే పరిపూర్ణభావము తెలియబడి అట్టి స్థితి కలుగ గలదు.

.........

66) లేనెరుక బయలులోపల! తానెట్లుజనించెననిన తగవిను వంధ్యా। సూనుని గతి వియదబ్జవి। ధానంబునయక్షరాజధానీ విధమునన్ ॥ రజ్జువు సర్పమైనావిధమునన్ । స్థాణుపురుషుని చందాన మృగజల। శశవిషాణ వలె స్వప్నానందముగ ॥ రాజధానీ విధమునన్ । రజ్జువుసర్పమై నావిధమునన్ ।

భావము ; శిష్యా! లేని యీ యెరుక పరిపూర్ణములోపల ఏవిధముగా ఏర్పడినదనగా - గొడ్రాలి బిడ్డవలె, ఆకాశపుష్పము వలె, కుబేరనగరమువలె, త్రాడందు పామువలె, మొద్దుయందు దొంగవలె, ఎండమావులలో నీరువలె, కుందేటికొమ్ము వలె, కలలో తోచబడిన ఆనందమువలె ఇట్లు లేనిదే భ్రమరూపముగా ఉన్నట్లు తోచబడుచున్నదే కాని నిజమునకు పరిపూర్ణములో యెరుక పుట్టనే లేదని తెలుసుకొనుము.

విశేషభావము : "అధ్యారోప అపవాదాభ్యాం। నిష్ప్రపంచం ప్రపంచ్యతే॥" లేని ప్రపంచము అధ్యారోప అపవాదములచే ఉన్నట్లు చెప్పబడుచున్నది. అధ్యారోపమనగా - ఉన్నవస్తువుపై లేని వస్తువు కలదని అరోపించుట. ఉదా॥ త్రాడుమీద లేని పాము ఉన్నదని భావించుట. అపవాదు అనగా అసలు వస్తువే లేదు. కాని ఉన్నదని చెప్పుకొనుట ఉదా॥ కుందేటి కొమ్ము. గొడ్రాలి బిడ్డ. చెప్పుకొనుటకు మాత్రమే కాని వస్తువు లేనే లేదు. ఈ విధముగానే ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేని యీ యెరుక పుట్టినదని చెప్పుట. అని భావము. ఈ భావమునే ఈ క్రింది పద్యములో కూడ మరొక మారు చెప్పుచున్నారు.

——

67) లేనెరుకను యెరుకని యన । లేనెరుకెట్లా యన నిన తెన్నగ వినుమా । లేని మృగజలము వంధ్యా । సూనులు గలిగుండి వెదకి చూడాలేనట్లూ ॥ లేనెరుక యాడలేనట్లూ । స్థాణా పురుషుడు శశివిషాణము । గగన ప్రసూనము నల నీ స్వప్నానందమివి ॥ వెదకి చూడలేవట్లూ । యీలే నెరుక యాడలేదిట్లూ ॥

భావము : లేనెరుక యెలా అయినదనగా లేని ఎండమావులోని నీరువలె, గొడ్రాలి బిడ్డవలె, మొద్దు దొంగవలె, కుందేటి కొమ్ము వలె, ఆకాశ పుష్పమువలె, మానవునికి స్వప్నములో కలిగిన ఆనందమువలె, లేనిదే ఉన్నట్లుగా ఏర్పడినది. అనగా మాటవరకే గాని అవి వెదకి చూచినచో ఎక్కడనూ లేవు. అవన్నియు యేలా లేవో ఆలాగుననే యెరుక భ్రమరూపము. విచారిస్తే ఏమియులేదు.



68) యెరుకోద్భవమెట్లన్నను । సరళంబగు నారికేళ సలిలముభంగిస్ । యెరుకెట్లుబోవునన్నను । కరిమ్రింగిన వెలగపండు కరణిగానెరుగూ ॥ తిరిగి రానికరణింకోటెరుగూ। పరిపూర్ణమున్నాది ఎరుకతానెరిగితే । ఎరుకే మ్రగ్గును భస్మాసురుడు మ్రగ్గిననాటి ॥ కరణిగా నెరుగూ । తిరిగి రానికరణింకోటెరుగూ ॥

భావము : శిష్యా : ఎరుక యేలా పుట్టిన దనగా_కొబ్బరి కాయలోనీరుఎవరికి తెలియనిదే కనుపించకుండగా యేలా వచ్చినదో ఆలాగున యెవరికి తెలియకుండగ తనంతతానుగానే వచ్చినది. మరి యెరుక యేలాపోవుననగా_ ఏనుగు మ్రింగిన వెలగపండు ఆపండు ఎంతమాత్రము భిన్నము కాకుండగ అందులో గుంజు పదార్థము అంతయు హరించిపోయినట్లుగా అట్లే ఎరుక తనకు తానే లేకుండాపోవును. అంటే దీని రాకడ పోకడకు ఆధారమేమియు

లేదని భావము. ఇలాపోయిన యెరుక ఒరిగి రాకుండ పోవలెనంటే ఆయెరుక పరిపూర్ణమున్నదని గురుముఖతా సూచన మాత్రముగా గుర్తించినచో. భస్మాసురుడు తనహస్తముచే తానే నాశనమైన విధముగా, యీయెరుక తనకుతానే ఒరిగిరాకుండాపోవును.

---

69) సంతోష సంతోషము । అంతలోగనవచ్చి పిడుగ నరుగు నెచటికో । వింతైయున్నది చూచితె । యింతి యెనుమి యెరుక పుట్టువిక దెల్పుకోరా॥ సంశయమేలయిది నమ్ముకోరా । యెంతాని దెలుపూదు యీదేవమార్గము । దంతాట బహువన్నెలగుపడి యుగు వడ ॥ వికదెల్పుకోరా । సంశయము మేల యిది నమ్ముకోరా ॥

భావము : శిష్యా ! ఒక మంచిమాట వినగానే మనకు సంతోషము కలుగును. అంతలో మరొకచెడువార్త వినగానే దుఃఖము వెంటనే కలుచున్నది. దుఃఖము కలుగునరికి సంతోషము పూర్తిగా పోయినది. యీ సంతోషము - దుఃఖములు అంతలో వచ్చుచున్నవి. అంతలోనే లేకపోవుచున్నవి. విచారిస్తే చాల ఆశ్చర్యముగా నున్నది కదూ ! అట్టివిధముగానే యెరుకయొక్క ఉత్పత్తి నాశనము కూడ - అంతలో ఉన్నట్లుగా లోచబడి విచారించునరికి ఏమియులేకుండపోవును. సంశయము ఏమాత్రము లేకుండగ యీవిషయము సత్యము. ఇదిదేవమార్గము అనగా మృత్యువులేని విధానము (జననమరణములు లేనిది) యీ యెరుక అనేక విధములుగ అంతలో కనపడి అంతలో లేకపోవును. కనుక యీయెరుకయందు భ్రమనువిడువుము.

---

70) రాకడ పోకడలేకను । యేకస్థితినుండునట్టి యీ బయు లంమన్ । రాకడపోకడ కలిగియు । నేకముగా దోచులేని యెరుకా

సుశీలా ॥ ప్రతిమలో లేని పెరుమాళ్ళ లీలా ॥ లేక తోచిన యెరుక లేనేలేదనుచునీ । కీకిలు గురునిచె యెరుకైతే జా ॥ ఉళ్ళకెక్కురుకా సుశీలా ॥ ప్రతిమలోలేని పెరుమాళ్ల లీలా ॥

బావము : మంచిశీలముగల ఓశిష్యా ! ఉత్పత్తి నాశము లేకుండా సర్వకాలము ఒకేరీతిగానుండే యీపరిపూర్ణ పరబ్రహ్మము నందు, ఉత్పత్తి నాశము కలిగిన యెరుక అనేకవిధములుగా తోచు చున్నది. అది ఎట్లనగా దేవతా ప్రతిమలలో చైతన్యము లేక పోయినను ఉన్నట్లుగా భావించి ఉత్సవాదులుజరుపుకొనుచున్నారు. అట్లే యీయెరుకకూడ లేనిదేతోచ బడుచున్నది. అలాతోచినయెరుక లేనేలేదను రహస్యము సద్గురుమూర్తి కరుణచే నీకు తెలిసినచో యీ యెరుకలేకుండాపోవును.

విశేషబావము : వస్తువులో మార్పు ఉన్నచో ఆవస్తువు నశించునని తెలియవలెను, అలాకాకుండగ "ఏకస్థితి" అనగా ఎట్టి వికారము, మార్పు, చలనములేని దానికి నశించుట ఉండదు నశించనిది పుట్టదు. అనగా జనన మరణములులేనిది, అట్టిది ఒక్క పరిపూర్ణమే తప్ప మిగతా సమస్తము వికార స్వభావము కలిగినదే. అందుకే "వికార రహితమేవ ఈశ్వరః" అదే పరిపూర్ణము. విగ్రహ ములు(ప్రతిములు) మనచే తయారుకాబడినవే. అందులో ఏరకమైన చైతన్యము లేదు. అయినా అది దైవమని భ్రాంతిచే లేని చైత న్యము మనము కల్పించుకొని అనేక చిత్ర విచిత్ర కార్యములు చేయుచున్నాము, తుదకు ఎప్పుడో ఒకప్పుడు అవినశించునవే. అట్లే ఎరుక లేనిదే ఏర్పడి, పరిణమించి, విచిత్రములతో వికారము చెంది తుదకు ఏమియులేకపోయేదే. ఇట్టి ఉత్పత్తి, స్థితి, నాశములు లేనిది ఒక్క పరిపూర్ణము మాత్రమే.

.........

71) వనిగల్లుదకములోపల । తనకై తావచ్చి తనకు తానేగు విధంబున పరిపూర్ణములోపల । తనకై తావొచ్చి ఎరుక తనస్నై తా జనునూ ॥ అచలంబున్నదని తానెరిగిననూ । తనలేమి నిజమని తనకెతోచునుతోచి తన కల్మిమృషగా భావనజేసి నిలువక ॥ తనకై తాజనునూ । అచలంబున్నదని తానెరిగిననూ ॥

భావము : ఓ శిష్యా ! వాన కాలములో నీటి బుడగలు, ఆ నీటిలో తనకు తానేవచ్చి, కొంత సేపుండి, దిరిగి తనకు తానే లేకుండగపోవును. అటులనే ఈ ఎరుక, పరిపూర్ణములోపల తనంతట తానుగ తోచబడి, తనకుతానే లేకపోవును. అనగా ఎరుక యొక్క రాక_పోకలు, తనకు తానే ఏర్పడినవేకాని పరిపూర్ణము వలన కాదని భావము. ఇట్లు ఎరుక, పరిపూర్ణ పర బ్రహ్మము స్వతస్సిద్ధముగా ఉన్నదని గురుకరుణచే గుర్తించినచో తాను లేనను నిజమును గుర్తించి, తను ఉన్నాననుట అబద్ధమని తెలిసికొని తనకుతానే లేకుండాపోవును.

విశేషభావము : పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనది స్వతస్సిద్ధమైనది. కారణ కార్యములుకానిది. కనుక అందులోతోచిన ఎరుక నీటిబుడగలవలె తనంతటతానుగా ఏర్పడి కొంత సేపుండి తనకుతానే లేకపోవును. ఇట్లు ఉత్పత్తి_స్థితిలయములు తనకునేతా జరుగుచున్నదికాని పరిపూర్ణము ఎంతమాత్రము కారణము కాదని తెలుసుకోవలెను, ఇట్లు అనేకమార్లు వుత్పత్తి_లయములు పొందే ఎరుక, పరిపూర్ణమున్నదని గుర్తించనంతవరకు, తానేబ్రహ్మమని శాశ్వతమని, జగదధిష్ఠానమని, భావించుకొనును. ఇట్టి ఎరుక గురుముఖతా పరిపూర్ణము వున్నదని తెలిసిన వెంటనే, పరిపూర్ణమే శాశ్వతమని, తాను అబద్ధము. లేననియు, తెలిసితాను లేకపోవును

"తన కలిమి మృషగా భావనచేసి" అనగా తనకలిమి అనగా తానే బ్రహ్మమని, శాశ్వతమని గొప్పది మరేదిలేదని భావించిన ఎరుక నిజమును తెలుసుకొని అశాశ్వతమైనది లేనిది తానేనని తెలిసి తానే లేకుండాపోవును.

72) పరిపూర్ణములో దోచుచు । యెరుకే చను తనకు దానె యేర్పడ వినుమీ । తొరటలు తొమ్మిది గలదై । తరితీపులనొందు చుండి తనువాన దగుచూ ॥ అచలం బున్నదని తాలేననుచూ । మరుగిట్టెరుకకు దెలియు యెరుకె నిల్వదుగాని । పరిపూర్ణముండు దాన్నెరిగే దెట్టిక గుర్తు ॥ తనువానదగుచూ । అచలం బున్నదని తాలేననుచూ ॥

భావము : శిష్యా : వినుము. యెరుక పరిపూర్ణముతో తనకు దానే నవరంధ్రములతో కూడిన శరీరధారియై ఏర్పడి నానా యాతనలు పొంది, తుదకు లేకుండా పోవును. అట్టి యెరుక పరిపూర్ణమె ఉన్నదని, తానులేనను రహస్యము తనకు తెలియుగానే తానే లేకపోవును. కాని పరిపూర్ణము శాశ్వతముగా ఎప్పటివలెనే ఉండును. అయినను యెరిగే యెరుక లేకపోయిన తరువాత పరిపూర్ణమున్నదని యెరిగే దేలాగు ? ఉన్నదని గుర్తించేదే లేదు. కనుక గుర్తే (ఎరుకే) గుర్తుగాను, తనువుగాను యేర్పడుచున్నది అని భావము.

విశేషభావము : ఈ పద్యమును దండాన్వయము చేసికొని అర్థము చేసుకోవలెను. "పరిపూర్ణములో యెరుకె తనకు దానె దోచుచు, తొరటలు తొమ్మిది గలదై తనువనదగుచు యేర్పడ, తరితీపులు నొందుచుండి, చను, వినుమీ । అచలం బున్నదని, తాలే ననుచు (యీ) మరుగిట్టెరుకకు దెలియు, యెరుకె నిల్వదుగాని

పరిపూర్ణముండు, దాన్నెరిగే దెద్దిక ॥ గుర్తు తనువానదగుచు ॥
అని దండాన్వయము చేసుకోవలెను.

(తరి తీపులు - నానా యాతనలు)

— —

16) తొలుకారు మెఱపుకై వడి । పొలుపుగనీళ్లందు దోచు బుగ్గల రీతిన్ । అల సూర్యకిరణమందున । గల నీళ్లంబలెనె యెరుక గనుపించునయ్యా ॥ అంతలో యచట గనుపించదయ్యా । కలకాల మొకరీతి గలిగుండదీ యెరుక ! తిలకింప పగలురాత్రిరి దిరుగు విధమూన ॥ గనుపించునయ్యా । అంతలో యచట గను పించదయ్యా ॥

భావము : శిష్యా ! తొలకరి వర్షాకాలమున వచ్చే మెఱుపుల వలెను, నీటియందు ఏర్పడే బుడగలవలెను, సూర్యకిరణముందలి నీళ్లవలెను (తేమ) యీయెరుక. అంతలో కనుపించి అంతలోనే లేకుండపోవును. కలకాలము ఒక్కరీతిగ నుండదు. ఆలోచించగ పగలు తరువాత రాత్రి, ఆతరువాత తిరిగి పగలు ఏవిధముగా తిరుగుచుండునో, అట్టి విధముగానే ఎరుక ఉన్నట్లు తోచుట (జనించుట) తిరిగి లేకపోవుట (గతించుట) తిరిగి తోచుట జరుగుచున్నది.

విశేషభావము : జగత్తు అనేక మార్పులు చెందుచుండునే కాని ఒక్కరీతిగా ఒక్క క్షణమైననూ ఉండదు. కనుకనే సర్వలక్షణికం క్షణికం" అన్నారు. బ్రహ్మము శాశ్వతము అనగా ఎప్పుడునూ ఎట్టి మార్పు చెందనిది. జగత్తు, అధిష్ఠానమైన యెరుక చేతనే యేర్పడుచున్నది. జగత్తులో వికారము కనుపించును. కాని యెరుక యందు వికారము కనుపించదు. కాని జగత్తు స్వత



స్సిద్ధమైనది కాదు. యెరుకవల్లనే యేర్పడుచున్నది. అనగా యెరుక కారణము. జగత్తు కార్యము. కారణ కార్యములు రెండునూ ఒక్కటే కాని రెండు కావు కనుక, అధిష్ఠానములో లేనిది జగత్తులో ఉండుటకు వీలులేదు కనుక, జగత్తులోని వికారము అధిష్ఠానమందును కలదని చెప్పవలెను. అది నిర్గుణ రూపములో వికారము ఉన్నది. కనుక ఈ వికారములు అధిష్ఠానమైన ఎరుకలో ఉన్నదని విచారణచే తెలియనగును. "వికార రహితమేవ ఈశ్వరః" వికార రహితమైన ఈశ్వరుడు ఒక్క పరిపూర్ణము మాత్రమే అని తెలియవలెను. అది మాత్రమే శాశ్వతమైనది. జనన మరణములు లేనిది.



74) కట్టెందు నిప్పులేకనె । కట్టియు నొక సమయమందు గను పడి బహుగా । మిట్టిపడి తుదకు గనుపడ । దట్టి దెపుమి యెరుక పుట్టు వమల విచారా ॥ తనకు దానె యరుదెంచెనౌరా । పుట్టుగిట్టుటలనే నట్టేట నిలచుండి । బట్టబయలు పొడగట్టిన గను పొడ ॥ దయల విచారా । తనకు దానె యరుదెంచెనౌరా ॥

భావము : శిష్యా ! కర్రయందు నిప్పు కనపడదు. కాని ఒకప్పుడు అనగా వేసవికాలములో కర్రా కర్రా రాపిడుటవలన అందు సూక్ష్మరూపముగా నున్న అగ్ని బయటపడి దావాగ్నిగా పెద్ద రూపమై ఆకట్టెల నన్నిటిని కాల్చివేసి తుదకు ఆ అగ్ని ఎచ్చటను లేకుండగ పోవుచున్నది. యీ యెరుక పుట్టుకూడ అట్టి విధముగానే లేక యేర్పడి బహుగా విస్తరించి తుదకేమియు లేకుండా పోవును. తనంత తానుగా యేర్పడిన యీ యెరుక జనన మరణములనే నడిసముద్రములో ఉండి పరిపూర్ణముయొక్క కాంత కనిపెట్టిన వెంటనే ఏమియు లేకుండ పోవుచున్నది. ఓ మలిన

రహితమైన శిష్యా ! తనంత తానుగా యేర్పడిన యెరుక ఎంత అశ్చర్యముగా ఉన్నదో చూడుము.

విశేషభావము : కట్టెలో సూక్ష్మరూపముగానున్న నిప్పు కట్టె కట్టె రాపిడివలన అందున్న అగ్ని స్థూలరూపమును దాల్చి కట్టెల నన్నిటిని భస్మము చేసి తుదకు ఆ అగ్నికూడ లేకపోయినట్లుగా, యెరుక తనకు దానే వచ్చి విచారణ గురుముఖతా చేసినచో తాను జగత్తు సమస్తము ఏమాత్రము లేకుండగ పోవుచున్నది. ఈపద్యములో శిష్యుని "అమల విచారా : అని సంబోధించిరి. అనగా మలినము లేని విచారణ గలవాడా ! అని అర్థము. అనగా ఆత్మ-బ్రహ్మ-జగత్తు-పరిపూర్ణము వీటియందు దేనియందును, మమకార ద్వేషములు లేకుండగ విచారణ చేయువాడని అర్థము. మమకారము కాని ద్వేషము కాని ఉన్న విచారణచే నిజము గ్రహింపబడదు. అట్టి మలినరహితమైన విచారణ చేసిన శిష్యునికే, అధిష్ఠానము మాయయే కాని బ్రహ్మము కాదు. పరిపూర్ణము మాత్రమే చావు పుట్టుకలు లేనిదని తెలియును.

—— ——

76) తనమూలము తలిదండ్రులు । తనవలెనె వారు వారి తలిదండ్రులకున్। తనవలెనెగాని యన్యము। గననజనస్థానమొకటి గల దనతరమా॥ బ్రహ్మదులకది తెలియతరమా। వినుమీ బ్రహ్మాండ జననము నీనాయం। దున నైన దిదియుగాదని వేరేయింకోటి ॥ గలదనతరమా । బ్రహ్మదులకది తెలియతరమా ॥

భావము : శిష్యా ! తన మూలము తలిదండ్రులు, అట్లే ఆతలిదండ్రులకు మూలము వారి వారి తలిదండ్రులు, ఇంతకన్న అన్యమైన పుట్టుక స్థావము వేరేయింకొక్కటి చెప్పతరమా । అలా

చెప్పుట బ్రహ్మాదులకైనను తరముగాదు, కనుక బ్రహ్మాండము నీ-నాయందున అయినది. యింతకన్న వేరే జనన స్థానము ఉందని చెప్పుట బ్రహ్మాదులకైనను వశముగాదు.

విశేషభావము : తనమూలము తలిదండ్రులు అనగా సమస్త జీవులందు ఆత్మ (ఎరుక) ఒక్కటిగా వ్యాప్తమైయున్నది. అదే తలిదండ్రులలోను ఉండుటచే, అందరిలోను ఒకగా వారి వారి తలిదండ్రులలోను ఉన్నది ఒక్కటే కనుక వుత్పత్తి-స్థితి - లయములు తనకు తానే జరుగుచున్నవి, కాని దీనికంతకు కారణము వేరే మరొకటి గలదనుట శాస్త్రసమ్మతముకాదు. అన్నిటికి కారణము కర్మ కర్మయే బ్రహ్మ, బ్రహ్మయే కర్మ. కనుకనే "కర్మమున బుట్టు జంతుపు। కర్మమునవృద్ధిపొందు కర్మమున జెడున్। కర్మమెన రులను దైవము। కర్మమె సుఖదుఃఖములకు కారణమధిపా" ॥ అన్నారు. సమస్త జీవుల వుత్పత్తి స్థితిలయములకు కారణము తానే (కర్మ) తప్ప మరేదియుకాదు. ఇట్టి యీ బ్రహ్మాండము కూడతనలోనే ఏర్పడుచున్నది నీ-నాయందు జరుగుచున్నదని నగా వ్యక్తము, మాయ, కర్మ. బలము. "నా" యనగా బ్రహ్మము, రసము. ఈ రస బలసమ్మేళన పదార్థములోనే, దానియందే బ్రహ్మాండము యొక్క వుత్పత్తిస్థితిలయములు జరుగుచున్నవి కాని మరొక కారణమైనది ఏదియులేదు.

— ○ —

76) కనరాని దాన్ని శూన్యం। అనియనదగును గాని బయలు ననదగను సుమీ। కనవచ్చుచున్న దిందులో। కను గొనుటకు యెరుక లేదు కనుగొనరాదా ॥ యెరుకనె శూన్యమని యనరాదా। కనవొచ్చెనా లేదా, కనుగొంటి, లేదాని। యనరాదా

భయమేమి. యనుమానించకుమిదిగో ॥ కనుగొనరాదా । యెరుకనె శూన్యమని యనరాదా ॥

భావము : శిష్యా । విచారిస్తే కనుపించని దానిని శూన్యమనవచ్చును కాని పరిపూర్ణ పరబ్రహ్మమును మాత్రము శూన్యము అనరాదు. ఎందుచేతననగా విచారించినచో పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నదని నిర్ణయము జరుగుచున్నది, యీ పరిపూర్ణములో విచారిస్తే యెరుక యెన్నటనులేదు. కనుక యెరుకనే శూన్యమని చెప్పవలెను. యీ విధముగా విచారించినచో పరిపూర్ణము శాశ్వతముగా ఉన్నదని తెలియబడినదా? అనిగురుమూర్తి ప్రశ్నించగా,శిష్యుడు: "అవునుస్వామి కనుగొంటిని, ఉన్నదని నిర్ణయమైనది" అనిఅనెను అంత గురుమూర్తి" మరియింక భయమెందుకు ? అనుమానము లేకుండగ యెరుకలేదని నిశ్చయముగ చెప్పుము, ఇదిగో పరిపూర్ణము. విచారించి చూడుము. యెరుకయేలేదు. అని గురుమూర్తి చెప్పి చూపించెను.

విశేషబావము : కనుట అన్నపదమునకు విచారించుట అని అర్థము చెప్పుకోవలెను. చర్మచక్షువులకు జగత్తుయున్ను జ్ఞాన చక్షువునకు జగదధిష్ఠానము ఉన్నట్లు తెలియబడినది. కాని "గురుబుద్ధిర్విశేషతః" సద్గురుమూర్తియొక్క కరుణచే కల్గిన విశేష సూక్ష్మ ప్రజ్ఞానముచే, వారు చెప్పినట్లుగా విచారిస్తే పరిపూర్ణమె శాశ్వతముగా ఉన్నదనియు, జగత్తు - జగదధిష్ఠానములు లేనేలేవు భ్రమ రూపమనియు తెలియబడినది. కావున పరిపూర్ణమె శాశ్వతమై మునుగ్రుచ్చ సందులేక వ్యాప్తమై యున్నదనియు, ఎరుక ఎన్నటను ఎంతమాత్రములేదనియు దృఢముగా తెలియవలెను.

— —

77) యెరుకబయలందులేమిని। యెరుకను శూన్యంబటంచు యెరిగించబడెన్। యెరుగుమిదె యకసంబి। తెలిగితె యెరుకాకసములు యేకమౌగధరా ॥ అకసము బయులేకమెట్లారా। పరిపూర్ణ విధిగో కన్పడు శూన్యమనరాదు। తిరిగుందు మెదిరిస్తే యొకస్థానై జూచేవు ॥ యేకమౌగదరా। అకసము బయలేకమెట్లెరా ॥

భావము : శిష్యా ! యెరుక పరిపూర్ణములోలేదు; కనుక యెరుకయే శూన్యమని తెలుపబడినది. యీ సమస్తము ఆకాశ అంశముచే తయారైనది. నీలోని జ్ఞాత, తెలుసుకొనే తెలివి, ఆకాశ అర్ధాంశమేకదా। అనగా నీలోని తెలివి, దానిచే తెలియబడు సమస్తము ఆకాశముయొక్క అంశాస్వరూపమె. అనగా ఎరుకయే. కనుకనే యెరుక – ఆకాశములు ఒక్కటగుచున్నవి. పరిపూర్ణము ఆకాశముకాదు, ఎరుకకాదు. కనుక నీలోని జ్ఞాత (ఎరుక) పరిపూర్ణములు ఏకములావు. కలియుటలేదు. నీలోని యెరుక పరిపూర్ణములో శూన్యమైపోవుచున్నది. ఇందుకు విరోధిస్తె (యెదిరిస్తె) నాచేయి చూస్తేవుగాని పరిపూర్ణము పరబ్రహ్మను చూడజాలవు.

విశేషభావము : గురుమూర్తి శిష్యునకు పరిపూర్ణము యొక్క అపరోక్షజ్ఞానమును కలిగించుటకై ఈ పద్యమును చెప్పినారు. ఆకాశముయొక్క అర్ధాంశము తెలిసికొనేతెలివి జ్ఞాతఅయ్యినది మిగిలిన అర్ధాంశము మిగిలిన నాల్గు భూతములతో కలసియున్న, మిగిలిన నాల్గు భూతాంశము లు ఆకాశ భూతాంశముతో కలసి సమస్త జగత్తు అయినది. అనగా తెలివి తెలుసుకొనే సమస్తము ఆకాశభూతాంశమే. జ్ఞాత అనగా యెరుక తన స్వరూపమే అయిన సమస్త జగత్తును తెలియగల్గుచున్నది.

మన జ్ఞానము (చూపు) యెంతదూరము చూచినను ఆకాశాంశమైన వస్తువునే చూడగలదు. దానితో ఏకము కాగలదు. కానీ మధ్యనా పరిపూర్ణముండు నిలువక నిర్గుణమైపోవుచున్నది. కనుక బయలందు జ్ఞానము (చూపు) నిలుచుటలేదు, ఎందుచేతననగా బయలు ఆకాశ అంశముకాదు. బయలు (పరిపూర్ణము) తప్ప మిగిలిన సమస్తము ఆకాశాంశమే. మనలో చూచేది ఆకాశాంశమె. ఈ రెండును ఏక మగునుగాని, పరిపూర్ణము మనలోని జ్ఞానము (చూపు) ఏకము ఎన్నటికికాదు. పరిపూర్ణము ఇదిగో, అంతటా నిండియున్నది. విచారించిచూడుము. నేచెప్పినట్లుగాక విరోధిస్తే అనగా ఎదిరించి మాటాడితే నాచెయ్యి కనిపిస్తుంది. పరిపూర్ణమును చూడలేవు. కనుక ఆకాశము పరిపూర్ణము ఒకటి కాదని ప్రత్యక్ష ప్రమాణముగా సద్గురుమూర్తి ఈపద్యములో వివరించెను.

— —

78) కనుపడెడు బయలులోపల । కనుగొనలేదయ్యె యెరుక గావున శూన్యం । బనవలసెదీన్ని [illegible] మాయనోయప్పా ॥ యింతకు వేరె మాయయున్నా । కనుకనె యీ విశ్వమును లేనిదనిలెస్స । వినజెప్పనాయెను కనబోకుండని పోనీ । మాయనోయప్పా । యింతకువేరెమాయ యేదప్పా ॥

భావము : శిష్యా ! విచారిస్తే ఉందని తెలియబడే పరిపూర్ణ పరబ్రహ్మములో విచారించగా యెరుకలేదని నిర్ణయమైనది, గావున యెరుక శూన్యమనబడును. ఇట్టిలేని యెరుక చేతనే జగత్తు [illegible] చున్నది [illegible] తకన్న [illegible] మాయ యేమైన ఉన్నదా । కనుక లేని యెరుకవల్ల ఏర్పడినది కనుక విశ్వమును గూడలేదని, అసత్రూపమైనదని, బాగుగవిడారించిచెప్పుచున్నాను.

దీనిని ఉన్నదని ఎన్నడూ అనుకోవద్దని లేనిదనే నిర్ణయములో ఉండమని బాగుగ వినజెప్ప వలసివచ్చినది.

విశేషబావము :"అకాశం గగనం శూన్యం" అమరశ్లోకము. యెరుకను విచారించినచో లేనిదని నిర్ణయముగా తెలియుచున్నది. కనుక యెరుకను విచారించినచో లేనిదని నిర్ణయముగా తెలియుచున్నది. కనుక యెరుకను శూన్యమని, అకాశమని అనవచ్చును. లేని యెరుకవలన జగత్తు అధ్యారోప, అపవాద రూపముగా ఏర్పడినది. "శశవిషాణవత్", శుక్తి రజితువత్, వంధ్యా సూనవత్ ఇత్యాదిగా జగత్తులేదని మాయమని చెప్పబడుచున్నది.

---

79) అహమనదుగదా అచలము । అహమున్నదా లేదా చూడదదిని జెమెకదా । అహమును జట్టించదుగదా । అహముద యించేటివరకె అది ఉన్నదికదా ॥ అహమేవిశ్వమై నిల్చిందిగదా । అహమె యీ పుట్టిన్నట్లెన్నదుగుసుగద । అహమెతాలేనని యెరిగితె సరిగదా ॥ అది ఉన్నదిగదా । అహమె విశ్వమై నిల్చిందిగదా ॥

బావము : శిష్యా ! పరిపూర్ణము అహము (నేను) అనదుగదా ! మరియు నేననీయెరుక ఉన్నదో లేదో దానికి తెలియదు. అది నిజమేకదా ! మరియు నేనను యీ యెరుక పుట్టుటకు పరిపూర్ణము కారణము కాదుగదా ! ఇట్టి నేనను యెరుక పుట్టుటకు పూర్వమై పరిపూర్ణమున్నదిగదా ! నేనే ఎరుకే విశ్వరూపమైనది. యీ ఎరుకను నేను ఉన్నట్లు, జగత్తు ఉన్నదని వగైరా ముచ్చట్లను ఎరుగుచున్నది. కనుక అన్నిటికి కారణమైన ఎరుక, పరిపూర్ణమున్నదని గ్రహించి, తానే లేనని తెలిసిపోతేసరి. పరిపూర్ణమే ఉండును.



౭౦) ఆవరణము నాకసము । నిరావరణము నచలముసుఖు
అగిరిమహాత్ముల్ । ఆవరణము మితి గలిగిన ॥ దావరణము లేంది
అమితమని తెలుసుకోరా ॥ యీ రెంట్ని వేరని కనుక్కోరా ।
ఆవరణముననే నిరావరణమును జూచి । ఆవరణమెడలిన నావలి
మాటలేదని ॥ తెలుసుకోరా । యీ రెంట్ని వేరని కనుక్కోరా ॥

భావము : శిష్యా ! ఆకాశము ఆవరణము కలిగినది. పరి
పూర్ణము ఆవరణరహితమైనది అని మహాఋషులు చెప్పియున్నారు.
కనుక పెద్దలవ్యాఖ్యానుసారముగా విచారణచేసినచో ఆవరణమున్నది
అనగా మితస్వరూపమని తెలుసుకోవలెను. కనుక ఆకాశము మిత
స్వరూపమ తెలుసుకోవలెను. కనుక ఆకాశము మితస్వరూపము,
పరిపూర్ణము ఆవరణలేనిది కనుక అమితమైనది. అందుచే ఆకాశము
పరిపూర్ణము ఈరెంటిని వేరని తెలుసుకొనుము. ఈ ఆవరణ సహిత
మైన ఆకాశమునందే నిరావరణమైన పరిపూర్ణమున్నదని విచారించి
చూచి, ఆవరణ స్వరూపమైన ఆకాశము లేనిదని తెలుసుకొంటే,
దానికావలగా ఉన్న పరిపూర్ణమును గురించి చెప్పుటకు మాటలేదని
తెలుసుకొనుము.

విశేషభావము :"ఆవరణ రహితమచలం । కర్తృ కార్య
వివర్జితం" । అని అన్నారు మహాఋషులు. కనుక పరిపూర్ణము అవ
రణరహితమై, అమితమై, అచలమై సర్వే సర్వ ప్రాణులు గ్రుచ్చ
సందులేనిదై నిండి నిబిడీకృతమై స్వతస్సిద్ధమైయున్నది. అందులో
లేనిదే తోచినది ఆకాశము అనగా మహాకాశమైన ఆత్మ, (ఎరుక)
ఈమహాకాశము ఆవరణకలిగినది. అనగా సత్తాయే ఆవరణగా కలి
గినది. మాయాస్వరూపమైనది మహాకాశము. అదేబ్రహ్మాండము. కనుక
ఆవరణ కలిగినది మితస్వరూపము. మితము అల్పమైనది, మృత

మని శృతులు చెప్పుచున్నవి. అట్టి మహాకాశములేనిదని దృఢ మైనచో ఆ మహాకాశమునకు లోపల వెలుపల అంతటా నిండియున్న పరాకాశమైన పరిపూర్ణమును గురించి చెప్పుటకు మాటయేది ? మాట్లాడుటకు రెండోవస్తువులేదు ? కనుక శాస్వతమైనది, రెండోది లేనిది, వికార రహితమైనది పరిపూర్ణమె ఉన్నది. దానందు ఓం అను శబ్దములేదు. శబ్దరూపముగా వర్ణించుటకు రెండోవస్తువుకూడా లేదని గ్రహించవలెను.

........

81) ఆకాశము శూన్యంబని । లోకులు మొరబెట్టి దానిలో పవనాదుల్ । ప్రాకటముగ బుట్టినవని । చీకాకుగచెప్పినారు ఛీ వినరాదు ॥ వంధ్యాసంతీక్షితిలోనలేదూ । కాకుంటె వినుచోద్యమా కుందేటికొమ్ము । నీకాలమున మేమెకంటి మనుమాట ॥ ఛీవినరాదు। వంధ్యా సంతీక్షితిలోన లేదు ॥

భావము: అకాశము శూన్యమని జనవాక్యము. అట్టి శూన్యమందు గాలి, అగ్ని, నీరు, భూమి భూతచతుష్టయము పుట్టినవని చెప్పిరి. అకాశమే శూన్యమయినప్పుడు, దానితో గాలి మొదలగునవి కల్గెననుట చీకాకుమాటలేకాదా। అట్టిమాటలు వినరాదు గొడ్రాలిబిడ్డ ఎచ్చటైనా కలదా? కాకపోతే ఈకాలమందుకుందేలుకు కొమ్ము మేము చూచినాము అన్నమాట నిజమా ? అట్టి మాటలు వినరాదు. శశశృంగము ఏమీయుండనేరదు.

విశేషము : "అకాశం గగనశూన్యం" అని అమరకోశములో ఆకాశమునకు శూన్యమని పర్యాయపదముకలదు. శూన్యమనగా ఏమీయు లేదని భావము. ఆకాశమే లేనిదయితే, అందులో

వాయువు మొదలైన భూతములేర్పడుట, వాటివల్లనే సమస్త జగత్తు ఏర్పడుట వింతయైన మాటకదా। అందుకే ఆకాశముతో సహా సమస్తమయిన జగత్తు లేనిదని, మాయయని, మిథ్యయని చెప్పిరి. అ భాసరూపమేకాని ఉన్నదనుటకు వీలుకాదని చెప్పుటయే యీ పద్యభావము.

— —

82) లేనెరుక బయలందున । లేనేలేనటక యిక నేల వలెనురో । లేనివికలవని పిదపను । లేనేలేవనుచు సిగ్గులేకా యీ లీలా॥ ఛీవినకి చీకాకు నీకేలా॥ మేనందశుద్ధము తాఁ పట్టుకొని మళ్ళీ। మూఁదికడిగిన రీతి నేను సిగ్గేకయింత। లేకా యీలీలా ॥ ఛీ వినకి చీకాకు నీకేల ॥

భావము : శిష్యా ! లేనెరుక పరిపూర్ణములో లేనేలేదని ఖ్యాక్కి చెప్పక, యితర సిద్ధాంతములలో యీ లేని ఎరుక జగత్తులు కలవనియు, అవి ఏలా ఏర్పడినవో వివరించి, చివరకు ఇదంతయు మిథ్యయని సిద్ధాంతీకరించిరి. లేనిది ఉన్నదనిచెప్పి, అపిదపలేదని చెప్పుట, రెండుమాటలాడుట సిగ్గులేకనేకదా ! అవి ద్వంద్వపు మాటలు. అవి వినకు. శరీరమందు అశుద్ధము పూసుకొని, తిరిగి ఛీఛీ అని శుభ్రముగా కడిగికొనుట ఎంత వెర్రిపనో_అట్లే లేనిది ఉందని చెప్పి పిదప లేదని చెప్పుట సిగ్గులేక చెప్పిన మాటలు. అట్టిమాటలు వినవద్దు.

విశేషభావము : సాంఖ్యాది సిద్ధాంతముల యందు ** "అధ్యారోప అపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అని లేని జగత్తు రజ్జుసర్పమువలె, కుందేటి కొమ్మువలె అధ్యారోపముగాను

మరియు అవవాదురూపముగను ఏర్పడినదని ఈపరివంచోత్పత్తి క్రమమును మహాఋషులు చెప్పియున్నారు. మరియు వారే బ్రహ్మ సత్యం-జగన్మిథ్య అనెడు వాదంతయు లేనిదే కలిగినది కాని నిజమునకు ఈ సమస్తము కొంచెముకూడ లేదని నిర్వికారమైన పర బ్రహ్మమే సత్యమైనదని చెప్పిరి. ఈవిధముగా లేనిది మొదటగా ఉన్నదనుట, అతరువాత లేనేలేదని సిద్ధాంతీకరించుట అవి ద్వంద్వవిధములుగా మాట్లాడుట అనిపించుకొనును. అట్టి ద్వంద్వ మాటలయందు బుద్ధినిలిపి ఏమియు లేనేలేదని దృఢప్రజ్ఞ కలిగి యుండమని చెప్పుటయే యీ పద్యభావము.

బ్రహ్మమేదో-జగత్తనగా ఏదో, నేను అనగా ఏదో ఎరుగని అల్పజ్ఞులకు లేని జగత్తు ఏలా కలిగినదో చెప్పుటకు అట్టి ద్వంద్వ విధములయిన మాటలతో మహాఋషులు నిర్వచించిరి. అవి అన్ని పూర్తి చేసుకొని అఖరిమాటలయిన ఈ పరిపూర్ణబోధలో శిష్యునికి దృఢప్రజ్ఞ కలుగుటకై అట్టి ద్వంద్వమాటల సిద్ధాంతములు ఎంత మాత్రము నమ్మకుండుటకై ఈరసన పద్యముగా భావించవలెను.

— —

౮౩) అన్నపు సూక్ష్మాంశము మన । సెన్నగనీరంబు ప్రాణ
మెరుగుము యీరెం । డెన్నడు కలియవానాడే । నున్నసుమీ
యొరుకమాట సుగుణసంపన్నా ॥ కలసుటె యెరుకసుమి యింత
కన్నా । వున్నాదెరుకకు మూలమన్నాది వినలేదు । యెన్నడు
యీ భ్రాంతి నిన్నంటనివ్వకు ॥ సుగుణ సంపన్నా । కలసుటె
యొరుకసుమి యింతకన్నా ॥

భావము : సద్గుణ సంపత్తిగల ఓ శిష్యా ! అన్నము యొక్క సూక్ష్మభాగము మనస్సున్ను, జలముయొక్క సూక్ష్మ

భాగము ప్రాణమున్ను యీ రెండెప్పుడు విడిపోవుచున్నదో అప్పుడే యెరుకమాట లేకుండాపోవును. మనస్సు, ప్రాణము ఈ రెండుకలసినచో యెరుక అనబడుచున్నది, యింతకన్న యెరుకకు మూలమేమియులేదు. మరేదో మూలముకలదను భ్రాంతిఏన్నడూ నీమనస్సునందు రానీయకుము.

విశేషభావము : మంచియేదో, చెడు యేదో చక్కగా విమర్శించి చెడును పూర్తిగా, విడిచి, మంచిని ఆచరించుటయే సద్గుణవంతుని లక్షణము ఆవిధముగాశిష్యుడు ఎరుక, వరములనుచక్కగా విమర్శించి అశాశ్వతమైన యెరుకయందు బుద్ధిని విడచి శాశ్వతమైన పరిపూర్ణమును గ్రహించినవాడు కనుక శ్రీకృష్ణప్రభువుల శిష్యుని ప్రేమపూర్వకముగా "సుగుణ సంపన్నా !" అని సంబోధించిరి. మనము తినే అన్నము వైశ్వానరాగ్నియందు హుతమై స్థూల, సూక్ష్మ, సూక్ష్మాతి సూక్ష్మములను మూడు భాగములుగా విడిపోవుచున్నది. అందు స్థూలభాగము మృతమై పురీషముగా బయుటకు నెట్టివేయబడుచున్నది. సూక్ష్మభాగము రసాది క్రమమును పొంది, సప్తధాతువులనువేరె పోషించుచున్నది, సూక్ష్మాతి సూక్ష్మభాగము అమృతము. ఇది బయటనుండి చంద్రునివలన సోమరసముగా, ఓషధులలోచేరి అన్నరూపముగా మనయందు ప్రవేశించి, తిరిగి సూక్ష్మాతి సూక్ష్మభాగముగా విడివడి. మనస్సునుచేరుచున్నది అట్లే మనము త్రాగిన జల, పానీయములు జీర్ణమై మూడు రూపములుగా అనగాస్థూలము, సూక్ష్మము, సూక్ష్మాతి సూక్ష్మరూపముగా విడిపోవును, స్థూలభాగము మూత్రమై బయటకు పోవుచున్నది. సూక్ష్మభాగము రక్తమగుచున్నది. సూక్ష్మాతిసూక్ష్మభాగము ప్రాణమును చేరుచున్నది. ఈ విషయము ఛాందగ్యోపనిషత్తులో చెప్పబడినది.

శృతి॥ అన్నమశితం త్రేధావిధీయతే । తస్య యః స్థవిష్ఠో ధాతు । స్తత్పురీషం భవతి । యో మధ్యమస్తన్మాగ్ం సః । యోఽణిష్ఠస్తన్మనః ॥

జలసూక్ష్మాంశము ప్రాణము ।–

శృతి॥ ఆపః పీత్వా స్త్రేధావిధీయంతే । తాసాం యస్థవిష్ఠో ధాతు స్తన్మూత్రం భవతి । యో మధ్యమస్తల్లోహితః । యోఽణిష్ఠ స్స ప్రాణః ॥

— —

ఇట్లు అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు, జలము యొక్క సూక్ష్మాంశము ప్రాణము ఈ రెంటి కలయికవల్లనే 'నేను' అను ఎరుకయొక్క ఉనికి కలుగుచున్నది. ఈమనః ప్రాణములు విడిపోయినచో 'నేను' అనలేము, అనగా జాగ్రదవస్థలో 24 ఇంద్రియములు చేరి పనిచేయుటచే మనఃప్రాణములు రెండు కలసి పని చేయుచున్నవి కనుక "నేను" అనబడుచున్నది. అట్లే స్వప్నావస్థ లోను 17 ఇంద్రియములు కలసి పనిచేయును. అందులోను మనః ప్రాణములున్నవి. కనుక స్వప్నావస్థలోను "నేను" అనబడు చున్నది. అనగా అహంవృత్తి కలదు. సుషుప్తి అవస్థలో ఇంద్రియ వ్యాపారములేకపోవుటచే మనః ప్రాణముల కలయిక లేకపోవు చున్నది. అందుచే ఈ అవస్థయందు అహం, నేను అనువృత్తి లేదు. మరియు తురీయావస్థయందును ఇంద్రియములు పని చేయుటలేదు. అందుచే ఇక్కడకూడ మనః ప్రాణములు కలియుట లేదు. కనుక ఇచ్చటకూడ నేను అనుమాటలేదు. కనుక ఈ విధ

ముగా విచారిస్తే రెంటి కలయికతే "నేను" అని తెలియుచున్నది. రెంటి కలయికకే యొరుక. రెండూ విడిపోతే ఏమీలేదు. [illegible] ప్రాణములు, నేను / మేనులు, స్థూల + సూక్ష్మములు, ఆత్మ + జగత్తులు రస + బలములు ఇట్లు రెంటి కలయికే యీ యొరుక. రెండు విడిపోతే ఏమిలేదని తెలియపర్చుటే ఈ పద్యభావము. అలగా యొరుక ద్వంద రహితమైనది ఒక్కటి, ఏకమాత్రము కాదని నిర్ణయము.

— ० —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాఽద్వైత రహిత పరమతత్త్వ

యొరుక లక్షణజ్ఞానము

పంచమోఽధ్యాయమునకు

భావ విశేష భావములు

సమాప్తము.

॥ జై గురు ॥

# 6. మెఱుకను విడిపించుట (22)

84) పిల్లలు తాట్యాకులతో । పిల్లల గావించి పెండ్లి పేరం
టంబుల్ । కొల్లలుగజేయువారల । తల్లులు గని సత్యమనుచు
తలచేరామదిని ॥ నినునీవిట్లు దలచరమదినీ ॥ కల్లాసంసారముగని
మానవులుసంత । సిల్లగ గురుమంత్ర సిద్ధులు నిజమని ॥ తలచేరా
మదినీ । నికునేవిట్లు దలచరామదిని ॥

భావము : శిష్యా ! చిన్నపిల్లలు తాటాకులతో బొమ్మలు తయారుచేసి, వాటికి పెండ్లిండ్లుచేసికొనుచు, పేరంటములు పెట్టుకొనుచు ఆడుకొనుచుందురు, అట్టి పనులన్నిటిని ఆసమయములో వారలయొక్క తలిదండ్రులు చూచి ఆపనులు నిజమనుకొందురా? వట్టివే ఆటలాడుకొనుచున్నారని మానభావము వహించెదరు. అట్లే నీవు-నీచే చేయబడు సమస్త సంసారిక వ్యవహారములు లేనివేయని గ్రహించుకొనుము. ఈ సత్యముకాని సంసారజగత్తునుచూచి అజ్ఞానయుతమైన మానవులు నిజమైనవేనని నమ్మి సంతోష, దుఃఖములు పొందుచున్ననూ, ఆశరీర గురు మంత్ర ఉరూఢులైనవారు, ఇదంతయు నిజమని తలచెదరా ? లేదు ఇదంతయు పిల్లలు ఆడుకొనే బొమ్మలపెండ్లి వంటిదే, లేనిదే, యని అభావులై యుందురు.

విశేషభావము : పిల్లలు బొమ్మలపెండ్లిండ్లు చేసుకొనేటప్పుడు వారి తల్లులుకూడా వారినిసంతోషపెట్టుటకై ఆపెండ్లిండ్లతో సహకరించెదరు. కాని పిల్లలభావము - ఆ పెడ్డి పేరంటములు నిజమైనవిగానే భావించెదరు. కాని వారి తల్లులు పిల్లలతో సహకరించినప్పటికి, అవి యెంతమాత్రము నిజమనినమ్మరు. తల్లులు నిజము కాదనే భావములోనే ఉందురుకదా : అట్లే లోకులుచేయు సంసారిక జగద్వ్యాపారములవలెనేగురుమంత్రసిద్ధులుకూడ ఆపనులన్నియు

చేయుచున్నప్పటికి, లోకులు ఆపనులన్నియు నిజమైనవిగాను, గురుమంత్ర అర్హతపొందినవారు ఆపనులన్నియు కల్లయనియు భావించెదరు. అట్లే నీవుకూడ సమస్త వ్యవహారములు నిజమునకు లేకపోయినప్పటికి, లోకమునకు తగినట్లుగా వ్యవహరించుము. అని భావము.

— —

85) మేనెరుకలరెండింటిలో। దానిని యిది దీనినదియు తగసృజయించున్। మేనెరుకలివియు మూలము। లేనిదె సృజనా యెననుచూ లేనేలేవంటీ ॥ అంటే తప్పులేనేలేదంటీ ॥ మేనెరుకలిప్పుడూ దేనందున్నవో చూచి। లేని మేనెరుకలు లేనివనుచూ నమ్ము ॥ లేనేలేవంటీ। అంటే తప్పులేనేలేదంటీ ॥

భావము : శిష్యా ! దేహివలన దేహము, దేహమువలన దేహి, ఒకదానివలన మరొకటి సృజింపబడుచున్నదేకాని, ఈరెంటికి మూలము మరేదియులేదు. ఇట్టి మేనెరుకలు, మూలములేనిదే సృష్టి అయినవి. కనుక యీ మేనెరుకలు లేనేలేవనిచెప్పుచున్నాను ఇట్లు మేనెరుకలు లేనేలేవని చెప్పినప్పుడే తప్పులేదు. ఉన్నవని చెప్పుట తప్పే. కనుక యీ మేనెరుకలు దేనందున్నవో చక్కగా విచారించి, లేని మేనెరుకలు లేనివని నీవు నిస్సంశయముగా నమ్ముము.

విశేషభావము : శరీరము_ఆత్మ యివి ఒకదానికొకటి అన్యోన్యాపేక్షతో ఉన్నవి. శరీరములేక ఆత్మకు ఉనికిలేదు. ఆత్మ లేకుండా శరీరము నిలువదు, ఒకదానికొకటి ఆశ్రయమైయున్నది వీటికిమూలము మరేదియులేదు. ఆత్మ స్వయంభు. ఒకదానివల్ల ఏర్పడినదికాదు. ఆత్మవల్లనే జగత్తంతయువచ్చినది. ఆత్మ జగత్తుని

విడచి ఉండదు. ఉంటే దానికి ఉనికేలేదు. బ్రహ్మ + కర్మ బ్రహ్మ అత్మ, కర్మ అనగా జగత్తు, శరీరము. బ్రహ్మ + కర్మ విడిబడిలేపు ఎన్నడూ విడిబడవు. ఇట్టి ఏకరూపమైన బ్రహ్మ మొట్టమొదటగా లేకనే, పరిపూర్ణములో లేక తోచబడినదను విచారణ తెలిసినప్పుడు, లేక తోచిన బ్రహ్మ + కర్మ లేనేలేవని నిస్సంశయముగా తెలియబడును. పరిపూర్ణము మాత్రమే స్వతస్సిద్ధము శాశ్వతమైనది. ఈ పద్యములో "దేనందున్న వొచూప" అంటే ఈ దేహిదేహములు రెండునూ, పరిపూర్ణములో లేక స్వప్నమువలె తోచబడినవని విచారణచే చూచి, అని అర్థము చేసుకోవలెను.



86) యెరుక పనిచేయుదనకుము । యెరుగుట మరచుటలు రెండు యెవ్వరిపనులో । యెరిగింపుమునా మ్రోలను । వెరువను తప్పితివె దెబ్బవేశాను చూడూ ॥ అట్లనకుండ జేశాను నేడూ ॥ అట్లనకుండజేశాను నేడూ । నెరపించుటె దెబ్బవేశాన నాతండ్రి । యెరిగించిపై మర్మ మెరుకనునేచేని ॥ వేశానుచూడూ । అట్లనకుండ జేశాను నేడూ ॥

భావము : శిష్యా ! "యెరుక పనిచేయుదు. అది నిర్వికారము "అని అనకుము. యెరుగుట_మరచుట అను యీ రెండూ యెవరి పనులో నాయెదుట చెప్పుము. నేను చెప్పిన విధముగా గాక మరొకవిధముగా విచారించితివా_ దెబ్బవేస్తాను జాగ్రత్త. అట్టి తప్పుదారిమాటలు లేకుండగ జేస్తానునేడు. (అంత శిష్యుడు భయముతో మాటలాడకుండుటను జూచి, గురుమూర్తి) భయపెట్టితినే కాని నిజముగా కొట్టితినా నాతండ్రి ! పై మర్మమెరిగించి యెరుక లేకుండగ జేస్తానుచూడుము. అని భావము.

విశేషభావము : ఈ పద్యము, యెరుక (బ్రహ్మము) నిర్వికారము, క్రియాశూన్యము. నామరూప క్రియారహితమైనదను అద్వైత సిద్ధాంతమును ఖండించుటకై చెప్పబడినది. సమాధిస్థితిలో ఉన్నప్పుడు, యెరుక క్రియారహితమై, తన్నుగాని యెదుటను గాని గుర్తించే లక్షణము లేదుకదా ! అని శిష్యుడు అడుగగా- గురుమూర్తి యిచ్చిన సమాధానము. అయితే ఈ సమస్తమును యెరిగేది ఏది ? మరొక యెరుక యేమైన ఉన్నదా ? లేదు. ఒక్కటే యెరుక. ఆ యెరుక సహస్రారమున గుర్తురహితమై (మరుపు) ఉన్నది. అదేయెరుక భ్రూమధ్యస్థానమున సమస్తమును గుర్తించుచున్నది. కనుక యెరుక ద్వంద్వరూపమైనది. వ్యక్త- అవ్యక్త స్వరూపము-ఒకేవిధముగా ఉండేదికాదు. ఈవిధానముగా విచారించితేనే, యెరుక యొక్క నిజస్వరూపము తెలియబడును. ఈ మార్గమును విడచి మరొక (వంకర) విధముగా విచారిస్తే అవి నిష్పక్షపాతమైన విచారణ కానేరదు, కనుక నిజముగ్రహింపబడదు. కనుక సద్గురుమూర్తి శిష్యునికి పైమర్మమెరిగించి యెరుకనునే దీసివేశానుచూడూ" అన్నారు. అనగా అతిరహస్యమైన పరిపూర్ణ మెరిగించి, అందులో యెరుక యెంతమాత్రము లేదనియు, మాయ యేకాని, అనగా ఉన్నట్లుగాతోచబడే భ్రమరూపమైనదేకాని, శాశ్వత మైనది కాదనియు, నిష్పక్షపాతబుద్ధితో విచారించి, యెరుకను దీసి వేస్తాను. అని చెప్పుచున్నారు.

87) లేని కల కలిగినప్పుడు । దానికి దశదిశలయందు తగమొదట కొనన్ । తానంట కున్న మేల్కొను । లేనికలే చూచె నేని లేకపోవుగదా ॥ కలతో మేల్కొ లేకపోదుగదా ॥ లేనెంక బయలు లీలాగ నీకెపుడు । గానవచ్చితె బోధ గావలెననవపుడూ ॥ లేకపోవుగదా । కలతో మేల్కొలేక పోదుగదా ॥

భావము : శిష్యా ! లేని యెరుక భ్రమ అనగా సుఖ దుఃఖములతో వ్యాకులత పొందినప్పుడు, యెరుకకు దశదిశల యందు నిండి నిబిడీకృతమై యున్న (నేను లేని) పరిపూర్ణమును, యీతేనెరుక చూచినచో, యెరుకయే లేకపోవును. కలనుండి మెల్కొనగానే–కలయే లేకపోయినట్లుగా, పరిపూర్ణము ఉన్నదని చూడగానే, యెరుక లేకుండా పోవును. కలతో పాటు మేల్కలేక పోదుగదా ! అట్లే యెరుక లేకుండునే కాని పరిపూర్ణము శాశ్వత మైనది. ఈ విషయము ఎప్పుడు నీకు దృఢముగా తెలియబడునో అప్పుడు నీవిక బోధ కావలయును, అని అనవు.

విశేషభావము : ఈ పద్యములో కల – యెరుకకున్ను, మేల్క–పరిపూర్ణమునకు సాటి పరిచి చెప్పినారు. కల వచ్చి అందలి సంఘటనలచే భయాందోళనలు పడుచున్న వ్యక్తికి మెలకువ రాగానే, వానికి కలిగిన కలయున్ను, అందలి సంఘటనలుకూడ లేకపోవుచున్నవి. అప్పుడు ఆవ్యక్తి భయమును విడచినవాడగును. అట్లే యెరుకయొక్క భయాందోళనములు కలిగినప్పుడు, జ్ఞానము తెచ్చుకొని, అంతటా నిండియున్న పరిపూర్ణ పరబ్రహ్మమె శాశ్వ తమై యున్నదనియు, అందులో యెరుక యెంతమాత్రము లేద నియు దృఢమైనచో, అట్టివానికి యెరుక లేదు. యెరుక చేష్టలు లేవు. ఇటు దృఢమైన వానికి, బోధ అవసరము లేదు.

— —

88) వొంటుకు దాపల విందౌ౦ । ట్లంటించిన కొలది లెక్క అధికంబగునా । వొంటుకు వలపల విందౌక । టంటించిన లెక్క ఉళ్ళక్కెగదనోయీ ॥ వొంటుండిలేఁదౌగదనోయీ ।

భావము : శిష్యా ! ఒకటికి దాపల సున్న పెట్టినకొలది ఏమయినది అని గురుని ప్రశ్న. పది, వంద యీలాగున లెక్క పెరిగినది అని శిష్యుని జవాబు, అయితే ఆ ఒకటికి వలపల సున్నా పెట్టినచో అప్పుడేమయినది ? అని గురుని ప్రశ్న లెక్క ఉళ్ళక్కి అయినది అని శిష్యుని జవాబు, ఒకటి ఉండికూడ ఒకటి అనుటకు గాని పది అనుటకుగాని వీలులేకుండగ లెక్క ఉళ్ళక్కి అయినది. యీ విధముగానే యెరుక, తనకు పరముగానున్న పరిపూర్ణమును చూచినచో, తానుండి లేకపోవును. దానితో ఏతంటాలు లేకుండగ పోవును. అని గురుమూర్తి శిష్యునితో చెప్పెను.

విశేషభావము : ఒంటుకు దాపల అంటే ఒకటి (10) వేసి ఆ ఒకటికి ఎడమచేతివైపు సున్న పెట్టినచో అ అంకె పది అయి లెక్క పెరుగుచున్నది ఆ ఒకటికి వలపల అనగా కుడిచేతి ప్రక్క సున్న పెట్టినచో (010) లెక్క ఉళ్ళక్కి అయినది. మరొకవిధముగా ఒకటివేసి (01) సున్నా పెడితే, శిష్యుడు గురుమూర్తికి ఎదురుగా ఉండుటచే దాపలసున్నా అయి లెక్క పెరిగినది అని శిష్యునిజవాబు. అట్లే ఒకటివేసి వలపలసున్నా పెట్టినచో (10) శిష్యుడు గురు మూర్తికి ఎదురుగా ఉన్న కారణముచే లెక్క ఉళ్లక్కి అయినదని శిష్యుని జవాబుగా గుర్తించవలెను. ఈ పద్యములో "తంటాదీరును చూడు దానివలెనే యెరుక కంటె బయలును" అన్న వాక్యమును, "తంటాదీరును చూడు దానివలెనే యెరుక బయలునుకంటె" అని అర్థవంతముగా గుర్తించవలెను. యెరుక బయలును చూచినచో యెరుక లేకపోవును అని భావము. తాను ఉండి లేకపోవును. అనగా! ఉన్నప్పటికి దానికి రెండువైపుల సున్నాలు ఉండుటచే (ఒకటి) అనిగాని 10 అనిగాని అనలేము. ఒకటి ఉండిలేకుండగుచున్నది ఇక్కడ 1 అనునది ఆత్మ దానికి కుడిప్రక్క సున్నాలు జగత్తు (జగత్తు

మిధ్యారూపకనుక). అప్పుడు ఆత్మ యొక్క తంటాలు పెరిగిపోవు చున్నది. కాని ఆత్మకు ఎడమపక్కన సున్నా పరిపూర్ణము. ఆత్మ పరిపూర్ణ పర బ్రహ్మను గురుముఖతా అవలోకనము చేసినచో తాను ఉండి లేకపోవును. అని భావము.

— —

89) యెరుకొక్కటుండెనేనియు। యెరుకే యీ విశ్వరూప మేర్పడదాల్చున్। యెరుకొక్కటి లేకుండిన। యెరుకైన ప్రపంచ మున్నదెవెరెరిగే రికనూ॥ లేదనన్నైన నెవరుండే రికనూ॥ పరిపూర్ణ మైనట్టి బయలుండ గనిపెట్టి। గురుని వాక్యముబట్టి గురుతూబో గొట్టితే॥ యెవరెరిగే రికనూ। లేదనన్నైన నెవరుండే రికనూ॥

భావము : శిష్యా। యెరుక ఒక్కటి యున్నచో ఆయెరుకే యీ చరాచర విశ్వరూపముగా ఏర్పడుచున్నది. ఆ యెరుకే లేక పోయినచో ప్రపంచమున్నదని యెరుక, ప్రపంచములు లేవని చెప్పేవారైన ఉందురా? (అనగా అట్లుచెప్పేవారు లేరు అని అర్థము) సర్వే సర్వత్రా అంతటా నిండియున్న బట్టబయలును గురుముఖతా ఉన్నదని గుర్తించి, గురువాక్యమైన షోడశీమంత్రము చే ఉన్నిటిని యెరిగే గుర్తు (నేను) లేకుండా పోయినచో, పరిపూర్ణమున్నదనికాని ప్రపంచమైన యెరుక లేదనిగాని చెప్పేవారులేరు.

విశేషభావము : యెరుక అనగా నేను. నేను ఉంటే సమస్త ప్రపంచము యేర్పడుచున్నది. సమస్త ప్రపంచము నేనే. "మయిసర్వం ప్రతిష్ఠితమ్. అట్టి "నేను" గురువాక్యముచే లేకుండా పోయినచో నేనులేను అనిగాని, పరిపూర్ణమున్నదనిగాని, ప్రపంచము లేదనిగాని, చెప్పేవారెవరు ఉండరు. చెప్పే యెరుకలేదు గనుక అట్లు చెప్పుటకు వీలుకాదు. కాని పరిపూర్ణ మాత్రము ఉండును. అయినా అది ఉన్నదని చెప్పుటకు "నేను" లేనని భావము.

90) తెలుపు మృదుత్వము మధురము । గల వస్తువు చక్కెరనుచు గనుగొన్నట్లా । తెలివి శరీర జగములు । గలవస్తువు బిందువనుచు గనుగొనదాహా ॥ నేచెప్పితే వినినమ్మరాదా ॥ తెలివిచే బయలుండ దెలిశే యీా తెలివిని । తెలివిచేతనెపట్టి తీసివెయ్యరపోనీ॥ కనుగొనరాదా । నేచెప్పితె వినినమ్మరాదా ॥

భావము : శిష్యా ! తెలుపు, మృదుత్వము, మధురము ఈ మూడు గలిసిన పదార్థము చక్కెర అని తెలుసుకొన్నట్లుగా' జ్ఞాత-ఎరిగే-శరీరము-జగత్తు ఈమూడు కలసినదే బిందువు (ఎరుక) అని తెలుసుకొనుము. యీా విధముగా తెలియజేయుచున్నాను. వినినమ్ముము. గుర్తించే తెలివిచేతనే పరిపూర్ణమున్నదని తెలసి. అధిష్ఠానమైన గుర్తును (తెలివిని) పట్టితీసివేసినచో సమస్తము లేకుండాపోవును. నేచెప్పిన యీా విషయమును నమ్మి విచారించి చూడుము.

విశేషభావము : అధిష్ఠానమైన జ్ఞాత గుర్తించే శరీరము (జ్ఞానము) జగత్తు ఈమూడును కలసినదే యెరుక. అందు యీా మూడు విడబడకుండా ఉండును. కనుకనే దీనిని త్రిశక్త్యాత్మక మన్నారు, కనుకనే సృష్టి స్థితిలయములతో కూడిన జగత్తు అని ధారగ జరుగుచునేయుండును. యీా యెరుక పిండాండములో "నేను" సహస్రారస్థానము. అచ్చట గుర్తించే లక్షణము లేదు. అందుచే దానిని యెరుకలేని యెరుక అని అందురు. అదే తెలివి. భ్రూమధ్య స్థానమందు ఆయెరుక ప్రతిబింబితమై ప్రత్యగాత్మ యనుపేరుతో సమస్తమును తెలుసుకొనుచున్నది. ఇదియును తెలివియే. యీా తెలివిచేతనే గురుముఖతా పరిపూర్ణమున్నదని తెలుసుకొని, గురువాక్యమైన శోతశీ మంత్రముచే సహస్రార

మందున్న తెలివిని కూడ లేనిదని తెలిసి దానియందు భ్రాంతివిడచి అరూఢత్వము పొందినచో యిక యేమియు ఉండదు. తెలివిచేతనే తెలివిని పట్టితీసివేయుడమనగా, తెలివిచేతనే (యెరుకచేతనే) పరిపూర్ణమున్నదని తెలిసి, సహస్రారమందున్న అధిష్ఠానస్వరూపమైన "గుర్తు" తెలివి,లేనిదనితెలసుకొని దానియందు భ్రాంతిలేకుండుట అని భావము. అదీ లేకపోతే దానివల్ల కలిగిన సమస్తము లేక పోవునుగదా!

— —

91) లేనెరుక బయులులోపల। తానై తనకేనపడిన తన మూలమునే। తానెరుగదలచినప్పుడు। తానేలేకుండు దృష్టాంతము వినుమిచటా॥ కలదోచదె తనకై తానెచటా॥ తానై తోచినకల తన మేల్కగన బోతె। తానే తనకులేదు తగియున్నదీ దృష్టాం॥ తము వినుమిచటా। గలదోచదెతనకై తానెచటా॥

భావము: శిష్యా! యీలే నెరుక పరిపూర్ణము లోపల తనకై తానుగా యేర్పడినది. అట్లు యేర్పడిన యెరుక తనకు మూలమేది అని చక్కగా విచారించదలచినప్పుడు, తానే లేకుండ పోవుచున్నది. ఇందుకు ఒక దృష్టాంతము ఇచ్చుట వినుము. యెచ్చటైనను కల తనంతతానుగానే యేర్పడుచున్నది. అట్టి కల తనకు మూలమున్న మేల్కను గనపోతే తానే లేకపోవుచున్నదిగదా; యీ దృష్టాంతము సరిపోవుచున్నదికదా!

— —

92) వచ్చుట పుట్టుట మెఱుక। వచ్చుట గాఢా సుషుప్తి వచ్చుటలీనా। గ్గచ్చము సహజ మెరుకకు పొచ్చము యీ ఎరుక

నిల్వ బోదుమాయప్పా ॥ అచలము కిట్లులేదుగదప్పా ॥ మచ్చికతో రెంటి మర్మము నీకిప్పు । డెచ్చుగతెల్పితి నెరుగు మెరుకనిల్వ । బోదుమాయప్పా । అచలముకిట్లు లేదుగదప్పా ॥

భావము : శిష్యా । చచ్చుట, పుట్టుట, మేల్కొ పొందుట, గాఢసుషుప్తి పొందుట, అను యీ నాలుగు తెరుకకు సహజలక్షణ ములు. నాతండ్రీ ! యీ కపటపు యెరుక శాశ్వతముగాదు. కాని పరిపూర్ణమునకు పైన చెప్పిన లక్షణము లేవియు లేవు. నీమీద ప్రేమతో యెరుక-పరి పూర్ణముల యొక్క మర్మము నీకిప్పుడు బాగుగ తెలియజెప్పితిని. చక్కగా తెలిసికొనుము.

93) యెరుకను కలలో పురుషుని । యెరుకే యీ విశ్వ మగుచు యేర్పడుకలగా । యెరుక బయలుగని తాలేం । దెరిగిన నెరుకకది మేల్కయిదినమ్ము లెస్సా ॥ యెరుకతో పొందువదులతె పిస్సా॥ యెరుకనెకలనీకు యెప్పుడుదోచితె॥ యెరుకలేందను మేల్క నెరుగుమప్పుడు చాలు యిది నమ్ము లెస్సా । యెరుకతో పొందు వదులదెపిస్సా ॥

(పొచ్చము=కపటపు, పిస్సా=అవివేకము)

భావము : శిష్యా ! యెరుక అనే కలలోనివానికి ఆ యెరు కయే విశ్వరూపమై కలగా యేర్పడుచున్నది. అట్టి యెరుక పరి పూర్ణమున్నదనియు, తానే లేననియు తెలిసికొనినచో యెరుక అనే కలకు అదియే మేల్కొ. ఈవిషయము చక్కగా నమ్ముము. అంతా యీ యెరుకతో కూటమి వదలకపోతే అది నీ అవివేకమే. యెరుక అనే భ్రమ (కల) అది నీకు యెప్పుడు కలిగితే, అప్పుడు యీ యెరుకలేనిదనే మేల్కొను గుర్తించితే చాలు, ఆ భ్రమ లేకుండా పోతుంది. యిది బాగుగా నమ్ముము.

94) చిత్తరువు రంగుగోడల । నెత్తెరగున దెలిసినావా నీవిప్పుడు నీ । చిత్తమున జగము నెరుకను । వృత్తబయల్

నట్లు దెలయుముమూ హాతోడుతనూ ॥ తె - సివిడుపువమూహా జగములను ॥
అత్తెరగునజేస్తే అవలిమాటను । యిత్తెరగని తెలియు నెవరుండే
రటుమీద॥ నూహాతోడుతనూ। తెలిసి విడువుమూహా జగములనూ॥

భావము : శిష్యా ! చిత్రము (బొమ్మ), రంగు, గోడ ఆనేవి యేలాగున ఉన్నవి? అనగా గోడపైన రంగుతో బొమ్మ గీయబడినది. అట్లే జగత్తు, యెరుక, ఉత్తబయులను మూటికి మన స్సులో ఊహతో సరిపెట్టుకొనుము. అనగా ఎట్టి మార్పు లేని స్వచ్ఛ మైన గోడమీద, రంగుచే, చిత్రవిచిత్ర మైన బొమ్మలు ఏర్పడినవి. రంగు, బొమ్మలు ఎప్పటికైనా పోయేవే. గోడమాత్రము ఎప్పుడూ ఉండును, దానికే వికారములేదుకదా ! అట్లే ఆవికారియైన ఉత్త బయలులో (పరిపూర్ణములో) ఎరుకచే (రంగు) చిత్ర విచిత్రమైన జగత్తు (బొమ్మలు) ఏర్పడుచున్నవి. బొమ్మలు-ఎరుక, లేక ఏర్ప డినవే. ఆవిలేకుండా పోయేవే. కాని పరిపూర్ణము మాత్రము స్థిర ముగా వికారమేమియు లేకుండగ ఉండును. ఈనిజమును చక్కగా గుర్తెరిగి ఎరుక జగములను విడచిపెట్టుము. ఆవిధముగా ఎరుక జగత్తులను విడచి నతదుపరి (అవలిమాట) పరిపూర్ణము ఇట్టిదని ఎవరు గుర్తించుటకున్నారు ? ఎరుకలేకపోయినచో పరిపూర్ణము ఇట్టిదని చెప్పేవారులేరని భావము.

— —

95) పరిపూర్ణములో లేనిదె। ఎరుకొక్కటిదోచి తనను యెరి
గిన వృషగా । యెరుకే విడచునదెట్లస। కరములు తమ పనులు
తామె గడపూనట్లుగనూ ॥ యిది గాకుంటె కలదింకోటివిను ॥ మరి
కానిద్ధామాట మంచిదీమాటని। పరిపారివిధములు పలుకెపలుకులపని॥
గడుపునట్లుగనూ । యిదిగాకుంటె కలదింకోటివినూ ॥

భావము : శిష్యా ! పరిపూర్ణములో లేనియెరుక ఒక్కటి దోచినది, అట్టిలేనియెరుక తాను మృష (లేనిదే ఏర్పడుట) యని విచారణచే తెలిసికొనినచో, తనకుతానే లేకపోవును. అదేలాగున ననగా-చేతులు యిచ్చుట, పుచ్చుకొనుటయున్ను, అలాగే నోటితో యిచ్చి మంచిమాట అని, చెడుమాట అని పలికినట్లుగా తెలియుము. అనగా ఇచ్చుట-పుచ్చుకొనుట రెండు భిన్నమైన పనులు ఒకే అవయవముచే చేసినట్లుగా, యెరుకే- పరిపూర్ణమున్నదని తెలియునప్పుడు తాను శశ్వ యని తలచినది. ఆయెరుకే పరిపూర్ణమున్నదని తెలిసినప్పుడు తానులేనని లేకపోవున్నది. యీ రెండుపనులు ఎరుకకే జరుగునని భావము.

96) తలయెత్తి చూడజాలునె । అలచీకటి యెదుటనిల్చి ఆజ్ఞాప్తుకళన్ । కలవచ్చి మేల్కయందున । గల చేష్టలమొప్పిలనిల్చి కనుగొన గలదా ॥ ఇట్లనె యెరుక కనుగొనగలదా ॥ యిలలో సద్గురుబోధ నెరుగని నరునిచే । ష్టలు గంటెనుళ్ళక్కి సద్గురుబోధౌట॥ కనుగొనగలదా ! అట్లనె యెరుక కనుగొనగలదా ॥

భావము : శిష్యా । చీకటి సూర్యుని ప్రకాశమును ఎదుట నిల్చి తలయెత్తి చూడగలదా ? అట్లే మేల్కయందున చేసినపనులు ముందుగా-కలలో చేసినపనులు వచ్చి చూడగలవా ? అవిధముగానే యెరుక, పరిపూర్ణమును కనుగొనగలదా ? యిలలో సద్గురు బోధస్థితి నొందిన నరుని సమస్తకర్మలు (చేష్టలు) ఉళ్ళక్కె, అనగా లేనివే యని భావము. (యీ పద్యములో-"అట్లనె యెరుక యిలలో సద్గురుబోధ కనుగొనగలదా, సద్గురుబోట నెరుగని నరుని చేష్టలు, సద్గురుబోధౌవ గంటె నుళ్ళక్కి" అని దండాన్వయము చేసికొనవలయును.

———

97) అంటదుకల మేల్కనుమే । ల్కంటదు కలనెన్నటికిని కనునిశ్చయమీ । రెంటి క్రియగుర్తు బయులుల । రెంటిని రెండంట కుండు, రెం డ్రెంటిలోనూ ॥ కలయెరుకాలి రెండూ మిధ్యేనూ ॥ దంటాగమేల్క బయులుంటావెప్పటికెరిగి। గెంటుమాపై తెంట రెంటీ కల యెరుకాల ॥ రెం డ్రెంటిలోనూ । కల యెరుకాలి రెండూ మిధ్యేనూ ॥

భావము : శిష్యా ! కలమేల్కను, మేల్క-కలను ఎన్నటికి ఒకదానిని మరొకటి చూడదు. ఇది నిశ్చయము. ఆ రెంటివలెనే యెరుక-బయులు రెండూకూడ, ఒకదానిని మరొకటి చూడలేవు. కల-మేల్క, యెరుక-బయలు, అను రెండు జంటలలోను, కల-యెరుకలు రెండూ మిధ్యే, అనగా లేనిదే ఉన్నట్లుగా తోచబడినవే. మేల్క-బయలులు ఎప్పటికి ఉండేవేయని తెలుసుకొని, కల-యెరుకల జంటను లేనివని విడచిపెటుము.

(దంటగ — జంటగ)

---

98) యెరుగదు సుషుప్తి జాగ్రత । నితవంద సుషుప్తి రెంటి నెరుగును మేల్క । ట్లరయగ బయలెరుకల రెం । ట్నెరుగదు బయలెరుక రెంటి నెరుగుచుండూ ॥ గురుముఖమున నెరిగి యీ రెండూ ॥ తిరముగ నెరుకను తీసివేసితెజాలు । పరుఉనేననియేటి పలుకే లేకుండూ ॥ నిట్లెరుగుచునుండూ । గురుముఖమున నెరిగి యీ రెండూ ॥

భావము : శిష్యా! గాఢసుషిప్తి-సుషుప్తిజాగ్రదలరెంటిని ఎరుగదు. మేల్క-జాగ్రదను, సుషుప్తినిరెంటినికూడఎరుగునుకదా।

అట్లే బయలు (పరిపూర్ణము) బయలును, ఎరుకను రెంటిని ఎరుగదు ఎరుక-బయలును, ఎరుకను రెంటిని ఎరుగును. గురుముఖముగా యీ యెరుక బయలులను చక్కగా తెలిసికొని, నిశ్చయముగా ఎరుకలేనిదని తీసివేసినచో చాలును. ఇతపలు, నేననే మాటలేమి లేకుండగపోవును. ఈ విధముగా గురుముఖముగా తెలిసికొనుము.

విశేషబావము : ఆరవంద సుషుప్తి అనగా గాఢనిద్రలో ఉన్న వ్యక్తి తనను గాని, జాగ్రదవస్థలోనున్న వానినిగాని ఎరుగవట్లు గానే, పరిపూర్ణము తననుగాని, ఎరుకనగాని ఎరుగదు. గుర్తించ లేదు, కనుకనే పరిపూర్ణమునకు "శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అన్నారు శ్రీధరస్వాములవారు. కాని ఎరుక మాత్రము తనయొక్క స్థితిని, పరిపూర్ణమును గుర్తించగలదు. జాగ్రదవస్థలోయున్న వ్యక్తి సుషుప్తి అవస్థలో ఉన్న వ్యక్తిని, తనను కూడ గుర్తించగలడుకదా! కనుక యిట్టిపరిపూర్ణమును గురుకరుణతో. గురుముఖముగామాత్రమే తెలిసి కొనగలము. అన్యథా తెలియబడునదికాదు. కనుక యీ పద్యములో "గురుముఖమున నెరిగి యీ రెండూ" అన్నారు కృష్ణప్రభువులు. అట్టి యెరుక, పరిపూర్ణములో లేనిదే కలవలె తోచబడినదని చక్కగా విమర్శించి తెలుసుకొని, లేని యెరుక లేదని దానియందు భ్రాంతిలేకుండాపోవుటవలన, నేను-పరులు అనేమాట లేకుండును. అనగా ఆత్మ సత్యమైనదని, జగత్తు మిథ్యయనే రెండు మాటలు లేకుండాపోవును అని అర్థము. ?

— —

99) సంకల్పములేనిదెని । స్సంకల్పములోన దోచు చను దోచుచనున్ । సంకల్పమె తప్పౌన ని।స్సంకల్పమునెరిగెనేని చను తాలేకనుచూ ॥ నిస్సంకల్పమును నిల్చెదనుచూ । సంకల్పించుట

కింక సంకల్పమేదిని । స్సంకల్పమందిటు సంకల్ప మెరిగితె ॥
చనుతాలేకనుచూ । నిస్సంకల్పమును నిల్చెదనుచూ ॥

భావము : శిష్య ! యెరుక లేనిదే పరిపూర్ణములో తోచి గతించుట, తిరిగి జనించుట, గతించుట జరుగుచుండును. అట్టి యెరుక చటుక్కున పరిపూర్ణమున్నదని ఎరిగినచో, పరిపూర్ణమె శాశ్వతమైనదని, అందు తనలేమిని తెలసికొని తానేలేకుండాపోవును. ఆవిధముగా యెరుక లేకపోయిన పిదప, తానులేననిగాని, పరిపూర్ణమున్నదనిగాని సంకల్పించుటకు ఎరుక లేదుగదా !

విశేషభావము ! ఈ పద్యములో "సంకల్పము" అను పదమునకు "ఎరుక" అని అర్థము చెప్పవలెను. ఆలోచన అను అర్థము చెప్పరాదు. కృష్ణప్రభువులు తమ 60వ కందార్థములో ఎరుకపేర్లు వివరించుచు. "సంకల్ప మంచని నాయిచ్ఛనినన్" అన్నారు. కనుక సంకల్పమనగా యెరుక. అయినచో నిస్సంకల్ప మనగా యెరుకకు వ్యతిరిక్తమైనది-పరిపూర్ణము అని అర్థము చెప్ప వలెను. కనుక యీ పద్యమును "యెరుక లేనిదె పరిపూర్ణములోన దోచుచనుదోచుచనున్ । యెరుక తప్పున (చటుక్కున) పరిపూర్ణము నెరిగినేని, చనుతాలేననుచూ । పరిపూర్ణమును నిల్చెదనుచూ । సంక ల్పించుట కింక యెరుకేది । పరిపూర్ణమందిట్లు యెరుక యెరిగితే । చనుతాలేననుచు । పరిపూర్ణమును నిల్చెదనుచూ" అని అర్థము చేయవలెను.

— ० —

100) యెరుక తనకు దావిడిపో । దెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్। గురుడొకడుదప్ప గురునకు। పరిచర్యయొనర్చి బోధ పద్ధాతివినినన్ ॥ తిరిగిరాని పద్ధాతి గనినన్ ॥ పరిపూర్ణ మెరుక

యేర్పరుచ నెరుకలేక। హరిని స్వప్నముగన్న కరి గ్రుంగ్గినటాయి॥
పద్ధాతివినినన్। తిరిగిరాని పద్ధాతి గనినన్ ॥

భావము : శిష్యా ! యెరుక తనంతట తానుగా పోదు. భూమిపై గురుమూర్తి ఒక్కడు తప్ప మరెవ్వరును యెరుకను విడిపించలేరు. కనుక గురుమూర్తికి చక్కగ సపర్య యొనర్చి బోధను, తిరిగి జన్మకురాని పద్ధతిని తెలిసికొనవలెను. అట్లు పరిపూర్ణమును, యెరుకను అపరోక్షముగా తెలుసుకొనినచో, ఏనుగు తనకలలో సింహమును చూచి మరణించినట్లుగా, యెరుక తనకుతానే లేకపోవును.

విశేషభావము : "శాస్త్రజ్ఞోపి స్వాతంత్రేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం నకుర్యాత్" అన్నట్లుగా పరిపూర్ణమును తనంతటతానుగా ఎవ్వరును తెలిసికొనలేరు, అట్లే యెరుకను స్వతంత్రజ్ఞానముచే ఎవ్వరును విడువలేరు. గురుకరుణచే మాత్రమే పరిపూర్ణము, తెలియబడుట, యెరుక లేకపోవుట యీ రెండు ఒక్కసారిగానే జరుగును. గాపున గురుమూర్తికి కరుణపుట్టులాగున సపర్యలు చేయవలెను. కనుకనే "గురుశుశ్రూషయావిద్య" అన్నారు. గురుశుశ్రూషచే మాత్రమే బోధస్థితి కుదరగలదు. పరిపూర్ణము – యెరుక యీ రెండు శిష్యుడు దృఢముగా తెలియులాగున గురుమూర్తి చెప్పి శిష్యునికి అపరోక్షజ్ఞానము కలిగించవలెను. ఇందులో ఎంత మాత్రము సంశయము పనికిరాదు. అట్టి దృఢనిశ్చయముచేతనే ఎరుక భ్రాంతి నశించును. ఎట్లనగా సింహమును ఏనుగ తనస్వప్నములో గనినంతమాత్రమున ఏనుగ చనిపోవును. ఇది ఆర్యోక్తి. అట్లే పరిపూర్ణము ఉన్నదని గుర్తించిన ఎరుక, తనంత తాన గానే

లేకుండాపోవును. పరిపూర్ణము ఉన్నదని, ఏమఱకలేదని దృఢత్వము కలిగినచో బోధస్థితికుదిరి ఎరుకలేకుండాపోవును. ఈ నిర్ణయము అట్టివారికి మాత్రమే తెలియును. అన్యులకు తెలియదు. కనుక సింహము ఏనుగ స్వప్నములో కని చనిపోయినదను ఆర్యోక్తి వలెనే శిష్యుడుకూడ సద్గురు బోధయందు దృఢమైన నమ్మకముకల్గి తెలిసి కొని అట్టిబోధస్థితి గురుకరుణచే పొందిన వెంటనే ఎరుకలేకుండా పోవును. అని గ్రహించవలెను.

— —

101) అపరోక్షమౌనెమనుజుల। కుపరోక్షంబైన బయలు గురుకృప లేకన్। అపరోక్షమౌను మనుజుల। కుపరోక్షంబైన బయలు గురుకృపకలుగా ॥ కీలిదె లేని యెరుకతా తొలగా ॥ విప రీతమౌ బుద్ధి విడచి నీవెప్పుడు। ఉపచారములు జేయుచుండుము గురునీకి ॥ గురుకృపకలుగా। కీలిదె లేని యెరుకలొ తొలగా ॥

భావము : శిష్యా ! పరోక్షమైన (ప్రత్యక్షముగా లేని) పరిపూర్ణము గురుకృప లేకున్నచో, మనుజులకు ప్రత్యక్షముగా (అపరోక్షముగా) తెలియబడునా ? గురుకృప కలిగిన మనుజులకు ప్రత్యక్షముగా తెలియబడును. పరిపూర్ణము ప్రత్యక్షముగా తెలియ బడిన వెంటనే ఎరుక లేకుండా పోవును. కనుక లేని యెరుక లేకుండా పోవలెనన్నచో "గురుకృప కావలయును, అన్నదే అసలు రహస్యము. అందుచే విపరీతబుద్ధిని విడచి గురుకరుణ కలుగుటకై గురుమూర్తి కెప్పుడునూ ఉపచారములు చేయుచుండుము.

విశేషభావము : అపరోక్షమనగా - ప్రత్యక్షభావము కలు గుట నిస్సందేహముగా వస్తువు యెడల వస్తు నిశ్చయజ్ఞానము కలు గుట. యెరుక అనగా నేదొ, పరిపూర్ణమనగా నేదో, యీరెండూ అప

రోక్షముగా (వస్తు నిశ్చయముగా) తెలియబడాలి అని ఈపద్యము లోని భావము. పరోక్షభావము కేవలము వాచాజ్ఞానమును మాత్రమే కలిగించును. అపరోక్షజ్ఞానము కలుగునంతవరకు సంశయము, అసంభావన, విప త భావనలు నశించవు. అనగా ఇది త్రాడా ? పామా ? సంశయము. వెంటనే భయముచే ఇది పామే అను అసం భావన కలుగును. ఆవెంటనే దానిని తొలగించుటకు జనసమీకరణ, కర్రలు మొదలగునవి తెచ్చుట అను విపరీత భావన కలుగును. అట్లు చేరిన జనాభాలో ఒకానొక వ్యక్తి 'త్రాడు, పాములయందు అపరోక్షజ్ఞానము కలిగినవాడు-కంగారు పడవద్దని చెప్పి, పాముగా భ్రమించిన ఆత్రాడును చేతితో తీసి అందరకూ చూపించగా వచ్చిన వారితోపాటు మొట్టమొదలుగా సంశయించిన వ్యక్తిగూడ, ఇది పాము కాదు త్రాడేనని నిశ్చయజ్ఞానము కలుగును. అతనికి అక్షణమందే సంశయము, అసంభావన, విపరీత భావనలు మూడు కూడ పూర్తిగా నశించును. అనగా వస్తువునందు అపరోక్ష జ్ఞానము కలుగనంతవరకు సంశయము నశించదు అని భావము. అట్టివిధము గనే యెరుక-పరిపూర్ణముల రెంటియందు అపరోక్షజ్ఞానము కలుగు లాగున శిష్యుడు గురుమూర్తికి పరిచర్యలు చేస్తూ, విద్యను అభ్య సించవలెను. శాస్త్రములలో ఎరుకనే పరిపూర్ణముగా చెప్పబడినది. ఇదే సద సత్పదార్థము, అట్టి సద సత్పదార్థము కానిది, రసమన దగనిది మాత్రమే పరిపూరమని, సదసత్పదార్థమే యెరుక అని కేటాయించి తెలసి, అట్టి పరిపూర్ణమే తన్నదని, దానందు యెరుక యేకాలమందున లేదను దృఢజ్ఞానముచే బోధస్థితిని పొందుటయే, అపరోక్షజ్ఞానము కలుగుట, ఇది కేవలము గురుకరుణచే మాత్రమే కలుగును. గురుకరుణ అనగా నిజమునకు ఈమానుష శరీరపు యొక్క దయ అని చెప్పరాదు. అఖండ గురుస్వరూపమేది

కలదో దానియొక్క కరుణ, దానికి దయకలుగుట అనగా ఆగురు స్వరూపమునకు అతిసమీపస్థుడై శిష్యుడుండుట వలన అఖండ జ్ఞానము కలుగును. అనగా శిష్యుడు అఖండ గురుస్వరూపమును ధ్యానించుచు నిత్యము అనుష్ఠానము చేయుచుండుటచే అట్టి ప్రజ్ఞ ఏర్పడును. అయినను అట్టి ప్రజ్ఞ ఈమానుష గురుస్వరూపము ద్వారా మాత్రమే పొందవలెను. అందుచే అట్టి అఖండ గురు స్వరూపమును లక్ష్యార్థముగాను, మానుష గురుస్వరూపము వాచ్యార్థముగా చేసుకొని శ్రవణ మనన నిధిధ్యాసలచేతను, అనుష్ఠానము చేతను మానుషగురుమూర్తికి సేవలు చేస్తూ అట్టి అఖండ జ్ఞానము పొందినచో పరిపూర్ణము ప్రత్యక్షముగ తెలియబడి, ఎరుకలేకుండా పోవును. అందుకే ఈపద్యములో "విపరీత బుద్ధిని విడచి ఉపచారములు చేయుము గురునికి "అన్నారు. అనగాగురుమూర్తిని మానుష మూర్తిగా చూడక, కేవల పరబ్రహ్మ స్వరూపముగా గుర్తించి షోడశ ద్వైవోపచారములచేత మానుషగురుమూర్తికి పూజాదులు చేయుచుండవలెనని ఈపద్యముయొక్క భావము.

— —

102) నేనెవ్వడనను జీవుడు। నేనే నను శివుడు యీరెండన కన్। తానుండున చలము వీటి। నినేనెరిగినను పైటినేనెట్లనినీ ॥ నేననకున్న తానెట్లనినీ। నేనన్నతాంట్లోనే నీనా ప్రసంగాము। లేనన్నదాంట్లోనే తలపోయవలె నిల్లు ॥ నేనట్లనినీ। నేననుకున్న తానెట్లనినీ ॥

భావము : శిష్యా! జీవుడు_నేనెవ్వడను? అంతా అపర మాత్మ డయు అని భావించును. కాని నేనే_నేను అహమేవ బ్రహ్మ, నావల్లనే సమస్తము, నాకు పైన ఏమీ లేదు అనుకొంటాడు

శివుడు. కాని పరిపూర్ణము_నేను జీవుడని కాని, నేను శివుడనని కాని అనదు. ఈజీవ, శివ, పరిపూర్ణములను చక్కగా తెలిసికొన్నచో పైది అనగా నేను జీవుడననిగాని, శివుడననిగాని, అనగలవా ? ఈరెండు అనలేవు అని భావము. నేను అన్నా, నీవు అన్నా (శివుడు_జీవుడు) ఈరెండూ నేనే. అపరిపూర్ణముతో నేనే అనగా యొకకే ఈశ్వరుడుగను, జీవునిగను అనేకముగా భ్రమించుచున్నది.

విశేష భావము : జీవుడు_అజ్ఞానము, ఈశ్వరుడు_జ్ఞానము అజ్ఞానముచే జీవుడు_"నేను కేవలము పాత్రధారిని, సూత్రధారి ఆ పరమాత్మ, ఈశ్వరుడు. ఈజగన్నాటకమునకు నేను కర్తనుగాను. కర్మబద్ధుడననుకుంటాడు అజ్ఞానముచే జీవుడు. కాని జ్ఞాని అయినవాడు "అహమేవబ్రహ్మ" అంతయు నేనే. మమాత్మా సర్వభూతాత్మా, నేను బద్ధుడను కాను. జీవుడను కాను. ఈశ్వరుడే నేను. అని అనుకుంటాడు. కాని పరిపూర్ణము మాత్రము పలుకు (భావము) లేనిది. కనుక నేను అనదు. అహం లేనిది, జీవేశ్వరుల విషయము ఎంతమాత్రము తెలియనిది. కనుక జీవుడనని, ఈశ్వరుడని అనుకొనేది అహమే, నేనే. ఇట్టి "నేను" పరిపూర్ణమందు లేక తోచబడినదని భావము.

— —

103) తొత్రలు తొమ్మిదిగలమే । న్మత్రికి యొకరెంటిలోన మత్రలు నాల్గుం । డెర్రది తెల్లది నల్లది । కర్రిది దానగ్రమందు గల దొక్కతూటూ ॥ అది యెరుకనె పులుగుండేచోటూ ॥ కుర్రా గురుబోధనె గొడ్డాలిచేబూని । మత్రిపులుగుల రెంటి తులచికొట్టర పోసీ ॥ కలదొక్కతూటూ । అది యెరుకనె పులుగుండేచోటూ ॥

పుట-473 పక్షి:

భావము : శిష్యా! తొమ్మిది రంధ్రములుగల ఈ శరీర మనే మర్రిచెట్టుకు రెండు రంధ్రములతో ఎరుపు, తెలుపు, నీలము బూడిదరంగు అను నాల్గు రంగులతోకూడి దాని మధ్య నుండు ఒక అతిసూక్ష్మమైన తూటు (రంధ్రము) కలదు. అదేయొరుకనే పక్షి యుండేచోటు. శిష్యా! గురుబోధనే గొడ్డలి చేతబూని (షోడశాక్షరి మంత్రముచే) మర్రిచెట్టును, దానందున్న పక్షిని రెంటిని కూడ కొట్టినచో రెండూ లేకుండాపోవును.

మరచి = దొలచి

విశేషబావము : నవరంధ్రములతోకూడిన ఈదేహమనే మర్రిచెట్టుకు ఒక రెండు తొర్రలు అనగా నేత్రములందు ఎరుపు, తెలుపు, సునీల, బూడిదవర్ణముతో కూడిన 4 అవరణములతోకూడిన కంటి గుడ్డుకలదు. ఎరుపు-భూతత్వము, తెలుపు-జలతత్వము, నీలము -అగ్నితత్వము, బూడిదరంగు -వాయుతత్వము! అందు మధ్యగా తూటు అనగా సన్నని గొట్టమువలె రంధ్రము ఆకాశ తత్వము. అందులో అపోజ్యోతి తత్వము. ఇదే యొరుక అనే పక్షి. శరీరమును విడిచి ఎగిరిపోయేది కనుక "పక్షి" అన్నారు. ఈ యొరుకయే "గుర్తు" ఎరిగే శరీరమే - మర్రిచెట్టు. మర్రిచెట్టు ఊడల అనేకముగా దింపి చాల ప్రదేశము వ్యాపించి పెనుగాలులకు సైతము పడిపోక నిలచుండును. అట్లే ఈఎరిగేశరీరము నేను నాది అనే మమకారమనే ఊడలతో అనేక కర్మలు చేయుచు ఎన్నటికి నశించక తిరిగి, తిరిగి జన్మకువచ్చుచున్నది. అందుచే దీనిని మర్రి చెట్టుతో పోలికచేసిరి. కనుక గురుమంత్రమన్న గొడ్డలితో మర్రిని, పక్షినిగూడ రెంటిని అనగా గుర్తు, ఎరిగేశరీరము - గుర్తెరిగే శక్తిను లేదని, షోడశీమంత్ర విచారణచే దృఢపడి అర్థూఢమగుటయే

మలచికొట్టుట అనగా దొలచి దొలచి కొట్టుచున్నాడు. అంత యొరుకనే దేహి-దేహములు రెండును లేకపోవును.

— —

104) తనువుతోవచ్చిన యెరుకే। తనువును తనువనుచు తనను తానని యెరుగున్। తనువును బాసిన మీదట తననా దేహమును రెంటిని తానెరుగదపుడూ ॥ అది గనుక తాలేనేలేదెపుడూ ॥ అనుమాన రహితమిందచలాయున్నాని కంటె। తన మాట తలపోయు తనకె సిగ్గయి తనను ॥ తానెరుగదపుడూ। అదిగనుక తాలేనే లేదెపుడూ ॥

భావము : శరీరముతో వచ్చిన యెరుకయే శరీరమును మిథ్యయని, తాను శాశ్వతమైన బ్రహ్మమని తలపోయుచుండును. ఆ యెరుక శరీరమును విడిచినపుడు తన్నుగాని తనశరీరమును గాని గుర్తించలేముగదా! అందుచే శరీరమువలె తానుగూడ (యెరుకగూడ) మిథ్య, లేనేలేదని తెలియవలెను. పరిపూర్ణము ఇక్కడే ఉన్నదని విచారించి తెలుసుకుంటే, ఎరుకలేదను మాటలో అనుమానము లేకుండును. అప్పుడు తనమాట (ఉనికి) తలపోయుటకు తనకే సిగ్గయి తానే లేకుండ పోవును.

— —

105) ఉప్పైన చేజెడుతరువునో। కప్పడు విత్తనము పుట్టినారెంటికి ఈ తిప్పలు దప్పవు ధరయే। తిప్పలు తానెరుగదిట్లు తెలుసుగదోయీ ॥ తను వెరుక బయలులనట్లెడుగోయీ ॥ గొప్పైన గురుబోధ చొప్పన నెరిగి పై। తిప్పలుగలవాన్ని తప్ప దీసిబెచాలు ॥ తెలుసుగదోయీ। తనువెరుకబయలులనట్లెడుగోయీ ॥

భావము : సముద్రములో పుట్టిన తుఫానుచే చెట్టుపడి పోయినశించును. ఆచెట్టుయొక్క విత్తనము పురుగువచ్చి నశించును ఇట్లు విత్తనమునకు, చెట్టునకు ఈతిప్పలున్నవి కాని. భూమికి మాత్రము యేతిప్పలు లేవని తెలుసుగదా ! అట్లే ఈ శరీరము, ఎరుక, పరిపూర్ణము ఈ మూటిని విచారించి ఎరుగవలయును శరీరము, (చెట్టు) ఎరుక, (విత్తనము) భూమి, (పరిపూర్ణము) గా గుర్తింపవలెను. గొప్పదైన గురుబోధచే, తిప్పలుగలవైె రెంటిని అనగా శరీరము, ఎరుకలను ఎరిగి, వాటిని తప్పదీసితే చాలునని తెలుసుకొనుము,

విశేషభావము : చెట్టు, విత్తనము, భూమి, ఈ మూటిలో గల చెట్టు, విత్తనము ఈ రెండు, రాక, పోకలు గలవి. భూమి స్థిరమైనది. దానికి తిప్పలు లేక స్థిరమై ఉన్నది. అట్లే శరీరము, ఎరుక ఈరెంటికి రాకపోకలనే తిప్పలుగలవు. పరిపూర్ణమునకు అట్టి తిప్పలు ఏమియులేవు. కనుక గొప్పదైన పరిపూర్ణబోధచే తిప్పలుగల శరీర మెరుకలరెంటిన్ని లేనివని గురువాక్యముచే రహితపరచుటయే, తప్పదీయుట. అనగా తిరిగి పుట్టకుండగ జేయుట. అని భావము.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
యెరుక మోక్షజ్ఞానము
షష్టమోఽధ్యాయము నకు
భావ విశేష భావములు
సమాప్తము.

# 5. మతాల లక్షణము (29)



106) మతముల వారలు తమ స । మ్మతమైనటువంటి శాస్త్ర మర్యాదలచే । మితమేరపరచుకొని బహు । గతులను కలహింతు రట్టి గతినీకేమిటికి ॥ చపలతజెందేస్థితి నీకేమిటికి । ప్రతిలేని యీ బట్టబయలుండ జూచి సం । తతముతే నెరుక లేదని నమ్మిక ॥ వారిగతినీ కేమిటికి । చపలతజెందేస్థితి నీకేమిటికి ॥

భావము : మతములవారు వారి వారి సిద్ధాంతములను పోషించుకొనుటలో అందుకు సమ్మతమైన శాస్త్ర, ఆగమ, నిగమ వాక్యములను తీసుకొని వారి బుద్ధికి సరిపెట్టుకొనేలా వాటి అర్థములను చెప్పి మితములోనే వారి సిద్ధాంతములను సరిపెట్టుకొని అనేక విధములుగా వారిలో వారు తగవులాడుకొనుచున్నారు. అట్టి గతి నీకు వద్దు. అవన్నియు వారి బుద్ధికి తగిన చపలత వాక్యములే. ఆసిద్ధాంతములన్నియు చంచలత్వమునకే కారణమగును. కనుక నీవు యే ఉపమానముచేత నిరూపణచేయలేని యీ పరిపూర్ణమును శాశ్వతముగా ఉన్నదని జూచి, తేనెరుక యేకాలమందును లేదని నమ్ముము. అట్టిచో అమతములవారి సిద్ధాంత రాద్ధాంతములతో నీకేమిపని ? ఆ విధముగా చపలతజెందేస్థితి నీకెందుకు ? అనగా వాటితో పనిలేదని భావము.

విశేషార్థము : 1) మరణమే మోక్షమని చార్వాకులు, 2) సతతోర్ధ్వగమనమే మోక్షమని క్షపణకులు, 3) విశుద్ధ విజ్ఞాన సంతానోదయము మోక్షమని విజ్ఞానవాదులు 4) సర్వశూన్యతా బోధము మోక్షమని మాధ్యమికులు (బౌద్ధమతశాఖ) 5) బుద్ధ్యాది నవగుణాత్యంతికానుత్పత్తి మోక్షమని తార్కికులు, 6) ప్రకృతి పురుష వివేకము మోక్షమని కపిల (సాంఖ్య) మతానుయాయులు,

 

7) క్షేత్రజ్ఞునకు పరమ పురుష సాయుజ్యము మోక్షమని యోగులు 8 ఆత్మ స్వరూపావస్థానము (ఉనికి) మోక్షమని పాశుపతులు, 9) వాసుదేవాది చతుర్వ్యూహాత్మకుడగు హరియొక్క సారూప్య సాయుజ్యాదులు మోక్షమని సాత్వతులు ఇట్టి మతభేదములు కలవు ఇంకను అనేకమతములవారు తమ తమ బుద్ధికి తోచిన విధముగా శృతులకు వ్యాఖ్యానములు చెప్పి అనేక మతములుగా చీలిపోయి. వారి సిద్ధాంత భిన్నత్వముచే వారిలో వారు తగువులాడుకొనుట, లోకవిదితమేకదా ! అవన్నియు తాను ఉండి విచారించిన మిత వాదములు. తనతో సర్వము ఉన్నది, తానులేకపోతే ఏమీలేదు. అన్న విషయమును చక్కగా విమర్శించుకొనక తన్ను విడచి సమస్త మును విమర్శించిన మితవాదములు, యీ అచల పరిపూర్ణసిద్ధాన్త ములో తనకు పరముగా ఉత్తబట్ట బయలైన పరిపూర్ణము ఉన్నదని గురుముఖతా చక్కగా విచారించి అందులో "నేను" లేనను విషయ మును దృఢపర్చుకొని, తాను లేకుండుటయే యీసిద్ధాంతము యొక్క పరమలక్ష్యము. కనుక ఇందులో మతవాదములకు చోటు లేదు. దీనికి మించినది ఉండనేరదు. కాని యీ సిద్ధాన్తమును గురుముఖతా బహుజాగ్రత్తగా తెలిసికొనవలయును, లేనిచో పాత పాటు అపభ్రంశల వ్రిమాదముచేబౌద్ధమతశాఖయొక్కమాధ్యమికుల వలె భ్రిష్టత్వమునకు కారణమగును.

— —

107) ద్వైతాఽద్వైత విశిష్టులు। సైతురు వినిసైసరెవుడు సైసకపిదపన్। సైతురు క్రమమున వేరన। నాతతమతి జీవశివు లనవి వినబోకూ॥ నేబోధించినది విడబోకూ। పూతమౌ బయలూనూ పొంతచూచి గురునిచే। ద్వైతాఽద్వైత విశిష్ట ద్వైతములను మాను॥ మవి వినబోకూ। నేబోధించినది విడబోకూ॥

భావము : శిష్యా ! జీవుడు-శివుడు వేరని చెప్పగా విశేష బుద్ధిచేత ద్వైత మతస్థులు అంగీకరించెదరు. అద్వైత మతస్థులు అంగీకరించరు. విశిష్టాద్వైతమతస్థులు మొట్టమొదటగా అంగీకరించక తరువాత అంగీకరింతురు. ఇట్టిభేదాభిప్రాయములుతోకూడిన మతవాదములు అంగీకరించకు, మరియు నేబోధించిన యీ బోధను విడ పెట్టకుము. గొప్పదైన పరిపూర్ణమును గురుముఖతా ఉన్నదని జూచి, ద్వైతాద్వైత విశిష్టమతములజోలివిడచి పెట్టుము. నేబోధించిన యీ పరిపూర్ణబోధను విడచిపెట్టకుము.

విశేషార్థము : యీ పద్యమును క్రమాలంకారముచే విడదీసి అర్థసమన్వయము చేయుపలయునని శ్రీకృష్ణ ప్రభువులు "క్రమమున" అన్నపదము యీపద్యములో వ్రాసియున్నారు. కనుక. 1) నాతతమతి జీవ-శివులు వేరన ద్వైత (తులు) విని సైతురు. 2) నాతతమతి జీవ-శివులు వేరన అద్వైత (తులు) విని సైసరెపుడు. 3) నాతతమతి జీవశివులు వేరన విశిష్టులు విని సైసక పిదపన్ సైతురు. అని క్రమాలంకారముచే అర్థసమన్వయము చేయవలెను.

జీవుడువేరు, శివుడువేరు. ఈరెండూ న్వయంభూలే. ఒక దానియందు మరొకటి కలవదు. జీవుడు అవిద్యాపరివృతుడు, కించిజ్ఞుడు. కాని శివుడు (ఈశ్వరుడు) మాయను అధిగమించిన వాడు. సర్వజ్ఞుడు. కనుక శివునియందు జీవ ఐక్యము సంభవము గాదు. ఈశ్వరునియందు జీవులుసాలోక్య(ఆలోకమునందుండుట) సామీప్య-(దగ్గరగా నుండుట) సారూప్య (అట్టిరూపముతో అనగా శంఖచక్రగదాద్యాయుధ చతుర్భుజుడై యుండుట, ఆతరువాత సాయుజ్యము-(అనగా విష్ణువునందైక్యముకాదు, సమీపమునందే

శాశ్వతముగా తిరిగి జన్మకు రాకుండ ఉండిపోవుట, ఇది ద్వైత సిద్ధాన్తము.

జీవుడువేరు శివుడువేరు అంటే అద్వైత సిద్ధాంతులు అంగీకరించరు. "జీవోబ్రహ్మైవనాఽపరః" ఉన్నది శివతత్వము (బ్రహ్మతత్వము) ఒక్కటే. అవిద్యచే జీవులు వేరని కర్మబద్ధులమని భ్రమించుచున్నారు. జ్ఞానముచే అట్టి భ్రమతొలగి "అహం బ్రహ్మాస్మి" జీవైక్యము జరుగునని వీరి సిద్ధాంతము.

సృష్టికి పూర్వము విష్ణువు (బ్రహ్మము) ఒక్కటి మాత్రమే ఉన్నది. రెండోదిలేదు. కాని కొంతకాలము తరువాత విష్ణువు నుండి మాయాపరిచ్ఛిన్నతచే జీవులు విడిపోగా నిప్పునుండివిస్ఫులింగముల వలె విడిబడినవి. అలా విడిపోయిన జీవులు తిరిగి విష్ణుమూర్తి యందు ఐక్యత జరుగదు. (పాలనుండి విడివడిన వెన్నవలె) అట్టి జీవులు ద్వైత సిద్ధాంతములో చెప్పినట్లుగా సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు చెందును. ఇది విసిష్టాద్వైతసిద్ధాంతము ఇవన్నియు మితవాదములే. వారుచెప్పిన బ్రహ్మతత్వము కేవలము ఒక్కటి అనరాదు. విడదీయబడని రెంటి సమన్వయ స్వరూపము అదే బ్రహ్మ + కర్మ. ఇందు కర్మ ఉన్నది గనుకనే సృష్టి కారణమగుచున్నది. అట్టి కర్మస్వరూపముకానిది పరిపూర్ణము. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులు" పూతామౌబయులును" అని పద ప్రయోగము చేసిరి. ఇట్టి పరిపూర్ణమును గురుముఖతా ఉన్నదని గుర్తించవలెను అని చెప్పుటయే "ఉండజూచి" అన్న పదమునకు అర్థము.

— —

108) కొందరు దశవిధనాదము। లందు నవకపంచకంబున చక్రా।లందునలక్ష్యధ్యాన।బందునహంసందుబుద్ది నాటింతునందున

రోయీ ॥ యోగములందు నటియింతురోయి । ఇంది సిద్ధులచాత
నానందింతురు కొంద । రందారి మనసీ బోధందెనీ వుండూము ।
నానందింతురోయీ । యోగములందు, నటియింతురోయీ ॥

భావము : శిష్యా ! కొందరు దశవిధ నాదములందు (యోగముచే) ఆనందము పొందెదరు. మరికొందరు భూతాకాశము మొదలైన ఆకాశ పంచకమందు మనస్సు విహరింప జేయుదురు. మరికొందరు షట్చక్రములద్వారా హంసను పయనింపజేసి ధ్యానము ద్రచే తారకదర్శనము చేయుదురు. హఠయోగాదియోగములు చేసి సిద్ధులపొంది ఆనందింతురు. ఇట్లు అందరు కొన్ని కొన్ని విధానములచే అదేమోక్షమని ఆనందించుచుందురు. నీవుమాత్రము అట్టి పోకడలు పోక యీ బోధయందే స్థిరత్వమును పొందుము.

విశేషభావము : దశవిధనాదములు— 1) జలధిఘోష, 2) భేరీ, 3) చిణీ, 4) మృదంగ, 5) ఘంటా, 6) కాహళ, 7) కింకిణీ, 8) వేణు, 9) భ్రమర, 10) ప్రణవనాదములు.

నభపంచకము :- 1) భూతాకాశము, 2) తత్వాకాశము, 3) నిరవయాకాశము, దహరాకాశము ) మహాకాశము.

నభపంచకము :— ఆకాశ పంచకము.— జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

నభపంచకము :— నభపంచకమందు—అనగా జ్ఞాత, మనస్సు బుద్ధి, చిత్త, అహంకారములను జ్ఞాతయందు లయపర్చి ఆనందించుట అనికూడ భావము.

109) కొందరు ముద్రలుగనవలె । నందురు మరికొంద రధికమందురు ద్రష్టన్ । కొందరు భజనే తెస్సని । యందురు యివియున్ని యెతకె, నని తెలుసుకొనుమీ ॥ నీకివియాల పని

లేదు వినుమీ। ముందుగ పరిపూర్ణమున్నది. గని గుర్తు। నెందుండ కుండా దాన్నెగురగొట్టితె చాలు ॥ నని తెలుసుకొనుమీ। నీ కివి యాల పనిలేదు వినుమీ ॥

బావము : శిష్యా ! కొందరు ముద్రలువేసి యోగము చేయవలెననియు, మరికొందరు ద్రష్టఅయిన ఆత్మయందేలయము చెందవలెననియు, నామసంకీర్తనమే గొప్పదని కొందరు ("కలౌ స్మరణాన్ ముక్తిః) అని అనేకరకములుగా భావింతురు. కాని ఇవి అన్నియు భ్రమరూపమైనవేకాని సత్యము కానేరదు. కావునవాటితో నీకు పనిలేదు. ఏసృష్టి లేనప్పుడు పరిపూర్ణము మాత్రమే యున్నదనినే చెప్పిన విధముగా విచారించి గుర్తు అయిన "నేను" సర్వత్ర ఉన్న పరిపూర్ణములో లేనేలేదని "నేను'' లేకుంటే అదే చాలునని తెలుసుకొనుము.

విశేషబావము ! ముద్రలు-దశవిధముద్రలు. కుండలినీ జాగరణకై ఈదశవిధముద్రలను అభ్యసించవలయును. 1) మహాముద్ర, 2) మహాబంధము, 3) మహావేధ, 4) ఖేచరి, 5) ఉడ్యాణము, 6) మూలబంధము, 7) జలాంధరబంధము, 8) విపరీతకరణి, 9) వజ్రోలి, 10) శక్తిచాలనము. ఈ ముద్రాభ్యాసము వలన కుండలినీ జాగరణ చెందుటయేకాక అణిమాది అష్టసిద్ధులు కూడ కలుగును.

— • —

110) దేవుణ్ణి నిన్ను ఋరుగవు। నీవిప్పటి కెట్టివారొనే దెల్పెదనీ। కేవ త్రిబోధలెందుకు। కావున దేవుణ్ణియిదిగో కనుగొనవోయీ। నామరూపకర్మా లేవోయీ। నీవాదేవునిలోన నిను లెస్స వెదకిన। న్నావలి ముచ్చట నడుగోయీ తెల్పెద ॥ కనుగొనవోయీ। నామ రూప కర్మాలేవోయీ ॥

భావము : శిష్యా ! దేవుడు అనగా ఎవరో, నీవు ఎవరో నీకు ఇంతవరకు తెలియదు, మీఇద్దరుగురించి ఎట్టివారో నేను తెలియ పర్చెదను. నీకు మరేయితర వెర్రిబోధలు అక్కరలేదు. కావున యిదుగో దేవుడు, చూడుము. యీదేవునికి ఎంతమాత్రము నామ రూప, కర్మలులేవు. కనుక ఆదేవునియందు నీవు ఎక్కడ ఉన్నావో బాగా విచారించిచూడుము. ఆతరువాతనన్ను డుగుము. పైముచ్చట తెలియపరచెదను.

విశేషభావము : దేవుడు అనగా నామ, రూప, కర్మలు లేనివాడని శాస్త్రము నిర్దేశించుచున్నది. అట్టి నామ, రూప, కర్మ లెంతమాత్రములేనివి పరిపూర్ణము ఒక్కటి మాత్రమే. ఇది సర్వత్ర నిండి, ముఖ్యగుర్తు ందులేనిదై, బుద్ధికిగూడ గోచరించనిది. ఇట్టి దానియందు అణుమాత్రమైన యితరము ఏమీలేనివి. కనుకనే ఉత్తది, ఉబట్టబయలు అన్నారు. కనుక అట్టిదేవునియందు అనగా పరిపూర్ణ పరబ్రహ్మమునందు "నేను" అను తెలివిలేక గుర్తు ఎక్కడైనా ఉన్నదా ? అని గురుముఖతా సంపూర్ణముగా విచారిస్తే "నేను" ఎక్కడాలేను అని తెలియగలదు. "నేను" భ్రమరూపము. కలవలెలేక తోచబడినది కనుక, లేనేలేను అని తెలియపడగలదు. నేనులేనని తెలిసిన తదుపరి అడిగేవారెవరు ? ఏమనిఅడుగవలెను? ప్రశ్నవేసేదేలేదు. ప్రశ్నేలేనప్పుడు, చెప్పుటకు అవలిముచ్చట యేమియుండును ? అనగా ప్రశ్నించుటకు నీవులేవు. చెప్పుటకు నేనులేను అని భావము. పరిపూర్ణము మాత్రమే యున్నది. దీనికే శ్రీకృష్ణప్రభువర్యులు "నీవాదేవునిలోపల (పరిపూర్ణమందు) నిను లెస్సవెదకి, నన్నాకలిముచ్చట ఆడుగోయీ తెలిపెద" అని ఈ పద్యములో విశ్లేషించినారు.

— —

111) మానవుడు చేయబూనిన। దానిని తాదెలిగి చేయ వగునని మదిలో। నేనెఱిగి నీకు జెప్పితి। పూనము రుచి బుట్టదేని, పోనీ నీమనసు ॥ రుచిపుట్టితెపూనూ నీమనసూ। నేనేమి యనబోతె నీకేమీదోచునో। లేని నిష్ఠూరము లేకుండుటె లెస్స ॥ పోనీ నీమనసూ। రుచిబుట్టితె పూనూనీమనసూ ॥

బావము : శిష్యా : మానవుడు తాను చేయబూనిన పని యొక్క మంచి చెడులు బాగా విచారించి. ఆపని వలన తన కార్య సాధన జరుగుతుందా ? లేదా ? యని బాగుగ విచారించే చేయవలె నని పెద్దలవలన తెలుసుకొని నీకు చెప్పుచున్నాను. కనుక జన్మ రాహిత్యమునకై నీవుచేసే ఈపని మంచిచెడ్డలు బాగా విచారించి, ఇది చాలమంచిది. ఇదే సరియైన విచారణ అని నీకు తోచినచో ఈ బోధయందు వర్తించుము. అట్లు తోచకపోతే నీమనసుకు నచ్చిన విధానములోనే యుండుము. నేనుఏమిచెప్పినచో, నీకేమితోచునో లేని నిష్ఠూరములేకుండుటయేబాగు. నీమనసుకునచ్చినవిధానమును అవలంబింపుము.

విశేషబావము : జ్ఞానము సంస్కారజన్యమేకాని ప్రయత్నమువలన ఏర్పడేదికాదు. గతజన్మసంస్కారము సరిపడునంత లేకపోయినవానికి గురువు ఎన్నివిధములుగ చెప్పినను పుట్టదు. అట్టివానిని గురించి ఈపద్యము చెప్పబడినది. "నీవు విచారించి నేచెప్పిన యీ పరిపూర్ణ బోధవలన పునరావృత్తిరహితమగునని లెస్సగా నీమనసుకు సరిపోయినచో యీబోధయందు ఉండుము, నీమనసుకు సరిపడనిచో నీమనసుకు నచ్చబడిన మరోవిధానమునే అవలంబింపుము" అని గురుమూర్తి శిష్యుని గురించి చెప్పిన పద్యము.

— —

112) పంచదశాక్షరముల ప్ర। పంచము తా నుద్భవించె ప్రణవాక్షర ముం। దంచు శృతులెన్నెదాన్నెరు। కంచని నీవెరిగి యరుగుము తలాముదీనన్ ॥ నిల్పకు మెరుక నచలాము లోనన్। చంచాలమతిచేత చతురాక్ష రెక్కువం। చెంచేదవెందుకు యిది నమ్మకెరుగుమీ ॥ యతలాముదీనన్। నిల్పకు మెరుకనచలాము లోనన్ ॥

భావము : శిష్యా : ఏబది అక్షరములు, పంచభూతయుత మైన ప్రపంచము, తాను ప్రణవాక్షరమైన "ఓం"నుండే పుట్టినదని శృతులు చెప్పుచున్నవి. అట్టి "ఓం" నే ఎరుకయని నీవు తెలిసి। అట్టి తెలివిచేతనే పరిపూర్ణపరబ్రహ్మమును గురుముఖతా గుర్తించి। అట్టియెరుక పరిపూర్ణములోలేదని లేకుంతపొమ్ము. అట్లుగాక చపల చిత్తుడవై చతురాక్షరి అయిన "ఓం" ఎక్కువైనది (బ్రహ్మమని) తలంచెదవెందుకు ? యిది నమ్ముకుము. అచలమునుయెరుగుము. దీనియందు "ఓం" అయిన ఎరుక ఉన్నది అని నిలపెట్టకుము.

విశేషభావము : చతురాక్షిరి అనగా అ, ఉ, మ, (అర్థ మాత్ర) అనునాల్గు అక్షరములకూడిక 'ఓం', ఈఓంకారమునుండియే ఏబది అక్షరములు (సంస్కృతాక్షరములు 50) న్ని, దానివలన సమస్త వాక్ ప్రపంచమున్ను, మరియు పంచభూతములతోకూడిన వస్తుప్రపంచమున్ను కలిగినవని శృతులయందు చెప్పబడినది. అట్టి ఓంకారమే జ్ఞానము, బ్రహ్మము, నేను అనునవి. ఇవన్నియు జ్ఞానము యొక్క (తెలివి యొక్క) రూపాంతర ములే కనుక 'యెరుక' అని దీక్షిత సిద్ధాంత నిర్దేశము. జ్ఞానము వలన జ్ఞేయము కలుగుచున్నది. కనుక జ్ఞాత, జ్ఞేయము అయిన ఓంకారమును 'యెరుక' అని చెప్పబడినది. పరిపూర్ణము అంతట నిండియున్నదైనను జ్ఞానమునకు దొరకనిది అగుటచే పరిపూర్ణము

జ్ఞేయవస్తువు కాదని గ్రహించవలెను. అనగా జ్ఞానమైన ఓంకారము పరిపూర్ణములో లేదనియు, అందుకే పరిపూర్ణము "ఉత్తది" అని నిర్వచించినారు. కనుక పరిపూర్ణములో ఎరుకలేదని తెలియవలెను. చంచలబుద్ధితో పరిపూర్ణములో ఎరుకయున్నదని యెన్నడును అనరాదు.

— —

113) యెరుక జడమజడమిజగ । మరయగ పరిపూర్ణమేమి యనరానిది యా । యెరుక జగములస్థిరములు । పరిపూర్ణము శాశ్వతపుదీపాటించికనరా ॥ కావా రెండీపాటివి వినరా ॥ గురుముఖ మున వీట్నె నరుడు గుర్తెరుగునో । తిరిగి పుట్టడు. వాడీధరపై మునుపటివలె । పాటించి కనరా ॥ కావా రెండీపాటివి వినరా ॥

బావము : శిష్యా । యెరుక, జగత్తులు రెండూ విచారించగా జడము, అజడముగానుయున్నవి. విచారించగా పరిపూర్ణము జడముకాదు. అజడముకాదు. ఆయెరుక జగములు శాశ్వతమైనవి కావు. పరిపూర్ణము శాశ్వతమైనది. ఈ విధముగా విచారించి తెలుసుకొనుము. యెరుక - పరిపూర్ణములు రెండూ విచారించి చూడుము. గురుముఖముగా యే మానవుడు యీ విధముగాగుర్తించునో అట్టివాడు పూర్వమువలె భూమిమీద తిరిగిపుట్టడు. విచారించిచూడుము.

విశేషబావము : యెరుక-తాను కదలకపోవుటచే జడ స్వభావముగను, సమస్తమును కదిలించే సత్తా కలిగినదగుటచే అజడమైనది (చలించునది) గను రెండువిధములుగనున్నది. అట్లే యెరుకవలన యేర్పడిన జగత్తు కదలుచున్నట్లు కనిపించుటచే

చలించునదిగను (అజడము) స్వతస్సిద్ధముగా కదలని కారణముచే జడస్వరూపముగను రెండువిధములుగను ఉన్నది. కనుక ఈ పద్యములో శ్రీకృష్ణప్రభువులు "యెరుకజడము జడమీజగము" అని పద ప్రయోగముచేసియున్నారు. అనగా యెరుక జగములు రెండు జడములు. అని అర్థము. ఇక్కడ క్రమాలంకారము సూచించరాదు యెరుక జగములు రెండూ, జడముగాను అజడముగాను రెండు రూపములుగను ఉన్నవి. అనిఅర్థము చెప్పవలెను. పరిపూర్ణము జడముకాదు. అజడముకాదు. కనుక ఏమీ అనరాదు. ఇట్టిది అని నిర్ణయించుటకు జ్ఞేయపదార్థముకాదు. కనుకనే గురుముఖముగా యెరుక - పరిపూర్ణములు ఇట్టివని గుర్తించి, అ తెలిసిన తెలివే' "నేను" అది లేనిది పరిపూర్ణము, శాశ్వతమైనదని తెలుసుకొని తానులేకపోవుటే పునరావృత్తి రహితము.

114) కొందరు భూతములై దిటి। యందున చిత్తంబునుంతు రధికములనుచున్ । కొందరు యేమియులేదని । యందును గుర్తెరుగుమిన్ని, యపశబ్దములేరా ॥ యివి నిలువానివని తెలియవలెరా । యెందరెన్నన్నా నీకెందుకు బయలును । ముందూగ గని గుర్తెందుండనివకవ్వి ॥ యపశబ్దములేరా । యివి నిలువానివని తెలియవలెరా ॥

భావము : శిష్యా ! కొందరు ఆకాశాది పంచభూతములే గొప్పవని దైవముగా వాటియందు మనస్సు ఉంచుకొనుచున్నారు. మరికొందరు సమస్తము యేమీలేదని నాస్తిక భావజ్ఞులై యుందురు. ఇవన్నియు అపశబ్దములు, తప్పుడుమాటలేయని తెలుసుకొనుము, అవన్నియు సంపూర్ణమైన శాస్త్రవాచములో నిలువవని తెలుసుకొనుము. యెందరు యెన్ని సిద్ధాంతములు చెప్పినా నీకెందుకూ.

అన్నిటికి ముందుగా పరిపూర్ణమై శాశ్వతమైనది కలదని విచారించి అవిచారించిన తెలివి (గుర్తు) "నేను", పరిపూర్ణములో లేదని లేకుండా పొమ్ము. మిగిలినమాటలన్నీ తప్పైనమాటలేయని నమ్ముము.

— —

115) కొందరు కర్మముతో బా । గందురు మరికొందరెక్కు వందురు తనువున్ । కొందరు ప్రాణము లధికము । లందురు నీ కిట్టి వట్టియాశలేమిటికి ॥ వారితో పొందు జేశేవేమిటికి ॥ యెందరీ మాటలనెన్ని యీబోధ । కింది వెతానిపై కెక్కేవిగావిట్టి ॥ యాశా లేమిటికి । వారితో పొందుజేశేవేమిటికి ॥

భావము : శిష్యా ! కొందరు కర్మయేగొప్పదని అందురు. ("కర్మమె నరులకు దైవము" అని భారత వచనం). మరికొందరు శరీరమె గొప్పది అనియు, కొందరు పంచప్రాణములే అధికమైన వనియు అందురు. ఇట్టి వట్టి యాశమాటలు వద్దు. ఇట్టి వారితో స్నేహమువద్దు. యెందరు యెన్నిమాటలన్నా, అవన్నియు ఈ బోధ క్రింది మాటలేకాని పైమాటలు కావని తెలియుము.

— —

116) తను వెరుకలు రెండొక్కటి । యని యనరాదనుచు కొందరందురు భువిలో । తను వెరుకలతో నొక్కటి । గనరాకుంటేను రెండు గనరావోయన్నా ॥ రెండొక్కటి వినరామాయన్నా । అను మానమికయాల అందాకి మాటల। వినబోకనే బోధించినరీతినెప్పుడు॥ గనరావోయన్నా । రెండొక్కటి వినరా మాయన్నా ॥

భావము : శిష్యా ! కొందరు దేహి _ దేహములు రెండు ఒక్కటియని యనరాదు అందురు. కాని అది నిజముకాదు. తనువు

లేకుంటే యెరుకకు ఉనికిలేదు. యెరుకలేని తనువులేదు. కనుక తనువెరుకలలో యేఒక్కటి లేకున్ననూ రెండూలేనట్లేగదా! కనుక తను వెరుకలు రెండునూ ఒక్కటే. వినుము. అనుమానములేకుండగ అందరిమాటలు (సిద్ధాంతములు) వినబోక, నే బోధించిన విధముగా ఎప్పుడూ విచారించుము.

విశేషభావము : శరీరములేకుండగ (ఉపాధి లేకుండగ) ఆత్మకు ఉనికిలేదు. ఆత్మలేనిదే ఉపాధి నిలవదు కనుక శరీరము ఆత్మ యీ రెండును ఆశ్రయి-ఆశ్రయములు. రెండును అవినాభావ సంబంధముకలవి. అనగా ఒకటి ఉంటే రెండునూ ఉండును. ఒకటి లేకపోతే రెండూ లేకుండపోవునని భావము. తనువు అశాశ్వతము. ఆత్మశాశ్వతము అనుమాటలచే యీ రెండును భిన్నస్వభావముకలవిగా కనుపించినను, ఆత్మనుంచి అయిన జగత్తు ఆత్మకు భిన్నమగునా? సంపూర్ణమైన విచారణ గురుముఖముగా విచారించినప్పుడు ఆత్మ-జగత్తులు రెండునూ ఒక్కటే (చెట్టు - విత్తనముల వలె) అని తెలియబడగలదు.

—— ——

117) కన్నుల ప్రక్కలవేళ్లిడి । చిన్నగ భ్రూమధ్యమందు దృష్టినిలిపి యుం । దున్నది వెన్నెలలో బయలన్నా । కనుమందు రెరుకె, అది నిలువదోయీ ॥ తనువుతో బోయేదని తెలియుమోయీ। యెన్నితనువులు వచ్చియరిగిన ఋణకక । వున్నా బయలిది జూచి వుళ్లక్కెరుకను మాను ॥ మదినిలువదో యీ । తనువుతో బోయ్యే దని తెలియుమోయీ ॥

భావము : శిష్యా ! కొందరు కన్నుల ప్రక్కవేళ్లు పెట్టి కన్నులుమూసి లోదృష్టిచే భ్రూమధ్యస్థానమందు దృష్టిని నిలపెట్టి

చూచినచో అంతు వెన్నెలకలదు, ఆదేలోబయులు, దానినేచూడుము అదే పరమాత్మయని చెప్పుదురు. కాని అది శాశ్వతమైనది కాదు. శరీరముతో పోయేదేకదా ! అందుచేత అది నమ్మకుము. యెన్ని ఉపాధులు వచ్చినా యెన్ని ఉపాధులుపోయినా, యిసుమంతైన మార్పు లేకుండగ ఎప్పటికి ఒక్కలాగేయున్న పరిపూర్ణమును జూచి యెరుకలేనిదని తెలిసి లేకుండుము.

— —

1.8) జనులాత్మానుభవంటై । నను ముక్తని పల్కిరిమ్ము నమ్మకు మెఱుకే । కనరాదెచ్చట గురుకృప । ననుభవ మెవ్వరికి పైన, ఆమాట నిజమో ॥ అనుభవ ముళ్ళకిక్కి మాట నిజమో । విన జెప్పుమీరెండు వివరించి పైమాట । వినినే ముందరిబోధ వినిపింతు వేవేగ ॥ ఆమాట నిజమో । అనుభవముళ్ళకిక్కిమాట నిజమో ॥

బావము : శిష్యా ! జనులు ఆత్మ సాక్షాత్కారమైనచో మోక్షమనిపల్కిరి. అదినమ్మకుము, అదియును యెరుకే( భ్రమయే) గురుకృపచే యెరుక ఎచ్చటను కనరాదు. ఆత్మసాక్షాత్కారము ఎవరికి ? ఆత్మ సాక్షాత్కరించుట అబద్ధము. సాక్షాత్కారము నిజమా? లేక ఆత్మను చూచుట జరగనిపని, యీ మాట నిజమా ? విచారించి నాకు వినజెప్పుము. అ మాట నేనువిని ముందుచెప్పబోయే బోధను వినిపించెదను.

విశేషబావము : శ్లో॥ రూపం దృశ్యలోచనం దృక్తద్దృశ్యం దృక్తుమానసం । దృశ్యాధీవృత్తయస్సాక్షి । దృగేవనతు దృశ్యతే ॥ రూపముచూడబడునది_కన్ను చూచునది. కన్ను చూడబడునది_మనస్సు చూచునది. మనస్సుచూడబడునది_సాక్షియగు ఆత్మచూచునది. ఆత్మ సర్వదాచూచునదే కాని చూడబడునదికాదు.

అనగా దృశ్యము ఎన్నటికిని కాదు. అట్టిచో ఆత్మ సాక్షాత్కారము జరుగుట అబద్ధమేకదా ! ఆత్మ ప్రతిబింబము చూడబడునేమోకాని ఆత్మను చూచుటకు రెండోవారెవరు? కనుక అనుభవముళ్ళక్కి ఈ మాటే నిజము.

— —

119) తననుతాగననిదమోక్షం । బని పల్కిరిగాని జనులు అది నమ్మకుమీ । తనను తాబట్టబైటను । గనబోయితె తనకుదానె, కాన రాదోయీ ॥ విశ్వము తనకు కానతాదోయీ । తననుండైనదికనుక తాను విశ్వము రెండు । కనుపించుటుళ్ళక్కి గావున తనకు దా ॥ కానరాదోయీ । విశ్వము తనకు గానరాదోయీ ॥

భావము : శిష్యా ! తన్నుతాను చూచుటయే మోక్షమని జనులు పల్కిరి. అదినమ్మకుము. పరిపూర్ణ పర బ్రహ్మములో తాను ఎక్కడ అని చూచినచో ఎక్కడనూలేదు. పరిపూర్ణమును చూడబోయి తనకుదానే లేకపోవును. ఈ విశ్వమంతయు తననుండైనది కనుక విశ్వము తాను రెండూ లేకపోవును. కనుక తన్నుతానుచూచుట ఉళ్ళక్కి అని తెలియుము.

120) మాయగదా లేనియహం । బాయగదా తనకుదానె అచలము మేర్పా । బాయగదా మాయనలేం । బాయగదా మాయ చిత్రమాయగదోయీ ॥ సంశయమంత పాయగదోయీ । మాయ సమూలము మాయజూస్తుండంగ । మాయమైపాయును మాయకె యిది చిత్ర ॥ మాయగదోయీ । సంశయమంత పాయగదోయీ ॥

భావము : శిష్యా ! మాయయే యీలేని అహమయ్యెను గదా : అచలము (పరిపూర్ణము) తనకుదానె స్వతస్సిద్ధముగ

ఉన్నదిగదా ! మాయ అనగా లేనిది అనేగదా ! మాయ యెంత చిత్రమైనది ! సంశయమంతపోయినదిగదా ! లేని నేను (మాయ) చూస్తుండగనే సమూలముగా యీమాయ లేకుండ పోయినదిగదా। యిది యెంత విచిత్రము:

విశేషభావము : మాయ అనగా యా "మా" సమాయ. అనగా యేదైతే లేనిదో అదిమాయ అని అర్థము. కనుక మాయ అనగా లేనిది అని అర్థము. యీమాయ లేనిదే తోచబడినది. అనగాముందు (భవిష్యత్) లోలేదు. వెనుక (భూతకాలమందును) లేదు. ప్రస్తుతము (వర్తమానమునందు) ఉన్నది. భూతభవిష్యత్తులలో లేక ఇప్పుడు ఉంది అంటే నిజానికి ఇప్పుడుకూడ లేదనే అర్థము. "ఆదావంతే చయన్నాస్తి। వర్తమానేపి తత్తథా" అన్నారు శ్రీ విద్యారణ్యస్వామి. కాని ఉన్నట్లు తోచబడుచున్నది. యీమాయ అనిర్వచనీయమైనది. అవ్యక్తము. ఈఅవ్యక్తము బ్రహ్మమునందు గర్భితమైయున్నది. ఉన్నట్లుతెలియబడదు. కేవలము బ్రహ్మమే అయితే సృష్టి ఉండదు. కేవలము మాయ ఉండదు. కనుక బ్రహ్మ + అవ్యక్తముల సమ్మేళనపదార్థమే బ్రహ్మము. బ్రహ్మము నుండి మాయ విడదీయబడనిది కనుకనే భగవద్గీతలో "మమ మాయాదురత్యయా" నాయొక్క మాయ దాటశక్యము కానిది. అని చెప్పబడినది, మాయమిధ్య అయినను బ్రహ్మము నందే విడదీయరాకుండ ఉన్నది. శ్వేతాశ్వతరో పనిషత్తులో "మాయాంతు ప్రకృతిం విద్యాన్ మాయినంతుమహేశ్వరమ్" అని చెప్పబడినది. ఈమాయనుండే సమస్త జగత్తు ఉద్భవించుచున్నది. నేను (అహం) మాయనుండే ఏర్పడినది కనుక అహమనగామాయ అనగా లేనిది. పరిపూర్ణము ఒక్కటే. అట్టి మాయలేని పరిపూర్ణము ఉన్నదని గురుముఖతా గుర్తించిన 'నేను' సమస్త విశ్వముతోకూడి

మాయమైపోవుచున్నాను అనగా లేకపోవుచున్నాను. అనిఅర్థము లేనిది ఉన్నట్లుగా భ్రమింపజేయుట, దానికి బద్ధుడైపోవుట, అదే ఉన్నదని భ్రమజెందుట ఎంత విచిత్రము!

(21) లేనిఅహముతున్న బయలును। లేని ప్రపంచమును తనను తెన్పగ తనలోతాను విముర్శించినయా। లేనివి లేకుండు నవలలేము యేమాటా॥ యిట్లనన్నైన లేదుయేమాటా। లేనియహమీ బైటలేనేలేదిదిజూచి। లేనిది కలదాని లేనిమాటాడేవూ॥ లేదూ యేమాటా। యిట్లనన్నైన లేదుయేమాటా॥

భావము : శిష్యా! లేని అహము (నేను), లేని ప్రపంచ మును తనను ఉన్నబయలును తనలోతాను బాగుగవిమర్శించినచో లేనివి లేకుండాపోవును. అతరువాత యేమాటాలేదు. లేనివి లేవు అనుచెప్పుటకూడ (నేనులేనుకనుక) జరుగదు. లేనినేను పరిపూర్ణ ములో లేదనిజూచి లేనినేను కలనని అబద్ధపుమాటాడేవూ. లేనిమాట మాటాడకుము.

విశేష భావము ! శాశ్వతమైన పరిపూర్ణమును నేనైన జ్ఞానముచే గుర్తింపబడదు. అనగా జ్ఞానము జ్ఞేయముకాని పరి పూర్ణము అని తెలియుబడుచున్నది. పరిపూర్ణము సర్వత్ర ఉన్నది. అందులో జ్ఞానము లేదుకనుక అది జ్ఞానముచే గుర్తింపబడలేదు. అట్టిచో పరిపూర్ణములో జ్ఞానము లేదనేకదా అర్థము. సర్వత్ర ఉన్నది పరిపూర్ణము, అందులో జ్ఞానములేదు. అనగా జ్ఞానము అయిన "నేను" ఎచ్చటనులేదు. నావల్ల ఏర్పడిన ప్రపంచము నేను లేక పోయినచో అదికూడ ఉండదుకదా. ఇట్లు చక్కగా విమర్శించితే లేని నేను, ప్రపంచము లేవని ఉన్నట్లుగా కలవలె తోచ బడినవే కాని ఉన్నవి కావని తాను లేనని దృఢపరచుటయే తాను లేక

పోవుట. తానేలేకపోవుటవలన "నేను" లేను అని కాని, పరిపూర్ణమే ఉన్నదనుటకాని యేమాటయు ఉండదు.

---

122) పరిపూర్ణమెరుకలెట్టివో । గురుముఖమున రెంటిని తెల్స గుర్తెరిగెరుకన్ । సరిపుచ్చుకొన్న మృషయని పరిశుద్ధపు బోధయని పాటించికనరా ॥ శివరామూల పద్ధతియిదెరా ॥ నరులు కొందరువల్కి రెరుకను భ్రమింగి యా । పరిపూర్ణమయ్యే మంచెరు గాక, చెడుటకై ॥ పాటించికనరా । శివరామూలపద్ధతి యిదెరా ॥

భావము : పరిపూర్ణము అనగా ఏదో, ఎరుకనగా ఏదో రెంటిని గురుముఖముగా తెల్సగా గుర్తెరిగి, ఎరుకలేనిదని సరిపుచ్చుకొన్నచో అదేపరిశుద్ధమైన పరిపూర్ణబోధ. యిదే శ్రీ శివరామ దీక్షితులవారి సిద్ధాంతము. ఇది యెరుగక కొందరు నరులు ఎరుకను భ్రమింగి పరిపూర్ణమయ్యేదము అంటారు. అదిచెడిపోవుటకే.

విశేషభావము : పరిపూర్ణము జ్ఞానముచేగుర్తెరుగబడదు. అనగా వేదములో పరిపూర్ణము గురించి చెప్పబడలేదు. ఎందుచేత ననగా-వేదము పురుషోత్తముడు అయిన "ఓం"కార స్వరూపమునే తెలియపర్చినది. అంతవరకే శబ్దగమ్యము. దానికి అవలగానున్న పరిపూర్ణము శబ్ద,స్పర్శ, రూప, రస, గంధాములు ఇసుమంతైన లేనిది కనుక శబ్దముచే (జ్ఞానము) పరిపూర్ణమును చెప్పలేము. కనుక వేదాంత అతీతమైనది. కనుకనే పరిపూర్ణమును, ఎరుకను గురుముఖముగా మాత్రమే గుర్తెరుగవలయును. అట్లు గుర్తించినచో యెరుకలేదని, పరిపూర్ణము మాత్రమే సర్వత్ర ఉన్నదని తెలియబడి తానైన యెరుక లేకపోవును. అదే అచల పరిపూర్ణసిద్ధాంతము,

లేక శ్రీ శివరామదీక్షితులవారిచే స్థాపన చేయబడిన బృహద్వాశిష్ఠసిద్ధాంతము. యెరుకను భ్రమించుట-అనగా భ్రూమధ్యస్థానాంతర్గత చైతన్యమే యెరుకనియు, అది సహస్రారమందు లయమొందుటయే (సమాధిస్థితి) యెరుకను భ్రమించుట అనియు, అదే పరిపూర్ణస్థితి అనికొందరు భ్రమించిరి. అది తిరిగి జన్మకారణమే కాని జన్మరహితముకాదు.

— ० —

13) బిందువు తనువున బుట్టును । బిందువు తను వింద్రియములబృందంబసువుల్ । అందముగ గలుగనివి దీ । నందున బుట్టినవో తెలియ నజునికి తరమా ॥ మూలములేనివని । తెలుసుకొనుమా । అందుకె బయలున్న దరసి మూలములేని । బింద్వాది కంబుల పేరూ దల్వకు తెలియ ॥ నజునికి తరమా ॥ మూలములేనివని తెలుసుకొనుమా ।

భావము : శిష్యా ! బిందువు (శుక్లము) శరీరములో పుట్టును. ఈ బిందువు, శరీరము, ఇంద్రియ సమూహము, ప్రాణములు ఇవన్నియు దేనందుబుట్టినవో బ్రహ్మకునైన తెలియశక్యము కాదు. ఇవన్నియు మూలములేనివని తెలుసుకొనుము. అందుకే శాశ్వతమైన పరిపూర్ణమునున్నదని గుర్తించి, లేక యేర్పడినబిందువు మొదలైన సమస్తమును విడచివేయుము. వాటిపేరు తలవకుము.

— —

14) జనులనిరుదేవుడెవరికి । కనరాడని నామరూపకర్మజననముల్ । గన నతనికిలేవనియూ । జనవాక్యము బయలుకెషము సహజమే వినరా ॥ అనుమానము టాలించి కనరా । కనినాము

రూపాదికములున్న యెరుకాను । వినబోక కనబోక విడచిపెట్టర పోనీ । సహజమే వినరా । అనుమానము చాలించికనరా ॥

భావము : శిష్యా ! దేముడు ఎవరికి కనిపించువాడు కాడనియు, నామరూప క్రియలు లేనివాడనియు, జననమరణములు అతనికి లేవనియు, జనులనుచున్నారు. ఆ జనవాక్యములు పరిపూర్ణమునకు మాత్రమే సహజముగాయున్నది. అనుమానములేకుండగ విచారించుము. యెరుకకు నామ, రూప, జననమరణాదులు కలవని చక్కగా విచారించి అట్టియెరుకను వినబోక కనబోక విడచిపెట్టము. లేకుండపోవును.

——

125) అంతటగలదీ యెరుకని । యెంతో వాదింపుచుందు రెరుగనివారల్ । అంతట నింతట గనుపడు । నంతటిదేకాని యెరుక అంతటగలదా ॥ అది నిజమైతే అగుపడవలదా ॥ అంతట గలదొక్క అచలమెకానెరుక । సంతాటగలదానియనరాదువినరాదు । అంతట గలదా । అదినిజమైతే అగుపడవలదా ॥

భావము : శిష్యా! యెరుక, సర్వవ్యాపకమైనది. అంతటా గలదు. అని దానియొక్క విషయము పూర్ణముగా యెరుగనివారు ఎంతోవాదించుచుందురు. యెరుకఅంతట, ఇంతట అగుపడు నంతటి దేకాని అంతటాయున్నదా ? (అనగా బ్రహ్మాండము లో అఖండము గను, పిండాండములో ఖండముగాను, ఖండ అఖండ స్వరూపము) అంతటాయున్నట్లు కనుపించునదేకాని విచారిస్తే అసలులేనేలేదు. అంతటా యున్నదైతే విచారిస్తే కనిపించాలి. అట్లు విచారణకు కనుపించుటలేదు. అంతటా సర్వత్రా ములుగుచ్చు నంతులేక ఖండ

అఖండములుగాకయున్నది, ఒక్క అచల పరిపూర్ణమేకాని, యొరుక అంతటా గలదని అనరాదు. వినరాదు.

126) బయలాకసమని కొందరు । భయపెట్టుదురు ఆ భ్రమవలన
భయపడకు సుమీ । బయలందు శబ్దమున్నను । బయలాకసము
నుచు నమ్మబడని నీచేతా ॥ శబ్దములేది భ్రమయెందు చాతా ॥
బయలాకసముగాదు పరిపూర్ణము నమ్మి । నయముగ యొరుకను
నమ్మాక విడచిపో। బడని నీచేతా। శబ్దములేది భ్రమ యెందుచేతా॥

భావము : పరిపూర్ణమనగా ఈ ఆకాశమేయని కొందరు తప్పుగాచెప్పెదరు అదివిని తప్పుపడకు. పరిపూర్ణములో శబ్దము లేదు. శబ్దమున్నచో ఆకాశమే పరిపూర్ణమని యనవచ్చును. శబ్దము పరిపూర్ణములో లేదు కనుక అట్టి భ్రమపడకు. బయలనగా పరిపూర్ణమే కాని ఆకాశము కాదని నమ్ముము. కనుక చక్కగా యొరుకను విచారించి విడచిపెట్టుము.

విశేషభావము : "ఆకాశస్య గుణశ్శబ్దః" అని శ్రుతి. శబ్దము కలిగినది ఆకాశము. పరిపూర్ణములో శబ్దము ఎంతమాత్రము లేదు. కనుక పరిపూర్ణము ఆకాశము ఒకటికాదు. వస్తునిర్ణయము లేకపోవుటచే ఎవరుగాని అకాశమే పరిపూర్ణము అనితెలియక చెప్పెదరు. ఆకాశము నాకివలె నల్లనిరూపము కలది. చీకటి వెలుతురుచే ఆక్రమింపబడునది. శబ్దగుణము కలది. అదే భూతాకాశము అనగా పంచభూతములలో ఒకటైన ఆకాశము. ఇది బయలు కాదని భావముచే తొలగేస్తే ఇక్కడేయున్నది మహాకాశము. ఇది చీకటి వెలుతురు కానిది. మహాకాశకారణమైన తేజస్స్వరూపము. శబ్ద గర్భిత నిశ్శబ్దము సత్తాకలిగినది. సృష్టిలయస్థితులకునత్తానిచ్చునది కనుక ఇదియును ఎరుకేయని భావనచే అదికూడ లేదని త్రోసివేసి

నచో ఇక ఉన్నది పరిపూర్ణమని చెప్పబడు పరాకాశము. ఇది శబ్ద రహితము, చీకటి వెలుతురుగానిది. సత్తాలేనిది. ఉత్తది. ఏమియును రానిది. స్వతస్సిద్ధమైనది. ఇదిమాత్రమే సర్వశాస్త్రములు గుచ్చ సందులేనిదని నిర్ణయించుకొని దీనందు యెరుకయే పరిపూర్ణ సిద్ధాన్తము.

---

127) కలమేల్క లెరుక బయలుల । కలసామ్యముజేసి చూడు మీ భ్రమదొలగున్ । ఫలమేమి పెక్కుచదువుల । వలనను జపయాగ యోగ వ్రతములవలనన్ ॥ శమదమముఖశతమూలవల నన్॥ తల క్రిందుగాబడ్డ తనువునెగానన్న । కలమేల్కగని తానెక్కడ నిల్వనట్లానే । వ్రతముల వలనన్ ॥ శమ దమ ముఖ శత మూల వలనన్ ॥

భావము : శిష్యా ! కల, మేల్కలు రెంటిని, యెరుక- పరిపూర్ణముల రెంటికి సామ్యముజేసి చూడుము. నీభ్రాంతి దొలగి పోవును. పెక్కు శాస్త్రములు వగైరా చదువుటవలన ఫలమేమి ? లేక జపములు, యాగములు, యోగములు, వ్రతములు, శమ దమములు, యజ్ఞయాగములు నూరుచేసినను జన్మరాహిత్య ఫలముదక్కదు. తల క్రిందుగా పెట్టి తపమాచరించినను, ఈశరీరము నేనుగాను అనివైరాగ్యము జెంద[redacted]అనగాని ఫలితములేదు. ఎరుక పరిపూర్ణమునుగని తెనెక్కడ లేకుండ పోయినట్లుగా పైనచెప్పిన వ్రతములు, శమ దమములు, శత సంఖ్యాయజ్ఞయాగముల వలన యేమియు ఫలితములేదు. అనగా జన్మరహితము కాదని భావము.

విశేషభావము : శ్లో । చిత్తస్యశుద్ధయేత్కర్మ । నతు వస్తూపలబ్ధయే । వస్తుసిద్ధిర్విచారేణ । నకించిత్కర్మకోటిభిః ॥

అన్నట్టుగా కర్మలు, వ్రతములు శమ దమములు ఇవన్నియు చిత్త శుద్ధిని కలిగించునవేకాని జన్మరహితస్థితిని కలిగించునవికావు. కల (స్వప్నము) యెన్నడూ నిజముకాదు. కల, కల్ల, కట్టుకథ ఈ మూడు ఒకేభావ ప్రతిపాదితములు. అనగా అబద్ధము అనిభావము కలలో జరిగిన విషయములు అన్నియు అబద్ధములేకాని నిజము కాదు. మేల్కలో అనగా జాగ్రత అవస్థలోని విషయములు నిజ మైనవి. అనగా మేల్కొరాగానే కల పూర్తిగా లేకపోవుచున్నది. అట్లే కలవంటిది యెరుక, మేల్కవంటిది - పరిపూర్ణము. కల, యెరుకలు అబద్ధమైనవి. మేల్క పరిపూర్ణములు నిజమైనవి. మరియు మేల్కకలుగగానే కల లేకపోయినట్లుగా పరిపూర్ణము ఉన్న దని తెలియగనే యెరుకలేకపోవును. ఇది కేవలము గురుముఖతా విచారణవల్ల యేర్పడవలసినదే కాని జప, తప, దానయజ్ఞాది వ్రత శతములు చేసినను కలవంటి యెరుక లేకుండాపోదు. అని చెప్పు టయే ఈపద్యభావము.

— —

128) నీ కలలో నిను నన్నును। లోకుల లోకములజూచి లోపలి భ్రమచే। నాకరుణ బడసి మేలుక। చేకొని కలకల్ల జేసి చేరెదవెటకో ॥ సర్వము నీతో చేరెనుయటకో। ప్రాకటముగ బట్ట బయలెరుక లీరీతి। నీకు దెలిసిన మీద నిలువాక వేవేగ। చేరెదవెటకో। సర్వము నీతో చేరెనుయటకో ॥

భావము: శిష్యా : నీకలతో, నిన్ను నన్ను, లోకులను, లోకములను కలయొక్క భ్రమచే జూచిన నీవు. నాకరుణచే (గురు కరుణచే) మేల్కొని యెరుకను (కలను) అబద్ధమని తలచి ఎచ్చ టకో చేరెదవు. అనగా ఎచ్చటను లేకుండ పోయెదవు. నీవు పోతే

నీతోకూడ సమస్తము లేకపోవును. ప్రసిద్ధముగ పరిపూర్ణము శాశ్వత మైనదని యెరుక కలవలె లేనిదని నీకు తెలిసిన మీదట తక్షణమే నీవు లేకుండ పోయెదవు. (ప్రాకటముగ-ప్రసిద్ధముగ)

........

129) హరికరనఖముఖవిదళిత । కరిమస్తక గళితమైన ఘన మౌక్తికముల్ । దొరకిన నెరుకలు గురిజలె । ధరియింతురు రెంటి విలువ తమరెరుగక నెక ॥ అట్లనె బోధ క్రమ మెరుగక నెక॥ పరి పూర్ణ బోధను యెరిగింపుచుండిన । యెరుకాకె కొందరు మరిగే రీమ ర్మము । తమ రెరుగకనెక ॥ అట్లనె బోధ క్రమ మెరుగకనెక ॥

బావము : శిష్యా ! సింహముయొక్క వాడిగోళ్ల అగ్ర ములచే ఖండింపబడిన ఏనుగుయొక్క కుంభస్థలమునుండి జారి పడిన గొప్ప ముత్యములు అడవులలో నివసించు ఆటవికులకు దొరకి నచో ఆముత్యములయొక్క విలువ తెలియక గురివిందగింజలతో కలిపి హారములవలె ధరించెధరు. అనగా విదళిత - ఖండింపబడిన, గళిత-విడువబడిన, జారిపడిన ముత్యముయొక్క శ్రేష్ఠత్వమును, గురివిందగింజయొక్క అల్పత్వమును విలువ తెలియక రెంటిని సమముగా హారములో వేసికొందురు. అట్లనే పరిపూర్ణ బోధయొక్క శ్రేష్ఠత్వమును తెలియక కొందరు పరిపూర్ణ బోధను విని అది యెరు కకె సరిపెట్టుకొందురు. వారికి పరిపూర్ణబోధయొక్క మర్మము క్రమము తెలియకనే కదా !

— —

130) తనువో బహిరింద్రియములో మనసోప్రాణములో విషయు మమతోనేనం । చనినీవని యమనిదియుని । యుమమనాని

 

చెదవ దేల అది తోవగాము ॥ నీవెన్నాడు యిది వినలేదూ। వినుమీ పరిపూర్ణము గనిలేనియూ మీది। తనువాదికమును లేందని గురునిచే దెలియు। మదితోవగాదూ। నీవెన్నడు యిది విన లేదూ ॥

భావము : శిష్యా! శరీరము, బాహ్యేంద్రియములు, మనసు, ప్రాణములు, విషయామరాగము ఈ వీనిలో, ఏదోవకటి ఆత్మయని, మరి జగత్తు అని అనరానిది యని యనుమానించుట ఏల ? అది సరియైన త్రోవగాదు. నీవు యెన్నడూ యిట్టి బోధ వినలేదు కనుకనే చెప్పినది వినుము. నే చెప్పిన పరిపూర్ణమును చక్కగా తెలసి లేనియూశరీరము మొదలైన వన్నియు లేనివేయని గురుముఖతా తెలిసికొనుము. యిట్టిబోధ నీవు ఇదివరలో వినలేదు.

........

131) నిను నను ప్రపంచమును జగ। మనియెరిగే యెరుక చాత నచలమునుగనుంగొని। నిను నను జగమును జగ। మని యెరిగె యెరుకమాను మమల వివేకా ॥ చాలును నీవీ క్రమ మెరిగి నాన్కా। నిన్ను నన్ను పై రెండింటిని విశ్వమనక। బయలన కుండె దున్నా దంచనగుర్తు లేకుత ॥ సుమలా వివేకా। చాలును నీవీ క్రమ మెరిగి నాన్కా ॥

బావము : శిష్యా! నీవని, నేనని, ప్రపంచమని, జగత్తని యెరిగే యెరుకచేతనే పరిపూర్ణము న్నదని విచారించి తెలుసు కొని, నీవని నేనని, ప్రపంచమని జగత్తని యెరిగే యెరుకను (తెలివిని, లేక నేనును) విడచిపెట్టుము. ఓ మలినము లేని బుద్ధి మంతుడా! నీవు ఈ క్రమమును ఎరిగిన తరువాత చాలును. నీవని, నేన పై రెండింటిని విశ్వమనక బయలనక (పరిపూరమనక)

ఉండుము. అవి ఉన్నవని కాని లేవని కాని గుర్తు లేకుండ ఉండుము.

........

132) ప్రొద్దున నిద్దుర మేల్కొని । వద్దకియే తెంచి గురుని వక్త్రజనితమౌ । సుద్దులు మ్రొక్కి వినుముయే । ప్రొద్దిది బహు ముద్దు సుమ్మి పుట్టినందుకూ ॥ గురుచరణము పట్టినందుకూ ॥ నిద్ధమౌ భక్తిచే నీవిట్లు జేసితే । దిద్దితీరిచి బోధ తెరవూ జూపును నీవు పుట్టినందులకూ ॥ గురుచరణము పట్టినందులకూ ॥

భావము : శిష్యా ! ప్రతిరోజు ఉదయముననే (ప్రాతః కాలము) నిద్దురనుండి లేచి గురునివద్దకు వచ్చి వారిముఖమునుండి వచ్చిన మంచి మాటలను గురుమూర్తికి మ్రొక్కి వినుము. ఈ సాంప్రదాయములో పుట్టినందుకు గురుచరణము పట్టినందుకు ఇట్లు చేయుట ధర్మము. బహుముద్దు సుమీ ! మలినము లేని భక్తిచే నీవిట్లు జేసితిలేని నిన్ను దిద్దితీర్చి బోధయొక్క మార్గమునుజూపును. (సుద్దులు—పరిశుద్ధపు మాటలు) నిద్ధమౌ—నునుపు తేరిన (కల్మ షము లేని)

విశేషభావము : పరిపూర్ణ బోధ కేవలము గురుకరుణచే మాత్రమే అవగాహన జరుగును. అట్టి గురుకరుణ అనుష్ఠానము చేయుటచే కలుగును. ఈఅనుష్ఠానమునకే ప్రొద్దున నిద్దుర మేల్కొని వద్దకియే తెంచి గురుని వక్త్ర జనితమౌ సుద్దులు మ్రొక్కి వినుము, అన్న మాటకు అర్థమని గ్రహింపవలెను. కనుక గురుపుత్రులు ప్రతిదినము అనుష్ఠానము తప్పక చేసికొన వలయును.

——

113) గురుడు పరిపూర్ణముగను జూ । పెనకను లేం ధనుచు దెల్పియుక దల్చకు మం ! చెరిగించక విడిపోవునె । యెరుకనరుల్ సాధనములు యెన్ని జేసిననూ ॥ లక్ష్యము ద్రలెన్ని జూచిననూ ॥ హరిహర బ్రహ్మమరాసురముఖులైన । ధరణీ సురాద్యష్టాదశ జాత్యుద్భవులాను ॥ యెన్ని జేసిననూ । లక్ష్యము ద్ర లెన్ని జూచిననూ ॥

భావము : శిష్యా ! గురుడు పరిపూర్ణముజూపి. యెరుక లేనిదనియు యిక దానిని తలచకుము అని యెరిగించకుండిన యెరుక విడపోవునా ? విడదు అని భావము. నరులు అనేకసాధనములు, లక్ష్యముద్రలు ఎన్ని చేసిననూ ఎరుక విడిపోదు. నరులకే కాదు, విష్ణుమూర్తి, ఈశ్వరుడు బ్రహ్మాదిదేవతలు దేవేంద్రాదులకైననూ, బ్రాహ్మణాది అష్టాదశ జాతులలో పుట్టినవారికైనను గురుమూర్తి విడిపింపనిచో ఎరుక విడిపోదు.

విశేషభావము : గురుముఖముగామాత్రమే పరిపూర్ణము ఉన్నదనియు, లేనియెరుక లేశమైనను లేదనియు ఆసద్గురు కరుణా విశేషముచే మాత్రమే తెలియవలయునుగాని శాస్త్రములవల్ల ఎంత మాత్రము దెలియబడదు. అందుచేతనే గురుకరుణచేతనే ఎరుక విడిపోవునుగాని మరియొక విధముగాదు.

అష్టదశజాతులు :- 18 జాతులు 1) బ్రాహ్మణ, 2) క్షత్రియ 3) వైశ్య, 4) శూద్ర, 5) వ్యావహారిక, 6) గోరక్షక, 7) శిల్పక, 8) పంచాణ. 9) కుంభకార, 10) తంతువాయి, 11) క్షౌరక, 12) రజక, 13) వస్త్రచ్ఛేదకా, 14) చర్మకార, 15) తిలఘాత, 16) లుబ్ధక, 17) కసాయి, 18) మాతంగజాతులు.

(లుబ్ధకుడు - (బోయవాడు) పంచాణ - (రాళ్లుకొట్టువారు

— —

134) బల ధన విద్యా ధైర్యం । బులుచక్కదనంబు సత్వ బుద్ధ్యాద్యుతులన్ । కలలో యివి లేనిమను । ష్యుల జగమును తనను తాను జూచి మానవుడూ ॥ మేల్కనేని చూడాలేడొకడూ । కల మేల్కలెరుక బయలులకిట్ల జతగూర్చి । కలయెరుకలను దేశికులచె వీడితె జాలు ॥ చూచి మానవుడూ । మేల్కనేని చూడాలేడొకడూ ॥

బావము : శిష్యా : బలము, ధనము, విద్యా, ధైర్యము, చక్కదనము, సత్వ ధార్మికబుద్ధి మొదలగునవి కలిగియున్నట్లుగా యివిలేని మనుష్యులు తనను జగత్తును కలలో చూచిన మానవుడు, మేల్కనగా ఇవి యేమియు లేనివాడై మునుపటివలెనే ఉన్నాడు. అనగా కలలో తోచిన సమస్తము మిథ్యా, లేనిది అని అర్థము. మేల్కమాత్రమే నిజమైనది. అట్లే కల యెరుకకును, మేల్క పరిపూర్ణమునకును జతచేసి ఉదహరించుకొని, కలఅయిన యెరుకను గురుకరుణచే విడబిపెట్టినచో చాలును.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
సకల మత లక్షణన్నామ
సప్తమోఽధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.
॥ జై గురు ॥

శ్రీ గురుభ్యో నమః ఓం శ్రీ ౯జగురవే నమః

# 8. పరిపూర్ణ బోధ (26)

135) యీావృత్త బట్టబయలును। నీవిప్పుడు వుండజూచి నిజముగ యెరుకన్। నీవని నేనని జగమని। భావింపుము పిదప దీన్ని బాయుమనిశమున్॥ నిజముగ దీన్ని బాయకనిశమున్। శ్రీవనితేశరాజీవ సంభవ భవ। దేవేంద్రాదుల నింక సేవించు తల పేల॥ పాయుమనిశమున్। నిజముగ దీన్ని బాయకనిశమున్॥

బావము: శిష్యా! యీావృత్త బట్టబయలును (పరిపూర్ణ మును) నీవు శాశ్వతముగ ఉన్నదని జూచి, యెరుకనగా నీవని, నేనని, జగత్తని భావింపుము. ఆతరువాత యెరుక లేనిది గనుక విడచిపెట్టుము. పూర్తిగ అట్లు ఎల్లకాలము విడువక విష్ణుమూర్తిని, బ్రహ్మను, రుద్రుడు, దేవేంద్రాది దేవతలను సేవించే తలపెందు లకు? ఎల్లప్పుడు ఎరుక లేనిదని విడచిపెట్టుము.

విశేష బావము: గురుముఖముగా పరిపూర్ణ మెరుకల రెంటిని, విచారించగా శాశ్వతముగా సర్వత్రనిండి నిబిడీకృతమై ఉన్నది ఒక్క పరిపూర్ణమే ఉన్నదనియు, ఉన్నట్లుగా కనిపించే యెరుక ఏకాలమందును లేదని తెలియబడును. యెరుకనగా నీవు, నేను, జగత్తు సమస్తము అనగా ఎంతవరకు మనకు తెలియబడు చున్నదో అది అంతయు యెరుకే. అనగా సమస్త దేవతలు మరియు అధిష్ఠాన చైతన్యముతో సహా సమస్త జగత్తు యెరుకే. ఈయెరుక లేనిదే ఉన్నట్లుగా కలవలె తోచబడుచున్నది. కనుక యెరుక లేదని విచారణ పూర్వకముగా దృఢపరచుకొని దానందు ఎంతమాత్రము భ్రమ లేకుండగ విడచిపెట్టవలెను అట్లు విడచిన పిదప విష్ణ్వాది

సమస్త దేవతలమీద భ్రాంతి ఉండకూడదుగదా! ఆలా కాకుండగ వారిని సేవించుచుండినచో యెరుకను విడువలేదనియే అర్థము. కనుక శిష్యునికి ఎరుక భ్రాంతి లేకుండజేయుటకై బ్రహ్మేంద్రాది సమస్త దేవతలను ఆరాధించు తలంపును మాని "నేనే" ఎరుకను, అట్టి నేను లేదని లేకుంత ఉండుమని గురుదేవులు ఈపద్యములో ప్రబోధించినారు. ఒక్క చిన్న విషయము—పద్యభావమును పట్టుకొని ఏ పూజలు పనికిరావని మానుటకు వీలులేదు. అట్టి పరిపూర్ణ స్థితి కలిగే పర్యంతము సమస్త దేవతారాధనలు మాని గురుపూజానుష్ఠానము తప్పక ఆచరించవలెను. లేనిచో శిష్యుడు పాడై పోగలడు.

136) లేదనకు మున్నదదిగో। నేదెలసితివనకు దీన్ని నీవెరిగేవా। కాదది నీచే దెలియను। యేదిర తన్మాత్ర సమితి యీాబట్టబైటా ॥ దీనికి సాటి దేదీ యెచ్చోటా। వాదేల లేనెరుకతో దీన్ని గనిపెట్టి। పోదొట్టు మెరుకనింకేది బట్టదు చాలు ॥ యీాబట్టబైటా। దీనికి సాటి దేదీ యెచ్చోటా ॥

భావము: శిష్యా! పరిపూర్ణము లేదనకుము. ఉన్నది అదిగో. దీనిని నీవు తెలిసితిని అనకుము. దీన్ని నీవెరిగితివా, అది పరిపూర్ణము కానే కాదు, యెందుచేతననగా యీపరిపూర్ణము నీచే తెలియబడుటకు దానందు శబ్దస్పర్శాది తన్మాత్ర సమూహము లేశమైననూ లేదుకదా! దేనితో సరిపోల్చదగినది మరేదైనను కలదా? వాదములతో పని లేదు. యీాలేని యెరుక చేతనే పరిపూర్ణము ఉన్నదని కనిపెట్టి, యెరుకలేదని విడచిపెట్టుము. చాలును. నీకింకేమీ బాధ లుండవు.

విశేషభావము : అశరీర సాం|ఖ్యాయత గురుముఖముగా విచారిస్తే తప్ప, పరిపూర్ణము ఉన్నదని యెవరికి తెలియబడదు. అది సర్వ|త్రా నిండియున్నది. కాని శబ్దస్పర్శాదితన్మా|త్రలచే గుర్తింపబడదు. ఏవస్తువైనను అనగా మాటలు-శబ్దరూపముగను, వాయువు స్పర్శరూపముగను, వస్తువులు (రూప) దృశ్యరూపము గను, రుచులు-రసరూపముగను, వాసనలు-ఘ్రాణరూపముగను, పర|బ్రహ్మము-తన్మా|త్రలు అన్నియుకలసియున్న బుద్ధిచేతను తెలియబడుచున్నది. ఇట్టి శబ్దస్పర్శాది తన్మా|త్ర సమూహము లేశమైనను పరిపూర్ణమందు లేవుకనుక "నాచే" తెలియబడనేరదు. అనగా "నేను దాన్ని తెలుసుకొనలేదు. నేను అనగా జ్ఞాన స్వరూపము. నానందు శబ్దస్పర్శాది తన్మా|త్ర సమూహము నిండి యున్నది. తన్మా|త్రలను విడచి జ్ఞానము, జ్ఞానమును విడచి తన్మా|త్రలుకాని యుండనేరదు. కనుక "నేను" చే తెలియబడనిది పరిపూర్ణము. అనగా పరిపూర్ణము "నేను" లేనిది అని అర్థము 'నేను' లేనివస్తువు నాచే తెలియబడదు. ఇట్టి తన్మాత్రలు లేని వస్తువు, పరిపూర్ణము తప్ప మరేదిలేదు. కనుక పరిపూర్ణమునకు సాటి మరేదిలేదు. పరిపూర్ణమే శాశ్వతమైనది. అంతటా ఉన్నది. ఎరుక పరిపూర్ణములో లేదుకనుక ఎరుక యెచ్చటనూ కొంచెమైనను లేదని గురుముఖతా గుర్తించి తానులేకుండా పోవుటయే పరిపూర్ణ సిద్ధాంతము.

---

137) కనవచ్చి యిట్టిదట్టిది । యని యనరాకుంటు బయలు లన దెకను గొనుమీ । కనరాకపోతే శూన్యం । బనుమిట్టిదియట్టి దనుచు పలుకవచ్చిననూ ॥ ఎరుక నాంట్లోపలకి జొచ్చినదటా ।

వినుమాబయలును నీవేమనినవొప్పెదగా । నొప్పను నీమాటను, నే
జెప్పినరీతి గనవస్తే ॥ పలుకావచ్చిననూ । యెరుక దాంట్లోపలికి
జొచ్చిననూ.

బావము : శిష్యా! పరిపూర్ణము ఉన్నదని తెలియబడును.
అయినను ఇట్టిది అట్టిది అని చెప్పరానిది, అట్టి పరిపూర్ణము అదిగో
చూడుము. విచారించగా కనరాకపోతె శూన్యమనవచ్చును.
ఇట్టిది అట్టిదియని చెప్పవీలు అయినను, గుర్తించవీలు అయినను,
దానిని నీవేమని అన్నప్పటికి ఒప్పను. కాని నేచెప్పిన రీతిగా విచా
రించినచో పరిపూర్ణమును పలుకు కలిగినదిగాని, గుర్తించదగినదని
గాని అనరాదని తెలియబడును.

— —

138) కనవొచ్చు బయలులేదని । యనవచ్చునె యిట్టిదట్టి
దనవచ్చునె ఛీ । యనరాదూ యెరుకకెన్నడు । కనుకనె యీ
బయలు యెల్లకాలముంచుందీ ॥ దీనందెరుకే కాలములేందీ । విను
మీతేనెరుకాను వివరించశూన్యమౌ । అనుమానమేమెరుకగను విశ్వ
మట్టిదే । కాలముంచుందీ ॥ దీనందెరుకే కాలములేందీ ॥

బావము : శిష్యా ! విచారిస్తే ఉన్నదని తెలియబడే పరి
పూర్ణము లేదనియనవచ్చునా ?యిట్టిది అట్టిదియని యనవచ్చునా?
ఛీ అట్లనరాదు. లేదని, యిట్టిది అట్టిదియని చెప్పశక్యమైనది,
యెరుక కెతగును. పరిపూర్ణమును అట్లనరాదు.
కనుకనె పరిపూర్ణము యెల్లకాలము శాశ్వతముగా ఉంటుంది.
ఈ పరిపూర్ణములో యెరుక యెన్నడూలేదు. ఈయెరుకను విచారిస్తే

శూన్యము. అనుమానమేమి ? ఎరుకవంటిదే విశ్వముకూడ ఏకాల మందును లేనిదని విచారించుము.

— —

139) పరిపూర్ణమనిన యెట్టిదో । యెరిగెదనని యెరుక బైటి కేగిన యెరుకె । యెరుకకు శూన్యంబయ్యేను । యెరుకనుజన్మించి నట్టి యీ విశ్వమంత ॥ యెరుకపలెనే యేమీలేదంతే । యెరుక పుంజంగానే యెరుకవిశ్వములు లే । వెరుకాజె ఇది జూడ యెంతో వింతై తోచె ॥ యీ విశ్వమంతా । యెరుకవలెనె యేమీలేదంతా ॥

బావము : శిష్యా ! పరిపూర్ణమనగ యెట్టిదో తెలుసుకుందా మనిన ఎరుక విచారించగా తనకు తానే శూన్యమయ్యేను. తనతో యేర్పడిన యీ జగత్తంతయు కూడ శూన్యమైపోయెను. యెరుక యేలా లేకపోయెనో యెరుకవల్ల ఏర్పడిన విశ్వమంతయు కూడ అలాగే లేకుండా పోయెను. ఎరుక తానుండగానే తాను విశ్వము లేవని విచారణచే తెలుసుకొన్న ఎరుకకు యిది ఎంతో వింతై తోచెను. తాను ఉండగానే తాను, తనవల్ల యేర్పడిన విశ్వము సమస్తము లేకపోవుటను చూచిన ఎరుకకు యిది ఎంతో విచిత్రమనిపించు చున్నది.

— —

విశేషబావము : పరిపూర్ణమును గురించి విచారించిన నీవు అనగా జ్ఞానము, పరిపూర్ణమె శాశ్వతమైనది, యేమార్పు లేకుండగ సర్వకాలము ఉన్నదని తెలిసికొనినది. తనచే గుర్తించ శక్యము కానందున తాననే జ్ఞానస్వరూపము, పరిపూర్ణమందున లేదనికూడ తెలుసుకొన్న జ్ఞానము తాను లేననిగుర్తించినది. తానేలేకపోయినచో తనవల్ల వచ్చిన జగత్తు ఉండునా ? కనుక తాను ఉండగానే తాను

తేనని తెలుసుకొనుట ఎంత ఆశ్చర్యము ? తాను ఏకాలమందున లేనను నిశ్చయజ్ఞానము కల్గిన జ్ఞానములేనిదనే నిర్ణయము జరిగినది. అప్పుడు పరిపూర్ణము మాత్రమే ఉన్నదికాని పరిపూర్ణమున్నదను టకు ఎరుకలేదు గదా ! కనుక ఎరుక లేకపోవుటయే పరిపూర్ణము ఉన్నదనుట. తాను తేనని ఆరూఢజ్ఞానము కల్గి తేకపోవుటయే పరి పూర్ణము ప్రత్యక్షముగా కనిపించుట అనబడును.

140) గురుమూర్తి జూపకున్నను । పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్షమగున్ । గురుమూర్తి జూపెనేనియు । పరిపూర్ణము తనకు తెన్న ప్రత్యక్షమౌరా ॥ చూస్తునె ఎరుక పారిపోవునురా । ఎరుకా బోయిన వెనుక ఎవరా ప్రత్యక్షాన్ని । ఎరిగిట్టిదంచెరిగెవారటుమీద॥ ప్రత్యక్షమౌరా । చూస్తునె ఎర్రుక పారిపోవునురా॥

భావము : శిష్యా ! గురుమూర్తి చెప్పి చూపింపక పోయి నచో పరిపూర్ణము నీకు ఏ వి ధ ము గా ప్ర త్య క్ష ము గా తెలియబడును ? గురుమూర్తి చూపినప్పుడు మాత్రమే చక్కగా తెలియబడును. అట్లు పరిపూర్ణమును ప్రత్యక్షముగా చూస్తునే ఎరుక యెక్కడను నిల్వకుండగపోవును. అవిధముగా యెరుకపోయిన తరువరి. పరిపూర్ణమును ఎవరు యెరిగి ఇట్టిది అట్టిది అని చెప్పేవా రున్నారు? అనగా పరిపూర్ణమునుగూర్చి చెప్పేవారెవరూ ఉండరు.

141) పరమపదమనిన బయలన। గురుగుహ్యమనంతమనిన గోప్యంబనినన్ । పరిపూరమచలమనినను తిరమునగా బట్టబయలు తెలుయుమాయప్పా ॥ యీా తెలిసిన తెలివి మానప్పా ॥ యెరుక నెరుగని దన్నా నెరుక మీరినదన్న । యెరుక మరుపులులేని పరవస్తు వన బయలె ॥ తెలియుమాయప్పా ॥ యీా తెలిసిన తెలివి మానప్పా॥

భావము ! శిష్యా ! పదముపదము, బయలు, గురుగుహ్యము, అనంతము, గోప్యము, పరిపూర్ణము, అచలము, నిర్గుణము, బట్టబయలు ఇవన్నియు పరిపూర్ణమునకే పేర్లు అని తెలియుము. ఆ తెలిసిన తెలివిని విడచిపెట్టుము. మరియు యెరుకనెరుగనిదన్నా, యెరుకమీరినదన్నా, యెరుక మలుపులేని పరమవస్తువన్నా, పరిపూర్ణమనె తెలియుము, అలా తెలిసిన తెలివిని విడచిపెటుము.



142) బట్టబయలనుచు దీనికి । మొట్టమొదల్ పేరులేదు. ముదమున యెరుకే । పుట్టి పేర్బెట్టి దానిని । పట్టుకలవాడులేక పారిపోవునురా ॥ కనరాదిందు దూరసేరదురా ॥ పుట్టి చచ్చుచు మళ్ళి బుట్టిగిట్టుచు బుట్టు । నిట్టి తిప్పలనొందు యెరుకె బయలును చూస్తె ॥ పారిపోవునురా ॥ కనరాదిందు దూరసేరదురా ॥

భావము ! శిష్యా ! యీ పరిపూర్ణమునకు బట్టబయలని, పరిపూర్ణమని, మొట్టమొదటగా పేరే లేదు. యెరుక పుట్టి యీ పేర్లు దానికి పెట్టి దానిని పట్టుకొనలేక (గుర్తించలేక) యెరుకే పారిపోవుచున్నది. పరిపూర్ణములో ఐక్యముపలేకుండ కనరాకుండ పోవుచున్నది. పుట్టి చచ్చి తిరిగి పుట్టి ఇట్టి తిప్పలనుపొందే యీయెరుక పరిపూర్ణమును చూచినచో ఎక్కడను లేకుండా పోవును.



143) వినుము నేననుచు యెరుగని । తనువందున లేక బయలు తానిండినదొ । కనుగొను మదికనుగొని । యీ తమపును విడనాడు మింత తడవేలనోయీ ॥ యీపనికింక గడువేలనోయీ । అనుమానముంటె నీవడయూడు శివరాము । అను దీక్షితులు జేసెన చలాగ్రంధమునంత ॥ తడవేలనోయీ। యీపనికింక గడువేలనోయీ ॥

భావము : శిష్యా ! వినుము. వేననుచు యెరిగే శరీరము (గుర్తెరిగే శరీరము) పరిపూర్ణమందునలేదు. పరిపూర్ణము సర్వత్ర ముల్లు గ్రుచ్చ సందులేకుండగ నిండియున్నది. ఈ విధముగా విచారించుము. విచారించి లేని యీ గుర్తెరిగే శరీరమును (యెరుకను) విడిచిపెట్టుము. యీ పనికి గడువుపెట్టక వెంటనే చేయుము. నీకు ఈ మాటలయందు అనుమానము ఉన్నచో శ్రీ శివరామదీక్షితులు వారిచే వ్రాయబడిన అచల గ్రంథమును చూడుము.

విశేష భావము : "శాస్త్రదృశ్యం గురుర్వాక్యం" అన్న ఆర్యోక్తి ప్రకారము, శ్రీకృష్ణదేశికేంద్రులవారు వ్రాసిన కందార్థములలోని భావము పరిపూర్ణమె యున్నదనియు, అది యీ తెలివి గుర్తించలేవనియు. కనుక లేనిది అయిన యెరుక లేనిదనియు ధృఢీకరించుచున్నారు. ఇందుకు శాస్త్రసమ్మతము కావలెనుగదా! అందుకే వారు వ్రాసిన కందార్థ భావమునకు శాస్త్రదృశ్యముగా ఈ సిద్ధాంతమును పీఠ ప్రతిష్ఠాపన చేసిన శ్రీ రామడుగు శివరామ దీక్షితులవారిచే వ్రాయబడిన "బృహద్వాశిష్ఠము" అను అచల గ్రంథమును చూడుమని చెప్పియున్నారు.

---

144) దేహాకారముగానిది। యహంభావము లేనిదఖిలజనులు దా। సోహం సోహం బనినను । మోహము జెందనిది బైలు మొదలెరుగవలెరా ॥ యెరిగిన యెరుక తుదకరుగవలెరా ॥ కోహం కస్త్వంబని కూతాలు గూసేటి । దేహి దేహములాను తెలియని యీ బైలు । మొదలెరుగవలెరా ॥ యెరిగిన యెరుక తుదకరుగవలెరా ॥

భావము : శిష్యా ! పరిపూర్ణము దేహాకారము కానిది. "అహం" అనగా నేను లేనిది. సమస్త జనులు దాసోహం అని

గానిసోహమనిగాని అన్న నూమోహముచెందనిది. ఇట్టిపరిపూర్ణమును వున్నందుగా తెలిసికొనుము. ఇట్లు తెలిసిన కోరుకతుదకులేకుండా పోవలెను. నీవెవరు ? నేనెవరు ? అని పలికే యీదేహిదేహములను తెలియుని పరిపూర్ణమును ముందుగా తెలిసి అలా ఎరిగిన యొరుక చివరకు లేకుండా చేసికొనుము.

విశేషభావము : తవ దాసోహం అనగా నేను నీకు దాసుడను, నీవు నాకు ప్రభువు అని భక్తుడు మహావిష్ణువు యొక్క సంబంధముగా ద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతము, "సోహం" సః + అహం = అతడే నేను. ఆ బ్రహ్మయే నేను, నేనే బ్రహ్మము అన్నది అద్వైత సిద్ధాంతము, ఇట్టి రెండు సిద్ధాంతములను మీరియున్నది అచల పరిపూర్ణ సిద్ధాంతము. అనగా నేనుగాని బ్రహ్మగాని అననిది గుర్తులేనిది. కారణ కార్యములుగానిది అచలము. కోహం అనగా కః + అహం. నేను ఎవరిని ? కఃత్వం = కస్త్వం = నీవెవరు ? అను ద్వంద్వదోషములతో నిండియున్న దేహి, దేహములు కానిది పరిపూర్ణమని తెలియవలెను.

145) యేవస్తువు చాతనుదా । నాచిర్భవమొందు దేహమను తరువరయన్ । అవస్తువె దానికి వి। త్తై వెలయును దాన్నె సాక్షి ద్రష్టానికనుమీ ॥ యెరుకయిదె స్పష్టాముచినుమీ । భావించిచూడు మీబట్టబయలనుభూమి । యీ విత్తుచెట్టున్న దరయు దావిత్తునే । ద్రష్టానికనుమీ ॥ యెరుకయిదె స్పష్టాముచినుమీ ॥

భావము : శిష్యా ! విచారించగా యేవస్తువుచేత యీ దేహమనే వృక్షము పుట్టుచున్నదో. అదే దేహమనె వృక్షమునకు విత్తనమని తెలియుము. అదే సాక్షి, ద్రష్ట అని తెలుసుకొనుము. యీ విషయము స్పష్టముగ అనుమానములేకుండగ విచారించుము

వివర్తమును వృక్షమును యీ భూమి ఎట్లు తెలుసుకొనకుండగ ఉన్నదో, అట్లే ఆత్మ (ద్రష్ట) అనువివర్తనమును దానినుండియేర్పడిన దేహము అనువృక్షమును యీ రెంటిని ఎంతమాత్రము యెరుగనిది (భూమివంటిది) పరిపూర్ణమని చక్కగా భావింపుము.

— —

146) యే పరిపూర్ణము మేనికి। లోపల వెలినుండి యుండు లోపము లేకన్। ఆపరిపూర్ణమె జగతికి। లోపలవెలి, నుండు దాని లోనెవున్నవిరా ॥ పై రెండెవ్వీలేని వెన్నకురా ॥ యీ పూర్ణబోధచె పై ప్రపంచ శరీర। రూపము లెడబాపు మీపట్లనె దాని। లోనెవున్నవిరా। పై రెండెవ్వీలేని వెన్నకురా ॥

భావము : శిష్యా : యే పరిపూర్ణము శరీరమునకులోపల వెలుపల, ఎంతమాత్రము సందులేకుండగ నిండియున్నదో, ఆ పరిపూర్ణమె జగత్తునకు లోపల, వెలుపల నిండియున్నది. మరియు మేను జగత్తులు పరిపూర్ణములోనే యున్నవి. కాని మేనుజగములు రెండులేనివే అభాసరూపములుగా తోచబడుచున్నవి. పరిపూర్ణబోధచే ఆశరీర ప్రపంచములు లేనివని విచారించి ఇప్పుడెవాటిని లేకుండ చేయుము.

.........

147) యెరుకనగా యెరిగేటిది। మరువనగా యెరుకతనను మరచుట మీరెం। ట్పురుగనిదె బయులివినీ। వెరిగెడుకను మరుపు తివస్తు దెరుకాచెపిడరా ॥ వీడితె పైమాటెరిగెదెవ్వడురా ॥ యెరుకె వరిపూర్ణ మంచెదిరించి వదిలేవూ పరిపూర్ణమైతే చూపరబయులందున దాన్ని। యెరుక చెపిడరా ॥ వీడితె పై మాటెరిగె దెవ్వడురా ॥

భావము : శిష్యా ! యెఱుకనగా-సమస్తమును యెరిగెదనియు, మరుపనగా-యెఱుక తనను మరచుటయనియు, యెఱుక మరుపులు యీ రెంటిని యెరుగనిదె పరిపూర్ణమని, నీవు తెలుసుకొని, యెరుక మరుపుల రెంటిని యెరుకచేతనే విడచిపెటుము. ఆలాగున విడిచితె పరిపూర్ణమునుగాని యెరుకనుగాని యెరిగేదెవరు? యెరుకే పరిపూర్ణమని యేతిరించి పలుకుచున్నావు. పరిపూర్ణము యెరుక ఒక్కటే అయితే, ఆయెరుకను పరిపూర్ణముతో చూపింపుము !

విశేషభావము : సమస్తమును తెలుసుకొనునదే తెలివి ఏదయితే ఉన్నదో, అదే యెరుక సమస్తమును గుర్తించుటయేకాక తనను తానుకూడ తెలుసుకొనును. అనగా భ్రూమధ్యస్థానమునందున్న ప్రత్యగాత్మ తనను తానే గుర్తించుచున్నది, ఆయెరుకే సహస్రారమున మరియు హృదయస్థానమున గుర్తించే తెలివి లేకుండగ తనలో తాను మరుపుజెందుచున్నది, ఇట్టి మరుపునకే సహస్రారమున సమాధిస్థితియని హృదయస్థానమున అజ్ఞానమందులయమయినదని అందురు. ఇదియును యెరుకయే. అంటేఎరుకకు రెండవస్థలు. ఎరుగుట, మరచుట. యీ రెండవస్థలును పొందుచున్నది యీ యెరుకయే. ఇట్టి యెరుగుట, మరచుటలు లేనిది పరిపూర్ణమని తెలియవలెను. అంతేకాని నిర్వికల్ప సమాధిస్థితి తన స్వస్థానమునందున్న యెరుకనే, సంకల్ప వికల్పములు లేని పరిపూర్ణమని భావించుట తప్పు, యెరుక పరిపూర్ణముకాదు. పరిపూర్ణము యెరుక యెన్నటికి కాదు. పరిపూర్ణములో లేనిది యెరుక. కనుక ఆయెరుకచేతనే యెరుకను, పరిపూర్ణమును చక్కగా వస్తునిశ్చయముగా గుర్తించి యెరుకను విడచినచో పరిపూర్ణమునుగాని, యెరుకనుగాని తెలియలేము అని చక్కగా తెలుసుకొనవలయును.

.... ...

148) లేదన్నను కనుపడుగద। నే దెలసితిననిన బైటనే నిల్వగదా। నే దీనివెనుకగదనా। కేదో మూలంబు యితిగాదికలే దెచ్చోటా॥ కనుక నెవుళ్ళకిక్కనే। న్నాటా॥ యేదీలేదిదిదప్పనే దెలియునిదియని। తాతెలుసుకొని యెరుకె తనను వీడితెజాలు॥ యికలేదెచ్చోటా॥ కనుకనెవుళ్లకిక్కనేనన్నాటా॥

భావము : శిష్యా ! పరిపూర్ణము లేదంటివా : విచారిస్తే కనుపించుచున్నదికదా ! "నేను" తెలుసుకున్నానంటివా ! అ పరిపూర్ణములో "నేను" లేదుగదా ! ఇక ఎట్లు తెలుసుకొందువు, 'నేను' పరిపూర్ణముతరువాతనే, లేక ఏర్పడినదిగదా ! అయితే నాకు మూలము యీ పరిపూర్ణముకాదు. మరియేది నాకు మూలము అని విచారించగా పరిపూర్ణము మూలము కాదనియు, మరి యింకేదీ నాకు మూలము లేదనియు తెలియుచున్నది. కనుకనే "నేను" మూలములేనిది కనుక 'నేను' లేనేలేనని తెలియవలెను. నాచే సమస్తము తెలియబడుచున్నది. ఒక్కపరిపూర్ణము తప్ప "నే" తెలియునిది ఏదీలేదు. అని విచారించి తెలుసుకొని, యెరుక తనకు తానే లేకుండపోతే చాలును. ఎరుక ఏకాలమందు ఎచ్చటను లేకుండ పోవును.

విశేషభావము : "నేను" అనగా యెరుక. యెరుక అనగా తెలుసుకొనునది, తెలియబడినది అనికూడ అర్థము, తెలివిచే తెలియబడిన సమస్తము తెలివియొక్క రూపమే. అన్యముకాదు. కనుక తెలియబడిన సమస్తము యెరుకే. పరిపూర్ణములో యెరుక లేదు కనుక పరిపూర్ణము నాకు తెలియబడదు. అది ఒక్కటి తప్ప సమస్తము 'నేనే' ! అంతయు నాచే తెలియబడును. కనుక అంతయు "నేనే" కనుక నాకు మూలముఏదీ ? అని విచారిస్తే పరిపూర్ణములో

లేను కనుకపరిపూర్ణము నాకు వేరుగనుకాదు. సమస్తము 'నేనే' కనుక మరింకేదినాకు మూలములేదు. అనగా నేను లేకనే, కలపలె యేర్పడినది. కనుక "నేను" అను ఎరుకలేనేలేదు.

149) సత్యమగు బట్టబయలున । సత్యంబగు యెరుక నెరిగి సద్గురు కృపచే । సత్యముగాదని యెరుకను । సత్యముగా నమ్మి వుంటె చాలుచాలన్నా ॥ వానితోటి సాటెవ్వరన్నా ॥ నిత్యానిత్యములనె నిర్ణయమెరుగక । నిత్యుడై యుండేటి నిజబోధ కలిగితె ॥ చాలుచాలన్నా । వానితోటి సాటెవ్వరన్నా ॥

భావము : శిష్యా ! శాశ్వతమైన పరిపూర్ణమును. అశాశ్వతమైన యెరుకను గురుకృపచే నెరిగి అశాశ్వతమైన యెరుక సత్యము గాదని స్థిరముగా నమ్మి వుంటె చాలును. అట్టివానితోటి సాటెవ్వరూ ఉండరు. నిత్యమైనది పరిపూర్ణమని, అనిత్యమైనది యెరుకనే నిర్ణయములెరుగక, లేక ఉన్న పద్ధతిని తెలిపే నిజబోధ (పరిపూర్ణబోధ) కలిగియుంటే చాలును. అట్టివానితో సాటి ఎవ్వరును ఉండరు.

విశేషభావము : సత్యమైనదిపరిపూర్ణమని. అసత్యమైనది అనగా లేనిదే ఉన్నట్లు తోచబడునది ఎరుకని, అట్టి ఎరుక శాశ్వతము కాదని స్థిరముగా శ్రీ గురుముఖముగాను, గురుకరుణచేతను తెలియవలెనేకాని శాస్త్రజ్ఞానము వగైరాలచే అట్టిపద్ధతి తెలియబడదు. ఆవిధముగా ఎరుకను విడచినవాడు తానులేనివాడు గనుక వానికి సాటి ఉండరు, లేనివానికి సాటి ఉండదు. ఉన్నదానికే సాటి ఉండును.

---

150) పరిపూర్ణములో దోచిన । ఎరుకలేకల, లేని ఎరుక నెరిగి మృషని యీ । మరుగెరుక కెరుక దెల్పిన । ఎరగటమె మేల్కా

సుమ్మీ యిదియామరకుమీ ॥ సద్గురువాజ్ఞకెదిరి మీరకుమీ ॥ ఎరుక యీ రీతిగ ఎగిరిపోయిన వెనుక । పరిపూర్ణమొకటుండు పలుక రాదెట్లుందు ॥ నిదియామరకుమీ ॥ సద్గురువాజ్ఞ కెదిరి మీరకుమీ ॥

భావము : శిష్యా ! పరిపూర్ణములో తోచిన యెరుక కల వలె లేనిది. అట్టి లేనియెరుక మృష (అసత్యము)యని యెరుకకు దెల్పుటయే యెరుకకైనకలకు మేల్చయని యిది మరువకుమీ. ఇది సద్గురువాజ్ఞ. యీ ఆజ్ఞను ఎదిరించి మాటాడకుము. యెరుక యీ రీతిగ లేకపోయిన పిదప పరిపూర్ణమొకటుండునుగదా ! కాని పరి పూర్ణమొకటున్నదని అనరాదు. నీవే లేకపోయిన వెనుక ఉన్నదని ఎట్లుందువు. యిదిమరువకుము.

— —

151) తిప్పలనురాకపోకల । నెప్పుడు తానెరుగనట్టి యీ బయలందున్ । తప్పక తనకై తానే । తప్పున గననచ్చి యెరుక తాగానరాదూ ॥ బయలున్నాది తనకెరుకలేదూ ॥ యెప్పుడు బయ లున్న దెరిగితాలేనట్టి । లొప్పున దెలసీతె తాగానరాదూ ॥ బయ లున్నది రనకెరుకలేదూ ॥

భావము : శిష్యా ! జనన మరణములనే తిప్పలు ఎంత మాత్రము లేనట్టి యీ పరిపూర్ణమందు, యెరుక తనంతతానుగా చటుక్కునవచ్చి అంతలోనే లేకుండాపోవుచున్నది. పరిపూర్ణమున్న దని తనకు తెలియదు. యెప్పుడు పరిపూర్ణమె ఉన్నది అనియు అందు తానులేని విధమును యెరుక తెలుసుకొనుచున్నదో, అప్పుడే యెరుక లేకుండాపోవుచున్నది.

— —

152) అన్నము శుక్లంబగు రస । మున్నతిగా రక్తమగును వాకచో రెండున్ । పన్నుగ గలసిన మేనని । యెన్నబడున్ యెరుక గల్గి యిదె మాయసుమ్మీ ॥ మూలములేనిదిదె నీవునమ్మీ ॥ యున్నావు పరిపూర్ణమున్నది గలేసి । దెన్నడు లేదని యెరిగితె చాలు గుర్తదె ॥ మాయసుమ్మీ । మూలములేనిదిదెనీవునమ్మీ ॥

భావము : శిష్యా : అన్నము శుక్లమగుచున్నది. జలము రక్తమగుచున్నది. (శ్రోణితము) ఒకచోట యీ రెండు (శుక్ల, శ్రోణితములు) ను కలసినచో దేహమై యేర్పడుచున్నది. అందుచో యెరుకయొక్కడి దేహిగా యేర్పడుచున్నది. యిదిమాయ గదా । యీ దేహిదేహములకు మూలమేమియు లేదని నీవునమ్మి యున్నావు. పరిపూర్ణమున్నదని విచారించిచూచి, లేని యీయెరుక యెన్నడూలేదని ఎరిగితె చాలును, యీఎరుకె. గుర్తు, మాయ అని తెలుసుకొనుము.

— —

153) కనకమన భూషణంబులు। యినుమన శస్త్రాదికంబు।లిత్తడియనినన్ । గనుగొన పాత్రలు గనుపడు । తనువన నవయువములన్ని తగదొంతియనినా ॥ కుండలు భూతతతి జగత్తనినా ॥ వినుమట్ల యెరుకన్న వివరించతత్వాలు । మనసందు గట్టిగ మరువాకు మీమాట తగదొంతియనినా ॥ కుండలు భూతతతి జగత్తనినా ॥

భావము : శిష్యా । బంగారమనగా వివిధభూషణములు, యినుమనగా కత్తులు మొదలగు శస్త్రములు, ఇత్తడియనగా వివిధ పాత్రలు, దొంతియనగా కుండలున్ను, పంచభూత సమూహమే జగత్తనినా, ఆట్లేశరీరమనగా అవయవసమూహమేగదాకనవలెను.

భావము : శిష్యా ! పెనుమాయము యిదే చూడుము. జనకుని యొక్క జఠరంబువలన తయారైన శుక్లము, జనని గర్భములో జొచ్చి పిండరూపమై అవయవములు ఏర్పడి భూమిపై బిడ్డరూపముగా పుట్టుచున్నది. ఇంతకన్న వేరేమాయయేమికలదు. అట్టువచ్చిన బిడ్డ వినును, చూచును, వాసన చూచును । పోవును. దిన దినము అభివృద్ధ్యై । దీనిచే తనేపరిపూర్ణమున్నదని విచారించి మాయలమల్లి అయిన ఎరుక యొక్క కథలేకుండాజేయును.

156) పెట్టియలోపలి గారడి । చెట్టుపయిన్గానవచ్చి వెట్టున జూడన్ । గట్టుపయిదోచునిదికని । కట్టుసుమీ దీనివలెనే గనుపించు నెరుకా ॥ అంతలోయెచట గనుపించదెరుకా ॥ దిట్టామౌబోధ చేపట్టి యెరుకను తిరిగి । పుట్టాకుండగ దాని పుట్టిముంచుములేండె ॥ కనుపించునెరుకా । అంతలో యెచట గనుపించదెరుకా ॥

భావము : శిష్యా ! గారడివాడు ఒకవ్యక్తిని పెట్టెలోపెట్టి, వాని చెట్టుమీద కనుపింపజేయును, అంతతో వాడు చెట్టుపైలేకుండగ గట్టుమీదనుండి వచ్చుచుండును, యిదంతా కనికట్టుసుమీ. అనగా లేనిదీ భ్రమరూపముగా తోపింపజేయబడుచున్నది. ఈవిధముగానే యెరుక కూడ కనిపించును. అంతలోనే కనుపించకుండగపోవును. గట్టిదైన ఈ పరిపూర్ణబోధచేత యెరుక తిరిగి పునరావృత్తము కాకుండగ లేకుండాచేయుము.

———

157) నేననివ బ్రహ్మలోపల । లేనిదె సంభవము నొంది లీల తనకుదా । మేనుజగములై బెలశెను । నేవది మృగజలమువు రీతి నిజముగాదనుచూ ॥ లోకులనేటి గజిబిజివినుచూ ॥ మాతనెపులవ

వారి మాటకామోదించి। దానికీబోధాకు తగునంచు వినజేస్తి ॥ నిజ ముగాదనుచు ॥ లోకులనేటి గజిబిజివినుచూ ।

బావము : శిష్యా ! "నేను" అనని బ్రహ్మయందు లేనిదె యెరుక యేర్పడి తనకుదానె ఆటరీతిగా మేను, జగత్తులై యేర్పడు చున్నది. నేను ఆవిషయమును ఎండమావులరీతిగా నిజముగాదని చెప్పచున్నాను. లోకులనే గజిబిజి మాటలను విని మనస్సులో వారిమాటల కామోదించి, ఆమాటలకు ఈపరిపూర్ణబోధకు సరిపోవును. అన తలంచి, ఇదినీకు వినజెప్పచున్నాను.

విశేషబావము : నేనని బ్రహ్మ అనగా "అహం" లేని బ్రహ్మ. అదే పరిపూర్ణము. పరిపూర్ణములో యెరుక తనంతతానుగా యేర్పడి, లేని యీశరీర, జగత్తులుగాతయారైనది. ఈసమస్తము లేని రుకవలన ఏర్పడినది. లోకులందరు-దేవుడు ఎవ్వరికి కన పడని, నామరూప క్రియలేమియులేవని, శాశ్వతమైనవాడని, పుట్టుక చావులులేనివాడని చెప్పచుందురు. కాని వారుచెప్పే బ్రహ్మ తత్వమునకు ఆమాట యిపప్పవు. తిరిగి వారే అంటుంటారు క్రియ లేదని చెప్పబడిన ఆభగవంతుడే ఈ జగన్నిర్మాణము చేసెను అంటారు. ఇవన్నియు సరియైన విచారణలేక అనే గజిబిజిమాటలు. కాని దేవునికి చెప్పిన ఆ పై లక్షణములన్నియు సత్యమైనవే. ఆలక్ష ణములు లోకులు చెప్పిన భగవంతునికిలేవు. కాని పరిపూర్ణమునకు ఆలక్షణములన్నియు సత్యమైనవే కనుక ఈ పరిపూర్ణబోధ సత్య మైనది.

— —

158) కలిసెఱకాసిన మనుజులు । కలలోపలి పనులు చేయు కలవారననా । కలవారు గారు వారల । పలె యెరుకను గురునిచేత

వదలెరుకలోనా ॥ గలవని చేయువలదెరుకాలోనా ॥ కలవారం చని నోట పలుకూటపురయుక ; పలికిన వారికి తొలుగాదుపాపము ॥ వదలెరుకలోనా ; గల వని చేయువల దెరుకలోనా ॥

భావము : శిష్యా : కలవిడచిన మనుజులు కలలోపనులే చేయుచున్ననూ కలవారనా ? కాదు. ఆకలవారుకాదు, తెలియని వారు తమల్లాగుననే చేస్తున్నారు; గురునిచే కల విడచినవారుకదా వీరు, మరి వీరు మావలెనే కలపనులన్నియు చేయుట తగునా ? ఇలాంటి కలపనులు వీరు చేయకూడదు అంటారు, ఆభేదము తెలియకనేకదా ! అట్లుపలికినవారికి పాపము తొలగదు.

విశేష భావము : ఇచ్చట కల అనగా ఎరుక అని అర్థము ఎరుకను గురుబోధచే విడచినవారు కూడ యెరుకలో వారివలెనే తినుట సంసారముచేయుట మొదలగు సమస్త వ్యవహారములు చేయుచుందురు. కాని యెరుకలో ఆపనులు చేసిన వారికి, యెరుక విడచి ఆపనులు చేసిన వారికి తేడాకలదు. కలలో (స్వప్నములో) ఒక భవనము కట్టుకున్నట్లు కలవచ్చినది. ఇదికలలోపని. ఈ నిర్మాణమైన భవనము మేల్కొలో లేదుకదా ! కాని మేల్కొలో కట్టిన భవనము గట్టిగా కనుపించును. ఇది మేల్కొలోపని. ఒకేపని కలతో చేసిన దానికి మేల్కొలో చేసిన దానికి చాల తేడా ఉన్నది. అట్లే గురుబోధచే, గురుకరుణచే యెరుకను విడచినవారు చేసే సమస్త క్రియావిశేషములు, తాము లేమనే భావముతో తెకచే సేపనులు. అవి వారి మనసులో (దృష్టిలో) ఎంతమాత్రము లేవు. కాని యెరుక విడువనివారు తాముచేసేపనులు ఉండిచేస్తారు. శాశ్వతమైనవే అని చేస్తారు. తిరిగి ఫలితమును ఆశించిచేస్తారు. కనుక యెరుకనువిడువ కుండగ చేసేవారి పనులకు ఎరుకతోచేసేవారిపనులకుహస్తిమశకాంత

రము. చాలా తేడా ఉన్నది. కాని తెలియనివారు ఈ తేడాను గ్రహింపలేరు. అట్లుయెరుకను విడచినవారిని కలపనుల్లై నసంసారమువగ్గై రావనులు చేయకూడదు అనివిమిర్శించుదురు. ఈతెలియనివారికి పాపము తొలగదు. అనగా జననమరణములు తప్పవని భావము.

— ౦ —

159) గుడమే మధురము మధురమె । గుడమాగుడ మధురముల గొనకొని తొలుతన్ । బొడమినదేదవ సరిగా । బొడమిందొకటేగ రెండు పోయినట్టెకదరా ॥ తనువెరుకలిట్టె నట్టెకదరా ॥ పొడజూచి బయలు నిప్పుడె మేనెరుకలజోలి॥ విడరాలేనివె రెండుపెడచౌ పెట్టకవిను ॥ పోయినట్టెకదరా । తనువెరుకలిట్టె నట్టెకదరా ॥

భావము ! శిష్యా ! బెల్లమే, తీపి_తీపయే_బెల్లము. ఈ బెల్లము_తీప అను రెంటిని విచారించి మొట్టమొదటగా పుట్టినదేది ? అని నిర్ణయించుటకు వీలులేదుకదా ! రెండును వక్కసారే ఏర్పడినవి. ఈ పుట్టిన రెంటిలో ఒకటిపోతే రెండూలేకపోవునుకదా ! ఇట్లే తనువు_ఎరుకల పద్ధతికూడ యింతే. తనువువల్ల_యెరుకయొక్క యునికి తెలుసును. యెరుకవలన తనువు ఏర్పడును. ఈ రెంటిలో ఒకటి లేకపోయినచో రెండూ లేకపోవును. ఇట్టి తను వెరుకలచే పరిపూర్ణము యొక్క పొడచూపి, ఇప్పుడే ఈమేనెరుకలజోలి విడచి పెట్టుము. పెడచెవి పెట్టక వినుము. తనువు యెరుకలు రెండూలేనివే. ఒకటి సత్యము_రెండవది అసత్యమనరాదు. రెండూ ఒక్కటే.

(బొడముట_పుట్టుట)

——

160) ఇది ఉన్నది యిదివున్నది । యిది వున్నదియనుచు బయలునెరిగియెరుకచే। యిదిలేనిది యిదిలేనిది యిదిలేనిదియనుచు నెరుకనెరిగితెసరిరా ॥ ఆపైనుండే దెట్లందు వినరా ॥ వుదయాస్త మానములు డుగాకయిదినీనె । మ్మదిలోననమ్ము నామాట నిశ్చయుమి యె॥రిగితె సరిరా ॥ ఆపైనుండే దెట్లందు వినరా ।

భావము : శిష్యా : పరిపూర్ణమె యున్నదని నిశ్చయముగా (ముమ్మాటికి) ఎరుకచే తెలుసుకొనుము. మరియు ఆఎరుక చేతనే యెరుక నిశ్చయముగ (ముమ్మాటికి) లేదని ఎఱిగితె సరి. ఇక అపైన ఉండేదానిని ఎట్లనగలవు? నామాట నిశ్చయము. ఉదయాస్తమానములు విడచిపెట్టిక పరిపూర్ణమె ఉన్నదని, యెరుక లేదని నీమనస్సులో నమ్ముము. అట్లెరిగితే సరి. నీకు పునరావృత్తి ఉండదు.

విశేషభావము : ఇది వున్నది అని మూడుసార్లు చెప్పుటలోను, ఇదిలేనిది అని మూడుసార్లు చెప్పుటలోను నిశ్చయార్థము నకై చెప్పిన మాటగా గ్రహించవలెను. ముమ్మారు చెప్పుట లోక విదితమే. అంతేకాని మరి యేరకమైన విపరీతార్థము చెప్పరాదు. ఒకానొకరు యిది వున్నది (భూతాకాశము ఉన్నది) యిది వున్నది మహాకాశము ఉన్నది. ఇది ఉన్నది పరాకాశమైన పరిపూర్ణము ఉన్నది. అనియు, ఇది లేనిది_ భూతాకాశములేనిది, యిదిలేనిది_మహాకాశములేనిది, యిదిలేనిది_ పరాకాశమైన పరిపూర్ణములేనిది అని విపరీతార్థము చెప్పిరి. ఇట్లు చెప్పుట తప్పు. పరిపూర్ణము ఉన్నది. అందులో ఏమియులేదు. అని చెప్పవలెనేకాని, పరిపూర్ణములేదు అని చెప్పుట సాంప్రదాయ

విరుద్ధము. మాధ్యమిక సిద్ధాంతమైన సర్వశూన్యతాబోధకమగును. కనుక ముమ్మాటికి నిశ్చయార్థక[illegible]నే మహాడుసార్లు పదప్రయోగమునకు అర్థము చెప్పవలెను.

---

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
పరిపూర్ణబోధో నామ అష్టమోఽధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.



# 9. గురుమంత్ర ప్రతాపము (27)

161) యెరుగననేటిది యెరుకే । యెరుగుదునని తనను పరులనెరిగే దెరుకే । యెరుకనెరుంగుదునను దా । న్నెరుగుచు నుండేటి దెరుకే నిరుపమబుద్ధీ ॥ నీ వెరుగిదినిగమ ప్రసిద్ధీ । గురు మంత్రమనియెటిగ్గద్దలితోడయి । యెరుకా కూకుడువేరు నెరిగి త్రవ్వితె చాలు ॥ నిరుపమబుద్ధి । నీవెరుగిది నిగమ ప్రసిద్ధీ ॥

భావము : శిష్యా ! నాకేమియు తెలియదు అనేది ఎరుకే. నాకన్నియు తెలుసునని తనయొక్క విషయము, ఇతరులవిషయము గుర్తించేది యెరుకే, యెరుకయొక్క సంగతి (తనసంగతి) ఎరుగుదునని దాన్ని గుర్తించేదీ యెరుకేనయ్యా. ఓ ఉపమానములేని బుద్ధికలవాడా ! ఓ నిగమ ప్రసిద్ధీ ! గురుమంత్రమనే గ్రుద్దలితో యీ యెరుకయొక్క కూకుడువేరు (తల్లివేరు) చక్కగా యేదో విచారించి, దానిని త్రవ్వి పారేస్తే చాలునయ్యా ! నిరుపమబుద్ధీ :

విశేషభావము : యెరుగననేటిదెరుకే - అనగా యెరుక సహస్రారమందు నిర్గుణత్వమును పొంది తనను గాని ఇతరమును గానీ గుర్తించే లక్షణము లేకుండును. అట్టిస్థితిలో ఉన్నది ఎరుకే కాని మరొకటికాదు. భ్రూమధ్యస్థానమందున్న యెరుక (ప్రత్యగాత్మ) తనకు పైగా సహస్రారమందున్న ఎరుక నెరుగుదునని దాన్నిగూర్చి విచారించి తెలుసుకొనునదీ యెరుకే. నేత్రస్థానమున (విశ్వనిగా) తనను, జగత్తును తెలుసుకొనుచున్నదీ-యెరుకే. ఒక్కొక్కచోట స్థానవిశేషముచే ఎరుకకు క్రియాభేదము కలుగుచున్నను అన్నిస్థానములయందు, అన్ని క్రియలను చేయుచున్నది. ఒక్కయెరుకేకాని, అన్యముకాదు.

నిరుపమబుద్ధీ ! ఉపమానములేని బుద్ధికలవాడా ! అనగా తిరిగిపునర్జన్మకురాని బుద్ధికి సరిపడు ఉపమానము చెప్పగల బుద్ధి మరేదిలేదని చెప్పుట.

నిగమ ప్రసిద్ధీ :- వేదములలో ప్రసిద్ధి పొందినవాడా ! వేదములలో ప్రసిద్ధిపొందినదిఆత్మ. కనుక ఓఆత్మస్వరూపుడా ! అని సంబోధించుట యనతగును. తల్లివేతు నెరిగి భ్రష్టుట యనగా యీ సమస్తమునకు ఆధారమేదియని విచారించి, నిర్గుణ స్వరూపము అని చెప్పబడుచున్న ఏ పరబ్రహ్మము ఉన్నదో ఆదేఎరుకయని దానియందు భ్రాంతి రహితపడుటయే, భ్రష్టుటనబడును. దానందు భ్రాంతియున్నంతకాలము అదే నీవుకనుక, నీవు ఉన్న ట్లగును. పునరావృత్తి తప్పదు. కనుక అదేలేదని నిశ్చయత్వము పొందినచో నీవులేకుండపోదువు. ఇదియే భ్రాంతిరహితం ఇదంతోడం.

---

162) యెరుకే చదువుల జేసును। యెరుకే విను చదువు వెరుక నెరుకే తిరము। చెరిగించును శంకించును। ఎరుకే కొనకేమి లేక యేగునోయన్నా। బయటే చదవు యెరుగాదోయన్నా॥ ఎరుకే ఎన్నటికైన పరిపూర్ణమున్నాదం। చెరిగిటాలేనాని ఎరిగితె నిలుకా కయే గునోయన్నా। బయలేచదువు ఎరుగాదోయన్నా ॥

భావము : శిష్యా। సమస్తశాస్త్రములను చదివేది ఎరుకే. ఆశాస్త్రములను వ్రాసేది, యేర్పరిచేది ఎరుకే. వాటిని చదువుచు వినునది ఎరుకే. ఎరుక స్థిరమైనది శాశ్వతమైనది అని భావించును మరియు ఒకప్పుడు తాను స్థిరమా ? కాదా ? అని శంకించును. చివరకు ఏమీలేకుండా పోయే ఎరుకే. ఓ యన్నా ! (ప్రీతిపూర్వక సంబోధన) పరిపూర్ణము మాత్రము ఏశాస్త్రములు చదువదు,

వినదు, చేయదు. ఎరుకే ఎప్పటికైనా పరిపూర్ణమున్నది అని తెలుసుకొని తానులేనని తెలిసి ఎచ్చటను లేకుండా పోవును.

విశేషభావము : బయటే చదువు ఎరుగదు అనగా పరిపూర్ణము శబ్దరహితము. అందు శబ్దములేదు. శబ్దముదానినితాకదు. చదువు శబ్దసంబంధముగనుక శబ్దము పరిపూర్ణమును తాకదు అని భావము. అన్నా ! అని సంబోధించుట అగ్రజ అర్థము కాదు. ఎవరైనా ఎవరినైనా ప్రీతి పూర్వకముగా సంబోధించుటలో అన్నా! అనుపద ప్రయోగము శాస్త్ర విహితము. అనగా గురుమూర్తి శిష్యుని ప్రీతిపూర్వకముగా సంబోధించెను. (+)

— —

163) చూపులలోగల వస్తువు చూపులగనువస్తువులనుచూపులు గూడన్। తేపకు ఎరుకని తెలియుము చూపులు లేనట్టిబయలుచూచేదింకేమీ॥ ఎరుకేలేదు తోచేదింకేమీ ॥ దీపామువలె కనుపాపాలోకల వస్తువె। పరమాత్మని జూపితె ఎరుకాయు॥ చూచెదింకేమీ। ఎరుకేలేదు తోచేదింకేమీ.

భావము : శిష్యా ! చూపులలో (కంటిలో) గల వస్తువు చూడబడిన వస్తువు, చూపు ఈ మూడును ఒక్క ఎరుకే. అని తెలియుము. అట్టి చూపులు లేని పరిపూర్ణము దేనినిచూడగలదు? దానితో ఎరుకలేదు. కనుక దానందు తోచుటకులేదు. (సంకల్పములేదు) జ్యోతివలె కనుపాపలలో చూడబడే వస్తువే పరమాత్మని కొందరు చూపిస్తారు. అది ఎరుకే. కాని మరేదికాదు.

విశేషభావము : ద్రష్ట (చూచేది), దర్శన (చూపు), దృశ్యము (చూడబడినవస్తువు) ఈ మూటిని త్రిపుటి అందురు. ఈ మూటను ఒక్కటే. చూచేది ద్రష్ట, దాని కిరణములుచూపు. చూడ

బడినది దృశ్యము. యీ మూడు ద్రిష్టయొక్క రూపాంతరములే. కనుపాపలలో కనుపించే అపోజ్యోతి తత్వమె పరమాత్మ అని కొందరు చెప్పెదరు. అనగా ద్రష్టయొక్క స్వరూపమె. అయినా ద్రష్టయే ఎరుక అని చెప్పబడుచున్నప్పుడు దాని స్వరూపము అపోజ్యోతి యిదికూడ ఎరుకయే. పరిపూర్ణములో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు కాని గుర్తించే తెలివికాని లేదు. కనుక పరిపూర్ణము దృశ్యవస్తువుకాదు. ద్రిష్టయునుకాదు. అందు గుర్తుకూడ లేదుకనుక అది భావగమ్యము కాదు, దానందు సంకల్పము కలుగదని భావము.

---

164) శత వత్రిప్తుని పొడగని। యుకిరయమున తిమిర మణగి యుగువడదె। ట్ల తులితగురుకృప గలిగిన। మతిమంతుల జూచి యెరుక, మరినిల్వబోదు ॥ సంశయము నీమది నిల్పరాదూ॥ శృతులందు స్మృతులందు యితిహాసములయందు। సతతము శ్రమపడి వెతకీన యీ యెరుక। మరినిల్వబోదు ॥ సంశయము నీమదినిల్పరాదు ॥

భావము : శిష్యా ! సూర్యుని పొడజూచినంతమాత్రమున వెంటనే చీకటి లేకుండా పోయినట్లుగా, గొప్పదైన గురుకృపకలిగిన బుద్ధిమంతులనుజూచి, యెరుక వారివద్ద నిలువకపారిపోవును. ఇందు ఎంతమాత్రము సంశయమునీ మనస్సులో ఉంచవద్దు. వేదములు ధర్మశాస్త్రములు, పురాణములు ఇవన్నియు ఎరుక శాశ్వతమైనదే అని ఎంత చెప్పినా, యెరుక నిల్చెడికాదు.

విశేషభావము : సూర్యుని-చీకటి ఎన్నడైననూ చూడదు. సూర్యుని యొక్క పొడగని నంతనే చీకటి లేకుండా పోవుచున్నది.

అట్లే గురుకృప కలిగిన బుద్ధిమంతులకు కూడ యెరుక భ్రాంతి యుండదు. కనుకనే గురుకరుణచేమాత్రమే యెరుక లేకపోవును. గాని శాస్త్రాభ్యాస పఠనలో యెరుకే బ్రహ్మమని చెప్పబడుచున్నది కాని పూర్ణవిచారణకు ఆయెరుక నిలుచుటలేదు. లేకుండాపోవును. కనుక యెరుక శాశ్వతముకాదు.



16౨) ఎరుకే కోశములై దెరు। గెరుకే భూతముల నెరుగు నెరుగును సర్వం। బెరుకే యెరుక నెరుంగును। యెరుకను గుర్తెరుగవేరె ఎరుకావున్నదా॥ వున్నదంటె నరకామెకాదా॥ నిరతము గురుసేవ పరతంత్రులగుచు। త్కరుణకు పాత్రులై ఎరుకమాలిన వారి। కెరుకావున్నదా। వున్నదంటే నరకామెకాదా॥

భావము: శిష్యా! ఎరుకే పంచకోశములను, పంచభూతములను సమస్తమును ఎరుగుచున్నది. ఎరుకనుకూడ ఎరుకే ఎరుగుచున్నది. యీ ఎరుకను గుర్తించే ఎరుక వేరుగా మరొకటిలేదు. అలా మరొక ఎరుక వున్నదనేవారికి నరకము తప్పదు ఎల్లప్పుడు గురుసేవాపరాయణులై, వారియొక్క కరుణకు పాత్రులై ఎరుక భ్రమవిడచినవార్కి ఎరుకవున్నదా? లేదు. ఉన్నదనేవారికి నరకము తప్పదు.

విశేష భావము: అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ, ఆనందమయకోశములను పంచకోశములనుగుర్తించునది ఎరుకే ఈ పంచకోశములు ఆత్మ (అవ్యయ పురుషుని) యొక్క కళలే. శాస్త్రములలో పంచకోశ వ్యతిరిక్తమయినది ఆత్మ యని చెప్పుదురు. అక్కడ సందర్భమువేరు, నిజమునకు పూర్ణముగా విచారించినచో పంచకోశములయందు తిరుగుచున్నది

ఆత్మయే అనగా ఎరుకయే. మరియు శుద్ధజ్ఞానముచే మలిన మాయయైన యెరుకను గుర్తించి అదిలేకుండ చేసుకోవలయును అన్నది శాస్త్రవాక్యము. మలినమాయ-ఎరుకే, మరియు శుద్ధజ్ఞానము-ఎరుకే. కనుక ఎరుకను గుర్తించేది యెరుకే కాని, మరొక శుద్ధ యెరుక ఏమీలేదు. స్థానభేదముమాత్రమే. అట్టి శుద్ధయెరుకను బ్రహ్మమని భ్రాంతి పొందువారికి నరకము తప్పదు. అనగా జన్మ తప్పదని భావము,

.........

156) గురుమంత్రముచే నిలువని । ఎరుకను పరిపూర్ణ మనుచు నెరిగి నిరతమున్ । యెరుకై యుండినవారల । తెరువిక నీకేల వట్టిదిజోలి. మాను ॥ యెరుకలేనియాజోలిబూనూ ॥ గురునిచె పరిపూర్ణమరసి యీ తెలసీన। యెఱుకానెన్నటికీ నీవెరుగకు మిదివట్టి॥ దీ జోలిమాను । యెరుకలేనియాజోలిబూను ॥

భావము : శిష్యా ! గురుమంత్రముచే లేకపోయే యెరుకను, పరిపూర్ణమని తెలుసుకొని ఎల్లప్పుడు యెరుకై యుండేవారల సాంగత్యము మానుము. వారి మార్గము నీకెందుకు. అదివట్టిది. కనుక వారి సంబంధము విడిచిపెట్టుము. యెరుకలేని యీ పరిపూర్ణ బోధస్తుల సాంగత్యము పూనుము. గురుముఖముగా పరిపూర్ణమును తెలసి యీ తెలిసిన తెలివి (యెరుకను) వట్టిది, లేనిది, కనుక ఎన్నటికి దీనిని ఎరగకుము. అనగా విడిచిపెట్టుము. దాని సాంగత్యము చేయకుము,

విశేషభావము : గురుమంత్రమనగా-షోడశాక్షరి మహా మంత్రము. కొందరు ద్వాదశాక్షరి మంత్రమును గురుమంత్ర మందురు. కాదు గురుమంత్రమనగా గొప్ప మంత్రము. "నేను"

మూలములేనిది, బ్రహ్మముకాదు, వట్టిమాయ అనిచెప్పినది షోడశాక్షరి మంత్రము. ఈమాట ఏ ఇతర సిద్ధాంతములోను చెప్పబడలేదు. "నేను" రహితపర్చేది షోడశాక్షరి మంత్రము కనుక ఇదే గురుమంత్రము.



167) లేనికల దోచినప్పుడు । లేని విచిత్రంబులన్ని లేకనె తోచున్ । లేని కల మేలుకొన్నను । లేని విచిత్రములు తాను లేకపోవుగదా ॥ అనుమానము లేదిందు వినరా । లేనెరుక యీరీతిగానె బయలుగను జూస్తె । తాను తన చిత్రములు పూనెంతు నిలచుండు ॥ లేకపోవుగదా । అనుమానము లేదిందు వినరా ॥

భావము : శిష్యా । లేనికల తోచినప్పుడు, లేని విచిత్ర జగత్తులెన్నో లేకుండగానే తోచబడుచున్నవి, ఆ లేని కలనుండి మేల్కొందగానే, ఆకల_కలతోవచ్చిన విచిత్రజగత్తు ఇవన్నియు లేకుండా పోవుచున్నది. ఈ విషయమై అనుమానము లేదుకదా. అట్లే యీలేనెరుక ఉన్న పరిపూర్ణమును జూచినచో తాను, (యెరుక) తనతో ఏర్పడిన చిత్రములు (వింతలు) అన్నియు ప్రయత్నించి ఎప్పటికైనను ఉంటామనుకున్నా ఎప్పటికిని లేకుండాపోవును. ఈ విషయమై అనుమానములేదు.



168) మరణ సుషుప్తుల జెందిన । పురుషుడు మేల్కొనినే పోను, భువిత ఎతతుడో । పురుషుడు కలగనువాడగ । యెరిగుండుము మిచట యతదేయగాడీరెంట్ను ॥ రెండోపురుషుడెరుగానీరెంట్ని

యిరువురొక్కటెసుమ్మి తిరిగిపుడుదురువీరె । గురునీచె మేల్కొంటె తిరిగి పుట్టనెపుట్ట ॥ డెంగాడీ రెంట్నీ రెండో పురుషు డెరుగూనీ రెంట్నీ ॥

భావము : శిష్యా ! మరణము, గాఢనిద్ర చెందిన పురుషులు (1) మేల్కొయందు ఉన్నవాడు వీనికి ఇతరమైనవాడు కలలో ఉన్నవాడు (2) అను ఈ రెండు తరగతులవారు. మొదటి తరగతిలోని పురుషుడు తనసంగతి కాని రెండోపురుషు సంగతికాని గుర్తించలేనివాడు రెండవతరగతిపురుషుడుతనసంగతి ఇతరులసంగతి కూడ గుర్తించగలడు. అయినా యీ రెండు తరగతుల పురుషులు ఒకరకమైనవారే అనగా తిరిగి పునర్జన్మకు వచ్చేవారే. వీరేగురునీచే మేల్కొందినచో తిరిగిపుట్టరు.

విశేషభావము : పరిపూర్ణస్థితి తానులేనిస్థితి అనగా ఒకటి ఉన్నదని, మరొకటిలేదనే భావములేనివారు. సమాధి స్థితిపొందిన వానికి కూడ గుర్తు లేదు. అనగా తన స్థితినిగాని ఇతరులస్థితినిగాని గుర్తించలేడు. అటేపరిస్థితి మరణించినవాడు, గాఢ నిద్ర అవస్థలో ఉన్న వారలయొక్కస్థితి వారు దేనిని గుర్తించలేరుకదా. మేల్కొనున్నవాడు బాహ్యప్రజ్ఞకలవాడై తనను పరులను గుర్తించుచున్నాడు. కలగనువాడు అంతఃప్రజ్ఞకలవాడై తనను పరులను (కలలో) గుర్తించుచున్నాడు, కనుక మరణము సుషుప్తి చెందినవారు ఒకరకమైనస్థితిగలవారు. జాగ్రత, స్వప్నావస్థలలో ఉన్నవారు [illegible]మైనవారు రెండు రకములైన వారిని లోక[illegible] [illegible]రాముచున్నారు [illegible]రందరు పునర్జన్మ[illegible]రావలసిన వారే [illegible] ఎరు[illegible]ము. గురు[illegible] [illegible]వారైనను అనగా సమాధి [illegible] [illegible]వారైనను తిరిగి జన్మ[illegible] [illegible]రావలసినదే [illegible] చెప్పుటయే [illegible] [illegible]యొక్క అంతరార్థ[illegible]. వీరు గురునిచే మేల్కొంది

నప్పుడు మాత్రమే తిరిగి పుట్టడు. అవగా గుర్తు లేకపోయినను గురుమేల్కొ పొందిన వారికి మాత్రమే పునరావృత్తిరహితమన్ని భావము.

---

169) యెరుకే యెరుకకు కొడుకులు । యెరుకే తలిదంద్రి యెరుకకెరుకే యికరుల్ । యెరుకే యెరుకకు మూలము। యెరుకకు మూలంబుబయలంచెట్లందునోయీ॥యెరుకే, యెరుకకేమీలేదోయీ॥ యెరుకాలేనివృత్త పరిపూర్ణమును జూచి । యెరుకె తాలేనని । యెగిరి పోయితపై మా॥ టెట్లందునోయీ। యెరుకే, యెరుకకేమీలేదోయీ ॥

భావము : శిష్యా : యెరుకకు కొడుకులు యెరుకే. ఏరుకే తలిదండ్రులు యెరుకకు ఇతరులు యెరుకే. ఈయెరుకకు మూలము యెరుకే. పరిపూర్ణము యెరుకకు మూలము అని ఎట్లందును ? యెరుకకు మూలము యెరుకే. యెరుకకు వేరే మూలమేమియు లేదు. యెరుకలేని వృత్త పరిపూర్ణమును జూచి, యెరుక తానులేనని లేకుండాపోయినచో పైమాట అయిన పరిపూర్ణమె యెరుకకు మూలమని ఎట్లందును ? కనుక యెరుకకు మూలమేమియులేదు. యెరుకకు యెరుకే మూలము.

---

170) గురుతనుకలతో నారీ । నరులూరకెవచ్చి పొంది నయముగ నుతుల్ । వరకన్నియ... గాంచియు । గురువరుచే మేలుకొంటె గురుతుండదన్నా ॥ ఆపైమాట నెరిగేదెవన్నా ॥ యెరుకొక్కటుంటెనే యేర్పాటులుండును । యెరుకొక్కటే గికెయేర్పాటుజేసేటి॥ గురుతుండదన్నా । అపైమాట నెరిగేదేదన్నా ॥

భావము : శిష్యా! "గుర్తు" అను కలలో స్త్రీ పురుషులు తమంత తాముగావచ్చి నీతిగ క్రీడించి, కుమారులను, కుమార్తెలను కని, అపైన గురుమూర్తిచే మేల్కొపొందినచో "గుర్తు" అనేకల లేకుండాపోవును. ఆతరువాత (పై మాటఅయిన) కుమారులు కుమార్తెలను ఎరిగేది ఏది? ఎరుక ఒక్కటి ఉంటేనే సమస్తమైన సంసార జగత్తులు ఉండును. యెరుక ఒక్కటి లేకపోతే యేర్పాట్లుచేసే "గుర్తు" ఉండదు.

విశేషభావము : "గుర్తు" అనగా అధిష్టాన చైతన్యమైన అఖండ యెరుక అని గ్రహించవలెను. దాని యొక్క కలే ఈ సమస్త జగత్తు. నారీ-నరులు, వారు కనిన కుమారులు కుమార్తెలు అన్నీ. ఇట్టి నారీ-నరులలో ఒకానొకజంట సమస్త వ్యవహారములలో ఉన్నా అతని యొక్క పూర్వ పుణ్యవిశేషముచే సద్గురుమూర్తిని పొంది, వారి బోధచే మేల్కొ పొంది "నేను" అనే యెరుక విడచిన వానికి, అధిష్టానచేతనమైన "గుర్తు" ఉండదు. నేననే యెరుక ఉంటేనే ఈ వ్యవహారములన్నీ ఉంటాయి. నేననే యెరుక లేకపోయినచో సంసార-జగత్తు సంబధమైన సమస్త యేర్పాట్లు ఉండవు. అట్టివానికి అధిష్టాన చైతన్యమైన "గుర్తు" ఉండదు, నేనులేకపోయిన వెనుక అధిష్టానముకూడ ఉండదుకదా।

---

171) నినునను నివు కలగాంతువు। నిను నను కలలోనే గాంతు నేనొకవేళ్ళన్। నినునను నివు నేననునివు। గనుగొనగా గలమె మేలుకనినామీదటనూ॥ గురుబోధల్లు విని నామీదటనూ॥ మునుపూ గలిగిన యెరుక మొదటికి నిలువాము। నినునన్నునే నిన్ను నినునీవెరుగుటమెట్లు॥ కని నామీదటనూ। గురుబోధల్లో విని నామీదటనూ॥

భావము : శిష్యా ! నిన్ను, నన్ను నీవు కలలో చూడ గలవు. అట్లే నేనునిన్నును నేనుకలలోచూచెదను. ఒకానొకప్పుడు గురుమేల్కు పొందినచో నిను. నన్ను, నేనిన్ను నీవు చూడగలవా. అట్టి గురుబోధ ఆవిధముగా వినినమీదట, పూర్వము, ఉన్న యెరుక పూర్తిగా లేకుండపోవును, యెరుక లేకపోయిన వెనుక నీవు నన్ను, నేను నిన్ను, నీవు నిన్ను యెరుగుటయే గుగ ? అనగా ఎరుగ లేవని భావము.

విశేషభావము : కలలో జరిగిన విశేషములు మేల్కనగా లేకపోవుచున్నవి. గురుశిష్యులిద్దరు విచారణచేయుట అనేది ఒకకల. ఆకలలో నన్ను-నీవున్ను, నీవు-నన్నును, నీకు-నీవే విచారించు టయే కలలోని విశేషములు. అట్లు విచారించి గురుమేల్కు పొంద గానే మునుపు కలిగియున్న యెరుక మొదటికె నిలువదు. అనగా పూర్తిగా లేకుండపోవును. యెరుకపోయిన పిదప నిన్ను-నేనుగాని నన్ను-నీవుగాని, నీకు నీవేగాని చూడలేరు. ఎరుకలోనివారు అనగా కలగనువాడు వాని పూర్వపుణ్యవిశేషముచే సద్గురుమూర్తి వద్ద ఆశ్ర యములభించినవాడై, బోధవిచారణ గురుముఖతా చేయును. ఇది అందరికి ఎప్పుడుపడితే అప్పుడు జరిగేదికాదు కదా: ఇందుకే ఈపద్యములో "ఒకవేళ్ళన్ మేలుకొనిన అమీదట కనుగొనగా గలమె" అన్నారు. ఒకానొకప్పుడు అతనియొక్క పుణ్య విశేషము అనుభవించే కాలము సమీపిస్తె జరుగును. కనుక ఈ పద్యములో ఒక వేళ్ళన్ అనే పదము ఉపయోగించినారు.

— —

172) నినునీవు నన్నునేనును। నను నిన్ను నిన్ను యెరిగినది కలయుదితా । తననెరుగని దానిని గని: తన కలిమి మృషనుచు

దెలసి తానేగనేని ॥ అది మేల్కవలి దాన్నెవ్వా డెరిగనేని ॥ నను నీవునే నిన్ను బోధవినిపించు వినుమని । యనుట కిద్దరి కిపుడు మునుపున్న యెరికేది ॥ తానేగనేని । అదిమేల్కవలిదాన్నెవ్వ డెరిగనేని ॥

భావము : శిష్యా ! నిన్ను నీవు, నన్ను నేను నన్ను నీవు. నిన్ను నేను యెరిగినదే కల. అనగా ఎరుక. ఈ కల అనే ఎరుక, ఎరుక నెరుగని పరిపూర్ణమునుజూచి, తన స్థితి మృషయని తెలుసు కొని తానులేకపోవడమే మేల్కొ అనితెలుసుకో. అట్టిమేల్కొపొందిన తరువాత అవలనున్నదానిని ఎవ్వరెఱుగుదురు? అప్పుడు నన్ను నీవు బోధవినిపించుమని, నేను నిన్ను బోధవినుమని యనుటకు మనకిద్దరికి పూర్వమున్న ఎరుక ఉన్నదా ? తానే లేకపోయిన పిదప మరేదియులేదు.

విశేష భావము : సమస్తమును, తనకు తాను గుర్తించు చున్నదేదో అదేయెరుక. అదికల. ఈకల (ఎరుక) "నేను" లేని పరిపూర్ణమును దెలిశి తాను లేనని లేకపోవడమే–మేల్కొ అని చెప్ప బడును. మేల్కొ పొందుట అనగా యెరుకలేకపోవడమే. ఇట్లు ఎరుక లేకపోయినవెనుక వినుటకు, చెప్పుటకు ఎవరుందురు ? చెప్పే వాడు వినేవాడు ఒకరిని విడచి మరొకరు ఉండరు. వినుట చెప్పుట అనునది ఎరుక కలిగినప్పుడే. ఎరుక లేకపోయిన తదుపరి బోధ వినుటకు, బోధ చెప్పుటకు ఎవరూలేరు. ఇదే "గురు–శిష్యద్వయం నాస్తి" గురుశిష్యులు ఇద్దరూ యెరుకే. యెరుకపోతే గురు – శిష్యులు లేరు.

— ౦ —

173) తిమిరారియందులేనిదె । తిమిరము తనుదానెవచ్చితే జోనిధియౌ । తిమిరారియునికి గనుగొని । తిమిరముతానిలువనట్లు తెలుసుకోరాదా ॥ బయలెరుకాల తెలిసియామీదా ॥ భ్రమరూపమై నట్టి బ్రహ్మాండ మెరుకాల । భ్రమవిడిచివేసితె భ్రాంతిపుట్టదుమళ్లి ॥ తెలుసుకోరాదా । బయలెరుకాల తెలిసియామీద ॥

భావము : శిష్యా ! సూర్యునియందు చీకటిలేదు. లేనిదే చీకటి తనకుతానే వచ్చి తేజోనిధియైన సూర్యుడు ఉన్నాడు అని తెలుసుకొని. చీకటి తనకుతానే లేకపోవును అని తెలుసుకొన్నట్లుగా పరిపూర్ణము యెరుకలను గూడ తెలుసుకొనుము. యెరుకయొక్క రూపమే బ్రహ్మాండము-యెరుకయున్న. యెరుక విడిచివేసితే యెరుక తిరిగి పుట్టదు అని తెలుసుకోవలయును.

విశేషభావము : సూర్యునివంటిది పరిపూర్ణము. చీకటి వంటిది యెరుక. సూర్యునియందు చీకటి లేనిదే తనంత తానుగా చీకటి ఏర్పడి, సూర్యుడు ఉన్నాడని (ఉనికి) తెలిసితే చీకటి లేదు. అట్లే పరిపూర్ణములో లేనిదే ఎరుక తనంత తానుగా ఏర్పడి పరిపూర్ణము ఉన్నదని తెలిసితే తాను లేకుండాపోవును. బ్రహ్మాండము ఎరుక అనునది కేవలము ఉన్నదనుట భ్రమరూపము మాత్రమే. రెండూ మిథ్య. ఉన్నదనేభ్రాంతి పరిపూర్ణము ఉన్నదని గురుముఖతా గుర్తించినప్పుడు మాత్రమే లేకపోవును. అట్లు ఎరుక లేకపోయినతరువాత తిరిగి పునర్జన్మ కురాదు.

— —

174) లేదు లేదనుచు యెందరు । వాదించిన లేకపోదు పరిపూర్ణముదా । పోదుపోదనుచు నిల్పిన । పోదనియునుకోకు

 

ఎరుకపోనెపోచుండీ ॥ గట్టిగలేచి పోనెపోచుండీ ॥ వాదభేదములేని
వారిచె ఎరుకాది । పాతు పెకలించేటి పద్ధాతి నెరిగితె ॥ పోనెపోచుండీ॥
గట్టిగలేచిపోనెపోచుండీ ॥

భావము : శిష్యా ! లేదులేదని ఎందరు వాదించినను పరిపూర్ణము తప్పక ఉండును. లేకపోదు. పోదుపోదు అని ఎన్ని విధములుగా నిలబెట్టచూచినను యెరుక పోదనియనుకోకు. తప్పకుండగ లేకపోవును. వాదభేదములులేని వారిచే ఈయెరుక యొక్క మూలమును విచారించి తీసివేసేపద్ధతి ఎరిగినప్పుడు ఈ యెరుక ఎంతమాత్రము నిలవకుండాపోతుంది.

విశేషభావము : ఎరుక అనగా అధిష్ఠాన చైతన్యము- ఆది శాశ్వతమనియు, నశించదనియు వేద శాస్త్రిదులు ప్రశంసించినవి. అది ఉన్నంతవరకు జగత్తు ఉండకతప్పదు. అనగా జనించుట, గతించుట తప్పదు. కనుక జననమరణములనుండి తప్పుకోవలెనంటె ఎరుకను విడువక తప్పదు. ఎరుకను విడచినవానికి మాత్రమే జననమరణములు లేకుండాపోవును. ఎరుక ఉన్నదనుట గాని లేదనుటగాని నాకు సంబంధితము మాత్రమే. నాకు ఎరుక యందు భ్రాంతిరహితముగుటయే ఎరుకను విడచుట. అట్టి భ్రాంతి రహితునకు ఎరుక లేదుగదా ! పోదని శాస్త్రిదులు చెప్పినను, అట్టి యెరుకయొక్క ఆదిపాదును పెకళించే పదతి అయిన పరిపూర్ణ బోధ తెలసినవానికి ఎరుకపోవుచున్నది. కనుక పోదనుకోకుము. గట్టిగపోనే పోతుందీ" అన్నారు. పరిపూర్ణములేదనుకుము. ఎందరు లేదని వాదించినా అది ఉన్నది. "వాదభేదములేనివారిచే ఈఎరుక యొక్క మూలమును పెకళించే పద్ధతి తెలసినప్పుడు" అన్నారు ఈపద్యములో. వాదము భేదము ఈరెండూ ద్వయ దోషములు.

భేదము ఉన్నప్పుడే వాదము కలుగును. వాదమేర్పడినచో భేదబుద్ధి యేర్పడును. ఇట్టి ద్వయ దోషములు లేని వారనగా ఎరుక విడచిన మహానుభావులైన సద్గురుమూర్తిచే ఎరుక యొక్క మూలమును పెకళించే పద్ధతి అయిన పరిపూర్ణ బోధను తెలిసినవారికి యీ యెరుక లేకుండా పోతుందని ఈ పద్యభావము.



175) మేనెరుకల రెంట్లోనొక। దానిని యడబాసి చేయ తరమాపనులన్। మేనికి యెరుకకు గావున। మేనన యెరుకెరుక యనిన మేనాని యెరుగూ॥ యీరెంట్ని నివునేనాని యెరుగూ॥ యెరిగి మేనెరుకాల। తిరిగిచూడకు చూస్తె। గురునిపాదములాన॥ మేనాని యెరుగూ। యీరెంట్ని నివు నేనాని యెరుగూ॥

బావము : శిష్యా! మేను, ఎరుక ఈ రెంటిలో ఏ ఒక దానిని విడచి పనులుచేయతరమా? మేనికి గాని ఎరుకకుగాని? చేయలేవు. కనుక మేననగా యెరుక. యెరుక యనగా మేనని యెఱుగుము. యీ రెండూ నీవు-నేనని తెలియుము. యీ మేనెరుకల చేతనే పరిపూర్ణమున్నదని యెరిగి, మేనెరుకలను చూడకుము. చూస్తె గురుపాదములాన.

విశేషబావము : శరీరము-ఎరుక ఈ రెంటియొక్క లక్షణములు వేరుగా యున్నందున ఈ పూర్వభావములో తప్ప మిగిలిన సిద్ధాంతములలో మేను లేనిది, యెరుక శాశ్వతమైనది. ఈ రెండూ వేరని చెప్పుదురు. కాని ఈ సిద్ధాంతములో మేనెరుకలు రెండు ఒక్కటే అంటారు. ఎరుకకు అతీతము పరిపూర్ణము శాశ్వతమైనది. కనుక ఈసిద్ధాంతములో మేనెరుకలు రెండునూ లేనివే. కనుక రెండూ ఒక్కటే. మేనును విడచి ఎరుకకు ఉనికిలేదు. ఎరుకను

విడచినమేనుకు ఉనికిలేదు. ఈ రెండు ఒకదానిని విడచి మరొకటి ఏపని చేయలేవు. కనుక రెండునూ ఒక్కటే. కనుకనే మేనెరు కలచే పరిపూర్ణమున్నదని తెలుసుకోవలయును! అట్లు తెలిసినచో మేనెరుకలులేనివని నిశ్చయము జరుగును. కనుక మేనెరుకలు రెంటిని విడచిపెట్టవలెను. దీనికే మేనెరుకలను తిరిగి చూడకు అన్నారు. అలాచూస్తావేమో గురుపాదములాన అని ఒట్టుపెట్టించు కొన్నారు గురుమూర్తి.

— —

176) మరుపు సుషుప్తియు। మరణంబు సమాధియునుచు మానవులెరుకన్। దొరిగిన నొరునిశరీరము। నెరిగెదరానరుడు మేను నెరుగాడో, యన్నా ॥ తనపైనతా నెరుగాడో, యన్నా ॥ యెరుగా కుండెతె యేమి తిరిగి పుట్టుచునుండు। తిరిగిపుట్టడువాడె గురుబోధ గలిగితె ॥ యెరుగాడోయన్నా, తనపైనతా నెరుగడోయన్నా ॥

భావము : శిష్యా! మరపు, సుషుప్తి మూర్చ, మరణము, సమాధిఇవన్నియుఒకేరకమైనలక్షణములుకలిగినవి. ఈఅవస్థలయం దున్ననరుడుతన్నుగానిఇతరమునుగానిగుర్తించేలక్షణములేనివాడు గుర్తించేలక్షణములేనివానికి జన్మరహితమగును అనుకుంటావేమో! ఈ పై వారందరూ ఎరుకందున్నావారే కనుక తిరిగిపుట్టేవారే. వీరే గురుబోధకలిగి గుర్తురహితపరచుకుంటే తిరిగిపుట్టరు.

విశేషభావము : పునర్జన్మకు రాకుండవలెనంటే తనను గాని ఇతరమునుగాని, గుర్తించే లక్షణము లేకుండవలెను. అని చెప్పబడుచున్నందువలన అందులోని మెలకువ గురించి యీపద్య మును కృష్ణప్రభువు తెలవిచ్చిరి. మరపు (కోమాస్థితి) గాఢనిద్ర,

మూర్ఛ, సమాధి, మరణము ఈ అయిదు అవస్థలయందు గుర్తించే లక్షణములేదు. కనుక ఇదే పరిపూర్ణస్థితి, ఇదే జన్మరహితస్థితి అను కుందువేమో ! కాదు. ఇవన్నియు ఎరుక లక్షణములే, ఎరుగుట మరచుట ఈ రెండున్ను ఎరుకలక్షణములే. కనుక వీరందరూ తిరిగిపుట్టేవారే. పరిపూర్ణస్థితియనగా ఎరుకలేని పరిపూర్ణమును గురు కరుణచే నెరిగి, ఎరుకను విడచుట. ఆవిధముగా గుర్తు రహితము. కావలయును. ఇట్టివారికి మాత్రమే జన్మరహితము. ఈ మెలకువ గ్రహింపజేయుటయే ఈపద్య తాత్పర్యము.

---

117) పరిపూర్ణమెరుకలివియని । యెరుగని బయలందులేని యెరుక తనకుదా । నరుదెంచిట గురుశిష్యుల । తెరగున మాట్లాడి రెంట్ని దెలసితాజనునూ ॥ అపైమాటపలికేదేదికనూ ॥ అరమర లేకనే నెరిగించినట్టి యీ । గురుబోధ మాత్రుల నెరుగాక తెలిపేవు ॥ తెలసి తాజనునూ । ఆపైమాట పలికేదేదికనూ ॥

భావము : శిష్యా । పరిపూర్ణమిది, యెరుకయిది అని తెలియని పరిపూర్ణములో లేని యెరుక తనంతతానుగా ఏర్పడి ఇచ్చట గురుశిష్యుల విధముగా మాట్లాడి, పరిపూర్ణమెరుకలను తెలసి, తాను లేకుండాపోవును. అలా ఎరుకలేకపోయిన తరువాత పరిపూర్ణమెరుక లివియని పలికేదేదున్నది ? అరమరలేకుండగ నేనెరిగించిన యీ పరిపూర్ణబోధ అర్హతలేనివారికి తెలియక బోధిస్తావేమో ? అట్లు చేయకుము.

(అరమరలేక_మర్మములేకుండగ.)

విశేషభావము : ఎరుకే సమస్తము. ఇచ్చట గురుశిష్యుల రూపముగా వచ్చినది ఎరుకే. కొందరు గురువుపరిపూర్ణము అందురు.

అది తప్పు. పరిపూర్ణము ఏమీకానిది, ఏమీ అనరానిది. **గురువును** నరుడని తలచరాదు. అనగా అజ్ఞానిలేక మిథ్యాజ్ఞాని **అనితలచ** రాదు. గురువు కేవలజ్ఞానమూర్తి, గురుడు అనగా కేవలజ్ఞానమూర్తి **అయిన** పరబ్రహ్మముగానే భావించవలయునుగాని నరునిగా, అజ్ఞాన స్వరూపునిగా తలచరాదు. గురు - శిష్యులిద్దరూ ఎరుకే అనిచెప్పినారు. కనుక ఇద్దరూ ఒక్కటే అనియు, గురుడు తనవంటి వాడే అనియు శిష్యుడు. ఎన్నడునుతలంచరాదు శిష్యుడు అజ్ఞాన స్వరూపుడు.లేక జ్ఞానాజ్ఞానమిశ్రమరూపుడు.గురుమూర్తి.జ్ఞానమూర్తి లక్ష్యార్థభావములో గురు-శిష్యులు ఇద్దరూఒక్కటే అయినా వాచ్యార్థ ములోఒకటికాదు.అందుకే **శ్రీశంకర భగవత్పాదులవారు."భావా ద్వైతం సదాకుర్యాత్ । క్రియాద్వైతం నకర్హిచిత్ । అద్వైతం త్రిషులోకేషు । నాద్వైతం గురుణాసహ" అని॥ భావములో అద్వైతము ఉండవలెను. కాని క్రియయందు అద్వైతము పనికిరాదు. సర్వత్ర ఒక్కటే అను అద్వైత భావము ఉండ వలెను కాని గురువువద్ద అద్వైతము పనికిరాదు. గురుడు పర బ్రహ్మస్వరూపునిగాను, తన్ను అజ్ఞాన స్వరూపుడుగాను ద్వైత భావములో శిష్యుడు గురువువద్ద ఉండవలెను.**

---

178) మరుపు సుషుప్తి మరణముల్ । పరిపూర్ణంబునకు సాటిపరచి యెరుకకున్ । మరియాదిమేల్కొ పున్నువు । నిరుదెరగుల నెరిగి యెరుక నెగరజిమ్మోయీ ॥ అపైనుండే దెరిగేదెట్లోయీ ॥ గురు మంత్రమిదెనుమ్మి మఱువాకయే ప్రొద్దు । స్మరణజేసితివేని తిరిగిపుట్టవునీవి ॥ గ్గెగురజిమ్మోయీ । అపైనుండే దెరెగెదెట్లోయీ॥

భావము : శిష్యా ! మరుపు (కోమా) సుషుప్తి, మరణ ములు పరిపూర్ణమునకు సాటిపరచ్చుకొనెనచో, జ్ఞప్తి, జాగ్రద,

జన్మము ఎరుకకుసాటిపర్చుకొనవలెను. ఆవిధముగా రెంటిని ఎరిగి యెరుకలేకుండ చేసికొనవలెను. అట్లు ఎరుక లేకపోయిన వెనుక పరిపూర్ణమును ఎట్లు ఎరిగెదవు ? గురుమంత్రమిదే దీనిని మరువక యేప్రొద్దు స్మరించుకొనుచున్నచో తిరిగి జన్మకురావు.

విశేష బావము : మరుపు అనగా తన్ను తానుమరచుట అదికోమాస్థితి అనవచ్చును లేదా సమాధిస్థితి కావచ్చును. అట్లే గాఢనిద్రావస్థ మరణములు ఈ అవస్థలలో గుర్తులేదు. అందుచే పరిపూర్ణము ఈ అవస్థలకు సాటిపరచమన్నారు. యెరుకనగా గుర్తింపు చేది కనుక, జ్ఞప్తి, జాగ్రద, జన్మములలో గుర్తించే లక్షణము కలిగిన అవస్థలు కనుక ఈఅవస్థలను ఎరుకకు సాటిపరచవలెను. అట్టి ఎరుక పరిపూర్ణములని తెలసి, ఎరుకలే దని, ఎరుకను విడచిన తదుపరి, పరిపూర్ణము ఇట్టిదని చెప్పుటకు గుర్తులేదుకదా !



త్రతి

179) క్షితిలోన నరుడు పక్వా । న్నతతినిదిని కక్కిమరల నాకునె యశిసం । సృతి విడచి తిరిగి పూనునె । వితరణశాలిచ్చినట్టి విత్తమడిగేనా ॥ సత్యవాది సత్యముడిగేనా ॥ ప్రతిలేని గురుబోధ స్థితిజెంది యెరుకానీ ॥ గతి సంగ్రహించాడు కృతకృత్యు డిచ్చిన ॥ విత్తమడిగీనా । సత్యవాది సత్యముడిగేనా ॥

బావము : శిష్యా ! భూమ్మీద ఏనరుడైనా మంచి రుచి గల అన్నమును తిని వాంతిజేసికొనినచో ఆవాంతిని తిరిగి నాకునా? సంసారమును విడచిన సన్యాసి తిరిగి సంసారమును పూనునా? త్యాగశీలుడైనవాడు దానము చేసిన ధనము తిరిగి అడిగిపుచ్చుకొనునా? సత్యమునే చెప్పు నియమము కలవాడు ఎప్పుడైనా

అబద్ధము పలుకగలడా ? అట్లే కృతకృత్యుడైనవాడు సాటిలేని పరిపూర్ణబోధస్థితిని పొంది తిరిగి ఎన్నడూ ఎరుకస్థితిని పొందడు.

— o —

180) మరుపన తొలిమేనులు మూ । డెరుకన నాలవశరీరమీ రెండొకటే । పరిపూర్ణమవలిదీవలి । యెరుకను గురువాక్కు చేత యెగరాజిమ్మినను ॥ పోవును లేనిదెరిగే దేగినను ॥ యెరిగేదె లేకుండుయేమొ ఆవలిజాడ । నెరిగెవారెవరింక యింతెచాలెరుకను । యెగరజిమ్మినను ॥ పోవును లేనిదెరిగేదేగినను ॥

భావము : శిష్యా : మొదటి మూడు శరీరములు అజ్ఞాన శరీరములు. నాల్గవ శరీరము జ్ఞానము. అయినను ఈ రెండూ ఒక్కటే. దీనికి ఆవలిది పరిపూర్ణము. ఈవలియెరుకను షోడశీ మంత్ర విచారణచేత లేకుండా చేయ ప్రయత్నించినచో లేనియెరుక లేకుండాపోవును. యెరిగే యెరుకపోతే ఇక యెరిగేది ఏమియులేదు. అటుపైనున్న వాటియొక్క జాడ తెలుసుకునేదెవరింక. అంతియే చాలును.

విశేషభావము : మరువు అనగా అజ్ఞానము. స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు మూడున్ను అజ్ఞాన శరీరములు. ఈ మూడు శరీరములచే, ఆహార నిద్రభయము మొదలగు సమస్త లోకవ్యవహారములు చేయుచుందురు. ఈ వ్యవహారములు పశు పక్ష్యాదులకుకూడకలదు. ఈవ్యవహారములన్నియు అజ్ఞానసంబంధమైనవే. కనుక ఈ వ్యవహారములయందుతిరిగే స్థూల, సూక్ష్మ కారణ శరీరములు మూడు అజ్ఞాన శరీరములు అని చెప్పబడెను.

నాల్గవదైన మహాకారణ శరీరము భ్రూమధ్యాంతర్గతమైనది. తన యొక్క స్వరూపమును గుర్తించేది. కనుక జ్ఞానశరీరము. తెలుసు కొనేది కనుక ఎరుక అన్నారు, ఈనాల్గవశరీరము ఎరుక, జ్ఞానము అయినప్పటికి జ్ఞానా అజ్ఞానములు రెండును జన్మకు కారణమైనవే కనుక ఈరెండొక్కటే. ఎరుకైనను, మరుపైనను ఈ రెండొక్కటే అని ఈపద్యములో చెప్పినారు. అనగా జ్ఞానులైనను, అజ్ఞానులైనను పునర్జన్మకు రావలసినదే. జ్ఞానాజ్ఞానములుకానిది ఎరుక లేనిది కనుక, యెరుకచే పరిపూర్ణమున్నదని యెరిగి, ఈయెరుకను షోడశీమంత్ర విచారణచే లేకుండ జేయ ప్రయత్నించినచో, గురు కరుణచే యెరుక లేకపోవును. యెరుకయే సమస్తమును యెరిగేది. కనుక యెరుకపోయిన వెనుక యెరిగేదేమియులేదు. అనగా ఇది ఉన్నది శాశ్వతమైనది అనికాని, ఇదిలేనిది అశాశ్వతము, మాయ అనిగాని గుర్తించేదిలేదు. అదే పునరావృత్తిరహితస్థితి.

181) నానావిధావయవములు। నానావిధ నామరూపనటనలు మాయల్ । నానావిధాల వూహలు। నేనను యెరుకందె యున్ని నిబిడామైయుండూ ॥ బయలును గనతా నిలువాలేకుండూ ॥ నేను మేనీ రెండు నేననేలేకుంటె । మేనులేదిచ లేకనే సిల్చెదిట్లిన్ని ॥ నిబడమైయుండూ । బయలును గనతా నిలువలేకుండూ ।

భావము ! శిష్యా ! నానావిధములైన అవయవములు, నానావిధములైనపేర్లు, రూపములు, క్రియలు, మాయలు మరియు, నానావిధములైన సంకల్పములు ఇవన్నియు "నేను" అనే యెరుకయందే కూడియున్నవి. అట్టి యెరుక పరిపూర్ణమునుకనవచో తాను నిలువదు. నేను_శరీరము ఈ రెండూ "నేనే". "నేను" లేకుంటే మేను లేదు. యీ మేను లేక నేను ఉండేది

ఏలాగున ? ఈవిధముగా అన్నియు "నేను" అనే ఎరుకయందే నిండియున్నవి.

— —

182) జగమువలన సంకల్పము । జగమా సంకల్పమునను జనియించునువే। రగుపడదు జన్మమందిర। మగుపడదెడబాసి నిల్వ వారెండెన్నటికి ॥ బయలును గనిసీవిరెంట్నెన్నటికి ॥ యికదల్చ బోకూము యివి బుట్టుటుళ్ళక్కి । మృగజలమగుపడ్డ మిథ్యం చెరిగిన మాడ్కి ॥ యారెండెన్నటికి । బయలును గనిసీవి రెంట్నెన్నటికి ॥

బావము : శిష్యా : జగమువలన యెఱుక, యెరుకవలన జగము పుట్టుచున్నవి. ఇంతకన్న యారెంటికి వేరే మరొక జన్మ స్థానము విచారించినచో, కనుపించుటలేదు. అవి రెండు ఒకదానిని ఒకటి విడచి నిలువవు. నీవు పరిపూర్ణమును చక్కగావిచారించిచూచి యీజగము ఎరుకల రెంటిని ఎన్నటికి నిలబెట్టక విడచిపెట్టుము. యికవాటినిదలచకుము, అలాచేస్తే అవి పుట్టట అనేమాట ఉళ్ళక్కి. ఎండమావులలోని నీరు కనుపించుట ఏలా ఉళ్ళకోక్కి అలా యెరుక జగములు తిరిగిబుట్టుట ఉళ్ళక్కగును.

విశేష బావము : జగము అనగా శరీరమనియు, యెరుక అనేది నేననియు భావించవలెను. అనగా యీపద్యములో జగము-సంకాల్పము అనువదములు వాడినారు. సంకల్పమనగా ఎరుక అని గ్రహించవలెను. అందుచే జగము - యెరుక. ఇవే మేను, నేనుగా గుర్తించవలెను. నేనువలన మేను జనించుచున్నది. ఒకదానిని విడచి రెండోది నిలబడదు. కనుక నేను-మేనులు, రెండూ ఒక్కటే యీనేనుమేనులు ఎండ

మావులలోని నీరు ఎలామిధ్యయో, అలాంటిదే యీ నేనుమేనులు, తనక పరిపూర్ణము శాశ్వతమైనదిగాచూచి, అందులో మిధ్యఅయిన యీనేను మేనులులేవని వాటిని తలంచక విడచిపెట్టినచో, అవి ఇకపై తిరిగిపుట్టవు అనిభావము.

— —

183) పరిపూర్ణమనెటిపల్కై । యెరుకను బల్పాక్షరముల కెచ్చటగనినన్ । తిరమైయున్నది కనుగొని । యెఱుకను బల్పాక్షరములనికగట్టిపెట్టూ ॥ యెవరికి దెలియదిది మూలగుట్టూ । గురుమూర్తి కరుణచె యెరిగి తెల్పితినేనీ । పరిపూర్ణబోధను పనులుజెప్పిన బోధ ॥ నికగట్టిపెట్టూ । యెవరికి దెలియదిది మూలగుట్టూ ॥

భావము : శిష్యా ! పరిపూర్ణము_పలకఅనియు, యెరుక అనగా_బలపమనియు, అక్షరములనగా_జగత్తనియు భావింపుము. పలకపై బలపముచే అక్షరములు వ్రాయబడినట్లుగా, పరిపూర్ణముతో యెరుకచే జగత్తు సృష్టింపబడుచున్నది. వ్రాయబడిన అక్షరములు అన్నియు పలకలోనేయున్నవికాని. పలకను మించి అవలలేవు. మరియు అక్షరము గీటుఉన్న చోట, అక్షరమునకు వెలుపల లోపలకూడా పలక ఉన్నది. అట్లే పరిపూర్ణములోపల ఎరుక తనంతతానుగావచ్చి జగత్తును సృష్టించుచున్నది. యెరుక జగత్తులను మించిఉన్నది పరిపూర్ణము. అనగా పరిపూర్ణము లోపలనే ఎరుక జగత్తులున్నవి కాని దాటి వెలుపలలేవు. ఎరుక జగత్తులుకు లోపల వెలుపల అంతటా పరిపూర్ణమున్నది. ఎరుక జగములు శాశ్వతముకావు. వస్తూపోతూ ఉండును. కాని పరిపూర్ణమునకు ఎట్టి మార్పులేకుండగ వికార రహితమై శాశ్వతముగా ఉన్నది. ఇది

మూలగుట్టు. ఎవరికి తెలియుదు. గురుమూర్తి కరుణచే యీ రహస్యమును నేను తెలుసుకొని నీకు ఈ పరిపూర్ణ బోధను చెప్పుచున్నాను. ఇతరులుచెప్పిన ఇతరమైన బోధలను కట్టిపెట్టి. నేచెప్పిన ఈ పరిపూర్ణ బోధను గ్రహించుము.

— —

184) చూపించజూపరానిది । చూపించితి దాన్ని వుండజూచి నవుగదా । చూపించజూచెనిదిదీ । న్నె ప్రొద్ధికదల్చబోకు మిదెగురు బోధా ॥ నిన్నంటాదునిరతమేబాధా । నాపాపనాకూన నాచిన్ని నాయన్నా । నాపెన్నిధానమనా రత్నముల కొండ ॥ యిదెగురు బోధా । నిన్నంటదు నితర మేబాధా ॥

భావము : శిష్యా ! వస్తురూపముగా చూపించుటకు వీలు కాని పరమార్థమును చూపించితి. దానిని నీవు ఉన్నదని చూచితివి గద నేను చూపించగా యెరుక చూచినది. యీ యెరుకనిక ఎప్పుడును తలచపోకుము. ఇదే గురుబోధ. ఇటుపై నీకు ఏవిధమైన ఇతరబాధలు అంటవు. నాపాపా !. నాకూన !, నాచిన్నీ నాయన్నా :, నాపెన్నిధానమా !, నారత్నాలకొండా ! యిదేగురు బోధ. యీ బోధస్థితియందున్నచో ఏబాధలు నిన్ను అంటవు.

విశేషభావము : పరిపూర్ణము శబ్దస్పర్శాది తన్మాత రహితము. జ్ఞానమున కతీతము గనుక బుద్ధిచేకూడ చూచుటకు వీలు కానిది. అయినను గురుమూర్తి తన ప్రియమైన శిష్యునికి అట్టి చూపింప వీలుకాని పరమార్థమును అన్వయ వ్యతిరేక లక్షణయుతమైన బోధచే చెప్పిచూపించగా, శిష్యుడు అట్టిపరమార్థము కలదని తృఢపర్చుకొని చూచినాడు. ఆ తెలుసుకొన్న తెలివి పరమార్థమందు

లేము కనుక ఆతెలివి లేనిదని, దానిని విడచిపెట్టుమని చెప్పెను. ఆతెలివియే ఎరుక. అనగా అన్నిటిని గుర్తించునని, ఇదే నేను. యీ ఎరిగే యెరుక పరిపూర్ణమందులేదు కనుకనే, బుద్ధిరూపముగానైనను పరిపూర్ణము తెలియబడుటలేదు. అట్టిపరిపూర్ణమును గురుమూర్తి, ఎరుకకు వ్యతిరేక లక్షణములచే ఎన్నోయుక్తులు సూక్తులుచెప్పి, ఉన్నదని దృఢపరచుటచే, శిష్యుడుగురుకరుణచే అట్టి పరమార్థమేకలదనియు దానందు నేనను గుర్తు లేదుకనుక, అట్టిగుర్తు స్వరూపమైన "నేను" విడచి, ఎరుకలేనివాడై యుండును. అట్టివానికి మాత్రమే పునరావృత్తిరహితము. గురుమూర్తి చెప్పిన విధముగా శిష్యుడు ఉన్నాడు కనుక అంతటి సచ్ఛిష్యునిజూచి, గురుమూర్తి ఆనందాతిశయముచే నాపాపా! నారత్నములకొండా! యని సంబోధించుచు నేచెప్పిన యీబోధ అనగా గొప్పబోధ ఇంతకు మించినబోధ ఏమియులేదు. ఇదే పునర్జన్మరహితపరచునట్టి ఏకైక బోధ అనిచెప్పెను.



185) నామము రూపము నటన । స్తోమము బయలందు లేదుచూడుము నీవా । నామము రూపము నటన । స్తోమము యెరుకందు గలదు చూడుమి నిజమూ॥ బయలెరుకాలజూచి చూడకుమూ॥ వేమారు నేనెంతవినజెప్పినాగాని । యీ మార్గమెతప్ప యికలేదు రెండోది ॥ చూడుమినిజమూ । బయలెరుకాలచూచి చూడకుమూ ॥

భావము : శిష్యా ! నామ, రూప, క్రియాసమూహము, పరిపూర్ణమందులేదు చూడుము. ఆనామరూపనటన సమూహము నిజముగా ఎరుకందుగలదు చూడుము. యీవిధముగా పరిపూర్ణ

 

మెరుకలఁచూచి విడచిపెట్టుము, అనేకమార్గ నేనెంత వినజెప్పినా, యీమార్గమే తప్ప యికరెండో విధానము ఏమియులేదు. యిది నిజము. చూడుము.

**విశేషభావము :** నామ, రూప, క్రియా రహితమైనది పరిపూర్ణము. అందులో ఏమీలేదు. ఉత్తది యీనామ, రూప, క్రియాసహితమైనది ఎరుక. యెరుకలో సమస్తము ఉన్నది. కాని ఎరుకయే లేనిది. అనగా పరిపూర్ణములో లేనిది. మూలములేనిది. పరిపూర్ణము ములుగుచ్చసందులేకుండ సర్వవ్యాప్తమైయున్నదని గురుముఖతా గుర్తించినప్పుడు, ఎరుక పరిపూర్ణములో లేదుకనుక, ఇక ఎరుక ఎక్కడ ఉన్నట్టు ? పరిపూర్ణము సర్వత్రఉన్నది. ఎరుక ఎక్కడాలేదు. ఎరుకలేకపోతే ఎరుకలో ఉన్ననామరూప క్రియా సమూహమైన జగత్తుకూడాపోవును, యీవిధముగా పరిపూర్ణమెరుక లను చక్కగావిమర్శించిగురుముఖతాపరిపూర్ణము ఉన్నదనిగుర్తించి, ఎరుకలేదని తెలసి యెరుకను విడచిన వానికి_పరిపూర్ణము ఉన్నదని గాని ఎరుకలేదనిగాని అనగలడా ! రెంటిని విడచినవాడేకదా. కాని పరిపూర్ణము ఉన్నది. అదిపోదు. ఎరుకే లేకపోవును కాని అది ఉన్నదని_ఇది లేదను యెరుకే లేకపోయినది. దీనికే యీ పద్య ములో "బయలెరుకల చూచి_చూడకుమీ" అన్న పదప్రయోగము ఎంతజెప్పినా ఎంతవిన్నా_పరిపూర్ణము ఉన్నది. ఎరుకలేదు. అన్న బోధేకాని మరొకబోధలేదు. యీవిధముగానే యెరుక లేకపోవలెను గాని మరేమార్గముగాను యీ ఎరుకపోయేదికాదు.

— —

186) గురుడు గురుబోధ శిష్యుని । యెరిగించెటి వేళ్ళ శిష్యు డెరిగెటి వేళ్ళన్ । యిరువురు వైశ్వానరక । ర్పూరము లవలె వెలిగి

యవలపొడజూపరోయీ ॥ అట్లనె నీవిక్కడ దెలియుమోయీ ॥
పరిపూర్ణమెరుకల నెరిగియు మీదట। యెరుకను విడిచుటె గురుబోధం
చెరుగుము। పొడజూపరోయీ । అట్లనెనీవిక్కడ తెలియుమోయీ ॥

(స్తోమము = సమూహము.) ?

భావము : శిష్యా । గురుమూర్తి శిష్యునికి మొట్టమొదటగా బోధ తెలియపర్చు సమయమున కర్పూరము-దీపము వెలిగించి చూపి, కర్పూరము దీపము రెండునూకూడ వెలిగి, రెండుసూ చివరకు ఏమీలేకుండపోవుట చూపించబడినదికదా ! అట్లనె యిప్పుడు యీసమయమున తెలిసికొనుము. పరిపూర్ణ మెరుకల రెంటిని గురుముఖతా యెరిగి యెరకను విడచుటయే గురుబోధ అని తెలియుము.

విశేషభావము : సద్గురుమూర్తి శిష్యుని ఉపదేశము చేయునప్పుడు, ఇత్తడిపళ్ళెములో హారతికర్పూరము ఉంచి, దానికి దీపశిఖ తగిలించి చూపును. అప్పుడు కర్పూరము వెలిగి, కర్పూరరమంతయు కాలిపోయిన పి. ప దీప . లేకుండాపోవును. కరూరముకూడా లేకపోవును. పళ్లెము మాత్రమే పూర్వమువలె యధాతధముగఉండును. ఇచ్చటపళ్లెమునుపరిపూర్ణముగాను, కర్పూరము శిష్యునిగాను, దీపశిఖ గురుమూర్తిగాను పోల్చబడుచున్నది. మొట్టమొదటగా ఉన్నదే పళ్లెము దా లోలేనిదే వచ్చినది యెరుక. అనగా కర్పూరము, దీపశిఖ. యెరుక ఒక్కటేకదా, ఇక్కడ ఎరుకకు రెండువస్తువులు చూపించుచున్నారు. అదెట్లు? అనగా యెరుకకు రెండురూపములు 1) జ్ఞానము, 2) అజ్ఞానము ఈరెండునూ యెరుకయే. రూపాయికి బొమ్మ-బొరుసువలె. కనుక కర్పూరము అజ్ఞానస్వరూపమైన శిష్యునికి ప్రతీక. దీపశిఖ-జ్ఞానస్వరూపమైన

గురుమూర్తికి ప్రతీక. కనుకనే గురుశిష్యులిద్దరూ యెరుకే అని వెనుక పద్యములలో చెప్పబడినది. అవిధముగా దీపముముట్టించిన కర్పూరము పూర్తిగా వెలిగి, కర్పూరము పూర్తిగా అయిపోయే పర్యంతము వెలిగి అవల దీప, కర్పూరములు రెంటును ఇసుమంతకూడ లేకుండా పోవుచున్నది. వెలుగుట అనగా విచారించుటకు ప్రతీకగా గ్రహించవలెను. అ దీపకర్పూరములు లేక పోయిననూ పళ్లెము ఏమార్పులేకుండగ ఉన్నది. అనగా యెరుకకుముందుగనే పరిపూర్ణమున్నది. అందులో లేనిదే యెరుక గురుశిష్యుల రూపముగావచ్చి విచారణజేసినచో ఎరుక లేకపోయినది, కాని పళ్లెమునకు యేవికారము లేకుండగ ఉండిపోయినట్లుగా పరిపూర్ణమునకు యెరుకసంగతిగాని వాటివిచారణగాని తెలియకుండగనే, ఏమార్పు చెందకుండగ అట్లేయున్నది. యెరుకకుముందుఉన్నది. యెరుక పోయినా ఉన్నది. కనుక పరిపూర్ణమె శాశ్వతమైనదని తెలియుటయే గురుబోధ. యెరుకకే పుట్టుట, పెరుగుట, చచ్చుట అనే సమస్త వికారములు. ఇది మొదటలేదు. కనుక లేనిది. లేక వచ్చినది. దీనికి కారణము పరిపూర్ణముకాదు. యెరుక తనకుతానే వచ్చినది కలవలె. కనుక కల ఏలాలేనిదేవచ్చి లేకపోవునో అట్లే యెరుక లేకనేవచ్చి ఏమియు లేకుండాపోవును. య్యీ విషయము శ్రీ సద్గురుమూర్తి ముఖముగా బాగుగవిచారించి తెలుసుకొనవలెను. ఇది తెలయుటకు గురుకరుణయే ప్రధానము.



187) సతికౌగిట తప్పతిత। త్పతికౌగిట సతియుజేరి పవళించి కలస్। మృతిజెంది మేలుకనిను। స్థితులై యొకరొకరి కట్టిచేష డెల్పుదురా ॥ సిగ్గెడలియూచేష్ఠనిల్పుదురా ॥ ప్రతిలేని గురుబోధ

స్థితి జెందృట్లైనె సం। తతి ఇరిగి లేనెరుకగతి యిట్టిదని దానీ॥
చేష్ట దెల్పుదురా । సిగ్గుడలియాచేష్టా ౦లృదురా ॥

భావ ౦ః ! శిష్యా ! భార్యకౌగిటలో సతియు, సతికౌగిటలో భార్యయు జేరి క్రీడించి, నిదురపోయి, ఆ నిదురలో మృతిజెందినట్లు కలగని మేలుకొన్న పిదప ఉదయమున రాత్రివారు పవళించి క్రీడించిన క్రీడలుగురించి, కలలో మృతిజెందిన సంగతి ఇవన్నియు ఆభార్యాభర్తలు ఒకరికొకరు చెప్పుకుందురా ? సిగ్గువిడచి ఆ చేష్టలన్నియుచేసి చూపుకొందురా ? అట్లే ప్రతిరహితమైన పరిపూర్ణ స్థితినిజెంది, తిరిగి అలే నెరుక గతి యిట్టిదని ఆ యెరుక చేష్టలను చెప్పుకొనుట, చేయుట జరుగునా ? అనగా స్థితిమంతునకు యెరుక చేష్టలు ఉండవని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
గురుమంత్ర ప్రతాపం నామ నవమోఽధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.

---



# 10. బోధ దృఢీకరణము (5)

188) రానిది పోనిది బయలని। లేనిది యీయెరుకయనుచు లెస్సగ దృఢమౌ। దానుక నీవీమంత్రము। మానక జపియించుచుండు మానీతిశాలీ ॥ లేదిలేదు మరువాకిజోలీ ॥ లేనిది లేదని పూని నిశ్చయమైతే। తానొక్కటుండునుగాని యెట్లన విను ॥ మానీతిశాలీ। లేనిదలేదు మరువాకిజోలీ ॥

భావము: శిష్యా! జనన మరణములులేనిది పరిపూర్ణ మనియు. లేనిది యీ యెరుక అనియు బాగుగా నీమనస్సుకు దృఢమయ్యేదాక ఈమంత్రము మానక జపించుచుండుమా। ఓ నీతిశాలీ లేనియెరుకలేదు. ఇదిమరువకు ఈవృత్తాంతము మరువకుము. లేనిది లేదని ప్రయత్నముచే నీకునిశ్చయమైతే, పరిపూర్ణ మొకటుండునుగదా! కాని అది ఉన్నదని యెట్లందువు?

విశేషభావము: ఈ పద్యములో జననమరణములులేనిది పరిపూర్ణమనియు. ఉన్నట్టుగా కనుపించే యీ యెరుక లేదనియు భావదృఢత్వముపొందేవరకు శిష్యుని "రానిది పోనిది బయలని, లేనిది యీ యెరుక" అనేదే మంత్రముగా జపించమని శ్రీకృష్ణదేశికేంద్రులవారి ఆదేశము.

(జోలి - సంగతి, వృత్తాంతము.)

——

189) ఉన్నది పరిపూర్ణము లేం। దెన్నటికి యెరుకయనుచు నిది దృఢమౌదా। కెన్నమునేబోధించిన। తిన్నని యీబోధ శిష్య

తిలకా మరువకుమీ ॥ సుజనుల మోల్గిలపలుకవెరువకుమీ ॥ నిన్నుకు మతులువచ్చి నీలోతడిగితెవారీ । కెన్నివిధముల నీకెరిగింపకిది శిష్య । తిలకా మరువకుమీ ॥ సుజనుల మోల్గిల పలుక వెరువకుమీ ॥

బావము : శిష్యా ! పరిపూర్ణమె సర్వకాలములందున్న దనియు, యెరుక యేకాలమందు లేదనియు, యీ విధముగా ధృడమయ్యేవరకు నే బోధించిన యీ తిన్ననిబోధ మరువకుండగ చదువు కొనుచుండుము. ఓ శిష్యతిలకా ! సుజనుల యెదుట యీ బోధపలుకుటకు జంకకుము. కాని నిన్ను దుష్టబుద్ధికల ఇతరసాంప్రదాయకులువచ్చి యీబోధయొక్క సంగతి తెలుసుకొనే నిమిత్తమై అనేక విధములుగా వారు అడిగినప్పటికీ బోధ యెరిగింపకుము. శిష్యా తిలకా యీ మాట మరువకుము.

---

190) పరిపూర్ణము నెఱకనునే। నెరిగించితి నీవు రెంటి నెరిగితివికదా । యెఱకను గురుదక్షిణగా। మరివేగిరమివ్వ వట్టిమాటలేమిటికి ॥ యెరుకతో యింక కూటా మేమిటికి ॥ పరులు నేనని యేటిభావ మభావమై । నిరతాము ఒకరీతి నిలచుండుమిక వట్టి ॥ మాటలేమిటికి । యెరుకతో యింక కూటమేమిటికి ॥

బావము : శిష్యా ! పరిపూర్ణము, యెరుకను నేను నీకు యెరిగించితిని. నీవుఆరెంటిని నిశ్చయముగ యెరిగితివికదా ! యిక వట్టిమాటలు ఎందుకు ! తక్షణమె యెరుకను గురుదక్షిణగాఇవ్వుము. యీ యెరుకతో కూటమి యింకనూ నీకెందుకు ? జగత్తు – ఆత్మ అనే భావము అభావమై ఎల్లప్పుడు ఒక్కరీతిగా ఉండుము.

విశేషభావము : విద్య పూర్తి అయిన పిదప శిష్యునిగురువు గురుదక్షిణ ఇయ్యమని కోరుట, శిష్యుడు వినమ్రుడై గురుమూర్తి కోరిన గురుదక్షిణ గురుపాదములకర్పించుట. ఇది శిష్టాచారము. అందుకే పరిపూర్ణమును, ఎరుకను చక్కగా బోధించి, ఆ రెంటి విషయము నిశ్చయముగ శిష్యుడు తెలుసుకొనిన పిదప సద్గురుమూర్తి గురు దక్షిణ ఇయ్యమని శిష్యుని కోరెను. మొదటగా శిష్యుడు గురు మూర్తికి శరణుజొచ్చి తన్ను కృతార్థుని జేయుమని కోరినప్పుడు, గురుమూర్తి అంగీకరించి "మొదలచలము నెరిగించెద। విదితముగా లేనియెరుక వివరింతుపయిన్। తుదకెరుకను విడిపించెద" అని అభయమిచ్చియుండెను, ఇక్కడితో శిష్యునికి అచలము నెరిగించుట, లేనియెరుక వివరించుట అను రెండు పనులు పూర్తి అయినవి. ఇంకతనమాట ప్రకారముగా యెరుకను విడిపించుట కావలయును, యెరుకను విడిపించినప్పుడే శిష్యుడు కృతార్థుడగుచున్నాడు. అందులకై సద్గురుమూర్తి శిష్యుని-ధన, కనక, వస్తువాహనాది దక్షిణలు అడుగకుండగ "యెరుకను" గురుదక్షిణగతక్షణమె యివ్వ మనియు, అలా ఇచ్చినపిదప యెరుక కూటమి మానమని కోరెను. అట్లు యెరుకను గురుదక్షిణగా యిచ్చినవాడు ముందువాటిపై మచ్చటగ వెనుకటివాటిపై వాడుక వంటి ద్వంద్వరహితుడై యుండవలెను. అందుకే యీపద్యములో పరులు-నేను అనేభావము అభావమై నిరతము ఒక్కరీతినుండుమని అదేశించుచున్నారు.

— —

191) పరిపూర్ణమెంచ కలివియని । గురువరుడెరిగించి యెరుక కూటమి మాన్పన్ ॥ గురుపుకు గురువెవరనుటకు। మరి శిష్యునికింక

నోటమాట వెళ్లీనా ॥ పోయిన యెరుక మళ్లీ మళ్లీనా ॥ గురుశిష్యు లనియేటి గురుతెన్నడెరుగక । నిరతాము యొకరీతి నిలచున్న బయలందు ॥ మాటవెళ్ళినా । పోయిన యెరుక మళ్లీమళ్లీనా ॥

భావము : శిష్యా పరిపూర్ణము, యెరుక యివిఅనిచూపించి తెలియుపరచి గురుమూర్తి శిష్యునికి ఎరుకకూటమి మాన్పింపగా గురువుకుగాని శిష్యునికిగాని నోటమాట వస్తుందా ? రాదు ఎందుచేతననగా పోయిన యెరుక మళ్లీ వస్తుందా ! గురుశిష్యుల రూపముగామన్న యెరుకను ఎన్నడూ యెరుగక ఎల్లప్పుడు వికారములేకుండగఉన్న పరిపూర్ణమునందు మాటవస్తుందా ?

విశేషభావము : యెరుకకూటమి విడచుట అనగా యెరుక విడచిన శిష్యునకు "గురువెవరు" అని అనుటకు మాటరాదు. అట్లు ప్రశ్నించుటకు శిష్యునికి ఎరుకలేదుగదా । ఎరుక లేకపోయిన శిషునికి గురువు ఉండునా? అందుచే గురువుకు మాటాడేదిలేదు. గురుమూర్తికి ఎరుకలేదు. గురుశిష్యులు అనగా ఎరుకే. ద్వంద్వ రూపము. ఎరుకలేని బయులులో గురుశిష్యులులేరు అనగా ఎరుక లేదని భావము.

— —

192) స్థిరమగు పరిపూర్ణమున । స్థిరమగు యీ ఎరుక నెరుక దెలియుజగములన్ । ఎరిగిన దెరుకే కదస । గురు కృపచే ఎరుక బోతె గురుశిష్యులేరీ ॥ నోరెత్తాక మరివినరోరీ ॥ గురునిపాదములాన గురుతులేనటువంటి । పరిపూర్ణ మొకటుండు పలుకరాదట్లంటె ॥ గురుశిష్యులేరీ । నోరెత్తాక మరివినరోరీ ॥

భావము : శిష్యా ! పరిపూర్ణము శాశ్వతమైనది. ఎరుక అశాశ్వతమైనది. యీ యెరుకచే తెలయుబడు సమస్త జగములు

 

ఇంకా యెరిగిన సమస్తము యెరుకే కదా : సద్గురుమూర్తి కరుణచే యెరుకపోతె గురుశిష్యులున్నారా? నోరెత్తక ఇంకనూ వినుము. యెరుకలేకపోయినా, గురుపాదసాక్షిగా చెప్పుచున్నాను. ఎరుకలేని పరిపూర్ణముమాత్రమే ఉండును. కాని నీవు ఎరుక లేదనినపిదప పరిపూర్ణమున్నదని పలుకరాదు.

విశేషభావము : పరిపూర్ణముశాశ్వతమైనది. రాకడపోకడ లేనిది. ఎరుకచే నెరెగబడిన సమస్తము ఎరుకే కనుక ఏమీలేనిదే. అశాశ్వతము । గురుకృపచే ఎరుకపోయినను పరిపూర్ణము మాత్రము శాశ్వతముగా ఉండును. కాని ఎరుకపోయిన పిదప పరిపూర్ణము ఉన్నదనుటఎట్లు? అనుటకు ఎరుకలేదు. ఇచ్చట ఏమీలేదు శూన్యవాదమని భ్రమిస్తారేమో అని గురుపాదసాక్షిగా పరిపూర్ణమున్నదని శిష్యునికి ఆస్తిక నిశ్చయార్థమై గురుమూర్తి ఒట్టుపెట్టి చెప్పియున్నాడు.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వ
బోధ దృఢీకరణనామ
దశమోఽధ్యాయమునకు
భావ, విశేషభావములు
సమాప్తము.

# 11. బోధస్థితి పురుష లక్షణము (6)

93) గురుడ చలచలములను తన । రెరిగించిన శిష్యు డెరిగి యెరుకై యుండగ । యెరుకను నిల్పకుమనినను । యెరుకను విడనాడి శిష్యుడెట్లుండు నంటే ॥ అట్లనే నేనింకెట్లుండు నంటే ॥ పురుషుడు లేనట్టి పొలతి సౌందర్యము । మరిమరి కలిగుండి మరి లేనట్లనియుంటి ॥ యెట్లుండునంటే । అట్లనె నేనింకెట్లుండునంటే ॥

భావము : శిష్యా । గురుమూర్తి పరిపూర్ణమును ఎరుకను శిష్యునకు యెరిగించినపిదప, శిష్యుడు యెరుకతో ఉండగా, యెరుకను విడువుమని గురుమూర్తి చెప్పగా, యెరుకను విడచిన ఆశిష్యు డెట్లుండుననగా, అట్లనేయుండును. మరియు ఇంకా ఏవిధముగా ఉండుననగా, భర్త లేని స్త్రీ యొక్క సౌందర్యము ఉండికూడ లేక పోయినట్లుగా ఉండును.

విశేషభావము : పరిపూర్ణ మెరుకులనెరిగి, యెరుకను విడ చిన వానియొక్క స్థితి యెట్లుండునో ఈపద్యములో తెలవిచ్చు చున్నారు. ఎరుకలో ఉన్నప్పుడు ఏరకమైన వేషము ఆచరణ యున్నదో, అట్లనేయుండును. వేషభాషణలు ఏమియు మారదు. అట్లే యుండును. కాని భావములో మార్పువుండును. భర్త లేని స్త్రీకివున్న సౌందర్యము భర్తవున్నప్పుడు ఎలాగున్నదో, భర్త లేనప్పుడుకూడా ఆసౌంద ర్యము ఎక్కడాపోదు, అలాగేవుండును. కాని సౌందర్యవతిగా యుండునా ? ఉండదు. ఆసౌందర్యారాధనలు ఏమిలేక సౌందర్య విషయమై అభావము కలిగియుండును. అట్లే ఎరుకను విడచినవాడు

ఎరుకలో పనులు అన్నీ చేస్తూనేయున్నా, ఎరుక భ్రాంతి ఎంతమాత్రము వుండదు.



194) యెరుకను విడనాడినయూ । పురుషునిస్థితి యెట్టిదనిన పొందుగ వినుమీ । సరిపడు సరిపడదనకను । సరిగావర్తింపుచుండు సమరాసబుద్ధిన్ ॥ కార్యములందు సహజ ప్రవృద్ధిన్ ॥ పరిపరి విధముల పరుపులు బెట్టడు । మరి వైరాగ్యముచేత మానుకొనుండడు ॥ సమరాసబుద్ధిన్ ॥ కార్యములందు సహజప్రవృద్ధిన్ ॥

బావము : శిష్యా : యెరుకను విడచిన వానియొక్క స్థితి ఎట్లుండుననగా చక్కగా వినుము. రాగద్వేషములు మొదలగు ద్వంద్వములు లేకుండగ కార్యములందు సహజమైన లక్షణముచే సమరసముగా ప్రవర్తించుచుండును. కార్యములు చక్కపెట్టుకొనుటలో అనేకవిధములుగా ప్రయత్నముచేయడు. అలాగని వైరాగ్యముపూని మానివేయడు. సమరసబుద్ధి కలవాడై సహజముగా కార్యక్రమములు చేయుచుండును.



195) అనహంకారుడని మిషుడు । గనుకనె విశ్వంబనేటి కల గానడహం । బనువాడు సనిమిషుడుగా । వునవిశ్వంబనేటి స్వప్నోద్యోగముబూనీ ॥ చేయుచు యూపుద్యోగముమానీ ॥ యనుస్వప్నోద్యోగమునకు నేకారణమునితా । ననిమిషుడెన్నడనుకోడీమాట ను ॥ ద్యోగముబూనీ ॥ చేయుచు యూవుద్యోగముమానీ ॥

బావము : అనహంకారుడు అనగా ఎరుకలేనివాడు అనిమిషుడు (దేవతలు). కనుక విశ్వమనే కల యెన్నడూ లేదు.

అహంబనువాడు అనగా ఎరుకతో ఉన్నవాడు సామాన్య నరుడు (సనిమిషుడు) కనుక ఇతడు విశ్వమనే కల పనులు చేయుచుండును. ప్రయత్నించి యీ పనులను చేయుచుండును. ఎరుకలేని వాడు మా-నీ అను స్వప్నకార్యమునకు అనగా ఆత్మ జగత్తులనే స్వప్నకార్యములకు తాను కర్తనని ఎన్నడూ అనుకొనడు.

విశేష భావము : అనహంకారుడు అనగా అహంకారము లేనివాడు అనగా ఎరుక లేనివాడు. అట్టివాడు అనిమిషుడు. అనగా రెప్పపాటు లేనివాడు దేవతలు అని అర్థము. రెప్పపాటు లేదు కనుక నిద్ర, కలలు లేవు. ఇచ్చట కలలేనివాడు అని అర్థము. విశ్వమనే కలలేనివాడు. ఎందుచేతననగా తాను ఉంటే విశ్వమున్నది. తానే లేడు కనుక విశ్వమనే కల, ఎరుక లేనివానికి లేదు. ఈ విశ్వమనే కల పనులన్నియు తాను ఉన్నాడనుకొనే ఎరుకలో ఉన్నవానికే ఉండును. ఎరుకలో ఉన్నవానిని, సనిమిషుడు అన్నారు. అనగా రెప్పపాటు కలిగినవాడు, అంటే కలగనువాడని అర్థము. ఎటువంటి కల అనగా, విశ్వమనే కల గాంచుచుండును. మరియు ఎరుక లేనివాడు మా-నీ అను కల పనికి అనగా నాది-నీది అనుట గాని, ఆత్మ-జగత్తు అనే కల విశ్వపు పనులకు తాను కర్తనని భావించడు. అనగా "అహమేవ బ్రహ్మ" అని గాని, నేనే సమస్తమును అయియున్నాను. నాకు వ్యతిరేకమేదియు లేదు. నావల్లనే సమస్తము ప్రకాశించుచున్నది. ఈవిధమైన భావములు ఎరుకను విడచినవాడు ఎన్నడూ అనుకోడు. అని భావము.

— —

196) కల మేలుకొన్న పురుషుడు। కల లోపలి భావము లెన్నక కలిగుండగనే। తిలకింపలేవు గురుకృప। దెలివొందిన వాని

యింక తిప్పలున్నావే ॥ తెల్పర కొద్ది గొప్పలున్నావే ॥ తలిదండ్రి దారదాత కుల దైవమాప్తులు । కల బాంధవులు దేశికులని నమ్మితె యింక । తిప్పలున్నావే ॥ తెల్పరకొద్ది గొప్పలున్నావే ॥

భావము : ఎరుకను కలనుండి మేలుకొన్న పురుషుడు, కల లోపలి కష్ట సుఖములు ఎరుక యుండగానే కనుపింపవు. ఆవిధముగా గురుకృపచేత మేలుకొన్నవానికి జనన మరణములనే తిప్పలున్నాయా ? లేక కొద్ది గొప్పలున్నవేమో చెప్పుము, అట్టివానికి తల్లి, తండ్రి, దార, దాత, కుల దైవము, ఆప్తులు వీరందరు కల వంటి వారు. ఆబంధువులందరూ గురుమూర్తియే యని నమ్మినచో అట్టివానికి తిప్పలున్నవా ? అనగా లేవు.

విశేషభావము : ఎరుకను కలనుండి మేల్కొనుట యనగా యెరుకను విడచి, పరిపూర్ణ స్థితిని పొందుట అని అర్థము అట్టి స్థితి లోని వానికి తాను ఎరుకలో నున్నా ఎరుకయొక్క ద్వంద్వ విషయములు ఏమాత్రము వానిని అంటవు. అట్టి స్థితి గురుకృపవలన మాత్రమే కలుగవలెను గాని బోధచేత కాదు. బోధమార్గమును గుర్తింపజేయును. స్థితిని కలిగించు స్థి... గురుకరుణచేమాత్రమే కలుగవలయుననుట నిర్వివాదము. గురుకరుణ అనగా ఈమానుష గురుమూర్తి కరుణ అని అర్థము కాదు. అఖండ గురుస్వరూపమే దైతే కలదో దానియొక్క కరుణ. అచ్చట ద్వంద్వము లేదుకదా ! మరి దాని కరుణ అనగా ఏమి ? సాధకుడు ప్రతినిత్యము గురుమూర్తి చెప్పిన విధముగా అనుష్ఠానము, జపము, అధ్యయనములతో పాటు గురుబోధను శృతి సమ్మతముగా విచారించుకొనుచు, చెప్పబడిన ధర్మములతో చక్కగా నడచుకొనుచు, ఆచరణయుక్తుడై యున్నప్పుడు. ఆసద్గురుమూర్తి సామీప్యమునకు చేరుట అగును.

 

అదే "హృజ్జలజంబను పీఠముపై నిలిపి ఇకరము మాని గురువునే కొల్చునమ్మి" అను పద్యభావము. పరుసవేది దగ్గర ఇనుము బంగారము అయినట్లుగా ఆగురుమూర్తి చేతవలో అనగా సమీపములో ఉన్న సచ్ఛిష్యునకు ఆగురుస్వరూపము యొక్క అఖండ జ్ఞానము కలుగును. ఇదే గురుకరుణ. అయితే ఇక్కడ మానుష గురుమూర్తి ప్రభావములేదని అర్థము కాదు. ఆకరుణ జ్ఞానము, ఈమానుష గురుమూర్తిద్వారానే సంపాదించుకొనవలయును. ఆకరుణచే మాత్రమే స్థితిని పొందగలడు. మరేమార్గము లేదు. స్థితి పొందిన వానికి జనన మరణాది తిప్పలు ఏమాత్రము ఉండవు. అట్టివానికి కొద్ది గొప్పలుండవు. కొద్ది, గొప్ప అనగా జీవ–శివులు, కించిజ్ఞ – సర్వజ్ఞత్వములు అనే భేదము లేకుండ ఉండును. తానే లేని స్థితి కనుక ఇతరమైన మరేదియు ఉండదు. అట్టి స్థితికై ఈ ప్రయత్న పథములో తల్లి, తండ్రి దొర, సొంత కుల దైవము, ఆప్తులు వీరందరూ కలలోని వారే అన్నభావము కలుగవలయును. ఆబాంధవులు గురుమూర్తియే అనినమ్మి వారియందు భక్తి భావముతో ఉండవలయును.

---

197) ఈరీతి స్థితిగలిగిన । నేరుపుశాలి తరజనుల నిందాస్తుతులన్ । తారేగి చేయుడెన్నడు । వారలు మరి జేసిరేని వలదాని యనడూ ॥ చెవియొగ్గి కాకలెనాని వినడూ ॥ వారు మీవారు మావార వీరనుకొంచు । సారెకు వీథిలో పోరాడే వారిని । వలదని యనడు : చెవియొగ్గి కావలెనని వినడూ ॥

భావము : శిష్యా : ఇట్టి పరిపూర్ణ స్థితి కలిగినవాడు ఇతర జనులను నిందించుటగాని, స్తోత్రము చేయుటగాని చేయుడు; వినిన

ఇతరులు నిందాస్తుతులు చేసినచో ఎంతమాత్రము చలించడు. వారు మీవారు, వీరు మావారు అని పదే పదే వీధిలో పోరాడుకొనుచుండే వారి మాటలను వినుట, ఆపోరాటములో తిరుపెట తీర్పులువగ్గైరా చెప్పుట మొదలగు లక్షణములు ఏమియు వుండవు.

— —

198) ధ్వని మొదలగు తన్మాత్రలు । గనుగొనగా లేశమైన గాన్పించనిచో। టునుబట్టబయలు గాగని । ధ్వనిముఖతన్మాత్రలున్నదాన్నె యెరుకగనూ ॥ గని యీరెంట్లో దేన్ని యెరుగకనూ ॥ వునికి గలిగిన యట్టి ఘనుని సన్నుతి జేయ । జనులాకు శక్యమంచన రాదు వినరాదు ॥ దాన్నె యెరుకగను । గని యీరెంట్లో దేన్ని యెరుగకను ॥

బావము : శిష్యా : శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను తన్మాత్రలు లేశమాత్రమైనను లేని వస్తువును పరిపూర్ణముగను, తన్మాత్రలున్న వస్తువును యెరుకగను విచారించుము. అట్లు విచారించి ఆరెంటిలో దేన్ని యెరుగకుము. అట్టి ఉనికి (స్థితి) కలిగిన మహాత్ముని స్తుతి చేయుటకు జనులకు శక్యమని యనరాదు. అట్టి మాటలను వినరాదు.

విశేషబావము : "ధ్వని ముఖతన్మాత్రలున్న దాన్నె యెరుకగను, గని యీరెంట్లో దేన్ని యెరుగకను" అనుటయే సరియైన విధము. ఈ విధముగానే శ్రీకృష్ణ ప్రభువులు వ్రాసిన చేతివ్రాత గ్రంధములో వ్రాయబడినదిగా నేను స్వయముగా చూచియున్నాను. ఇట్లుగాక కొందరు దాన్నె యెరుగకను, గని యీరెంట్లో దేన్ని యెరుగకను" అని వ్రాస్తూ, అర్ధము చెప్పుచున్నారు. అది తప్పు పద్ధతి । ఈ సాంప్రదాయకులు కృష్ణప్రభువు తప్పు

వ్రాసెను అనుట చాల అవివేకము. అట్టివారు ఈబోధస్థులు ఈ సాంప్రదాయకులని నరాదు.

అట్టి స్థితిగంతుని స్తోత్రము చేయుటకు ఎవరికి శక్యము కాదు. ఉన్నవానికే స్తోత్ర పాఠము. లేనివానికి స్తోత్ర మెక్కడిది ?

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
బోధస్థితి పురుషలక్షణన్నామ ఏకాదశోఽధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.

— —



# 12. బోధ పఠన లక్షణం (14)

199) నామాట తెన్న వినుమా। సామాన్యంబనుచు జూడ జనదీబోధన్। ప్రేమాతిశయము నంగని। వేమారిది గురని నోట వినవలెనుమీ॥ నిత్యము జదువుకొనవలెనమ్మీ॥ నామరూప క్రియల నటనలుగలిగిన। దేమి। వస్తువాదాన్ని। యెటు నిల్వనివ్వదు॥ వినవలెనుమీ। నిత్యము జదువుకొనవలెనమ్మీ॥

భావము : శిష్యా : నామాట బాగుగ వినుము. ఈబోధ సామాన్యమైనదిగా జూడవద్దు. దృఢమైన ప్రేమచే ఈబోధను అనేక మార్లు విచారించుకొనుచు సద్గురుమూర్తి ముఖస్తముగా వినవలయును. దీనియందు నమ్మిక ఉంచి ప్రతి నిత్యము జదువుకొనుచుండవలెను. అట్లుచేసినచో నామరూప క్రియలున్న వస్తువు ఏదో దాన్ని ఎక్కడ నిల్వకుండగచేయును. కనుక నిత్యము చదువుకొనుచు గురుముఖతా వింటూ ఉండవలెను.

విశేషభావము : పరిపూర్ణబోధ సామాన్యమైనదిగాదు. మూఢజనులుకు సహజముగా చక్కగా నేర్వగలిగినదిగా అందరూ భావిస్తున్నారు. అట్లుకాదు. మొట్టమొదట ఆత్మతత్వబోధ గురుని వద్ద శుశ్రూషచేసి ఆత్మదృఢత్వమును పొందవలెను. అటుపిమ్మట గురుముఖముగానే పరిపూర్ణబోధను నిస్సంశయముగా తెలుసుకొనవలయును. ఈబోధ గురుముఖముగాతప్ప పుస్తక రూపముగా గాని, స్వతంత్రముగాగాని అభ్యసింపరాదని చెప్పబడుచున్నది. "శాస్త్రజ్ఞోఽపి, స్వాతంత్రేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం నకుర్యాత్" అని మహాఋషివాక్యము. శాస్త్రములు తెలిసిన పండితుడైనను స్వతంత్రముగా, గురువులేనిదే బ్రహ్మజ్ఞాన సంబంధమైన వేదాంత శాస్త్రమును అధ్యయనము చేయరాదు. కనుక ఈపద్యములో గురుని

నోటనేపలుమారు వినవలెనని వ్రాసినారు. అంతేకాదు శ్రవణమనన నిధిధ్యాస పూర్వకముగా ఆధ్యయనము చేయవలెను. మెట్టమొ దటగా, హృదయమునకు పట్టునట్లై మననము చేయుచుండవలెను అంతేకాదు. అనుష్టానము చేసికొనుచు, సత్కార్యా చరణగలిగి, ద్వంద్వములను అనగారాగద్వేషాదులు వదులుకొనుటకు నిత్య వ్యవహారములలో అతి మెలుకువను కలిగి, కార్యక్రమములు చేయు చుండవలెను. ఇదియే నిధిధ్యాస. ఇది చాలకష్టము. ఇన్నివిధము లుగ ప్రయత్నించినప్పుడుకాని ఈబోధస్థితకుదరదు. కనుక సామా న్యముగా తలంచవద్దని శ్రీకృష్ణదేశికేంద్రులవారు ఈ పద్యములో ఈసాంప్రదాయకులను హెచ్చరించుచున్నారు. బోధయందు గట్టి నమ్మిక, దృఢమైన ప్రేమయున్నప్పుడు మాత్రమే పైవిషయ ములనుసాధించుటకు ప్రయత్నింతురు. అట్లు ఆచరరించినచో బోధయొక్క మర్మధర్మములుగుర్తింపబడి ఎలకను భ్రాంతితొలగి, బోధస్థితి కలుగుటకు కారణమగును.

200) నే మొదట నిన్నుగనుగొని। యేముక్కలు నీను చెవిలో యిమిడిస్తినో నీ। వాముక్కల మూడింటిని। యేమాత్రము మరవకుండ యీబోధనిస్తి॥ అంతకెయింతగా బోధజేస్తి॥ ప్రేమా తొజదువు మిదేమారకెప్పుడు। కామితార్థము నిచ్చు పోమీయింటికి దీవిం॥ చీ బోధనిస్తి। అంతకెయింతగా బోధజేస్తి॥

భావము: : శిష్యా! నేను నిన్ను మొట్టమొదటగా చూచి నప్పుడు యేమూడుమంత్రములు నీచెవిలో చెప్పియున్నానో, ఆ మూడు మంత్రములను యేమాత్రము మరువకుండుటకై యీబోధ చెప్పబడినది. కనుక యీ బోధను ప్రేమతో జదువుము. ఎప్పుడు మరవకు. అట్లుజేసినచో నీవు కోరినకోరిక తీరగలదు. ఇకమీయింటికి పొమ్మని శిష్యుని అశీర్వదించెను.

విశేషభావము : ద్వాదశాక్షరి, షోడశాక్షరి, పంచదశాక్షరి అను మహామంత్రములకే ఈపరిపూర్ణబోధ. ఎంతచెప్పినా. ఆ మహాదు మంత్రభావములను దాటిచెప్పుటకు వీలుపడదు. అమహాదు మంత్రములు బాగుగా దృఢపడుటకై గురుదేవుడు ఎన్నోరీతుల ఎన్నో యుక్తులచే బోధించవలసి వచ్చుచున్నది. బోధంతయు పూర్తి ఆయినది అనిచెప్పుచూ సద్గురుమూర్తి శిష్యుని "నీ కామితార్థ మును ఇచ్చును పామ్ము మీయింటికి "అని ప్రేమపూర్వకముగా ఆశీర్వదించెను. నీకామితార్థము అనగా_నీవు కోరినకోర్కె. శిష్యుడు మొట్టమొదటగా గురుమూర్తిని సమీపించినప్పుడు, ఎన్నటికి తిరిగి పుట్టని, జన్మకురానిబోధమార్గము తెలియజేయుమని కోరియుండెను. అదే ఆతనికోరిక. ఆకోర్కె సిద్ధించగలదని ఆశీర్వదించి పంపుటయే ఈపద్యభావము.

— —

201) అన్నముతిన్నను ఆకలి। తిన్నగ నీరంబుద్రావ తృష్టయురోగం। బెన్నగ నౌషదసేవను। జన్న క్రియన్ యెరుక నిల్వజాలదోయన్నా ॥ యీబోధ నీచాలాతోవిన్నా ॥ కన్నులతో జూచి కడముట్ట జదివీన। నిన్నెన్నటికి యెదుట నిలచుండి కనుగొన జాలదోయన్నా । యీ బోధనీచౌలతోవిన్నా ॥

భావము : శిష్యా : అన్నముదినినతో ఆకలియు, నీరు ద్రాగినచో దాహమున్ను, ఔషధసేవచే రోగము పోయినట్లుగా, యీపరిపూర్ణబోధ నీచెవులతోవిన్నా, పుస్తకమంతయు కన్నులతో జూచుచు చివరకు చదివినా, యెరుక నిన్నెన్నటికి ఎదుట నిలబడి నిల్వజాలదు.

— —

102) జననమరణ ప్రవాహము । నణమును యీ బోధ పట్టుడని సాధువులిచ్చిన । నొల్లకుండి వారలు జనినిపుడా బోధమీద జనియించి ప్రేమా ॥ వెదకెదరట్టి జనచేష్టలేమా । యని తోచి నీకునే వినజెప్పవలసె । నీవును యీ బోధను వల్లననకు దొరకదుమళ్ళి ॥ జనియించి ప్రేమా ॥ వెదకెదరట్టి జనచేష్టలేమా ॥

భావము : శిష్యా ! యీ పరిపూర్ణబోధ జనన మరణ ప్రవాహమును లేకుండగ జేయును, గ్రహించమని సాధువు (గురువు) లిచ్చినప్పుడు అంగీకరించక ఉపదేశము తీసుకొనరు. ఆటుపై గురుమూర్తి వెళిపోయినపిదప కొన్నాళ్ళకు ఈ బోధమీద ప్రేమ కలిగి, అప్పుడు ఈ బోధ ఎవరుచెప్పుదురాయని ఆ చెప్పేవారిగురించి వెదకెదరు. ఇట్టి జనులపనులు ఏమని చెప్పను. ఇది నాకిప్పుడుతోచి నీకునే చెప్పుచున్నాను. నీవుకూడా యీబోధ వద్దనకుండగ గ్రహించుము. నీవు కావాలని కోరినప్పుడు అప్పుడు దొరకదు.

---

203) మరుపుకుతన్మాత్రలుగల । వెరుకకుతన్మాత్రలున్నవి రెండొకటే ॥ పరిపూర్ణమునకు లేవవి । పరిపూర్ణము యెరుక గాదు మరుపూగాదోయీ ॥ వెతకిన దీనిసరిదిలేదోయీ ॥ పరిపూర్ణమెరుకాల పరిశోధించి గ్రంథము। రచించి నీకిప్తు స్సురువక చదువెరుకః మరువు గాదోయీ । వెతకిన దీనిసరిదిలేదోయీ ॥

భావము ! శిష్యా । శబ్దాది పంచతన్మాత్రలు మరుపుకు అనగా అజ్ఞానమునకు ఉన్నవి, ఎరుకకు అనగా జ్ఞానమునకు ఉన్నవి, కనుక జ్ఞాన అజ్ఞానములు రెండును ఒక్కటే. పరిపూర్ణము

జ్ఞానముకాదు. అజ్ఞానముకాదు. ఎంత పరిశోధించినా పరిపూర్ణము నకు సాటియైనదేదియులేదు. ఈ పరిపూర్ణము ఎరుకలను గురు ముఖతా నేను చక్కగా పరిశోధించి, యీ గ్రంథము రచించినీకిచ్చు చున్నాను. మరువకుండగ చదువుకొనుము.

---

204) అందముగా సద్గ్రంథము । చందము వినిపింతుదాన్ని చదివిన వినినన్ । ముందుగ బయలెరుకై యే । సందున లేనెరుక లేక జనవలెనుమ్మీ ॥ అదెయిదివి చదువునమ్మీ ॥ యెందుకు నీ కింక యితరశాస్త్రముల జో । లందు గుర్తుండి పోదదిగాన యీ యెరుక । జనవలెనుమ్మీ ॥ అదెయిదివి చదువునమ్మీ ॥

భావము : శిష్యా ! సద్గ్రంథమనగా ఎట్టిదో చక్కగా వివరించెదనువినుము. సద్గ్రంథమును చదివినను వినినను మొట్ట మొదటగా పరిపూర్ణము తెలియబడి, లేనెరుక ఎచ్చటను, యెంత మాత్రములేకుండగపోవలెనుసుమా ! అదే సద్గ్రంథము. ఆసద్గ్రం థమెయిది. కనుక దీనియందునమ్మి కలిగించి బాగుగచదువుకొనుము నీకు యింక యితర శాస్త్రములజోలి యెందుకు ? అవి చదివినచో నీగుర్తు (యెరుక) పోకుండా ఉండును. అందుచే ఇతరశాస్త్రముల జోలి నీకువద్దు. యెరుకలేకుండా పోవలెనుగాని నిలబడుట పనికి రాదు. అట్లు ఎరుకలేకుండాపోగొట్టే గ్రంథము యిదే.

విశేషభావము : ఈపద్యములో "బయలెరుకై "అన్నారు. అందుకు కొంతమంది అల్పజ్ఞత్వముచే పరిపూర్ణము ఎరుక అవు తుంది అని అర్థము చెప్పుచున్నారు. అది సరిగాదు. పరిపూర్ణము ఏదీగాదు. ఎట్టిమార్పు జెందదనిది అని అనేకమార్లుచెప్పియున్నారు

పరిపూర్ణములో ఇసుమంతయు యేమీలేన్నది. ఇసుమంతమార్పు ఎన్నడూ చెందనిది అనియు, ఎట్టి భావ వికారములు లేనిది అని బాగుగ గుర్తించవలెను. కనుక బయలు యెరుక అవదు. బయలెరుకై అన్న పదమునకు అర్థము, బయలు తెలియబడును అని అర్థము. ఇట్లే 'యెరుక బయలై' అన్న పదము కొన్నిచోట్ల మన పెద్దలు ఉపయోగించినారు. ఇక్కడకూడ కొంతమంది తప్పుగా అర్థము చెప్పుకొనుచున్నారు. యెరుక ఎన్నడూ బయలుకాదు. బయలును చూడబోయిన యెరుకేలేకపోవును. అని అనేక సందర్భములలో చెప్పియున్నారు. మరి ఎరుక బయలెలాగున అగును ? యెరుక-యెరుకే, బయలు-బయలే. బయలు-బయలే. అది ఇది కాదు, ఇది అదికాదు. యెరుకబయలగుట అనగా ఎరుకను గూర్చి గురుముఖతా విచారణ జేసినప్పుడు, యెరుక శాశ్వతముకాదు. కేవలము మాయ, లేనిది అని తెలియబడినది. విచారణ లేనప్పుడు యెరుక పూర్తిగా తెలియబడక అది బ్రహ్మమని భావించుకొనుచున్నాము. కాని విచారించిన పిదప దానిగు తెలియబడినది. అదే యెరుకబయలగుట. ఎరుకయొక్క రహస్యము బయలై పోయినది అనగా రహస్యమేమియు లేకుండగ తెలియబడినది అని అర్థముచెప్పవలెను. కనుక బయలు-యెరుక అవదు యెరుక-బయలవదు. ఇక బయలెరుకవుతుంది, యెరుకబయలవుతుంది అనేవారు మనసిద్ధాంతులుకారు. ఒకవేళ మనసాంప్రదాయకులే అయినా, వారు శ్రీ దీక్షిత సిద్ధాంతమును చక్కగా గ్రహించిన వారుకారు. అట్టివారి బోధలు వినరాదు. **

— —

205) చక్కెరమెక్కక లోకులు । చక్కెరమాధుర్య మెరుగ జాలరటువలెన్ । మక్కువతోవినిచదువక । చక్కగ గ్రంథార్థమెరుగ జాలేరాజనులూ ॥ కావున నీవు చాలించి పనులూ ॥ చొక్కామీ గ్రంథాముచూడూమికొనవెళ్ళ । యిక్కాడితో జన్మమెత్తావు సరి ॥ తెలియజాలేర జనులూ ॥ కావున నీవు చాలించి పనులూ ॥

భావము : శిష్యా ! చక్కెర తినకుండగా, జనులు చక్కెర యొక్క మాధుర్యమును తెలియలేరుగదా ! అట్లే యీ గ్రంథ మందు ప్రేమ ఉంచి చక్కగ గురుముఖతా విని నిత్యము చదువక పోయినచో జనులు ఈగ్రంథము యొక్క భావమును చక్కగా గ్రహించలేరు. కనుక నీవు యితరమైన పనులు మాని గొప్పదైన యీ గ్రంథమును చివరవరకు పూర్తిగా విచారణ పూర్వకముగా చదువుకొనుము. అక్కడితో (అట్లుజేసితే) ఇక తిరిగి జన్మకురావు. ఈ విషయము సామాన్యజనులకు తెలియదు.

— —

206) గూఢార్థమెరిగి సతతా । రూఢుండై సతడు గ్రంథరుచి గొనడు, భువిన్ । గాఢతరజ్ఞానంబున । మూఢుండై యున్నవాడు మొదటికె వినడూ ॥ సుజనులపొడ మున మొప్పగనడూ ॥ వాడు వీడన రానివాడే గ్రంథము వినె । వాడు నిశ్చయమిట్టి వార్త లెరుగనివాడు ॥ మొదటికే వినడూ । సుజనుల పొడముద మొప్ప గనడూ ॥

భావము : శిష్యా ! ఈపద్యములలోని గూడార్థ మెరిగి ఎల్లప్పుడు ఆ రూఢస్థితిని పొందినవారు ఈ గ్రంథమును వారు చదువరు. మరియు గాఢమైన అజ్ఞానస్థితియందున్న మూఢజనులు

అసలు ఎంతమాత్రము ఈ గ్రంథమును చదువరు. వారు–వీరు కాని వారే అనగా ఆరూఢస్థితి పొందనవారు, మూఢులుకాని వారే సంతోషాతిశయముగా ఈ గ్రంథమును చదువుదురు. విందురు. ఇదినిశ్చయము. ఇట్టి పరిపూర్ణబోధ సూక్ష్మ తెలియగని మూఢుడు ఈ గ్రంథమును అసలు వినడు. అంతేకాదు సుజనులచెంతకు ఎంతమాత్రము చేరదు.

విశేషభావము : "గూఢార్థమెరిగి" అన్నపదమునకు ఈ ఈపద్యములలోని రహస్యభావము నెరిగి అని అర్థము చెప్పుచున్నారు. అందరికి విశదమగుటకే ఆంధ్రములో వ్రాసినట్లుగను, కొంచెములో సరిపుచ్చక చాల పెంచిన కారణము ఈభావము తేటతెల్లముగా తెలియుటకొరకే అని కృష్ణ ప్రభువులు మొట్టమొదటగా గ్రంథ సభావిజ్ఞాపనములో శెలవిచ్చిరి. అట్టిచో వారి రచనలలో రహస్యార్థముండుటకు తావులేదు. అయితే గూఢార్థము. గూఢ–రహస్యమైన, అర్థము–వస్తువు. అనగా రహస్యమైన వస్తువు అది ఏది ? అతిరహస్యమైనది బట్టబయలు. "అతిరహస్యం బట్టబయలు" అనులోకోక్తి కలదుకదా ! కనుక ఈపద్యములోచెప్పిన గూఢార్థ పదమునకు పరిపూర్ణము అని అర్థము చెప్పుకోవలయును. కనుక పరిపూర్ణమెరిగి ఆరూఢస్థితియందున్న వారికి గ్రంథముతో పనిలేదు. అజ్ఞానముచే పారమార్థికచింతనలేక తిరిగే మూఢజనులకు ఈ గ్రంథము వారికి ఎంతమాత్రము రుచించదు. ఆపై ఇద్దరు కానివారు అనగా పరిపూర్ణస్థితి పొందనివారు, మూఢులు కానివారు అట్టివారికి మాత్రమే ఈగ్రంథము వినగలరు. వారికి సంతోషము కలుగజేయగలదు.

—— ——

201) తాబేటి తలపుచేతను । తాబేల్పిల్ల లక్షుదార్తి తలగుట తెలియున్ । తాబేటి గర్భమందున । తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ ॥ సద్గురు బోధల్లరయా౽ తరులకూ ॥ యేబాధలెరుగనితబోధ గలవారి। చేబోధ, బడయకచే కొనదలచితే॥ తరమా యితరులకూ । సద్గురుబోధల్లరయనితరులకూ ॥

భావము : శిష్యా ! తాబేలు, తన పిల్లలను గూటియందు విడచి ఆహారమునకై బయటకేగినప్పుడు, కొంత సేపటికి తనపిల్లలకు ఆకలిఅగుచున్నదే మోయని తలంపు కలుగును, అట్లు తలచినంతమాత్రముననే ఆతాబేలుపిల్లలయొక్క ఆకలి దీరిపోవుచున్నది. ఇట్టివిషయము తెలియవలెనంటే తాబేలు గర్భమందు తాబేలై పుట్టకుండగ తెలియుశక్యము కాదుగద । అట్లే యీ సద్గురుబోధ యేబాధలెరుగని యీ బోధగలవారిద్వారా తెలుసుకొనకుండగ, తమంతతామే యీబోధ తెలుసుకొనశక్యముగాదు.

విశేషబావము : తాబేటి తలుపు మాత్రముచే తనపిల్లల క్షుద్బాధ తీర్చగలుగుట తాబేటి గర్భమందు జన్మించకుండగ ఆ విషయము తెలియుశక్యముకాదు అని ఈపద్యములో చెప్పబడినది. ఇది శాస్త్రవాక్యము. అయితే ఇట్లుచెప్పినవారు తాబేలు గర్భమందు జన్మించి, గతించి, తిరిగి మానవులై పుట్టినపిదప, పూర్వజన్మ అయిన తాబేలుజన్మ జ్ఞానము ఈ మానవజన్మయందు కల్గియుండి చెప్పగల్గెనా ? ఇది సంభవమేనా ? అనుసంశయము కలుగుచున్నది. దీనికి సమాధానము. అట్లు చెప్పినవారు మహాఋషులు మనకు ఈ పద్యరూపముగా చెప్పినవారు ~~కృష్ణప్రభువు శాస్త్ర~~ ~~వాక్యములను ఈ~~ పద్యములో ఉదహరించుకొన్నారు. ~~శాస్త్రములు మహా~~ ఋషి వాక్యము. మహాఋషులు సిద్ధపురుషులు. కనుక అణుత్వ

రూపులు మరియు మహత్ స్వరూపులు కాగలరు, మహత్ స్వరూపముగా, సర్వజీవులయందు ఆత్మస్వరూపముగా, వ్యాపక స్వరూపులు కాగలరు. అట్టిచో తాబేలుయందుకూడా ఆత్మస్వరూపముగా వ్యాపక స్వరూపుడై వాటిపిల్లలయొక్క క్షుదార్తి తొలగిన విధనమును స్వీయముగా తెలుసుకొనియే, [redacted]రు. లేనిచో వారికి మాత్రము ఎట్లు తెలియగలదు, కనుకనే తాబేలు గర్భమందు జన్మించకపోయినచో ఆపిల్లల క్షుద్బాధ ఎట్లు తీరినదో, తెలియుదు అన్నారు. కనుక ఆ మహఋషులు వ్యాపక స్వరూపులై తాబేలు పిల్లల క్షుద్బాధ ఎట్లుతీర్చినదో స్వయముగా తెలుసుకొని [redacted] ములో చెప్పుతారు. మరియు మహఋషులు సర్వజ్ఞులు. వారికి తెలియని విషయముండదు అని గ్రహించవలెను.

అట్లే యీ బోధయొక్క మర్మ ధర్మములు కూడ తెలియవలెనంటే యీ బోధ చక్కగా తెలిసిన సద్గురుమూర్తి వద్ద ఉపదేశము పొంది వారిద్వారా గ్రహించవలెనేగాని. యితరులకుసాధ్యముకాదు. ఈ పద్యములో "యేబాధలెరుగని యీబోధగలవారిచే" అన్నారు. యేబాధలెరుగని అనగా సమస్త బాధలకు మూలమైనజన్మకువచ్చుట అను బాధలేని, అనగా తిరిగి జన్మించని స్థితి గల సద్గురుమూర్తి ద్వారా ఈ పరిపూర్ణబోధను గ్రహించవలెనని అర్థము. అందుచేతనే గురుగీతలోకూడ "లబ్ధ్వాకులగురుంసమ్యక్" అన్నారు. శ్రేష్ఠమైన గురువును సంపాదించుకొనుము అన్నారు. కనుక ఈ పరిపూర్ణబోధయొక్క మర్మధర్మములు తెలియవలెనంటే, బోధపురుషస్థితిగల సద్గురుమూర్తికి జ్ఞానపుత్రుడై జన్మించి, యీబోధను నేర్చుకొని గ్రహించవలెను. మరొక విధముగా తెలియనేరదు అని భావము.

208) ఈతాపేక్షను మనుజులు । నూతిదరింజేరినిల్చి నోట గొలగినన్ । యీ తేలవచ్చువారికి చేతులతో నీళ్ళమీదజేతి యీద

కనూ॥ మునునేర్చినవారీదించకనూ ॥ యీ తీరుగనె దేశికేంద్రుడు దెల్పక। చాతుర్యమున బోధసాధించనయ్యాన ॥ చేరీయాదకనూ। మునునేర్చినవారీదించకనూ ॥

బావము : శిష్యా ! ఈతనేర్చుకొనవలెనను కోర్కెగలవాడు జలాశయముదరిజేరి, "ఈతరావాలి" అని నోటితో పలుమార్లు అన్నప్పటికి, వానికి ఈతవచ్చునా ? రాదు. జలాశయమునందు తన కన్న ముందుగా ఈత నేర్చినవానితోదిగి, అతనునేర్పుచూ, తాను నీటిమీద చేతులతో ఈదుతూ నేర్చుకొంటేనే ఈతవచ్చును. అట్లే యీబోధ నేర్చుకోవాలి అనిభావించినవ్యక్తి, గురువుపద్దజేరి ఉపదేశ క్రమముగా గురువును చక్కగా ఆశ్రయించి, గురువుచెప్పినట్లుగా నడచుకొనుచు నేర్చుకొనినవానికి మాత్రమే యీబోధ మర్మము తెలియబడగలదుగాని, మరియే యితరమైన సాధనలవలన యీ బోధ మర్మములు తెలియరావు.

విశేషబావము : "యత్తు స్వతః అప్రాప్తం। తత్ శాస్త్రేణబోధితవ్యం"। తనకుతానుగా ప్రయత్నించి పొందలేని బ్రహ్మవిద్యను, [redacted]. మరియు "[redacted] జ్ఞోపి, స్వాతంత్రేణ, బ్రహ్మజ్ఞానాన్వేషణంనకుర్యాత్"। బాగుగా [redacted] చదివిన పండితుడైనను, బ్రహ్మవిద్యను తెలియజేయు [redacted]ను, స్వతంత్రముగా అభ్యసింపరాదు. కనుకనే "ఆచార్యవాన్ పురుషోవేద"। గురువుకలిగినవాడు పరమును అనగా బ్రహ్మమును తెలియుచున్నాడు అని అన్నారు. కనుక పైపద్యములోచెప్పినట్లుగా చక్కనిబ్రహ్మజ్ఞాన సంపన్నుడు, శిష్టాచారుడు, పూర్ణస్థితిపరుడైన గురువును చక్కగా ఆశ్రయించి, పరిపూర్ణబోధను పొందవలయును.

— ० —

209) ప్రవిమలచిత్తుడు శిష్యుడు। సవినయమున దేశికునకు శరణాగతుడై । త్రివిధప్రసాదముఁ గొని । భవనాశస్థితులులేని పద్ధతివినినన్ ॥ తిరిగిరాని పద్ధతిగనినన్ ॥ భువిలోవాని సాటిబోల్ప నెవ్వరులేరు । అవిరళభక్తి నీవాపేతినుండేవి ॥ పద్ధతి వినినన్ । తిరిగిరాని పద్ధతి గనినన్ ॥

భావము : శిష్యా ! యెంతమాత్రము కుటిలత్వములేని శిష్యుడు, వినయ విధేయతా పూర్వకముగా సద్గురుమూర్తికి శరణాగతుడై, వారిచే నొసంగబడిన త్రివిధ ప్రసాదములను తీసుకొని, పుట్టుట, పెరుగుట, నశించుటలులేని యీ పరిపూర్ణబోధను క్రమ పద్ధతిగావిని, తిరిగి పునర్జన్మకురాని పూర్ణస్థితి పరుడైన వాని సాటి, యీ భూమిమీద ఎవ్వరును ఉండరు. నశించిపోని భక్తిచే నీవు అరీతిగా ఈ బోధనువిని ఉండుము.

విశేషభావము : త్రివిధ ప్రసాదములు అనగా 1) అన్న ప్రసాదము, 2) పాదోదకము, 3) మంత్రము. యీమూడును శిష్యుని మూడు శరీరములను పవిత్రత చేయుటకై శిష్యుడు తీసుకోవలయును. స్థూలశరీరము అన్నమయకోశము కనుక, గురు మూర్తి తినినపిదప మిగిలిన ఆహారమును ప్రసాదముగా శిష్యుడు గ్రహించవలయును. అంతేకాని ఎంగిలి అనుపేరుతో నోటిలో తిను చున్న ఎంగిలి ఆహారమును తినరాదు. ఉచ్ఛిష్టమనగా గురువు తినగామిగిలినదంతయు గురోచ్ఛిష్టమేయగును. గురువుఅఘ్రాణించి యిచ్చిన పండ్లు వగైరా ప్రసాదముకూడ ఉచ్ఛిష ప్రసాదమే యగును. కనుక శిష్యుని స్థూలశరీర పవిత్రతకై గురోచ్ఛిష్ఠ అన్న ప్రసాదమును తినవలయును. 2) సూక్ష్మశరీరము ప్రాణ ప్రధాన మైనది. కనుక ప్రాణము జలాంశము. అందుచే పాదోదకముచే,

సూక్ష్మ శరీరము పవిత్రమగును. అందుచే శిష్యుడు గురుపాదోదకమును తీసుకొనవలయును. 3) కారణ శరీరము అవిద్యాసంబంధమైనది. అవిద్యానివృత్తి కొరకై శిష్యుడు గురువుయొక్క నోటి ద్వారా చెప్పబడిన (ఎంగిలి) మంత్రములను గ్రహించుట. ఈ మూడును త్రివిధ ఉచ్ఛిష్ట ప్రసాదములు. ఈపద్యములో శిష్యుడు ప్రవిమలచిత్తుడై యుండవలెనని చెప్పినారు. ప్రవిమలచిత్తుడు అనగా ఎంతమాత్రమైనను మలినములు, కుటిలత్వము, రాగద్వేషములు లేక సదాచార సంపన్నుడైనవాడు అని అర్థము. ఈ మాటచే ఈ బోధస్థులమైన మనమందరము ఏలా ఉండవలయునో శ్రీకృష్ణదేశికేంద్రులవారు తెలవిచ్చుచున్నారు. కృష్ణదేశికులు మనసాంప్రదాయక గురుశ్రేష్ఠులు వారుచెప్పినట్లుగా మనమందరము ఆచరించి తీరవలసినదే.

"శరణాగతుడై" అనగా శిష్యుడు పునర్జన్మనుండి విముక్తిని గోరి అనేక ప్రయత్నములు చేసినను, దానివలన పునర్జన్మ ఇక నాకులేదను దృఢత్వము కలుగలేదు. అతనిని పునర్జన్మ భయము విడచిపెట్టలేదు. అందుచే పునర్జన్మనుండి తప్పించగలనని చెప్పిన సద్గురుమూర్తికి భయస్థుడైన శిష్యుడు శరణుకోరుటచే, శిష్యుడు శరణాగతుడయ్యెను, అభయమునుండి బాధపడుచున్న శిష్యునికి సద్గురుమూర్తి అభయదానమొసంగెను.

— —

210) ఉపనయనముగానిదెతా। నుపనయనముమీదిచదువు
నూహనుగానినన్। విపరీతమగును దానను। చపలుడు బ్రాహ్మ
ణుడుగాడు చర్చించిచూడా ॥ శూద్రుడు బ్రాహ్మణ్యయర్చించరేడా ॥

 

వుపమాచెబోధట్ల ఊహించినిక్కొటి । కపటాచిత్తుడు సాధుగణముతో సమమౌనె ॥ చర్చించిచూడ । శూద్రుడు వాణ్ని యర్చించరేడా ॥

భావము: శిష్యా! ఉపనయనముగాకుండగ, ఉపనయనము అయినపిమ్మట చెప్పకొనే చదువు అనగావేదమును, ఊహాచే పుస్తకముద్వారా పఠించి నేర్చిన బ్రాహ్మణుని, వేదసంస్కారములను చేయించు పురోహితబ్రాహ్మణునిగా ఎవ్వరును అంగీకరించరు. మరియిట్టివానిని, విపరీతముగా గ్రహించి, చపలునిగాను శూద్రునిగాను భావించి, అట్టివానిని పురోహితుని పూజించిన విధముగా పూజించరు. అట్లనే ఎవ్వడైనను గురుమూర్తికి సేవజేసి శుశ్రూషచేయా బోధ నేర్వకుండగ పుస్తకరీతిగానో, వారు వారు చెప్పకొంటె వినో, ఈ బోధను కొద్దిగా గ్రహించి, పరిపూర్ణబోధ నాకు తెలుసునని గర్వపడేవాడు, మోసగాడేకాని, గురుశుశ్రూషచే విద్య నేర్చుకొన్న సాధుసజ్జనునితో సమానముకాడు. అట్టివాడు శూద్రుడు అతనిని గురువుగా ఆరాధించరాదు.

విశేషభావము : బ్రాహ్మణ కులములో వేదవిద్యను అభ్యసించుటకు ముందుగా గురువు (పురోహితుడు) ఆవిద్యార్థికి ఉపనయనము అనే సంస్కారముచేసి గాయత్రీ మంత్రోపదేశము చేసి, అటుపిమ్మట వేదమునుచెప్పి విద్యావంతునిగా చేయును. ఉపనయకము కాకపోయినచో కులమునకే బ్రాహ్మణుడు అగును గాని నిజమునకు వాడు బ్రాహ్మణుడు అనిపించుకోడు. ఇట్టి ఉపనయన సంస్కారముగానిదే వేదవిద్యను తనయొక్క తెలివిచే పుస్తకరీతిగా అభ్యసించినప్పటికి. అతను వేదసంస్కారములు చేయించుటకు అర్హతలేనివాడగును. వానిచే ఎవరూ సంస్కారములు చేయించుకొనరు. పూజించరు. అట్లే గురువువద్దజేరి మంత్రోపదేశ

ముపొంది క్రమశిక్షణగా బ్రహ్మవిద్యను అభ్యసించినట్లయితేనే అట్టిజ్ఞానము అతనికి ప్రకాశింపగలదు. "గురువులేనివిద్య గుడ్డివిద్య" అనిలోకోక్తి. కనుక గురువులేనిదే తన తెలివిచే పుస్తకములలో చదివి, నాకు బ్రహ్మజ్ఞానము తెలిసినది, నేను బ్రహ్మజ్ఞుడను అని గర్వించే దుష్టునివద్ద విద్యనభ్యసించరాదు. అతడు చపలుడు. బ్రహ్మజ్ఞానం'తు'బ్రాహ్మణః అన్నారు కావున బ్రహ్మజ్ఞానముకల వాడు బ్రాహ్మణుడే. కాని గురు శుశ్రూష లేకుండగ పుస్తకరీత్యా బ్రహ్మవిద్యను ఆర్జించినవాడు కనుక ఇట్టివాడు బ్రాహ్మణుడుకాడు శూద్రుడే.

211) మంత్రముచేసంతెట్లు గుః తంత్రములేకున్న కాదుతంత్ర ముచేతన్మంత్రములేకనువగిడుల । మంత్రముతంత్రంబు రెండు రిమగూడుకొనీ॥ కార్యములన్ని జరిగించుపూనీ॥ మంత్ర తంత్రము లలో మర్మము గురుడెరుగు । మంత్రాతంత్రములలో మరుగెరుగు గురునిచే ॥ మరిగూడుకొని । కార్యములన్నీ జరిగించుపూనీ।

భావము : శిష్యా : కేవలము మంత్రోపదేశము చేసినంత మాత్రమున ఉపనయనముకాదు. అందుకు జరుపవలసిన తంత్రములుకూడ జరగాలి. లేక తంత్రములు జరిపి, మంత్రోపదేశము లేకున్నను ఉపనయనము జరిగినట్లు భావింపబడదు. అందుచే వడుగు (ఉపనయనము) మంత్రోపదేశమ, అందుకు చెప్పబడిన తంత్రములు ఈ రెండును సమముగా జరిగినప్పుడే, ఉపనయనము జరిగినట్లు అంగీకరింపబడును. అట్లే గురువువద్ద శిష్యునికికూడ మంత్రము, కొన్ని తంత్రములు రెండునూ జరగాలి. ఈ మంత్ర తంత్రములలోని భావము గురునికి తెలుసును. అందుచే నీవుచక్కగా గురుముఖముఆమంత్ర తంత్రములలోని రహస్యములన్ని చక్కగా తెలుసుకొనుము.

విశేషభావము : ఈ పద్యములో "సంతు" అన్న పదము నకు కొంతమంది సంతానము అని అని అర్థము చెప్పుచున్నారు. సంతు అనగా ఉపనయనము విద్యార్థికి విద్యార్జనకుముందుచేస్తారు మంత్రోపదేశము. మరియుయజ్ఞోపవీతధారణ మొదలగు తంత్రము లచే ఈ ఉపనయన కార్యక్రమము జరుగును. అందుచే కేవలము మంత్రోపదేశముచేసి ఏతంత్రము జరుపకపోయినచో అది ఉపనయ నము కానేరదు. లేక అన్నితంత్రములు జరిపి, మంత్రోపదేశము గాకున్నను అది ఉపనయనము కానేరదు. మంత్రము ఉపదే శించుచు అందుకు అవసరమయిన యజ్ఞోపవీత ధారణ మొదలగు తంత్రములు కూడ పూర్తిచేస్తేనే అది ఉపనయనము అనిపించు కొనును. అట్లే శిష్యుడు గురుపూజ అందు ఆచరించవలసిన విధులు వగైరా తంత్రములతోను, గురుమూర్తి ఉపదేశించిన మంత్రోప దేశము. ఈ రెండు సక్రమముగా జరిగినప్పుడే ఆశిష్యుడు గురు పుత్రుడగును. శిష్యుడనిపించుకొనగలడు. ఈ ఉపదేశింపబడిన మంత్రముయొక్కయు, తాను ఆచరించిన సాష్టాంగ నమస్కారము పూజ మొదలగు తంత్రములు యొక్కయు రహస్యభావములను సద్గురుమూర్తిద్వారా చక్కగా తెలుసుకొనవలయును.

(సంతు = ఉపనయనము)

— —

21౯) సంకల్పాదికర్గుణముల। సంకులమీ యెరుకయుందు సమకూడుండున్। సంకల్పాదిక గుణముల। సంకుల మచలమున జాడజాడలేదన్నా ॥ యీ రెంటికి 'యీడుగాదన్నా ॥ కొంటాక యీరెంట్ని గూర్చి గ్రంథముజేస్తి। సంకోచింపక జదువు శంక ఋట్టదు శంక ॥ జాడలేదన్నా। యీ రెంటికి యీడుగాదన్నా ॥

భావము : శిష్యా ! సంకల్పము మొదలగు సమస్తగుణముల సమూహము, యెరుకయందు నిత్యము ఉండును. యీ సంకల్పాది సమస్తగుణ సమూహము పరిపూర్ణమందున వెదకి జూచినను యిసుమంతయులేదు. కనుక ఎరుకకు – పరిపూర్ణమునకు ఎంతమాత్రము పోలికలేదు. యీ రెండూ ఎన్నడూ ఒకటి కాదు. సంశయమెంతమాత్రము లేకుండగ యీ యెరుక పరిపూర్ణముల గూర్చి యీగ్రంధమును జేసితిని, నీవుకూడ, యీ యెరుక పరిపూర్ణములగూర్చి విచారణజేసి యీగ్రంధమును గురుముఖతా చక్కగా అధ్యయనము చేయుము. అప్పుడు నీకు ఏవిధమైన అనుమానము పుట్టదు. అంతేకాదు_యెరుక తిరిగి పుట్టనేరదు.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాఽద్వైత రహిత పరమతత్వ

బోధ పఠనలక్షణనామ

ద్వాదశోఽధ్యాయమునకు

భావ, విశేషభావములు

సమాప్తము.

॥ జై గురు ॥



# 13. భద్రాద్ర్యంకితము (8)

213) అలభద్రాచలమనిన బ। యలుగా గుర్తెరుగవలయు యెరుకను విష్ణ్వం। దులదోచి గురుని కృపచే। నిలువకవిష్ణ్వెగిరి పోతె, నిశ్చయమదెరా ॥ కృష్ణదాసు నిశ్చయమదెరా। యిల మీద యెవరైన యీకందార్థములలోపలి గూఢార్థము। దెలియు భ్రమను జెందరు వారు ॥ నిశ్చయమదెరా। కృష్టదాసు నిశ్చయమదెరా ॥

బావము : అక్కడఉన్న భద్రాచలమనగా, పరిపూర్ణమే నని యెరుగవలయును. అందు యెరుక అనే విష్ణువు ఉన్నట్లుదోచి గురుకరుణచే ఆ విష్ణువు నిలువక ఎగిరిపోతే (లేకపోతే) అదే నిశ్చయము, నిజము. శ్రీభాగవతుల కృష్టదాసుయొక్క నిశ్చయమదే. యీ భూమిపై యెవరైనను ఈకందార్థములలో చెప్పబడిన పరి పూర్ణభావమును తెలిసినచో వారు ఎరుకభ్రమ చెందరు. ఇది నిశ్చయము.

విశేషబావము : గూఢమైన, రహస్యమైన, అర్థము. అనగా బట్టబయలని గుర్తించవలెను. అర్థము-భావము. కనుక గూఢార్థమనగా పరిపూర్ణభావము అని తెలిసుకోవలయును.

భద్రాచలమే-పరిపూర్ణమనియు, భద్రాచలమందున్న విష్ణువు (రాముడు) తోచబడిన ఎరుకనియు, గురుకృపచే విష్ణువుఎగిరిపోతే ఎరుకలేకపోతే. ఉన్నది పరిపూర్ణమే. అదే నిశ్చయము. ఈ విధముగా శ్రీకృష్ణ దేశికులవారు ఈగ్రంథమును అట్టిభద్రాద్రి యందున్న విష్ణువునకు అంకిత మొనర్చినారు.

— —

 

214) భాగవతుల నారాయణ। యోగికి జానకియనేటి యువిదామణికిన్ । బాగుగపుత్రుడనై భూ । భాగమునన్ కృష్ణ డనుచు ప్రభవించినానూ ॥ అనంతకి ప్రభువునైనానూ! నాగురువు కృపచేతనయమైన యీబోధ । నేగంటి కన్నంత నీకుదెల్పుటకిట్లు। ప్రభవించినాను । అనంతకి ప్రభువునైనానూ ॥

బావము : శ్రీ భాగవతులనారాయణయోగి, జానకి అనే దంపతులకు యీ భూమిపై పుత్రుడనై కృష్ణభట్టు అనునామము కల్గి పుట్టినాను. అనంతలక్ష్మి అనునామెకు భర్తనైతిని. నా సద్గురు మూర్తి కృపచేత మంచిదైన యీబోధనేర్చితిని. నేర్చిన సమస్తము నీకు తెలియ పర్చుటకు ఈ గ్రంధము వ్రాసితిని.

215) దేశాటనంబుజేసితి । వ్రాసితి గ్రంధములు కొన్ని వరగురుశిష్యుల్ జేసేటి చర్చ వింటిని । రోసితిమోక్షాద్యపేక్షరూఢిగ వినుమీ ॥ నీవిట్టి యూ రూఢతగనుమీ । దేశికు దయబుట్టజేసి శుశ్రూష వ । దేశముగొని యుపదేశమిచ్చితిమెచ్చి ॥ రూఢిగ వినుమీ । నీవిట్టియూరూఢతగనుమీ ॥

బావము : నేను కొన్నిదేశములు తిరిగినాను, కొన్ని గ్రంథములు వ్రాసినాను. శ్రేష్ఠులైన గురు శిష్యులు చెప్పుకొనే బోధలు, చర్చలు విన్నాను. చివరకు మోక్షము నందపేక్ష విడచి పెట్టినాను. సద్గురుమూర్తికి దయబుట్టులాగునచతుర్విధ శుశ్రూషలు చేసి, వారినుండి ఉపదేశము తీసుకొని (బోధతెలుసుకొని) నేను తిరిగి కొందరికి ఉపదేశమిచ్చినాను. మోక్షాపేక్ష విడచిపెట్టినాను. శిష్యా ! నీవుకూడ ఇట్టి ఆరూఢస్థితిని పొందవలయును.

విశేషబావము : "గురుశుశ్రూషయావిద్య" అన్నారు సద్గురుమూర్తికి చతుర్విధ శుశ్రూషలుచేసి వారికి దయకల్గులాగున

ప్రవర్తించి వారికలన మంత్రోపదేశము, సద్గురు బోధ తెలుసుకో వలయును. కొన్ని ప్రదేశములు తిరిగి అచ్చట ఉన్న అనేక సంప్రదాయక గురుశిష్యుల బోధలు చర్చలు విన్నాను. ఉన్నారు ఈపద్యంలో. ఇంటి అన్ని గురు బోధలు విని ఈ బోధకన్న మిన్న యైనది లేదని నిర్ణయం చేసుకున్నానను భావము తెల్పక తెలియ జేయుచున్నారు.

---

216) హటమున కుటిలాత్ముని జం। పుటకై భటకోటి కాజ్ఞ భూపతియిడినన్। భటులటువలె జేసెటిలో। పటకుటిలుడు పడిన పాట్లు పాటించి కనునా॥ అట్లనె గురుని నోటతావినెనా॥ యిటువంటి బోధను యెటువంటి నరుడైన। అటువెనుక తనచేష్టలెటువంటివో వాట్ని। పాటికచికనునా। అట్లనె గురునినోట తావినెనా॥

భావము : నేరము చేసినదుష్టుని ఉరితీయమని మహారాజు భటులకు ఆజ్ఞయిచ్చాడు. ఆ నేరస్థుని భటులు ఉరితీసేలోపల, ఆ దుష్టుడు తాను ఇదివరలో చేసిన తప్పులు నేరములు గూర్చి విచారించుకుంటూ ఉంటాడా? (తనకు ఇక బ్రతుకులేదు. బైమదగ్గర పడుతూ ఉంటనే ఉండును.) అట్లే ఎటువంటి నరుడైనను సద్గురుమూర్తి ద్వారా ఉపదేశము పొంది యీపరిపూర్ణబోధను చక్కగా తెలిసికొనినచో ఆ తరువాత ఆనరుడు తన వెనుకటి చేష్టలను విచారించుకొనలేడు. ఎరుకను విడచినవాడు కనుక అట్టి ఎరుకచేష్టల యందుబుద్ధి ఉండదు అనిభావము.

217) సకల జనుల సమ్మతిగా। నొకరై నను నడువలేరు నుర్వీస్థలిపై। మకరాంకజనని జనకా। ద్యకళంకులలోననేసేవన నేమి గణనా॥ బోధంపెతర జనులేమిగణనా॥ వికలమానసుడపై

వెతనొందబోకునీ। నకుటిలభక్తుడవని తెల్పితిబోధ॥ నననేమి గణనా। బోధందితరజనులేమిగణనా॥

భావము : శిష్యా। సకలజనుల సమ్మతిగా ఈభూమి పై ఒక్కరైనను ఉండలేరు. మన్మధుని తలిదండ్రులైన - లక్ష్మీదేవి విష్ణుమూర్తులకే అదిసాధ్యముకాలేదు. ఇంక నీవు, నేను ఒకలెక్క. ఈబోధకు ఇతరజనులైనవారు ఏమంటేనేమి ? అది లెక్కచేయకు. వారందరు ఈ బోధవిషయమై నిన్ను ఏదో అన్నారని మనస్సులో విచారము పెట్టుకొని భాధపడవద్దు. నీవు కుటిలత్వము లేని భక్తుడవనితెలుసుకొని నీకు యీగొప్పబోధ తెలియపరిచినాను ఇతరజనులు నిన్నేమన్నను బాధపడకుము. వాటిని లెక్క జేయకుము.

విశేషభావము : మకరాంక జనని జనకులు అనగా, మకరాంకుడనగా మొసలి గుర్తుగాగల జెండాగలవాడు - మన్మధుడు. అట్టివాని తలిదండ్రులు-లక్ష్మీదేవి, మహావిష్ణుమూర్తి, వీరు కూడ ప్రపంచములో అందరికి దైవముగా భావింపబడుటలేదు. మహమ్మదీయులకు వీరిని కొల్వ ఇష్టములేదు. పూర్వ పురాణగాధలు వీరిద్దరు రాక్షసులకు శత్రువులేకదా! కనుక ఏట్టి గొప్పవారైన అందరికి మంచివాడు కాలేకపోవచ్చును. యీపరిపూర్ణబోధ అందరికి ఇష్టపడేదికాదు. "సత్యం జనవిరోధాయ। అసత్యం జనరంజకం" అన్నారు కనుక సత్యమైనది. శాశ్వతమైనది అయిన యీ పరిపూర్ణ బోధ కొందరి జనులకు విరోధ భావము కలిగించవచ్చును అంత మాత్రముచే యీబోధస్థులను బాధపెట్టుకోవద్దని కృష్ణప్రభువు ఈ పద్యములో ప్రబోధించుచున్నారు, బోధ వారికి నచ్చకపోయినా నీ ప్రవర్తన మాత్రము అందరికి మెప్పుకలుగులాగున ఉండవలెను

అంతేకాని మన ప్రవర్తనను, వారు విమర్శించులాగున ఉండరాదు. కనుకనే జనులు నిను నను తిట్టనడువకు" అని ముందుపద్యములో చెప్పిరి. శృతియు "జనకృపానైష్ఠుర్యము సృజ్యతాం" జనులకు నిష్ఠూరముగా ప్రవర్తింపకుము అన్నారు కనుకమన ప్రవర్తన లోపము పనికిరాదు.



218) బలధన విద్యలు దుష్టుల। కిల గల్గిన నొంల నొంతు రీర్ష్యముచేతన్। బలధన విద్యలు శిష్టుల। కిలగలిగిన నాటల బ్రోతు రెంతో మోదమునా ॥ నీవీరెంటినెరిగి మోదమునా ॥ కలలోనైనా దుష్టులచెంతజేరాకు। మెలమి శిష్టుల జెంత కలనైనవదలాకు ॥ యెంతొమోదమునా। నీవీరెంటినెరిగిమోదమునా ॥

భావము ! శిష్యా ! బలధన విద్యలు మూడు దుష్టులకు కల్గినచో యీర్ష్యాసూయ గర్వములు పెరిగి ఇతర జనులను ఎంతో బాధపెట్టెదరు, ఆబలధనవిద్యలు సుజనులకుకల్గినచో సంతోషముగా వినయముతో జనులకు మంచినేచేయుదురు. కాని అవి దుష్టులవద్ద ఉన్నయెడల దుష్టత్వముబలపరచుటకే ఉపయోగించును. శిష్టులవద్ద ఉన్నయెడలవారి మంచిగుణములనే వృద్ధిపరిచి లోకమునకు ఎంతో ఉపకరింతురు, కనుక శిష్యా ! నీవీరెండు విషయములను తెలుసుకొని, దుష్టులచెంత కలలోనైనా చేరకుము. అనగా దుష్ట సహవాసమువద్దు అనియు సజ్జన సాంగత్యమే చేయుమనియు గురు మూర్తి శిష్యునకు హితోపదేశము చేయుసెనని ఈపద్యభావము.

219) అందమగు స్వాతిశర్దవు। బిందువు లెందెందుపడునొ వృథ్విని తత్తు। గ్బందుపులు పాధివశమున। జెందును తగునామ రూపచేష్టాదికమునూ ॥ ఇట్లనే నీవుజెందే పిన్నియునూ ॥ మందీతో

 

జతగూడి మాట్లాడినంతలో । అందుకే సహవాసమరయుము తగు దాన్ని ॥ చేష్టాదికములనూ । అట్లనే నీవు జెందేవిన్ని యునూ ॥

భావము : శిష్యా ! వానాకాలములో స్వాతికార్తియందు పడిన వర్షపు బిందువులు ఎందులోపడిన ఆయా రూపగుణములు ఆయా ఉపాధివశముచే ఏర్పడుచున్నవి. అట్లనే నీవుకూడ ఎటువంటి బుద్ధిగలజనులతో సహవాసముచేస్తావో అట్టివారిగానేమారెదవు. కనుకనే విచారించి ఎట్టివారి సహవాసముచేయాలో తెలిసిచేయుము. ఉన్నవారి సహవాసముచేస్తే ఉండిపోయెదవు. లేనివారి సహవాసము చేసినచో నీవులేకపోయెదవు. సహవాసము చేతనే నీవు నామరూప చేష్టలు అన్నియు ఏర్పడుచున్నవి.

విశేషభావము : స్వాతికార్తెలో పడిన వర్షముయొక్క బిందువు ముత్యపుచిప్ప పురుగునోటియందు పడిన అందు మంచి ముత్యములు తయారగును. ఎర్రనేలలోపడిన ఎర్రనీరుగామారును చేలయందలి బురదలోపడిన చీడపురుగులు ఉద్భవించును. వాన్ల బిందువు ఒక్కటేయైనను ఉపాధుల భేదముచే ఆబిందువు అందుకు తగిన నామ, రూప, క్రియలుతో కూడిన వివిధభేదములతో కూడిన వస్తువులుగా మారుచున్నది. అందుచేత జనులు ఎటువంటివారి సహవాసము చేయుదురో ఆట్టిగుణరూపములు కలవారగుదురు. కనుక యీ పద్యములో ఎట్టివారి సహవాసము చేయవలెనో ఆలోచించి అట్టివారి సహవాసము చేయుమని చెప్పబడినది. అనగా జన్మకుహేతువైన సిద్ధాంతుల సహవాసము చేయుదువో లేక జన్మరహితపరిచే సిద్ధాంతుల సహవాసము చేయుదువో అది చక్కగా విచారించి వారి సహవాసము చేయుము అన్నారు. అనగా

ఈ అశరీర గురుసాంప్రదాయుల సహవాసముచేసి జన్మరహితుడవు కమ్మని బోధించిరి.

— —

260) జాలరులకు లోకులందరు । జాలరులవలె తోచబడుట సహజగుణంబో । చోరులకు సకల జనములు । చోరకులని మదికి దోచుటునికి సహజమురా ॥ అట్లనె దుష్టాత్మునికి సహజమురా । సారములేని సంసారాబ్ధిదాటించు । వారిని తనవంటివారిగ గనుటట్టి॥ సహజము వినరా । అట్లనె దుష్టాత్మునికి సహజమురా ॥

భావము : శిష్యా ! వ్యభిచారి అయినవానికి జనులందరు వ్యభిచారులగనే కనపడుదురు. దొంగకు జనులందరూ దొంగలవలె కనిపింతురు. ఇది వారి సహజగుణము. అట్లే జననమరణములతో నానాయాతనలు పొందే ఈసంసార సముద్రమునుదాటించే మహానుభావులను, ఈబోధస్థులు కాని ఇతర దుష్టజనులు తమువంటివారిగనే భావించుట–అది వారి సహజగుణము.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
భద్రాద్ర్యంకితస్నామ
త్రయోదశాధ్యాయమునకు
భావ – విశేషభావములు
సమాప్తము.

# 14. గురుని లక్షణం 11

221) కం॥ బయలెరుకలు శిష్యునకున్ । దయతో గురు డెరుకజేసి తరువాతను సం । దియమేమి లేక యెరుకన్ । నయమున విడిపించు గురుడు నయశాలిగా ద॥ నీమదికిది నాటెన లేదా । భయభక్తి గురుసార్వభౌముని సేవ । నిశ్చయముగ జేసితె జయమందెదో గురుడు ॥ నయశాలిగాద । నీమదికిది నాటెనా లేదా ॥

భావము : శిష్యా ! పరిపూర్ణము, యెరుకల గురించి గురుమూర్తి శిష్యునకు దయతో తెలియజేసి తరువాత సందేహమెంత మాత్రములేకుండగ, యెరుకను విడిపించిన గురుమూర్తి గొప్పవాడు గాదా ! కనుక ఆవిధముగా ఎరుకలేకుండపోవుటకై, గురుసార్వ భౌమునికి భయభక్తితో పాదసేవ నిశ్చయముగ జేసినచో తప్పక జయము పొందగలవు.

విశేషభావము : గురుపాద సేవ చేతనే శిష్యుడు తాను విజయమును పొందగలడు. అనగా తాను పునరావృత్తి రహితమునుకోరి గురుమూర్తి వద్దకువచ్చియుండెను. అందు విజ యమును పొందగలడు. అనగా తాను పునరావృత్తి రహితమును కోరి గురుమూర్తి వద్దకు వచ్చియుండెను. అందు విజయము సాధించుటకు గురుకరుణచేమాత్రమే ఆపనిపూర్తగును. అట్టి గురు కరుణ సిద్ధించుటకై నిత్యము అనుష్ఠానము అనగా గురుపాద పూజ యున్ను, గురుమూర్తికి చతుర్విధ శుశ్రూషలు చేయుచు వారు చెప్పిన బోధను చక్కగావిని ఆచరణయుక్తుడైనపుడు మాత్రమే

 

గురుకరుణపొందినవాడై ఎరుకలేకుండపోవును. అందుచే ఈ పద్య ములో "గురుసార్వభౌమునికి భయభక్తితో సేవ నిశ్చయముగ జేసితె జయముందెదవు" అని చెప్పినాడు.

---

222) కం॥ పదిరెండక్షరములుగల। పదముల మంత్రార్థ మెరిగి సద్గురుకృపచే। పదియారక్షరములుగల। దదియెట్టిదొ తెలిసినేని యతడే సద్గురుడు ॥ యివి రెండెరుగనతడేటిగురుడూ। మొదటిది పరిపూర్ణమును దెల్పునెరుకాను। తదనంతరపుదిబోధను జేయునివి దెలిసి ॥ నతడే సద్గురుడు ॥ యివి రెండెరుగన తడేటి గురుడూ ॥

భావము : శిష్యా ! పన్నెండు అక్షరములు గల పవిత్ర మైన మంత్రార్థమెరిగి, గురుకృపచే పదహారక్షరములుగలదదియేదో తెలిసినవాడే సద్గురుడు. ఈ రెండు మంత్రముల నెరుగనివాడు గురుడుకాదు, మొదటిమంత్రము పరిపూర్ణముఅనగా ఎట్టిదో తెలియ పర్చును, రెండవ మంత్రము యొక కనగా యేదో తెలియజేయును. ఈపరిపూర్ణమెరుకలగురించి చక్కగా తెలిసినవాడే సద్గురుడు.

విశేషభావము : "పదిరెండక్షరములు గల పదముల మంత్రార్థ" మనగా "యీ ఉత్త బట్టబయలు ఏమీలేదు" అనుద్వాదశ మంత్రభావమును గురుముఖతా చక్కగా తెలిసుకొనవలెను. అట్లే పదియారక్షరములు గలది" "అనగా "మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు" అనుషోడశాక్షరిమంత్రము. ఈ మంత్ర అర్థ మంత్ర కీలక విచారణతో సహా గురుముఖత చక్కగ తెలుసుకొన

వలయును. ఈ మంత్రములు తెలియనివాడు ఈ సంప్రదాయుక్త గురువులు కారు.

— —

223) కం॥ ఆమంత్రయుగము దెల్పెద। నేమముతోదలపు ముత్తదీబట్టబయల్। యేమీలేదని పల్కిన। ఆమంత్రమె ద్వాదశాక్షరింకోటివినుమీ ॥ యెప్పుడు నోట యువిమరువకనుమీ। యీ మూలంలేని గుర్తెరిగె శరీరము। యేమీలేదనియుంటె యిదె షోడశాక్షరి ॥ యింకోటి వినుమీ। యెప్పుడు నోట యివి మరువకనుమీ ॥

బావము : శిష్యా। (పై పద్యములో రెండు మంత్రములు అన్నాను గదా!) ఆమంత్రములేవో తెలియపరచెదను వినుము. "ఈ ఉత్తబట్టబయలు ఏమీలేదు" ఇది ద్వాదశాక్షరి మంత్రము, "మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీలేదు" ఇది షోడశాక్షరి మంత్రము. ఈ రెండు మంత్రములను నియమముగా యెప్పుడు తలచుచు జపించుచుండుము.

విశేషబావము : శ్రీకృష్ణ దేశికేంద్రులవారు ఈ పద్యములో రెండుమంత్రములైన ద్వాదశాక్షరి, షోడశాక్షరి మంత్రములు రెండును తెరియపర్చినారు. మంత్రములు రహస్యమైనవి. గురువుమాత్రమే శిష్యునకు ఉపదేశకాలమందు చెప్పవలసినది మాత్రమే. అయినా రహస్యమేమియు లేకుండగ ఈ పద్యములో తెలియపరిచినారు. ఎందుచేతనపగా ఈ కాలమందు మంత్రములే రకరకములుగా మారిపోవుచున్నవి. ఆమంత్రార్థములుకూడ తప్పు అర్థములతో చెప్పుచున్నారు. ఇట్టి అనర్థము భవిష్యత్ కాలములో

ఏర్పడినసూ సాంప్రదాయము గా వచ్చుచున్న మంత్రములివి అని కొందరైనను గ్రహించి సమాజమును ఉక్కదిద్దుకొను టకు వీలుపడ గలదని మంత్రములు ఈ 223 పద్యములోను, ఈ మంత్రములు చెప్పినవారు మూత్రమే దీక్షిత సాంప్రదాయక గురుపరంపరులని 222 వ పద్యములోను, మంత్రములయొక్క అర్ధము 224, 225 పద్యములలోను చెప్పినారు. కనుక సాంప్రదాయకులు ఈమంత్ర ములు యధాతధాముగ ఉపదేశించగలరు.

— —

224) కం॥ తొలుమంత్రపర్థమెక్కడ । గలదోయని వెతుక నేల కలదంతటయా । వలిమంత్రపర్థమెక్కడ । గలదోయని చూడ నేల కాదా చూచేదీ ॥ వినేది యనేది తినేది ॥ అలతొల్త దాన్ని నీవవలోకనముజేసి । కలకాలమె రుకాలుగలదాన్ని విడు వెరుక ॥ గాదాచూచేది । అనేదివినేది తినేది ॥

బావము : శిష్యా ! మొట్టమొదటి మంత్రమయిన ద్వాద శాక్షరి లక్ష్యార్థభావము ఎక్కడ ఉన్నదో చూడనేల ? సరే సర్వత్రా ములు గ్రుచ్చ సందులేక నిండయున్నది ఇదిగో. రెండవమంత్ర మయిన షోడశాక్షరి మంత్ర లక్ష్యార్థమెక్కడగలదోయని చూడ నేల ? నీలోఉండిచూచేది, వినేది, తినేది మొదలగుసనుస్తమయిన పనులు, ఆలోచనలు దేనిసత్తాచే జరుగుతున్నదో అదే. అదే ఎరుక. (నేను). కనుక నీవు మొదటగా ద్వాదశాక్షరి మంత్రార్థమయిన పరిపూర్ణమును చక్కగా విచారించి చూచి, ఎల్లప్పుడు జ్ఞానస్వరూప మయిన ఎరుకను అనగా "నేను" ను విడచియుండుము.

విశేషబావము । ద్వాదశాక్షరి మంత్ర అర్థమైన పరి పూర్ణము సర్వత్ర నిండియున్నది. నీ-నామధ్య సర్వే సర్వత్రా,

అఖండంబై, ముల్లుగుచ్చ సందులేక వెల్తిలేనిదగుటచే ఉచలమై, నేను అనుజ్ఞానములేనిదై, ఈచీకటి వెలుతురుకానిదై, భూతాకాశ, మహాకాశములుకు అతీతమై, సత్తా ఎంతమాత్రములేనిదై, ఉన్నది ఏదో అదే పరిపూర్ణము. ఈ విషయమును బాగుగా గురుముఖతా విచారించి తెలుసుకొని, ఇక అన్నివ్యవహారములకు మూలమైనటి కారణ, కార్యములు కలది సగుణ, నిర్గుణములు మొదలగు ద్వంద్వములతో కూడినది ఎరుక. ఇదే అందరియందు "నేను" అనువ్యవహారముతో ఉన్నది. నిజానికి ఇదిలేదు. లేనిదే కలవలె పరిపూర్ణ పరబ్రహ్మమందు తోచబడినది. ఇట్టి మేల్కొ పొందినవారికి ఎరుక ఏకాలమందున లేదు అని నిర్ణయమగును.

— —

225) కం॥ ఇది తప్పయేమిలేదని। మొదటిది మొరబెట్టుచుండు ముదమునవినుమా। ఇదియేమిలేదు పొమ్మని। వదలక రెండోది తెన్ప వదరుచుండునురా॥ బయటెరుకలే నిది నిశ్చయమురా॥ అదిగాన నీరెంటినరసి నీవిప్పుడు। విదితముగ రెంటిని విడరా మంత్రములిట్లు॥ వదలుచుండునురా। బయటెరుకాలనిది నిశ్చయమురా॥

భావము : శిష్యా! పరిపూర్ణమెతప్ప యితరమైనదేది లేదని మొదటి మంత్రము చెప్పుచున్నది. "నేను" ఏమిలేదని రెండవదైన షోడశాక్షరి మంత్రము చెప్పుచున్నది, కావున ఈ పరిపూర్ణ మెతుకలను బాగుగా విచారించి చూచి బాగుగ రెంటిని విడచి పెట్టుము.

విశేషభావము : "విదితముగా రెంటిని విడరా" అని పద్యముతో చెప్పినారు. అనగా రెండులేనివే అని అర్థముకాదు.

పరిపూర్ణము ఉన్నది. ఎరుక లేదు అని బాగుగా విచారించి ఆ తెలిసిన జ్ఞానము (నేనును) విడచినచో ఎరుకను విడచినవాడగును. అప్పుడు ఎరుక విడచిన తరువాత పరిపూర్ణమున్నదని చెప్పుటకు ఎరుకలేదు గదా! అందుకే రెంటిని విడరా అన్నారు. కనుక ఎరుక లేదని ఎరుకయందు భ్రమను విడచి పరిపూర్ణము మున్నదని గుర్తు ఉండరాదు అని చెప్పుటయే "రెంటిని విడరా అన్న మాటకు అర్ధము. పరిపూర్ణముకూడ లేదని మనవాళ్లు చెప్పుట వినుచున్నాను. ఇది తప్పు-తప్పగింజ మొలకెత్తదన్నట్లు, ఇది జననమరణములులేనిది అని భావము.

---

226) కం॥ పరిపూర్ణమిదిగో యిదిగో। యెరుకని చూపించి లే యెరుకను లేందం। చెరిందిన గురుడేవరి। యెరుకను లేపేటి గురుడు యెందుకొయన్నా॥ తద్బోధ నీకెందు కొయన్నా॥ శరణన్నా వారి మస్తకమందు చెయిపెట్టి। తిరముగ యెరుకను తీసి వెయ్యనివాడు। యెందుకొయన్నా। తద్బోధ నీకెందుకో యన్నా॥

భావము : శిష్యా : ఇదిగో పరిపూర్ణము, యిదిగో యెరుక అని నిశ్చయముగ చూపించి, లేని యెరుకను లేదని నిరూపించి తెలియపర్చేవాడేగురుమూర్తి. ఎరుకే బ్రహ్మమని నిలపెట్టేగురువులు గురువులుకారు. వారిబోధలు నీకెందుకు? జన్మరహితమును కోరుచు శరణని మ్రొక్కిన శిష్యుని హస్తమస్తక సంయోగము గావించి స్థిరముగా యెరుకను తీసివేయలేని గురువులు ఎందుకయ్యా? అట్టివారి బోధలు వినవద్దు.

---

227) కం॥ పరిపూర్ణబోధ నెరిగిన । గురువరుచే బోధగొన్న గొప్ప ఫలంబౌ । పరిపూర్ణబోధ నెరుగని । గురువరుచే బోధగొన్న గొప్ప ఫలమౌనా ॥ అదియెట్లన్న కూడి రతిలోనా ॥ పురుషునిచే సంతుపొలతి బడయును బడయ । తరమౌన వారికె తమవంటి వారిచే ॥ గొప్ప ఫలమౌనా । దియెట్లన్న కూడిరతిలోన ॥

భావము : శిష్యా ! పరిపూర్ణబోధ ఎరిగిన గురుమూర్తి ద్వారా బోధను పొందెనచో గొప్పదైన ఫలితము సమకూరును. అనగా జన్మరహితస్థితి కలుగును. అట్లుగాక పరిపూర్ణబోధ నెరుగని గురుమూర్తివద్ద బోధపొందినచో అట్టి గొప్ప ఫలితమైన జన్మరహిత స్థితి కలుగదు. అదియెట్లనగా స్త్రీలు పురుషునిచే సంతానము పొంద గలరు గాని, తమవంటి స్త్రీల పొందు వలన సంతానము పొందు లేరుగదా !

విశేషబావము : శిష్యుడు ఎరుకలోనివాడు. జన్మరహిత స్థితి పొందనివాడు. అట్టి ఎరుకబోధనే చెప్పే గురుమూర్తి వలన ఎరుక వికువలేడు జన్మరహితస్థితిని పొందలేడుగదా ! ఎట్లనగా స్త్రీ తనవంటి స్త్రీవలన సంతానము పొందలేరుగదా ! అని భావము.

— —

228) కం॥ పరిపూర్ణబోధ నెరుగని । గురుశిష్యులు బోధకొరకు కోరపనిబడున్ । గురువర్యునొకని మరలను । హదువరమునబుట్టినట్టి యాశిఖండికినీ ॥ భార్యైనట్టి యబల తండ్రికినీ । వరులనిద్దరిని దేవతలెసీయల్లుడు నేను । వరియింతుమనిచెప్ప వనితనంపినయట్ల ॥ యాశిఖండికినీ । భార్యైనట్టి యబల తండ్రికినీ ॥

భావము : శిష్యా ! పరిపూర్ణబోధ తెలియని గురుమూర్తిని చేరిన శిష్యుడు జన్మరహిత స్థితిని బొందలేడు. కనుక ఆగురువు, శిష్యుడు ఇద్దరూకూడ పరిపూర్ణబోధ తెలియుపరిచే మరొక గురువును ఆశ్రయించవలసివచ్చును. ఆదెట్లనగా ఈశ్వరుని వరముతపుట్టిన శిఖండి జన్మతఃస్త్రీ. ఆమెను పురుషవేషముతో పెంచిన తండ్రి ఒకకన్యతో వివాహముచేసిన తదుపరి, ఆస్త్రీ తనభర్తగా పొందిన శిఖండి స్త్రీయేగాని పురుషుడు గాదని తెలుసుకొని తన తండ్రికి, తనకు తనభర్తకు ఇద్దరువరులను వెదకవలెనని వర్తమానము పంపినట్లుగా - ఇక్కడ గురు శిష్యులిద్దరు పరిపూర్ణబోధకొరకు మరొక గురువును ఆశ్రయించవలెనని భావము.

229) కం॥ దృష్టాంత మెరుకకేదని । యోష్ఠము గదలించగానె యొరులు కలనుచున్ । దార్ష్టాంత మడుగబోధకు । స్పష్టముగా కర్పూరము దీపము జూపవోయీ ॥ యీ యుక్తితోపము జేయకోయీ ॥ తుష్టినొందెదరిట్లు తోచి చెప్పితివేని । శ్రేష్టామా యీబోధచేకొన్నవారు ॥ దీపము జూపవోయీ । యీ యుక్తి తోపము జేయకోయీ ॥

భావము : శిష్యా ! యెరుకకు దృష్టాంతమేది అని ఇతరులు పెదవి విప్పి అడుగగానే కల అని చెప్పుము. యీ బోధకు దార్ష్టాంతము అడిగినచో కర్పూరము దీపశిఖను చూపించి సమాధానపరుచుము. యీ బోధచెప్పుకున్న వారికి స్పష్టముగా తెలసి సంతుష్టిపొందెదరు. కనుక యీ యుక్తితోపముచేయకుము.

విశేషభావము : దృష్టాంతము అనగా ఉపమానము. యెరుకలేనిదే ఉన్నట్లు తోచుచున్నది. అనుటకు ఏదైనా ఉపమానము

కలగా అని ఇతరులు అడిగినప్పుడు కలలో దోచిన వస్తువులు లేనిదే ఉన్నట్లు ఏలా తెలియబడుచున్నదో అట్లే ఈ యెరుక యెన్నడూ లేనిదే ఉన్నట్లు తోచుచున్నది అని చెప్పవలెను. అట్లే పరిపూర్ణమే తప్ప అందులో తోచిన సమస్తము లేదని చెప్పుటకు ప్రత్యక్షముగా చూపించగలవా? (దార్ష్టాంతము) అని అడిగినప్పుడు పళ్లెము పరిపూర్ణము వంటిది అనియు అందులో వచ్చిన శిష్యుడు మొదలు లేనిదే వచ్చిన కర్పూరమున్ను, దానికి తగిలించిన దీపశిఖ గురుమూర్తి గను చూపించి కర్పూర దీపములు వెలిగించి (గురుశిష్యులు) విచారించి ఆ రెండు లేకపోయినవనియు, కాని పళ్లెము యథాతథముగా యున్నదనియు, అలాగే జ్ఞానాజ్ఞాన స్వరూపంబైన ఎరుక లేకపోయిననూ పరిపూర్ణము శాశ్వతమని, వికారరహితమని, చెప్పి చూపించుటచే యీ బోధస్థులకు బోధ ప్రత్యక్షముగా తెలియబడగలదు.

— —

230) కక॥ యెరుక భ్రమగల్గు శిష్యుని। పరితాపము మాన్పి
నట్టి పండితుడెవడో। గురుడతడె కాని గురువులై గురువులమని పొట్టకొఱకు
గాలిగే వారెల్ల॥ వారికి బోధ తెలియుటకల్లా॥ పరిపూర్ణమును లేని యెరుక
నేర్పడ దెల్పి। యెరుకను విడిపించ నెరుగాక గురువులై ॥ గాలిగే
వారెల్లా। వారికీ బోధ తెలియుటకల్లా।

భావము : శిష్యా! యెరుక భ్రమయందున్న శిష్యుని హృదయపరితాపము మాన్పినట్టి పండితుడే గురువనబడును కాని పొట్టకోసం ధనసంపాదనకోసం కులగురువులమని వచ్చేవారు గురువులా? వారందరు గురువులుకారు. అట్టివారికి ఈ బోధ తెలియుట కల్ల. పరిపూర్ణమును, లేని యెరుకను విశదముగా తెలియపరచి, యెరుకను విడిపించుట యెరుగని గురువులు కేవలము పొట్టకొరకు బోధచెప్పుకొనేవారు గురువులుకారు.

231) కం ॥ గురుశుశ్రూషనొనర్చుట । యొరిగించెద నెట్లననిన యేర్పడ వినుమా । నరులిష్టదైవములకున్ । పరిచర్యయొనర్చునట్లు । భక్తితోడు తను ॥ గురుమూర్తి కత్యుక్తితోడు తనూ ॥ నిరతామరమరలేక నీవు సల్పుతివేని । గురుబోధ మరుగు సద్గురు నీచెదిలిసేపూ ॥ భక్తితోడుతనూ । గురుమూర్తి కత్యుక్తి తోడుతనూ ॥

భావము : శిష్యా । గురుశుశ్రూషచేయుట యెట్లో వివరించెదను, చక్కగా వినుము. నరులు ఇష్టదైవములకు పూజావిధులు ఏవిధముగ చేయుచున్నారో, అట్లే భక్తితో గురుమూర్తికి న్యాయముగా పూజాదులు జరిపించుము. భేదభావము లేకుండగ ఎల్లప్పుడు నీవు ఈవిధముగ గురుమూర్తికి సేవజేసినచో, గురుబోధయొక్క రహస్యము, బోధస్థితి ఆ సద్గురు మూర్తి కరుణచే తెలిసికొనగలవు.

విశేషభావము : "నరులిష్టదైవమునకున్‌పరిచర్యలొనర్చునట్లు" అనగా ఇష్టదేవతలకు షోడశోపచారములచే పూజచేసినట్లుగానే గురుమూర్తికికూడ షోడశోపచారములచేపూజింపవలెనని అర్థము,దైవమునకెట్లు చేసితివో అట్లే జేయువలయుననుటలో అర్థమేమనగా ఆచమనం సమర్పయామి అన్నప్పుడు గురువుగారిచేత ఆచమనం చేయించుట, అర్ఘ్యంఅన్నపుడుగురువుగారిచేతిలో నీరుపోసికడుగుట, నైవేద్యమన్నప్పుడు ప్రసాదమును గురువుగారి నోటితో తినిపించుట పానీయమన్నపుడు ఫలరసము త్రాగించుట ఇట్లు వెఱ్ఱి వెఱ్ఱి పనులు చేయుట, అట్లు చేయరాదు. ఇష్టదైవమును పూజించినట్లే గురుమూర్తి వికారములు పొందక ధ్యానమునకు

విఘ్నము కలిగించేలా ఉపచారములు చేయరాదు. దక్షిణ అయినా వస్త్రమైనా, బంగారం భూషణములైనా గురుపాదములవద్దనే ఉంచవలెనని భావము. అయితే ఇక్కడ యుక్తితోడుత అన్నారు: యుక్తి అనగా న్యాయము అని అర్థము కలదు దేవునివద్ద పెట్టిన సమస్తము, పూజ అయిన వెంటనే అవన్నియు తిరిగి భక్తుడే తీసుకొనును. కాని ఇక్కడ న్యాయముగా అన్నపదము ఉపయోగించుటచే అవన్నియు గురుమూర్తికి సమర్పించినందున అవన్నిటిని గురుమూర్తికేఇచ్చుట న్యాయమని గ్రహించవలెను. వాటిని శిష్యుడు తిరిగి తీసుకొనరాదు.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
గురుమూర్తి లక్షణన్నామ
చతుర్దశోఽధ్యాయమునకు
భావ, విశేషభావములు
సమాప్తము.
॥ జై గురు॥

— —

# 15. శిష్యుని లక్షణము (16)

232) కం॥ తను మనధనములు ఏరునకు। వినయంబున ధారపోసి వేడ్క గురునిచే। అనువైనబోధ బడసిన। ఘనమతి మంతునకు సాటి గలదా యీభువినీ॥ లోకులు మ్రొక్కవలదా చాలవినీ॥ తన నితరులనే తాననక యేమాటను। వినక పరిపూర్ణత దపరు వానికి సాటి॥ గలదా ఈభువినీ। లోకులు మ్రొక్కవలదా చాలవినీ॥

భావము : శిష్యా! తనువు, మనస్సు, ధనము ఈమూటిని వినయముతో గురుమూర్తికి ధారపోసి, ఆ గురుమూర్తిచే తగిన బోధ పొందిన గొప్ప బుద్ధిమంతునకు యీ భూమిపై సాటి ఎవ్వరును లేరు. అట్టివాడని విని తెలుసుకొన్న లోకులు, అతనికి మ్రొక్కవలసినదే. తానని, ఇతరమని చెప్పే "నేను" అనక ఆమాటలు ఏమీ వినక పరిపూర్ణస్థితిని పొందిన వానిక సాటి యీ భూమిపై ఎవ్వరు ఉండరు.

విశేషభావము : గురుమంత్రోపదేశము తీసుకొనుటకు ముందుగా శిష్యుడు గురుపాదములకు తన తనువు, మనస్సు, ధనము ఈమూడింటిని ధారపోయవలెను. ఇది ఈ గురుసంప్రదాయము. ఈ ధారపోయుట అన్నపని గురుపాదములకే ధారపోయవలెకాని గురుమూర్తి చేతిలో ధారపోయుతగదు. చేతిలో ధారపోయుట వ్యక్తికి ధారపోసినట్లగును. గురుపాదములకు ధారపోసినచో అఖండ గురుమూర్తికి ధారపోసిన భావము వచ్చును. ఇట్లు ఎందుకు ధారపోయవలెననగా - శిష్యునికి తాను ఏమి ఆచరించినను, అదంతా సద్గురుమూర్తిదే అను భావముకల్గి, తనకర్తృత్వమును (అహంకారము) లేకుండజేయుటకు మనపెద్దలు

ఈ సంప్రదాయమును నెలకొల్పిరి, మనము ఏపనిచేసినా శరీరము చేగాని, సంకల్పము ఒకరికి చెప్పి చేయించుటచేగాని. మనధనము, పుత్రులు, భార్య బంధువులు, భూములు మొదలగు సమస్త సంపదలచేత సమస్తపనులు చేయగలము. అందుచే శరీరము. మనస్సు (సంకల్పము) పుత్రదారాదులు (ధనము) ఈ మూటిని గురుపాదములకు ధారపోయుటచే, వాటిచే చేయించిన, చేయబడిన సమస్తకార్యముల క్రియలు, తానుచేసితిననుటకు వీలుకలుగదు. అందుచే కర్తృత్వ (అహంకార) రహితమునకు కారణమగుచున్నది. అందుచే అట్టి ప్రవర్తన, భావముకలుగుటకై గురుపాదములవద్ద తనువు, మనస్సు, ధనము ధారపోయవలయును, "వినయంబున వేడ్క ధారపోసి" అనగా ఈ ధారపోయుట వినయముగను సంతోషముగను ధారపోయవలెను. అలాచేయాలి అనే కట్టుబాటులో చేయుటగాదనిభావము. "అనువైనబోధ"_తగినబోధ అనగా తాను పునర్జన్మ పొందకుండుటను గోరి గురుమూర్తి వద్దకు వచ్చెను కనుక అందుకు తగిన బోధను పొందుట అని అర్థము. అట్టి సచ్ఛిష్యుడే గొప్పబుద్ధిమంతుడు. బుద్ధిగలవాడు కోరదగినది తిరిగి రాకుండే పద్ధతిమాత్రమే అని అర్థము అట్టివాడు పూర్ణస్థితిని పొంది తాను ఇతరము అని పల్కే "నేను" రహితమైనవాడు. కనుక అట్టివాడు తాను అని, ఆత్మ అని జగత్తనే మాటలను అనడు వినడు. అట్టి వానికి జనులందరు మ్రొక్కవలసినదే. అట్టివానికి సాటి ఎవ్వరూ ఉండరు. అని భావము.

236) కం॥ జలమునెడబాయునొల్లని । జలచరముల రీతి బూని సచ్ఛిష్యుడు హృ । జ్జలజంబను పీఠముపై । నిలిపితరము మాని గురువునే కొల్చు సుమ్మీ ॥ తదూక్తులనే తల్చునమ్మీ ॥

కలకాలమీరీతి గడుపుచునే ప్రొద్దు। తలిదండ్రి దారదాత దైవ మనచు గురువు। నేకొల్చుచుమ్మి ॥ తదూక్తులనే తల్చునమ్మి ॥

భావము : శిష్యా! జలచరములు జలమును విడచి బయట ఉండవలెననే తలంపు ఎన్నటికి ఉండనట్లుగానే, సచ్ఛిష్యుడై నవాడు హృదయపద్మమందు ఇతరములనువిడచి గురుపాదములనే ప్రతిష్ఠించుకొని నిత్యము అర్చించుకొనుచుండును. ఎల్లకాలము ఈవిధముగా ఆచరించుచు, గురువునే తలి, తండ్రి, దార, దాత, దైవమని భావించి పూజించుకొనుచుండును.

— —

234) కం॥ సతి పొరుగూరికిబోయిన। పతిరాకడ కోరినట్లు భావములోనన్। మతిమంతుడు సచ్ఛిష్యుడు। సతతము గురు రాకగోరు సత్యమువినరా ॥ వానితోటి సాటెవ్వరనరా ॥ హితుని రాకడను స్నేహితుడు గోరినయట్లు। అతిదరిద్రుడు ద్రవ్యతతి రాగోరినయట్లు ॥ సత్యము వినరా। వానితోటి సాటెవ్వరనరా ॥

భావము : శిష్యా! పొరుగూరికి పోయినభర్త ఎప్పుడు వచ్చునాయని అతనిభార్య కోరుకొనునట్లుగను, ఒకస్నేహితుడు తన స్నేహితుని రాక గోరినట్లుగను. అతిదరిద్రుడు ధనరాశి ఎప్పుడు తనకు గల్గునాయని ఎల్లకాలముకోరుచుండునట్లు, సచ్ఛిష్యుడు తనయొక్క గురుమూర్తి రాకను ఎల్లప్పుడు కోరుచుండును. ఇట్టి సచ్ఛిష్యునితో సాటి ఎవ్వరూ ఉండరు.

— —

235) కం॥ అతివల రతిచతురతలా। యతిపులవే వారి తండ్రుల రయరనుచుత। తృతులరయు రెరటనట్లనె। మతి

మంతుడు గురుడుబోధ మానీనగాని ॥ తద్బోధతామానడుపూనీ ॥
అతి దరిద్రునిచె విద్యార్జించినతగాడు । చతురుడై విత్తమార్జన
జేయు పంతులు ॥ మానీనగాని । తద్బోధతామానడుపూనీ ॥

భావము : శిష్యా : స్త్రీలయొక్క రతి చతురత ఆ స్త్రీలచే
వారి తండ్రులు తెలుసుకొనలేరుగదా, యని ఆ స్త్రీల భర్తలు వారి
రతిచతురతను తెలియకుండురా ? అట్లే అతిదరిద్రుడైన ఉపా
ధ్యాయునిచే విద్యసంపాదించుకొన్నవాడు చతురుడై ధనసంపాదన
చేయకుండునా? అట్లేగురుమూర్తి బోధమానినప్పటికి సచ్ఛిష్యుడైన
వాడు బోధను మానడు.

— —

236) కం॥ పరిపూర్ణబోధతెల్ప । పర్యంతము సేవజేసి
బహునమ్మికగా। గురుమూర్తికి తరువాతను । మరికన్నుల గననివాని
మార్గము ఛీఛీ ॥ తలచరా వామాట ఛీఛీఛీ ॥ గురువాజ్ఞయివనిదె
గురువై శిష్యునిగూర్చి । గురుబోధదెల్పెటి గురువంచకునియొక్క॥
మార్గము ఛీఛీ ॥

భావము : పరిపూర్ణబోధ దెల్ప పర్యంతము గురుమూర్తికి
బహునమ్మిక కల్గునట్లుగా సేవజేసి, ఆబోధను పొందిన పిదప ఆ
శిష్యుడు తన గురుమూర్తిని ఎన్నడూ దర్శనము చేసికొనకుండగ
పోయేవానియొక్క పద్ధతి ఛీ. తప్పుడుమనిషివాడు. అంతేకాదు
గురువాజ్ఞ యివ్వకుండగ తనంతతానే గురువై శిష్యులను చేసుకొని
గురుబోధచెప్పేవానియొక్క మార్గముకూడ ఛీఛీ. వీరి యొక్క
పద్ధతులు తప్పుడు పద్ధతులు.

237) కం॥ తన శిష్యులువిని తననతి । వినయంబునగొల్వ కొఱకు వినుతియొనర్చు । తన గురువును గురుడింటికి । జనుదెంచిన జూచి శు శ్రూషనొనర్పకుండు ॥ లేమిని దెల్పి చనుమనుచుండు ॥ వినుముకుచ్ఛిత శిష్యాగ్రణి వీడువీడెట్లు । ఘనబోధోక్తస్థితి గనునా గురునకు ॥ శుశ్రూషనొనర్పకుండు ॥

భావము : కుచ్ఛితుడైన శిష్యుడు తన శిష్యుడు తనను అతివినయముచే సేవించుకొరకు, తాను తనగురువునకు బహుసేవ జేసితినని చెప్పుకొనుచుండును, కాని తనగురువు తన ఇంటికి వచ్చి నప్పుడు ఏవిధమైన శుశ్రూషలుచేయడు. మరియు తను దరిద్ర బాధతో ఉన్నాననిచెప్పి ఈసారికి వెళ్లిరండి, ఇప్పుడు ఉండవద్దని చెప్పును. ఇట్టివాడుకుచ్చిన శిష్యులలో మొట్టమొదటగా లెక్కించ తగువాడు. ఇట్టివాడు పరిపూర్ణబోధ స్థితిని ఎట్లు పొందగలడు ? అనగా కుచ్చితులైన వారు మనః శుద్ధిలేనివారు బోధస్థితిని పొంద లేరని భావము.

— —

238) కం॥ కుటిలాత్ముడైన శిష్యుడు । యిటుపలికాం బలుకుచుండు యింటికివస్తే । యెటుబోవుచుండి వస్తురో । యిటకిక దర్శనము మళ్లి యెప్పుడయేనో ॥ యెవరికిదెలుమయెప్పుడేమౌనో ॥ యెటుదో, చదేమైన యిత్తామంచనుకొంటె । తుటుకూనవతరాగి దుడ్డయినలేధిప్పు । దెప్పుడయేనో॥ ఎవరికిదెలుసుయెప్పుడేమౌనో॥

భావము : కుటిలాత్ముడైన శిష్యుడు, గురువు తనయింటికి వస్తే, ఎటుబోవుచుండి ఇలావచ్చినారో ! మళ్లీ తమ దర్శనము నాకు ఎప్పుడుగల్గునో యెవరికి దెలుసు ? ఎప్పుడు ఏమౌతుందో ఏమిచెప్పగలను. ఏదైన దక్షిణ యిచ్చుకుందామనుకుంటే, ఒక్క

తాగిదమ్మిడి అయినాలేదు. ఏమీతోచకున్నది అని ఈ విధముగా పలుకుచుండును.

........

239) కం॥ జపములు తపములు సలుపును । విపరీతస్మరణ జేయు వేదాంతార్థం । బపరిమితంబుగ జెప్పును కపటాత్ముడు శిష్యకోటిగని మెచ్చుకొరకు॥ మెచ్చి ద్రవ్యమును యిచ్చుకొఱకు॥ అపకీర్తిచేతల కదిరినట్లగుపడి । ఉపమునె బ్రతుకుచునుండులోకులు తనను ॥ గని మెచ్చుకొఱకు । మెచ్చి ద్రివ్యమును యిచ్చు కొఱకు ॥

బావము : కపటాత్ముడైనవాడు, జపములు, తపములు చేయుచు విపరీతముగా మాటిమాటికి "గురుదేవా" అని స్మరించుచుండును. వేదాంతభావము అపరిమితభావముతో చెప్పుచుండును. అనగా విపరీతభావమునే విశేషభావముగా తెలియుపత్చును. అపకీర్తిని తెచ్చే తప్పుడు పనులకు అదిరిపడినట్లుగానటించుచు ఉపాయముతో బ్రితుకుచుండును. ఇవన్నియు తనశిష్యులుచూచిమెచ్చి హెచ్చుగా ధనము ఇచ్చుటకొరకే కదా !

——

240) కం॥ గురుమూర్తికెదుర హంకృతి । దొరకొన్నను దొంగ త్రోవ ద్రొక్కిన చెవులన్ । గురునిందవినిన జేసిన । నరునకు పరిపూర్ణబోదనలవీయె తెలియు ॥ కూడదువాన్ని తెలియక కలియ ॥ గురుడు దెల్పని వుస్తకరీతిచె పూర్ణ । మరసితినని యెంతో ముత సీన యీబోధ ॥ నలవీయె తెలియు । కూడదు వాన్ని తెలియక కలియ ॥

బావము : శిష్యా ! గురుమూర్తికి ఎదుట అహంకారపడి నను, మోసపువిధానములవలంబించినను, గురునిందపేనిన, గురునిందజేసినను, అట్టివానికి పరిపూర్ణబోధ తెలియుశక్యముకాదు. గురుమూర్తి చెప్పకుండగ పుస్తకముల చదివి పరిపూర్ణబోధ గ్రహించితినని చెప్పువానికి యీబోధ తెలియుశక్యముకాదు. ఇట్టివారిని తెలియక వారితో సఖ్యము పనికిరాదు.

---

241) కం॥ వాలుగు శుశ్రూషణములు। లోలతగావించు కొనుచు లోకాతీతం। బాలోకించి గురునిచె। యీ లోకము జోలి విడువుమింతేచాలన్నా ॥ నీతోగూడ యిదిమరువకన్నా ॥ కీలు దెలియని చదువు చాలా చదివెందుకు। చాలంచి నీవిట్టికీలు దెలసితివేని ॥ యింతేచాలన్నా ॥ నీతోగూడయిది మరువకన్నా ॥

బావము : శిష్యా : గురుమూర్తికి చతుర్విధ శుశ్రూషలు సంతోషముచే చేయుచు గురుకరుణచే లోకాతీతమైన పరిపూర్ణమున్నదని అవలోకనజేసి, యీలోకముల పొందు విడచిపెట్టుము. నీతో సహా లోకములపొందు విడువవలెను. ఇది మరువకుము. ఇట్టి రహస్యము దెలియని శాస్త్రములు వగైరా పెక్కుచదువులు ఎందుకు ? అవన్నిటిని కట్టిపెట్టి, నీవు తిరిగి పుట్టని రహస్యమును గురుమూర్తి ద్వారా తెలిసితివేని అంతేచాలును.

విశేషబావము : చతుర్విధశుశ్రూషలు అనగా, అంగ-స్థాన-భావ-ఆత్మ శుశ్రూషలని నాలుసేవలు, సద్గురుమూర్తికి చేసుకొనుచు వారికి దయుకల్గులాగున ఆచరించవలెను. కొన్నిచోట్ల స్థాన-అంగ-ఆత్మ-సద్భావ శుశ్రూషలని వరుసమార్చి చెప్పుట కలదు. ఈ వరుసక్రమము మూర్చరాదు. ఎందుచేతనగా వాటికి బాహ్యార్థ

ములేకాక అంతరార్థముకూడ కలదు. అంతరార్థము వరుస మార్చినచో కుదరదు.

కనుక మొదట అంగశుశ్రూషయనగా, గురుమూర్తి మన యింటికిరాగానే వారిపాదములు కడగి శిరస్సున జల్లుకొని, శేష జలమును త్రొక్కకుండగ ఒకపూలమొక్క మొదటబోయవలయును తదుపరిపాదములువత్తి పూజించినమస్కారము చేసికొనుట, మొదలగు శరీరమునకుచేసెడిసేవ అంగశుశ్రూషయనబడును. ఇది బాహ్యార్థము. అంగమనగా శరీరము కనుక శరీరము ఏలావచ్చినది తెలియజేసెడు సాంఖ్య పాఠమును గురుమూర్తిద్వారా తెలుసుకొని, తిరిగి ఆపాఠమును గురువుగార్కి వప్పగించిననాడు గుమూర్తికి అంగశుశ్రూషజేయుట అనబడును. ఇది అంతరార్థము.

స్థానశుశ్రూషయనగా గురుమూర్తిని ఒక ఉన్నతాసనము నందు కూర్చుండబెట్టుట శయ్యాదులు కల్పించుట, వారు వాడుచున్న ఆసన శయ్యాదులందు పవిత్రభావము కల్గియుండుట, ఇది బాహ్యార్థము. తనశరీరమందున్న ఆధారాది షట్చక్రములు వాటి స్థానములు, బీజములు వగైరా తారక విచారణ పాఠమునుచక్కగా తెలుసుకొని వల్లించి తిరిగి గురుమూర్తికి వప్పగించిననాడు. ఇది గురుమూర్తికి స్థానశుశ్రూష చేసినట్లగుము. అంతరార్థము. భావశుశ్రూషయనగా గురుమూర్తికి ఏసమయమునకు ఏది అవసరమో, ఆకాలము సందర్భముల ననుసరించి, వారు అడుగకుండగనే ఆహారపానీయాదుల నొసంగుట, వారి భావమునకు అనుకూలముగా వర్తించుటయనబడును. ఇది బాహ్యార్థము. భావమనగా సంకల్పము. ఈ సంకల్పములు పుట్టి లయమయ్యే

స్థానముమనస్సు ఇట్టిమనస్సు దానిచంచలత్వమును నిరోధించి ఏకాగ్ర తను,స్వస్థానమునందు మనస్సు లయింపజేయుటచేసాధింపవలెను. కావున అట్టివిధానమును తెలియపరిచే అమనస్క పాఠమును గురుమూర్తిద్వారాతెలుసుకొని తిరిగి అమనస్కపాఠమును గురుమూర్తికి వప్పగించిననాడు భావశుశ్రూష చేసినట్లగును. ఇది అంతరార్ధము. అట్లే ఆత్మశుశ్రూషయనగా గురుమూర్తి యొక్క ఆత్మీయుల యోగక్షేమములనుదెలపి వారియందు గౌరవభావముప్రదర్శించుట బాహ్యార్థము. ఆత్మ సర్వగతమయినదనియు, ఒకదానియందు బంధింపబడదనియు, సమస్త జీవోపాదుల లోన, బయట నిండి యున్నదే అఖండమైన పరమాత్మ స్వరూపము. తెలియజేయు మహావాక్య విచారణను సద్గురుమూర్తిద్వారా తెలిసికొని అవగతము చేసుకొని తిరిగి ఆ మహావాక్య విచారణపాఠమును గురుమూర్తికి వప్పగించుటయే ఆత్మ శుశ్రూష అనబడును. ఇది అంతరార్థము.

ఈ విధముగా బాహ్యార్ధ, అంతరార్ధములతో గురుశుశ్రూష చేయుచు విద్యను అభ్యసించవలెను. కనుకనే "గురుశుశ్రూషయా విద్య" అన్నారు. ఆ విధముగా గురుమూర్తికి అంతరార్ధముగా చేయు శుశ్రూషలు వరుసగా సాంఖ్య, తారక, అమనస్క, మహావాక్య విచారణలు కనుక బాహ్యార్థముగా చెప్పినప్పుడుకూడ అంగ-స్థాన-భావ- ఆత్మశుశ్రూషలని చెప్పవలెను. వరుస క్రమము మార్చరాదు.

---

242) కం॥ దేశికుని చరణతీర్థము । కాశీగంగయుని గురుని గనుగొన్నను వి । శ్వేశుడని యతడుతనకుప । దేశంబొనరించినట్టిదే

తారకమని ॥ మనసందుతానీతీరునగని ॥ యేసీమయందున్న కాశీ ప్రియాగ। రామేశునిపురమై ప్రకాశించునాసీమ ॥ దేతారకమని। మనసునందు తానీతీరునగని ॥

భావము : శిష్యా : గురుపాదజలమే, కాశీగంగ తీర్థమనియు, గురునిదర్శించుటయే-విశ్వేశుని దర్శనమనియు, గురుమూర్తి తనకుపదేశించిన మంత్రమే - తన్ను భవసాగరము నుండి తరింపజేయుమంత్రమనియు, గురుమూర్తి యేదేశమందుండునో, లేక యేస్థలమందుండునో అది కాశీ, రామేశ్వరము, ప్రయాగ వంటి పుణ్యతీర్థములని మనస్సులో దృఢమైన భావముకల్గియున్న శిష్యుడే పరిపూర్ణబోధస్థితిని పొందగలడు.

విశేషభావము : గురువు అనగా అఖండ పరబ్రహ్మము. అదే వైష్ణవ సాంప్రదాయముగా మహావిష్ణువనియు, శైవసాంప్రదాయములో పరమేశ్వరుడనియు ప్రసిద్ధి. గంగానది విష్ణుపాదములవద్ద ఉద్భవించినదని శాస్త్రవచనము. కనుక గురుమూర్తి (విష్ణువు) పాదములనుండి [illegible] బడినది గంగా తీర్థము అని చెప్పబడినది. మరియు గురుమూర్తి అనగా విశ్వమంతయు వ్యాపించియున్న, లేక విశ్వము అంతకు ప్రభువుగా ఉన్నవాడు కనుక విశ్వేశ్వరుడు. అందుచే "గురుమధ్యేస్థితం విశ్వం, విశ్వ మధ్యేస్థితో గురుః" అన్నారు.

— —

24) క॥ గురుచరణజలముగోదా। వరియని గురుమూర్తి రామభద్రుండనిత। త్పురమును భద్రాచలమని। గురుమంత్రమె తారకమని గురిగల్గినట్టి ॥ తిరిగిరాని మరుగెరిగినట్టి ॥ నరుడున్న

చోటే సుందర శేషగిరిభద్రి। గిరిరంగనాయకపురమనదగియుండు గురిగల్గినట్టి। తిగిరిరాని మరుగెరిగినట్టి ॥

భావము : శిష్యా! గురుపాద తీర్థము గోదావరి తీర్థమనియు, గురుమూర్తియె శ్రీరామచంద్రుడనియు, వారున్న ప్రదేశమె భద్రాచలమనియు, వారుపదేశించిన మంత్రమె భవతారకమంత్రమని నమ్మిక కల్గియుండవలెను. తిరిగి జన్మకు రాని పరిపూర్ణబోధ మర్మధర్మముల నెరిగినమహాత్ముడైన సద్గురుమూర్తి ఉన్నచోటునే, సుందరమైన శేషగిరి, భద్రగిరి, రంగనాయకపురముగా భావించదగును.

---

244) కం॥ గురుడు నరుడనుచు దలచిన। గురుమంత్రము మరచియున్న। గురుపుత్రులనాదరణ యొనర్చుకయును డిన। గురువును విడనాడి రెండో గురునీ జేరిననూ॥ సద్గురుబోధ నెరిగి దూరినను॥ యెరుక మహాత్మ్యము నెరిగినయుటువంటి। వానికి దప్పదు నరకము నిజమింకా॥ గురునీజేరినను। సద్గురుబోధనెరిగి దూరినను॥

భావము। శిష్యా! గురుమూర్తిని మనుష్య మాత్రునిగ దలచినను, గురుమంత్రము మరచిపోయినను, గురుపుత్రులను, అనాదరణ చేసినను, గురువును విడచి రెండో గురువుని ఆశ్రయించినను, సద్గురుబోధ నెరిగిన పిమ్మట ఆబోధను దూషించినను అట్టివాడు యెరుక మహాత్మ్యము యెరిగినవాడైనను వానికి నరకము తప్పదు. అనగా గర్భనరకము తిరిగి పుట్టుట అని భావము.

విశేషభావము : గురుని మనుష్యమాత్రునిగ దలచక, తన్నుద్ధరించుటకై ఈశ్వరుడే ఈమనుష్యరూపముగా తనగురించి అవతరించినట్లుగా భావించవలెనని శాస్త్రవాక్యము.

గురువునువిడచి రెండోగురువునుచేరరాదు అనగా మంత్రోపదేశము చేసిన గురువుకు సరిగా బోధరాదనిగాని, గురువుచనిపోయిన తనకు బోధచేసేవారు లేరనిగాని ఇదేపారంపర్య గురువును మరొకరి పాదములు పట్టి తిరిగి ఉపదేశముపొందరాదు: ఉపదేశమువలననే గురువనిపించుకొనును. కాని విద్య తెలియుపర్చుటవలన కాదు గనుక, గురువు బోధకుడు కాకపోయిననూ, గురువు చనిపోయినను, అట్టివారి శిష్యులకు మరొక గురువు బోధ చేయవలసినదే కాని తన శిష్యులుగా చేసికొనరాదు.

---

245) కం॥ జ్ఞానవైరాగ్యరక్త్యస । మానవదీస్నాన దేవ
మంత్ర పఠనత । ధ్యానముఖతంత్రములు పర । మని, నిరతిగోరు
నట్టి మనుజసంఘమునకూ ॥ బోధనుదెల్పు, మనిన వారలకు । తాను
బోధించుట తగదు బోధించితె । తాను నేనను భ్రాంతి తలగే దెలా
గట్టి ॥ మనుజసంఘముకూ । బోధను దెల్పు మనిన వారలకూ ॥

(నిరతి = మిక్కిలి యాసక్తి)

భావము ! శిష్యా ! జ్ఞాన, వైరాగ్య, భక్తులకు సమానమైన పుణ్యనదీస్నానము, దేవతార్చన, తన్మంత్రజప, ధ్యానములు, యజ్ఞయాగములు మొదలగు తంత్రములు, పరము నిచ్చునని మిక్కిలి యాసక్తితో కూడినవారు ఈబోధను దెల్పుమని అడిగననూ అట్టి మనుజులకు బోధించతగదు. ఎందుచేతననగా అట్టివారలకు

జీవేశ్వర ద్వంద్వబుద్ధిపోదు. కనుక అట్టివారలకు ఈ బోధ బోధించతగదు.

— —

246) కం ॥ ఇంగితము నెరిగి సద్గురు । పుంగవుచే నరుడు భుక్తి ముక్తి క్రియలన్ । సంగాసంగములెడలిన । శృంగారమె వానిచేష్టచూచేవారలకు ॥ వాడున్నట్లు తోచెవారలకు ॥ మంగళ సూత్రిమెళ్ళంగిశృంగారము । శృంగారవతికి యశృంగారవతి కట్లు ॥ చూచేవారలకు । వాడున్నట్లు తోచెవారలకు ॥

భావము : శిష్యః : సద్గురుమూర్తిచే వారి మనోభావమును చక్కగా గుర్తెరిగి, సంగా సంగములను విడచినవాడై, భుక్తి ముక్తి క్రియల రెంటిని చక్కగా నడుపుకొనుచున్న వాని క్రియ చూచు వారలకు మరియు తోచువారలకు కూడ శృంగారము. అనగా మంచిగా అనిపించుకొనును. అదెట్లనగా మంగళసూత్రము దానిని ధరించుచున్న స్త్రీలకును, ఇదివరలో ధరించి ఇప్పుడు ధరించని స్త్రీలు (వైధవ్యముతోనున్న)కు కూడ మంగళప్రదమనే భావము సమానమె కదా !

విశేషభావము : సద్గురుమూర్తి ద్వారా వారియొక్క మనోభావము (ఇంగితము) నెరిగి, అనగా పరిపూర్ణబోధ నెరిగి అని అర్థము. "భుక్తిముక్తి క్రియలన్ సంగా సంగము లెడలిన" సంగము అనగా కలసి ఉన్నది, దీనియందు సమస్తము ఉన్నదో అదే. ఆత్మ అని అర్థము. అసంగము అనగా విడిగా ఉన్నది. జీవభావము అనగా జగత్తు. ఆత్మ జగత్తులను రెంటిని విడచి, భుక్తి ముక్తి క్రియలనగా దేహకళ్యాణ నిమిత్తమై భుక్తి, ముక్తి క్రియలనగా

ఆత్మకళ్యాణమునకై ముక్తి క్రియయున్ను, గురుముఖతా పరిపూర్ణభావమెరిగి, ఆత్మ-జగత్తులనువిడచి, న్యాయముగా ఆర్జించిన విత్తముచేభుక్తియున్ను పరిపూర్ణబోధచే ముక్తికి పాటుపడుచున్న వ్యక్తియొక్క నడక అప్పుడుచూచేవారలకు, అట్టివాడని విని తెలుసుకొన్న వారలకును (తోచువారలకు) కూడ శృంగారముగా ఉండును. అదెట్లనగా, మంగళసూత్రము ఇప్పుడు ధరించుచున్న స్త్రీలకు (చూచువారలు) మంగళప్రదమైనదనే గౌరవభావము కల్గించును. అంతేకాదు ఇది వరకు ధరించి ఇప్పుడు ధరించని స్త్రీలు (వైధవ్యమును పొందిన వారు) (తోచువారలు)కు కూడ ధరించే స్త్రీలకు ఎంతటి గౌరవము కలదో, వీరికికూడ అంతే గౌరవభావము కల్గియుండును. అని భావము.

ఉదా॥ శ్రీకృష్ణదేశికేంద్రులు గురుముఖతా పరిపూర్ణభావము నెరిగినవారు. వారు న్యాయముగా సంపాదించుకొని (భుక్తి) తాను తిని ఇతరులకు పెట్టుచు, వృధాకాలక్షేపము చేయకుండగ చక్కగా విద్యచెప్పుకొనుట ఇతరులకు చెప్పుటలోనే కాలం గడిపిన మహనీయులు. అట్టివారియొక్క నడక అకాలమందు చూచిన వారలకు శృంగారమే, అంతేకాదు ఇప్పుడు మనకు అట్టివారని తెలిసిన వారము అనగా తోచువారలము. మనకు కూడ వారియొక్క నడక శృంగారముగనే తోచబడుచున్నది.

---

247) కం॥ జనులందరు గురుబోధనః । గనిరాజనులందు నేను గలియకయున్నన్ । నను మన్నింతురెవారని । మనసునతల

 

పోస్తె బోధమర్మ మబ్బినా ॥ అబ్బిన వారి ధర్మ మబ్బినా ॥ జనన మరణములేని ఘనమైన త్రోవనే । గననై తినని బోధగనకున్న యీబోధ మర్మా మబ్బినా । అబ్బినవారి ధర్మ మబ్బినా ॥

భావ ము : శిష్యా : తనబంధుజనులందరు ఈగురుబోధను తెలుసుకున్నారు. వారితోపాటు నేనుకూడ తెలుసుకొనకపోతే వారిలో నాకు గౌరవము లేకుండునుగదా యని భావించి యీబోధను తెలుసుకొనివచ్చో, అట్టివానికి ఈ బోధయొక్క మర్మ ధర్మములు ఎంతమాత్రము తెలియవు. జనన మరణములు లేని యీ గొప్ప బోధను నేను తెలుసుకొని తరించాలి అనేగొప్ప మనస్సు కల్గి ఈబోధ తెలుసుకున్న వానికిమాత్రమే ఈ బోధయొక్క మర్మ ధర్మములు చక్కగ తెలియబడగలవు.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే

శిష్యలక్షణన్నామ

పంచదశాధ్యాయమునకు

భావ - విశేషభావములు

సమాప్తము.

# 16. గురుశిష్యోభయు లక్షణం. (12)

248) కం॥ హృదయ గ్రంధి విడుటకై । సదయత యీ బోధ దెల్ప జనదా గురుడై । వదలక చిత్తములో గురు । పద యుగళము దలవవలదె భక్తుడై నపుడూ ॥ భ్రాంతిరహితాసక్తుడై నపుడూ ॥ కుదురదు యివిరెండు గురు శిష్యులకు లేక । కదలికై లేనట్టి ఘనబోధోక్తస్థితి ॥ భక్తుడై నపుడూ । భ్రాంతిరహితా సక్తుడై నపుడూ ॥

భావము : శిష్యా ! గురుమూర్తి తన శిష్యునియొక్క హృదయ గ్రంధిని విడిపించుటకై దయతో యీ పరిపూర్ణబోధను దెల్పవలయుననే సంకల్పముతో శిష్యునివద్దకు వెళ్ళవలెను. శిష్యుడు భక్తుడై భ్రాంతిరహిత ఆ సద్గురుమూర్తి పాదయుగళ మును తనమనస్సునందు (హృదయస్థానము) ఉంచుకొని మరువ కుండగ అర్చించుకొనుచుండవలెను. ఈ విధముగా గురుశిష్యుల యొక్క భావము ఉండవలెను. గురుశిష్యులకు యీ రెండు విధము లు లేకపోయినచో జనించుట గిట్టుట అనే చలనములేని గొప్పబోధ యొక్కస్థితి (పరిపూర్ణస్థితి) గురుశిష్యులకు కలుగదు.

విశేషభావము : హృదయ గ్రంధి అనగా అనేకులు అనేకవిధములుగా చెప్పుచున్నారు. అనాహత చక్రమువద్ద నున్న హృదయకమలమే, హృదయస్థానము. ఈ హృదయస్థానమందు కూటస్థుడు, జీవుడు లేక అక్షరుని స్థానము. అక్షరుడే సమస్తవ్యవ హారములు నడుపువాడు. అక్షరుని కూటస్థుడు అందురు "కూటస్థో౽క్షర ఉచ్యతే" అన్నారు భగవద్గీతలో. వీనికే జీవుడు అని వ్యవ హారము. ఈ క్షరుడే సమస్త వ్యవహారములు నడుపువాడని తెలియు

చున్నది. (ఇదం బ్రహ్మ చతుష్పాత్ అనుపాఠములో విశదపరచబ డైనది.) క్షరోపాధి వస్త్రాపోయేదే. దీనికే ప్రయత్నము అవసరములేదు. కాని అక్షరోపాధి అయినరెండవశరీరము స్వతఃశిద్ధముంగా నశించదు. దీనిని పరిపూర్ణబోధచే క్షరా అక్షరముల రెంటిని నశింపజేయుటకే పరిపూర్ణబోధ - కొఱకు సద్గురుమూర్తి వద్దకు శిష్యుడు వచ్చి ఆశ్రయించవలెను.

.........

249) కం॥ గురుడాస వదలకుండిన । మరిశిష్యుడు ద్రవ్య లోభముగ్నుండైనన్ ।మరియాద దక్కదిరువుర ! కెరిగుండుము వీరలతిహీనులొయన్నా ॥ గట్టిగ దురభిమానులోయన్నా । గురుడు శిష్యునికన్న కొడుకుగ గనకున్న । గురునిపై శిష్యుడాగురి నిల్పకుండిన ॥ హీనులొయన్నా । గట్టిగదురభిమానులోయన్నా ॥

భావము ! శిష్యా ! గురుమూర్తి ఆశ విడువకపోయినను, శిష్యుడు దర్రివ్య లోభముకలవాడైనను, ఇద్దరకు ఒకరియందు మరొకరికి గౌరవము ఉండదు గురుమూర్తి శిష్యుని కన్న కొడుకుగాచూచుకొనకున్నను, అట్లే శిష్యుడు గురుమూర్తిపై తనతండ్రివలె గౌరవభావము లేకున్నను, ఇద్దరుకూడ అతిహీనులని తెలుసుకొనుము.

.........

250) కం॥ గురుగురుబోధలచేతను । పరిపూర్ణము నెరిగి యొరుక బాసిన యతనిన్ । గురుతెరుగనొరులశక్యమె । యెరిగిన నరులిట్టిబోధ నెరిగిరోయన్నా ॥ వారెరుగని మరుగుండదన్నా ॥ చిరుతపాపనిరీతి మరిపైశాచముభాతి । తిరుగుచునుంను వెక్కురు

మాడ్కి గురుడెట్లు॥ యెరిగెరోయన్నా। వారెరుగని మరుగుంతదన్నా ॥

భావము : శిష్యా ! గురు గురుబోధలచే పరిపూర్ణమును ఎరిగి, యెరుక విడచిన వానిని గుర్తించుట యితరులశక్యముకాదు. అలాయెరిగినచో ఇట్టి బోధ నెరిగినవాడు కాదునాయనా. యెరుకను విడచిన మహాత్ములు ఎరుగని రహస్యమేదియునుండదు. అట్టివారు చిన్నపిల్లలవలె పిశాచముపట్టిన వారివలె అనేకకరకములుగ తిరుగుచుందురు.

విశేషభావము : గురు గురుబోధలనగా, గురుబోధఅనగా ఆత్మబోధ అని అర్థము అట్టి ఆత్మబోధకన్న గొప్పబోధ పరిపూర్ణబోధ అని అర్థము. "యెరుగిన నరులిట్టిబో యెరుగరోయన్నా" యెరుక విడచనవారిని గుర్తించినచో గుర్తించినవారు ఈయెరుకను విడచిన వారుకారు. పరిపూర్ణబోధ నెరుగనివారుమాత్రమే. అట్టివారిని గుర్తించగలరు. అనగా వారుకూడ తనవలె జ్ఞానభావమును గుర్తించినవారు అనుకుందురేగాని జ్ఞానాతీతమైన పూర్ణబోధస్థులని వారికి తెలియుదు. అని భావము. ఆవిధముగా ఎరుకను విడచి వర్తించువారు ఏ నిర్ణయములేక మనోరహితులై యుందురు అని చెప్పుటకే వారియొక్క నడకచిన్నపిల్లలవలె, పిశాచము పట్టినవానివలె ఉండునని పద్యములో చెప్పబడినది.

251) కం॥ మలయాద్రిచెంత చెంచుల। కిలచందన భూరుహములె యింధనమటమి। క్కిలి గలుగబట్టియుట్లనె। చులుకన సుమియింటగలుగు సూరీభూషణుడు ॥ బహుమాన్యుడు దూరస్థుడెపుడూ ॥ తెలియనివారికి తెలిసేది కఠినము। తెలివిచె దెలసితే తెలియజేసునుబోధ ॥ సూరిభూషణుడు। బహుమాన్యుడు దూరస్థుడెపుడు ॥

భావము : శిష్యా ! మలయ పర్వత సమీపమున నున్న ఆటవికులు, అచ్చటమంచిగంథపుచెట్లు ఎక్కువగా నుండుటచే ఆ చెట్లనే వంటకట్టెలుగా ఉపయోగించెదరు. అట్లేమనకు సమీపమున నున్న ఉత్తమపండితుడు అనగాపరిపూర్ణబోధగురువును, బహుచులు కనగా అందరి జనులవలెనే చూచెదము. దూరస్థుడైనవానిని ఎక్కువ గొప్పగా చూచెదరు. తెలియని మూర్ఖులకు ఇది తెలియుట కష్టము. సూక్ష్మజ్ఞానము కలవాడు తెలుసుకో గోరినచో అట్టి మహాపండితుడు ఈ పరిపూర్ణబోధను చక్కగా తెలియజేయును.

— —

252) కం॥ దూరమున నుండి విన్నను । చేరును సజ్జనుడు గురుని చెంతకు బోధం । గోరి దుర్జనుడు కోరడు ! దూరస్థుడుగాక గురునితో గూడయుండి ॥ యెట్లని యున్న దూరాననుండి ॥ కోరితుమ్మెద తమ్మి జేరితేనియ గ్రోలు । నారీతి నెరుగవు చేరి కప్పలు తమ్మి ॥ తోగూడియుండి । యెట్లనియున్న దూరాన నుండి ॥

భావము : శిష్యా ! సజ్జనుడు దూరమువననుండి విన్ననూ బోధనుకోరి గురువువద్దకు చేరును. దగ్గరనే యున్నప్పటికి దుర్జనుడు బోధనుకోరడు. అదెట్లనగా తుమ్మెద తామరపువ్వులలోని మకరందముకోరి దూరమునుండి వచ్చుచున్నవి కాని దగ్గరలోనే యున్నకప్పలు మకరందమును గ్రహించగల నేర్పు లేదుకదా !

253) కం॥ చూసి మదిదెలిసి శిష్యుని । యాశయమును తగినబోధ నతనికిదెలియన్ । జేసి ముదమొందజేసెటి । దేశికుడే ముఖ్యుడనుచు తెలుసుకోవోయీ ॥ కనియుతగాఁన్న కలుసుకో

వోయీ ॥ చేసినిదయతో నీయాశయ సంపూర్తియిట్లు । వ్రాసిపైతె వేసుకొచూచేవు తార్ఖాణ ॥ తెలుసుకోవోయీ । కనియుతగాణ్ని కలుసుకోవోయీ ॥

భావము : శిష్యుని ప్రవర్తనచూసి, అతని మనసందువ్న కోర్కె దెలసి, అతని ఆశయమునకుతగినబోధ తెలియజేసే గురువే ముఖ్యుడని తెలుసుకొనుము. అట్లు చక్కగా విచారించి తెలుసుకొని అట్టిగురువును కలుసుకొనుము. అతను దయతో అంగీకరించెనా - నీయాశయము సంపూర్తి అగును. ఈ మాటలను వ్రాసి ఉంచుకొని చూచుకొనుము తార్కాణము. అనగా నేచెప్పినమాటలు నిజమగునో కాదో చూచుకొనుము అని భావము.

విశేషభావము : ఈపద్యమును ఈవిధముగా దండాన్వయముచేసి చదువుకొనవలెను. "శిష్యుని అశయమునుచూసి, మది తెలసి అతనికి తగిన బోధ తెలియన్ జేసి, ముద మొందజేసెటి దేశికుడే ముఖ్యుడనుచు తెలుసుకోవోయీ । కని యుత గాణ్ని క లు సు కో వో యీ । దయతో యిట్లు చేసిని, నీయాశయ సంపూర్తి ! యిట్లువ్రాసిపైతే పేసుకోచూచేవు తార్ఖాణము ॥ ఈపద్యములో ఎట్టి శిష్యునికి గురువుబోధ జెప్పవలయునో ఎట్టి గురువును శిష్యుడు చేరవలెనో సూక్ష్మముగా చెప్పిరి. శిష్యుని యాశయమనగా పునరావృత్తి రహితమైన మార్గమును గోరు యాశయమున్నవానినే, గురువు శిష్యునిగా జేసుకోవలయును. ఇతర అశయముల వారిని చేరదీయరాదు. అట్లే ఆ అశయము నెరవేర్చగలిగిన పరిపూర్ణబోధ దృఢస్థుడు, చక్కని ప్రవర్తన కలిగిన గురువును, "కనియుతగాణ్ని కలుసుకోవోయీ" అన్నపదమును ఉపయోగించినారు. అట్టి గురువు అవునో కాదో చక్కగా

విచారించి తెలుసుకొని, అట్టి గురువును మాత్రమే ఆశ్రయించ వలెనని భావము.

254) గం॥ మంతనమున గురుబోధన। యెంతో వింతను చునమ్మి తింతేకదయే। వింతలుగనరావనిధా। వంతము నొందేటి వాని బ్రతుకెంతకంతె॥ చింతలులేని గతిగానడింతె॥ అంతకంతకు వానికతి చాదస్తమెకాని। సంతాకూటముతోటి సంభాషించదువాని। బ్రతుకెంతకంతె। చింతలులేని గతిగానడింతే॥

భావము : ఈగురుబోధ యెంతో వింతయైనది, చాల గొప్పది, అని ఆశించి ఇందులోకి వచ్చితిని. ఆలోచించగా ఇందులో ఏవింతలు, మహిమలు వగైరా ఏమియు లేవని దుఃఖించేవాని బ్రతుకు, ఎంతకంతే, అనగా ఇదివరకు ఎట్టివిధముగా జననమరణ ములతోనుండెనో ఇప్పుడూ అట్లేయుండును. దుఃఖములేని విధానము వానికి తెలియబడదు. అట్టివానికి ఉన్నకొద్దీ చాదస్తము పెరుగును. అనగా ఆ మంత్రములు ఈమహత్తులు సంపాదించాలి అనేకోరికతే పెరుగును. జన్మరాహిత్యమెరిగిన మంచివారియొక్క సమూహముతో సంభాషణ, విచారణచేయుటకిష్టపడడు. వాని బ్రతుకు అంతే.

(ధావంతము = దుఃఖము)

— —

255) కం॥ తనగురుబోధను తాజది। విన వినుజనవితతి మదికి వింతైయాబో! ధనునేర్వకున్న వ్యర్థము। జననంబవితోచి శరణ నెటట్టు॥ వెంటనె వాండ్లు దరిజేరెటట్టు॥ ఘనమైన యుక్తి జేసినవాడె శిష్యుడు। అనుమానమేమిందు గనరాదు వినవోయి॥ శరణనెటట్టు। వెంటనె వాండ్లు దరిజేరెటట్టు॥

సుంకద, తన పెర్టటిలోనున్న మూలిక మొక్కలు, తనగ్రామంలో నున్న సత్పురుషులు తనకు గొప్పగా తెలియబడవు. అకడుచేతనే కదా ఇంద్రుడు అందమైన భార్యను (శచీదేవి) కల్గియుండి అహల్యను మోహించెనని పురాణములో చెప్పుట విన్నావుకదా : అట్లే తన గ్రామంలో ఉన్న సాధుజనులు తనకు గొప్పగా తెలియబడరు.

257) కం॥ జతనముగ దాచి చదువుము । రతనమ్ముల హారమిదియు రసికుల గళమూ । యతనము దీనికి నేబహు । యతనముగావించి తెచ్చి యిస్తిర నేడు ॥ బోధకు బందోబస్తొరచూడు ॥

రతనాల్లాంటి రాళ్ళు రతనాలంచనియుంటే । రతనాలీపద్యాలే రసికు లెరిగెదరివినీ ॥ కిస్తిర నేడు । బోధకు బందోబస్తొరచూడు ॥

భావము : శిష్యా ! ప్రయత్నముజేసి యీపద్యములు బాగుగ్గ చదువుము. యీబోధను గ్రహించినవారి కంఠమునకునికి పట్టయి రత్నహారముగా ప్రకాశించును. యీ పద్యరచనతో నే బహు ప్రయత్నముజేసి (కష్టించి) రచించి నీకుయిచ్చితిని. యీ పద్యములు బోధకుచక్కగా ఉపయుక్తమగును. రాళ్ల రత్నాల్లా తాయి అనుకుందువేమో ? యీబోధయొక్కరుచిని తెలిసిన మహానుభావులకు యీపద్యములు రత్నములే. రాళ్లుకావు.

విశేషభావము : "రతనమ్ముల హారమిదియు రసికులగళమ్మూయతనము" అనగా రసికుల గళమునకు ఉనికిపట్టు చేస్తే అది అరసికులకు రత్నాలహారము ధరించిన వారివలె ప్రకాశించెదరు.

అనగా యీపద్యములు గళమునకు ఉనికిపట్టు అవాలి అంటి, కంఠస్థము చేయుమని భావము.

——

257) కం॥ వినసేర్చి చెప్ప నేర్చిన । మనుజులకే దీనిలోని మర్మము దెలుసున్ । వినజెప్ప నేర్వకుండిన । మనుజులు యీబోధ లోని మర్మ మెరిగేర ॥ దీనందుండె ధర్మా మెరిగెరా ॥ జనులె కొబ్బరికాయ తినసేర్పు గలవారు । తినసేర్చునా కోతి తనకాకాయ చ్చినా ॥ మర్మ మెరిగేర । దీనందుండె ధర్మ మెరిగేర ॥

బావము : శిష్యా : యీబోధ వినసేర్చి తిరిగిచెప్ప నేర్చిన వారికే యీబోధలోని మర్మ ధర్మ ములు బాగుగ దెలియగలవు. విన జెప్ప లేనివారు చక్కగా యీబోధ మర్మ ధర్మ ములు గ్రహించలేరు. అదెట్లనగా కొబ్బరికాయ ఒలిచి తినగల్గినవారు మనుజులెకాని. కోతికి తినసేర్పు గలిగి ఉన్నా ఒలచేసేర్పు లేదుకనుక కోతికి కొబ్బరికాయ దొరకినా తినలేకపోవుచున్నది.

——

258) కం॥ నేనెంత లెస్స జదివిన । దీనిని దెలియంగ గలరె దేశికవర్యున్ । పూని సేవించకుండిన । మానవులదియెట్ల నన్నమరి వినవోయీ ॥ నామాటందుమనసుంచవోయీ ॥ వానా కాలములోని వర్షాము ఒకబిందు । పైన మిట్టను నిల్వ దది నిశ్చయ మెకద ॥ మరివినవోయీ । నామాటందు మనసుంచవోయీ ॥

భావము : శిష్యా ! నేనెంత బాగుగఇదివి భావము జెప్పినను, శిష్యుడు ప్రయత్న పూర్వకముగా గురువును చక్కగా అనుష్ఠానము చేయనిదే ఈ పద్యభావమును, పరిపూర్ణబోధను గ్రహించలేడు. నాయీమాటయందు నమ్మికతో ఉండుము. వాన కాలములో పడిన వర్షము ఒక్కబిందువుకూడా కొండపై నిలబడక నీరంతయు క్రిందికి దిగజారిపోవుచున్నదికదా ! కనుక చక్కగా అహంరహితత్వమునకై గురుమూర్తిని సేవించి ఉపాసించుమని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
గురుశిష్యోభయలక్షణనామ
షోడశోఽధ్యాయమునకు
భావ, విశేషభావములు
సమాప్తము.



# 17. గురు దత్తాభయుదానం (11)

260) కం॥ నన్నాశ్రయించినావని । యన్నా పరిబోధ నీకు అతుకుటకొరకై । యెన్నో యుక్తుల జెప్పితి । విన్నావా దీన్ని నీవు విడువకెప్పటికీ ॥ నాయాజ్ఞను గడువకెప్పటికి ॥ నన్ను నీవు నిన్ను నేగన్న వేళ్లెట్టిదా । నన్ను నీవు విడువలేవు నిన్ను నేవిడలేను ॥ విడువకెప్పటికి । నాయాజ్ఞానుగడువకెప్పటికి ।

భావము : శిష్యా ! నన్ను నీవు ఆశ్రయించినావని, యీ పరిపూర్ణబోధ నీకు చక్కగా తెలియుటకొరకై యెన్నో ఉదాహరణలతో చెప్పినాను. విన్నావుగదా ! ఈ బోధను నీవు ఎప్పటికి విడచిపెట్టకుము నాయాజ్ఞను దాటక వర్తింపుము. నన్ను నీవు. నిన్ను నేను చూచినవేళ ఎంతటి మంచి ముహూర్తమో : నన్ను నీవు విడువలేవు. నిన్ను నేను విడువను.

— —

261) కం॥ పతియైనను సతియైనను । నతిసాహసపడులు గాక యూంతర్యమునన్ । రతివేళ్ల లజ్జపడసం । తతిగలుగదుచూడు సుట్లతగదులజ్జించా ॥ గురుశిష్యులు తగులజ్జనొంచా ॥ మతిని నీవిట్లు సమ్మతిజేసియేయి । సంగతినన్నడుగుము బోధస్థితినొందదృఢపరతు ॥ తగదులజ్జించా । గురుశిష్యులు తగులజ్జనొంచా ॥

భావము : శిష్యా ! భర్త అయిన, భార్యఅయిన, రతి సమయములో సిగ్గుపడినచో సంతానము గలుగదు. అట్లే గురు శిష్యులుకూడ అడుగుటలోనుచెప్పుటలోను సిగ్గుపడకుండగ ప్రశ్నించి తెలుసుకోవలెను. కనుక నీవునన్నులో ఉపిధముగా తెలుసుకొని

యేయేసంగతి తెలియబడలేదో అది అడిగినచో నేనునీకు బోధ దృఢపరతును. సిగ్గుపడక ప్రశ్నించుము.

— —

(6) కం॥ రతికొఱకుగాదె సతిపతి। కతిహితమతి సేవ జేయునటునలెబోధ। స్థితినీకు కుదుడుటకు। సమ్మతితో గురు సేవ జేయుమా నీతివంత॥ అభిమానము పోనినీదంతా॥ అతనికి దయవస్తె అరరనిముషమునబోధ। స్థితి నీకుకుదిరించు సిగ్గువిడచి కొల్వు॥ మానీతివంత। అభిమానము పోనీనీదంతా॥

భావము : శిష్యా! భార్య, భర్తకు ఎంతో ప్రేమతో సేవజేయుట దాంపత్యసౌఖ్యమును పొందుటకేకదా! అట్లే అభిమానమును విడచి సంతోషముతో గురుసేవచేసినచో బోధస్థితి కుదరగలదు. ఓనీతివంతా। ఆ సద్గురుమూర్తికి దయవస్తే అరనిముషములో నీకు బోధస్థితికుదరగలదు కనుక సిగ్గు అభిమానములను విడచి గురుమూర్తికి సేవజేయుము.

విశేషభావము : గురుకరుణచే మాత్రమే బోధస్థితి కుదురును. తీవ్రమైన ఎండ అంతటాయున్నప్పటికి ఆ ఎండలో ఉన్న తృణము (గడ్డి)నకు నిప్పు అంటుకొని భస్మము కావటములేదు. ఆ ఎండలో భూతఅద్దముద్వారా సూర్యకిరణమును ఆగడ్డిపై కేంద్రీకరించినచో క్షణములో నిప్పుపుట్టి గడ్డిని భస్మముచేయును. అట్లే అఖండ గురుస్వరూపముయొక్క దయవలననే శిష్యుని అజ్ఞానము భస్మము కావలసియున్నది. అయినను మానుష గురుమూర్తికి సేవజేసి అతనికిదయవుట్టులాగున ప్రవర్తించినచో, ఆఅఖండ గురు

కటుబ, మానుష గురుమూర్తి ద్వారా శిష్యునిపై కేంద్రీకరింపబడి, బోధస్థితి కలుగును. కనుక లక్ష్యార్థముగా అఖండగురువును, వాచ్యార్థముగా మానుష గురుస్వరూపమును శుశ్రూషలచేత శిష్యుడు సేవించవలెను. ఎండలో భూతద్దమువల్లనే నిప్పు పుట్టినట్లుగానే, మానుష గురువు భూతద్దముపలె శ్రేష్ఠమైనవాడు, శాస్త్రజ్ఞుడు, బ్రహ్మనిష్ఠుడు కావలయును. అట్టి సద్గురుమూర్తివల్ల మాత్రమే శిష్యుడు తరించగలడు అని గ్రహించవలెను.

— —

263) కం ॥ నీమానసమున సంశయ । మేమాత్రము నిల్వ బోకుమికనాతోడే । నామాట నిశ్చయమునే । నేమాత్రము దాచలేదు నీతోడుసుమ్మి ॥ యింతకు మిక్కిలికలేదులెమ్మి ॥ నామీద తల పుంచునను మఱవకికనేను । నీమీద దయవుంతు నిజమిందుకిదె వొట్టు ॥ నీతోడుసుమ్మి । యింతకు మిక్కిలికతేదులెమ్మి ॥

భావము : శిష్యా : నీమనస్సునందు ఏమాత్రము సంశయము ఉంచుకొనకు. నామీదవొట్టు. సంశయముదాచక అడుగుము నేచెప్పిన బోధ నిశ్చయమైనది. ఇందులో ఏమాత్రముదాచకుండగ సమస్తము నీకుచెప్పినాను. అందుకు నీమీదవొట్టుపెట్టి చెప్పుచున్నాను. నమ్ముము. యింతకన్నా గొప్పదైన బోధఏమియులేదు ఎల్లప్పుడు ఆ సద్గురుమూర్తిపై మనస్సు ఉంచుము. గురుమూర్తిని మరువకుము. అట్లే నేను నీమీద దయ ఉంచగలను. ఇందుకు నీమిదవొటువేసి చెప్పుచున్నాను.

విశేష భావము : బోధలో యేమాత్రము దాచకుండగ జెప్పితిననియు, ఈ బోధకన్న ఎక్కువ విశేషమైన బోధయేదియు

లేదనియు వొట్టుపెట్టి గురుమూర్తి చెప్పినాడు. అట్లే శిష్యునికూడ ఏసంశయములేదని తనమీద వొట్టుపెట్టి చెప్పించుకొనెను. అందుచే గురుశిష్యుల బోధ మనస్సు ఏవిధముగా ఉండవలెనో శ్రీకృష్ణ ప్రభువులు ఊపద్యములో చెప్పినారు. శిష్యుడు ఎల్లకాలము గురువును మరువరాదు. తాను గురువైనప్పటికిన్ని తనగురువు నకు తాను శిష్యుడే అన్నవిషయము మరువరాదు. అట్లే గురువు తనశిష్యులను ఎన్నడు మరువక బోధజేసి తరింపజేయుటకు ప్రయ త్నించుచుండవలెను. ఈనాడు కొందరు గురువులు వందలాది శిష్యులను చేసుకొనుచున్నారుకాని కొంతమందిని తిరిగి మరొకసారి చూచుటకూడ జరుగుటలేదనుట సాహసముకాదు. అట్టివారిని నేనెరు గుమను. అది గురుశిష్యులకు తగదని ఊపద్యభావము.

— —

264) కం॥ నీగురుబోధను నీచే । బాగుగవిని నిందసేయు భ్రష్ఠుల మాటల్ । తో గొని విడిచే విది నీ । కేగురుడీలాటిబోధ నెరి గించడోయి ॥యెరుకలోదె యెరిగించునోయీ ॥ ఆగురుబోధలనన్ని నేదెలసుండి । నాగురుబోధనే నయముగ నీకిస్తి ॥ యెరిగించ డోయి । యెరుకతోదె యెరిగించునోయీ ॥

భావ ము ః శిష్యా ః పరిపూర్ణబోధను నీచే తెలుసుకొని విని ఇది మంచిదికాదు అని నిందించే భ్రష్ఠుల మాటలు విని ఈ బోధను విడిచెదవేమో ః ఇట్టి గొప్పబోధ ఏగురువు తెలియపర్చడు. ఎరుక బోధనే చెప్పెదరు. అలాటి గురువుల బోధలన్నియు నేనెరిగి, యీ పరిపూర్ణ బోధకన్న గొప్పబోధేమియులేదని తెలుసుకొని, నీకు

యీపరిపూర్ణబోధను ప్రీతితో తెలియపర్చినాను. కనుక యెన్నటికి దీనిని విడువకుము.

— —

65) కం॥ నిక్కముగ బీరపీచుల। చిక్కనుమి విచ్చరాదు ఛీ యీ యెరుకన్। మక్కువనే బోధించిన। చక్కనిబోధాగ్ని చేత సాధించుపోర ॥ విచ్చి చింత చాలించుకోర ॥ చౌక్కామౌ యీ బోధకెక్కడయీడౌను। తక్కిన బోధాల దిక్కుచూడక దీన ॥ సాధించుపోర। విచ్చిచింత చాలించుకోర ॥

భావము : శిష్యా ! యెరుక నిక్కముగ బీరపీచులాంటిది బీరుపీచును చక్కగా విడదీయుట జరుగదు. అట్లే యీయెరుకబోధ కూడ తిన్నగ వంకరలేకుండ చెప్పవీలుకాదు. యీ పరిపూర్ణబోధ అనే అగ్నిచేత యెరుక అనే బీరపీచును చక్కగా భస్మము చేయ నగును. అంతేకాని దీనిని విడదీసే ప్రయత్నము మానుము. ఆ యెరుక బోధలు యీపరిపూర్ణబోధకు యెక్కడ సమము కాగలవు ? కనుక తక్కిన బోధల వంక యెంతమాత్రము చూడక ఈ పరిపూర్ణ బోధచేమాత్రమే ఎరుకలేకుండ సాధించుకొనుము.

— —

(66) కం॥ అడవిపుసిరికయు జలనిధి। బొడమిన లవణం బటంచు బొగడిన రీతిన్। పుడమిని ఈస్థలముందున। కడువేడుక నీవు నేను గలసుట వినరా ॥ నీనా ప్రేమగలసె కన్గొనరా ॥ విడ లేవునీవునన్ను విడలేను నేనిన్ను। పొడజూచి నీవు నేనెక్కడబోక నిలచిట్లు ॥ గలసుట వినరా। నీనా ప్రేమగలసె కన్గొనరా ॥

భావము : శిష్యా ! అడవిలోని ఉసిరికాయ, సముద్రము నుండి పుట్టిన ఉప్పు రెండు కలసినట్లుగా, ఈస్థలమందు చక్కగా నీవు-నేను కలసుటకూడ అట్లే ఉన్నది. నీయందునాకు, నాయందు నీకు వాత్సల్యము ఏర్పడినది. కనుక నీవునన్ను విడువలేవు. నేను నిన్ను విడువలేను. నిన్ను చూచినప్పటినుండి నేనెక్కడికిపోకుండగ నీవు నన్ను ఆపి ఈవిచారణ చేసుకున్నాము.

— —

విశేషభావము : అడవిలోపుట్టిన ఉసిరికాయ, సముద్రములో పుట్టిన ఉప్పు ఈరెండు వస్తువులు భిన్న ప్రదేశముల నుండి వచ్చినవి. ఒకచోటగలసి ప్రజలచే బహుమాన్యము పొందినది. అట్లే ఎక్కడనుండో గురువు, ఎక్కడోనుండి శిష్యుడు వచ్చి ఒక చోట వీరిద్దరు కలసి విచారించి, ఇద్దరూ ప్రజలందరుచే మంచిగా కొనియాడబడినారు. మరియు గురుశిష్యులు ఇద్దరూ ఒకరినొకరు విడువరు. తారహితమయ్యే పర్యంతము ఇద్దరూ ఉంటారు. ఒకరి హృదయములో మరొకరు అతివాత్సల్యముచే ఉందురు. శిష్యుడు రహితమయ్యేవరకు వీరు విడిగా ఉండలేరు. కర్పూరము(శిష్యుడు) నిప్పు (గురువు) ఈ రెండుకలసిన తరువాత అవిలేకపోయే పర్యంతము ఒకదానిని విడచి మరొకటి ఉండవుకదా :

— —

267) కం॥ పెద్దల నింద యొనర్చకు । పెద్దలసేవించు కొరకు వెరిదవియకుయే । పెద్దలతో వాదించకు । పెద్దల జెప్పేటి సుద్దిపెడచెవుల వినకు ॥ పెద్దలు నడచే నడకనే మనకు ॥ పెద్దల కన్ననే పెద్ద నంచనుకోకు । పెద్దల గనుగొన్న ప్రియముతో

ప్రొముక్కము ॥ పెడచెవుల వినకు । పెద్దలు నడిచే నడకని మనకు ॥

భావము : శిష్యా ! పెద్దలకు యెన్నడు నింద చేయకుము, పెద్దలకు సేవచేయుటలో వెనుదీయకు. ఏ పెద్దలతోటి వాదించకుము. పెద్దల నడకను ఏమీ అనకుము. పెద్దలకన్న నీవు పెద్దవని ఎన్నడూ అనుకోకుము. పెద్దలను చూడగనే సంతోషముతో నమస్కరింపుము.

.........

268) కం॥ పెత్తనమున యేనుంగిల చెత్తను దినవలసె చీమ చిన్నతనమున చే । హత్తుకొని తినును చక్కెర । యిత్తరి యీ రెంట్లో నీకు యిష్టమెద్దైతె ॥ చేకొనుమదె స్పష్టమిద్దైతె ॥ పెత్తనమున చేటె పెంపొందుచుండును । చిత్తములో దెలియు చిన్నతనమె మేలు ॥ యిష్టమెద్దైతె । చేకొనుమదె స్పష్టమిద్దైతె ॥

భావము : శిష్యా : పెత్తనముచే (పెద్దతనం) యేనుగు అనేకవిధములుగా చెత్తను (వృక్షశాఖలను) తినుచున్నది. కాని చిన్నతనమున చీమ చక్కెర రేణువును హత్తుకొని తినుచున్నది. ఈరెంటిలో అనగా పెద్దరికము, చిన్నతనము ఈరెంటిలో నీకు యిష్టమేద్దైతే అట్లెయుండుము. పెత్తనముచే కష్టములు పొందగల్గును అన్నమాట స్పష్టముగా చెప్పుచున్నాను. విచారిస్తే చిన్నతనమే మేలు అని చెప్పుచున్నాను.

విశేషభావము : పెత్తనముచే ఏనుగు చెత్తనంతయు తిన్నట్లుగా అధికారి అయినవాడు గురువు) శిష్యులసందేహములను తీర్పుటకై అనేక శాస్త్రములు, గ్రంథములను చదువవలసివచ్చును.

ఆచదివే శాస్త్రములు గ్రంథములు రహితస్థితికి పనికిరావు. అయినా శిష్యుల అనేకరకముల సందేహములను తీర్చేనిమిత్తమై గురువు పెత్తవంటి అనేక గ్రంథములు చదువుచున్నాడు. కాని చిన్నతనముచే చీమ చక్కెర రేణువును చక్కగా తినుచున్నది. అట్లే చిన్నతనమున (శిష్యుడు) గురువును హత్తుకొని (ఆశ్రయించి) చక్కెర వంటి మధురమైన బోధను గ్రహించి అతిసులువుగ తాను రహితమయ్యే మార్గము తెలుసుకొనుచున్నాడు. పెత్తనముచే అనేక కష్టములు పొందవలసివచ్చును. కనుక విచారించగా గురువు అయిన తదుపరి అహంకారము వృద్ధిఅయిపాడై పోవుటకు అనేకమార్గములు కలుగును. కాని శిష్యుడు చిన్నతనముచే పెద్దలనడచినమార్గములో నడచును అనహంకారుడై బోధస్థితి పొందుటకు అర్హుడగును. ఈ విషయము బాగుగ విచారించి, పెత్తనమే కావలయునో, చిన్నతనమే కావలయునో ఏరుకొనుమని కృష్ణ ప్రభువులు మేల్కొల్పుచున్నారు.

— —

269) కం॥ తనకుశరణన్నవారల। మనసెట్టిదొ తరచిచూచి మరి తెల్పదగున్। వినువారికి తగినట్టిది। యనితిట్లు మహానుభావుల తిచాతుర్యమునా॥ వినితని నీమన సతిచార్యమున॥ ఘనమైన ఈ బోధ తరుణిస్తి దీన్ని। చచ్చినదాక నిదురవచ్చినదాక మరువాకు॥ మతిచాతుర్యమునా। వినితని నీమనసతిచాతుర్యమున॥

భావము : శిష్యా : తనకు శరణని వచ్చి శిష్యునిగా చేర దలచినవారి మనసు ఎట్టిదో తరచిచూచిన తదుపరే ఈ బోధ తెలియ

పర్చాలి. అట్టివారికి తగిన బోధ ఇది అని మహానుభావులు చెప్పిరి. అట్టి విధము నీమనసు అతిచాతుర్యముగా విచారించి చూచి తెలుసు కొని ఈ గొప్పదైన పరిపూర్ణబోధను నీమీద దయచేత ఇచ్చితిని. కనుక దీనిని నీవు నిదురవచ్చుదాక చచ్చుదాక మరువకుము.

విశేషభావము : "అషుప్తే రామృతే కాలేనయం వేదాంత చింతయా" నిదురవచ్చుదాక చచ్చుదాక కాలమంతయు వేదాంత భావము చేయుము అని శృతి చెప్పుచున్నది. అట్లేకృష్ణ ప్రభువులు కూడ ఈ గొప్ప బోధయొుక్క భావమును సర్వకాలము మరువవద్దు అని చెప్పుచున్నారు. మరియు శరణని అడిగినంత మాత్రముచే చెప్పక వానియొుక్క మనసు బాగా తరచి తెలుసుకొని అర్హుడైన వానికి మాత్రమే ఈ బోధ తెలియపర్చమనిరి. ఇది ఈ సంప్రదాయస్థులు అందరు గమనించదగిన విషయము.

........

270) చెప్పదగు గురుడుబోధను । చెప్పినపని జేసెనేని శిష్యాగ్రణికిన్ । చెప్పతగదు చెప్పినపని । తప్పని వాదించెనేని దయదల్చి బోధ ॥ యిద్దరికుండదగునిట్టిమేధ । చెప్పి ముందుగ బోధ చెప్పండి పనులన్న , చెప్పగూడదు వాన్ని తిప్పలపెట్టక ॥ దయదల్చిబోధ । యిద్దరికుండదగునిట్టిమేధ ॥

భావము : శిష్యా ! చెప్పినపని చేసిన శిష్యునకు ఈ బోధ చెప్పదగును. చెప్పినపని తప్పు అని వాదించె వానికి దయదలచి ఈ బోధ చెప్పతగదు. ముందుగా బోధచెప్పి ఆ తరువాత పనులు చెప్పండి చేస్తాను, అని చెప్పిన వానికి కూడ తిప్పలు పెట్టకుండగ ఈ బోధ చెప్పతగదు. అయితే ఈవిధముగ

గురువు ఎట్టివాడో, శిష్యుడు ఎట్టివాడో బాగుగ నిర్ణయములు ఒకరిని మరొకరు తెలుసుకున్నాకనే వారిద్దరూ గురుశిష్యులుగా ఉండవలెను.

.........

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్త్వే
గురుదత్తాత్రయదానంనామ
సప్తదశాధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.



# 18. సుజన లక్షణం (6)

271) కం॥ ఇది వినుమనినను సుజనులు । చెవియొగ్గిద రివియు సృష్టిజేసికృతికిబల్ । చవిబుట్టింతురదెట్లన । శివుడు కళానిధిని చక్కజేసెన లేదా ॥ నీ మదిశంకబాసెన లేదా ॥ అవనిలో శ్రీరాముడవగుణి నాహల్య । నెవరేమియనకుండ సవరించి సుగుణిగ ॥ జేసెన లేదా । నీమది శంకబాసెన లేదా ॥

భావము : శిష్యా ! ఈపద్యములను సుజనులైనవారిని వినుమనినచో, అనగా అట్టివారికివినిపించినచో, ఈపద్యభావములకు చక్కని అర్థము వచ్చులాగున సవరణలు చేసెదరు. అది ఎట్లనగా శివుడు క్షయ గ్రస్తుడైన చంద్రుని తనశిరస్సునవాల్చి చందురునికి దేవతాగణములలో చక్కని గౌరవమును కలిగించెనుగదా । అట్లే శ్రీరాముడు తప్పుజేసిన అహల్యను, ఎవరూ నిందజేయుటకు వీలుకాకుండగ స్త్రీరూపము ధరింపజేసి చక్కజేసెనుగదా :

— —

272) కం॥ గురుసూచనైన నరులను । మరి మరి వినుమనుచు జదువు మాపద్యములన్ । గురుసూచన యెరుగనియా । నరులను వినుమనుచుజదువ నగుబాటే గతురా ॥ అదియెట్లన్నయిదిగోనే దెల్పెదర ॥ పురుష సంగతిలేని బాలతి కొక్కోకశాస్త్ర । మరసి మెచ్చునె దాన్ని యతి ప్రౌఢసతివలె ॥ నగుబాటే గదర । అదియెట్లన్నయిదిగోనే దెల్పెదర ॥

భావము : శిష్యా ! గురుసూచన అయినవారిని పదే పదే వినుమని ఈపద్యములను చదువుము. ఇందలి భావము తెలిసి,

వారు సంతసించగలరు, గురుసూచనలని (ఈ బోధస్థులని) వారికి ఈ పద్యములు వినిపించినచో హేళనచేసిపోయెదరు. అది ఎట్లనగా పురుషుని పొందు ఎరిగిన స్త్రీ కొక్కోకశాస్త్రము చదివి మెచ్చుకొన గలదుగాని పురుష సంగమము తెలియని స్త్రీ ఆ శాస్త్రమును మెచ్చుకొనగలదా ?

.........

273) కం॥ యెవరుంటె యేమి భయముర । సవరింతురు తప్పులుంటె సాధులువిన్నన్ । సవరించనివ్వు మిదివిని । యువనీతులు నిందజేస్తె అయ్యేదేమో యీ ॥ అందులో మనది పొయ్యేద్యేమో యీ ॥ భవనాశస్థితిలేని పద్ధతి ఈ బోధ । చౌరంగ వినిపించు చాటేల మాటేల ॥ అయ్యేదేమోయీ । అందులో మనది పొయ్యే దేమోయీ ॥

భావము : శిష్యా ! ఈ పద్యములు చదువుటకు సభలో యెట్టివారున్నప్పటికి భయపడకుము. సజ్జనులైనవారు ఇందు తప్పులేమైన వుంటె సవరించెదరు, సవరించనిమ్ము. అదిగాకుండగ దుర్జనులైనవారువిని నిందించెదరేమో అనికూడ భయపడకుము. అట్టివారు నిందించినచో ఏమైనది ? కనుక ప్రభవ, ప్రతిష్ట పరాయణత్వములులేని యీ పరిపూర్ణబోధను చాటు-మాటు లేకుండగ చెవులకు ఇంపయేటట్లు వినిపించుము.

.........

విశేష భావము : సభలో ఎటువంటివారు ఉన్నప్పటికి భయపడక చదవమన్నారు. చాటుమాటువద్దన్నారు. కాని చదివినది

వినేవారికి చెవులకింపగునట్లు చదవమన్నారు. ఇది గమనార్హము. కనుక సభలో చెప్పినప్పుడు చక్కగా వినేవారికి ఆనందము కలుగు లాగున భావము చెప్పవలెననే కాని కఠినోక్తులు పనికిరాదని భావము.

274) కం॥ పుట్టింట బిడ్డ బహుద। దిట్టయిఉండినను ఎవరు దిట్టరు భువిలో। పుట్టింటివారు కోడలు దిట్టయినను అత్తవారుదిట్టేరు సుమ్మీ॥ చేతులకొద్దీ కొట్టేరుసుమ్మీ॥ అట్టుంబలెనె బహు దిట్టయిన శిష్యుని। తిట్టాడు గురుమూర్తి వట్టివారు జూస్తే॥ తిట్టేరు సుమ్మీ। చేతులకొద్ది కొట్టేరుసుమ్మీ॥

భావము : శిష్యా ! ఆడపడుచు దిట్టదైనప్పటికి పుట్టింటి యందు ఆమెను ఎవరూ తిట్టరు. ఆ వ్యక్తి అత్తవారింటివద్దకూడ ఆలానోరుపారేసుకుంటే అందరు ఆమెను తిట్టెదరు. చేతులకొద్దీ కొట్టెదరుసుమీ। అట్లనే శిష్యుని నోరు మంచిది కాకపోయినను గురుమూర్తి తిట్టడు. కాని ఇతరులు మాత్రము ఊరుకొనక తిట్టెదరు మరియు కొట్టెదరుసుమా !

---

275) కం॥ అందముగ ఘనులు మెచ్చెద। రెండుకు మెచ్చెదరు దీన్ని యితరజనంబుల్। చంద్రుడు దయుంబందిన। సింధువు చెలరేగినట్లు చెలగునెచెర్లూ॥ కోనేర్లు నూతులు బావులేర్లూ॥ మందయానలపొందు మగవారెనుతి జేతు। రెండుకునుతి జేతురిల షండపురుషులు॥ చెలగునెచెర్లూ। కోనేర్లు నూతులు బావులేర్లూ॥

భావము : శిష్యా ! యీ గ్రంథమునుజూచి చాలాగొప్ప గ్రంథమని ఘనులైనవారు మాత్రమే మెచ్చుకొందురు. యితర

జనములు దీన్ని ఎందుకు మెచ్చుకొందరు ? అనగా మెచ్చుకొనరని భావము. అది ఎట్లనగా చంద్రోదయమైనప్పుడు సముద్రము పొంగునదికాని, చెరువులు నూతులు ఏర్లు పొంగుటలేదుకదా ! అట్లనే యువతులయొక్క పొందు మగవారు కోరెదరుగాని, నపుంసక జనులు కోరరుకదా !

విశేషభావము : ఈ గ్రంధమును ఘనులు మెచ్చెదరు. ఇచ్చట ఘనులు అనగా గొప్పవారు, అనగా ఘనమైన విషయము. అన్నిటికన్న గొప్పది ఆత్మ. అట్టి ఆత్మతత్వమును పూర్తిగా విమర్శించి తెలుసుకుని దానంతకూడ పునర్జన్మకలదని గుర్తెరిగి, అంతకు మిక్కిలి అయిన పరిపూర్ణబోధ గురుముఖతా గుర్తించినవారు - ఘనులు. ఎందుచేతననగా అన్నిటిని గుర్తించినవారు. అసాంతము తెలిసినవారు. ద్వయదోషరహితులు. అట్టి సంపూర్ణ శాస్త్ర విద్యాకోవిదులు గనుకవారు ఘనులు. వారెరుగని మరుగులేదు. అలాకాకుండగ అల్పవిద్య, కొద్దిమాత్రమే తెలిసినవారు దీనియొక్క గొప్పతనమును పూర్తిగా గ్రహించలేరు. అధిక జలసంపదగల సముద్రమే చంద్రోదయమునకు పొంగినది కాని అల్పజలాశయములైన చెరువులు, బావులు, ఏర్లూ పొంగుటలేదుకదా !



276) కం॥ లోకంబులు సంపూర్ణత । టాకస్థజలంబులెట్లు త్రాగక తృషచే । గైకొనునో కుంభజలము । ట్లీ కలియుగమందు దుష్టులింపుమీరగనూ ॥ నిర్వ్యరుబోధ కంపుబారిననూ ॥ మీకు దీని తెలంటె మాకేలయిట్టి చికాకు కొత్కోకమైతె గైకొందుమందురూ ॥ యింపుమీరగను । నిర్వ్యరుబోధ కంపూబారిననూ ॥

భావము : శిష్యా ! కాకులు దాహముచేత జలము ఎక్కువగా నున్న చెరువులయందు నీరుత్రాగక, అల్పజలము కలిగిన కుండలయందు నీరుత్రాగగోరును. అట్లె ఈ కలియుగములో దుష్టులైనవారు ఈ బోధ వినినచో వారికి సంతసము కలిగించకపోవుటచే అందులో నిలవకుండగపోవుదురు. "ఈ బోధ మీకె సరిపోవును, మాకెందుకు యీబోధ యిట్టి చికాకు, కొంకకమైతే బాగుండును" అని అనుకొనుచు అందుండక బయటకు పోయెదరు.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే

సుజన లక్షణన్నామ

అష్టాదశాధ్యాయమునకు

భావ, విశేషభావములు

సమాప్తము.



అంత. ఈగ ఎప్పుడూ సువాసన ద్రవ్యముల వద్దకు పోకుండగ గాయమునే కోరుచుండును. ఇది ప్రత్యక్షమే కదా :

279) కం॥ రమ్మని పిలువనిదే ప । ద్యమ్ములు జదువంగ వచ్చి యతినిందించున్ । సమ్మతిగా కుమతి విని । యిమ్మహి యది యెట్లనన్న నిట్లానె వినుమి ॥ వాని బుద్ధ్యదట్లానెకనుమి । బొమ్మలాటలో దిమ్మ బొమ్మ తానొకటి ఛీ । పొమ్మనియనినా హాస్యమ్ము నర్పదె పోక ॥ నిట్లానె వినుమి । వానిబుద్ధ్యదట్లానెకనుమీ ।

భావము : శిష్యా ! దుష్టబుద్ధి కలవాడు తనని రమ్మని మనము పిలువనదే వానంతటవాడే వచ్చి, పద్యములు జదివి అతిగా నిందచేయును. దుష్టుని బుద్ధి అది అని తెలుసుకొనుము. ఆదెట్లనగా తోలుబొమ్మలాటలో జుట్టుపోలిగాడు వాడిపాత్రలేనిదే తెరమీదవచ్చి నప్పుడు "ఛీ నీవు ఇచ్చటకెందుకు వచ్చితివిపోరా ! అని అన్నను పోకుండగ నిలచి హాస్యములాడుచుండును కదా ! అట్లనె ఇట్టి దుష్టులుకూడ జుట్టుపోలిగాడివలె పిలవనిదే వచ్చి ఈ గ్రంథమును జదివి నిందజేయుచుందురు.

— —

280) కం॥ వటియించిన చన్నులు గల । కుటిలాలకి నింద జేయు గుత్త పురవికన్ । యెటువలె తనతప్పెరుగక । యటువలె గ్రంథమును మెచ్చడ దుర్జనుడూ ॥ లేనిదె తప్పు వెదకుచునుండూ ॥ యిటువంటిబోధ నేనెరిగెదెట్లనుకోక । కటువాక్యములు బల్కి ఘనుల గాసిలజేయు ॥ నతి దుర్జనుడూ । లేనిదె తప్పు వెతకుచునుండూ ॥

భావము : కుష్ఠించిన చన్నులు గల యువతి, తను తొడిగిన రవిక బిగుతుగా అంటుకొని లేదని రవికను నిందజేయు నట్లుగా, దుర్జనుడు అయినవాడు తనతప్పు తెలియక ఈ గ్రంధ మును మెచ్చుకొనడు. మరియు లేని తప్పులు వెదకుచుండును. ఇంత గొప్పబోధ తనకెట్లు తెలియును అని అనుకొని, కఠినమైన వాక్యములను బల్కుచుండును.

.........

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాఽద్వైత రహిత పరమతత్త్వే

కుజనలక్షణం నామైకోనవింశోధ్యాయమునకు

భావ - విశేషభావములు

సమాప్తము.



# 20. శిష్య విజ్ఞాపన (8)

281) కం॥ గురువర మీ నాసందున। యెరుకను తెరగలిగి యుండె యిన్నాళ్ళ గ్రాలెన్। కరుణారసి క్షణములన్। తెరదీసితి రెరుకమాటదీరెనికక్కడికి॥ చాలు బోధాదూరేదెక్కడికి॥ పరిపూర్ణ మును తేని యెరుకను జూపించి। యెరుక లేదని యంత్రి యెర్రుకె లేదాయెను॥ తీరెనిక్కడికి। చాలుబోధదూరేదెక్కడికి॥

భావము : "గురువర్యా! మీనాసందున యెరుకనే తెర ఇంతవరకు ఉన్నది. మీ కరుణామృత దృష్టిచేత ఆయెరుకనే తెర దీసివేస్తిరి. అందుచే ఇక్కడితో ఎరుకమాట తీరినది. కనుక బోధ కావలెననే కోరికలేదు. అందుచే బోధచాలును. పరిపూర్ణమును, లేనియెరుకనువిశదపరచి చూపించి, యెరుకలేదని చెప్పగా, యెరుకయే లేకపోయినది." అని శిష్యుడు గురుమూర్తితో విజ్ఞాపన చేసికొనెను.

విశేష భావము : ఈపద్యములో గురు - శిష్యుల మధ్య ఇంతవరకు యెరుకనే తెరగల్గియున్నది అన్నారు. ఇచ్చట యెరుక అనగా "మాయ" అని అర్థము చేసుకోవలెను. మాయచే ఆవరింప బడినవాడు శిష్యుడు. కేవల జ్ఞానమూర్తి గురువు. కనుక వీరిద్దరి మధ్య ఎరుక - (మాయ) అనే తెర ఉన్నది. గురుమూర్తి తన కరుణాకటాక్షముచే పరిపూర్ణ మెరుపుల రెంటిని బోధించి చూపించగా, శిష్యునకు ఎరుక భ్రమవదలినది. అంతటితో ఎరుకను విడచినవాడయ్యెను. అట్టివానికి బోధతో పనిలేదు. తానేలేనివానికి బోధ యెట్లుచెప్పుట. కనుక ఈ పద్యములో "బోధదూరేదెక్కడికి।"

ఇక్కడితో గురుశిష్యుల పనితీరు వారిద్దరూ లేకపోయిరి కనుక "తిరెనిక్కడికి" అన్నారు.

---

282) కం॥ ధారుణి కొంతజరించిచి। దారించితిగాని యీ విచారమునేనె। వ్వారలు జెప్పగ వినలే। దారయ్య మీనోట విన్న నయ్యా గురుమూర్తి ॥ నాతరమానుతి జెయ్యమీకీర్తి ॥ సారస నయనపురారినీరజబ్బం। దారకముఖులై నేరానుమిముదెలియు ॥ నయ్యాగురుమూర్తి। నాతరమానుతి జెయ్యమీకీర్తి ॥

బావము : అయ్యా గురుదేవా ! ఈ భూమిమీద కొంత దేశము తిరిగి అనేకమందియొక్క బోధ విచారణ నేను విన్నానుకాని ఇట్టిబోధ ఎవరూ చెప్పుట వినలేదు. ఈ బోధమీ ముఖతామాత్రమే విన్నాను. ఇట్టి గొప్పబోధ జెప్పిన మీకీర్తి, ప్రజ్ఞను స్తోత్రము చేయుట నాతరమా ? విష్ణుమూర్తి, మహేశ్వరుడు, బ్రహ్మ మొదలగు వారికే మీ ప్రజ్ఞను (బోధను) స్తుతిజేయులేరు. మరియు మిమ్ము వారు దెలియులేరు. ఇకనాతరమా గురుదేవా !

విశేషబావము : దేశములో ఎన్నిమతములసిద్ధాంతముల వారైనను పరబ్రహ్మమునే గొప్ప అని చెప్పుచున్నారు. అక్కడే మాయయున్నదని చెప్పినా దానిని విడిచే పద్ధతిని తెలియులేక పోయిరి. ఒక్క పరిపూర్ణబోధ మాత్రమే మాయను విడచే సరైన మార్గము చెప్పుచున్నది. కనుకనే ఈ బోధవలన మాత్రమే జనన మరణ ప్రవాహము తెగిపోవుచున్నదనుట నిర్వివాదము. కనుక ఇంతటి గొప్పబోధ మరేదిలేదు. "అన్ని బోధలకన్న మిన్నయైన యీబోధ-పరిపూర్ణబోధ" అన్నారు. ఇంతటి గొప్పబోధను స్తుతింప

విశేషభావము :- వాచ్యార్థము, లక్ష్యార్థము; అనుభవార్థము నిర్ణయార్థము అని తెలుసుకొనే విధములు నాల్గు. కంటికి కనుపించని కుండ, ఉన్న పదార్థము ఇట్టిదని చెప్పుట వాచ్యార్థము. మామిడిపండు ఇలా ఉంటుందని బొమ్మగీసి చూపించి దానిరుచి విశేషాదులను తెలియపర్చుట వాచ్యార్థము. ఆ పండు తెచ్చి చూపించినప్పుడు అది లక్ష్యార్థముగా తెలియబడినది. దానిని తినినప్పుడు అనుభవార్థము వెంటనే నిర్ణయార్థముగ ఆమామిడిపండు యొక్క విషయము సంపూర్ణముగ అవగాహన అయినది. అట్లే కుండను జూపించి యిదిగో కుండ అని చూపినప్పుడు వాచ్యార్థము లక్ష్యార్థము, అనుభవ, నిర్ణయార్థము లతో సంశయరహితముగా ఘటజ్ఞానము కుదిరి నట్లుగా, చెప్పి చూపించకని పరిపూర్ణమును గురుమూర్తి యొన్నో రీతుల అన్వయ వ్యతిరేక భావములతో, యుక్తులు సూక్తులు జెప్పి చూపించినప్పుడు, శిష్యునకు పరిపూర్ణమై ఉన్నదని యెరుక యెంత మాత్రములేదని, యెరుక భ్రమ పూర్తిగా నశించి అరూఢజ్ఞానము యేర్పడి సర్వసంశయ నివృత్తి అయినది.

284) కం॥ ఒర్పుల్లు నేనన్న నిజమిన । దెర్రిగింపు మదీము బయ్యల్లు, యేనొరులనుచున్ ॥ యెరుగునీవెవరు యీలే । నెరుకను మన్నావు వుంటె యిన్ని లేదంచు ॥ నేనానిను నీమదిని లేననుకో ॥ యెరిగి యీ లేనెరుక యిట్లా లేకుండితె । పరిపూర్ణమా దాన్నె పగిది గుర్తెరిగేము । యిది లేనంచనుకో । నేనా నిను నీమదిని లేననుకో ॥

భావము । ఈ పద్యభావమును ప్రశ్న జవాబుగా తెలుసుకొనవలయును.

| గురుని ప్రశ్న | శిష్యుని జవాబు |
|---|---|
| 1) శిష్యా : ఇతరమునేను అనకుండగ సర్వత్రా నిండినది ఏది ? | అదే పరిపూర్ణము. |
| 2) నేనని ఇతరమని తెలుసుకొనే నేనె వరు ? | యీాలేనెరకను. |
| 3) వున్నావు గదా ! .... .... | వుంటె యిది లేదంటనుకో. మరియు నేను, నీవుకూడ లేనని భావింప వలెను. |

ఈ విధముగా తెలుసుకొని యీాలెనెరుక యీావిధముగా లేక పోయునచో పరిపూర్ణమువలె ఉందువు. కనుక యీా యెరుక లేదనుకో అని గురుమూర్తి చివరగా చెప్పెను.

విశేషభావము : పద్యములో చివరవాక్యము, "యీాలే నెరుక యిట్లా లేకుండితే పరిపూర్ణమౌదు." అన్నారు. అనగా యెరు కను విడచినవానియొక్కస్థితి పరిపూర్ణస్థితి. అనగా తననుగాని ఇతర మేనున్నాని యెరిగే [illegible]ముతేదు. ఎందుచేతననగా యె[illegible] కలేమ [illegible] అంతుచేత తత్త్వ[illegible] "దాన్నే పగివగుర్తె రెగేము" [illegible] గుర్తించలే[illegible] అ[illegible] భావము.

[illegible]

285) కం॥ నాబుద్ధికి సరిపడ్డది । నీబుద్ధేకాని యన్నిసేర్పుల గనినన్ । ఛీ బద్ధుల యాబుద్ధుల నాబుద్ధికి మెప్పురావు నాతంత్రి వినర॥ శెబాసునిన్నేతంత్రిగనెరా॥యాబుద్ధినికమానకేబుద్ధిబూనాకు। యేబుద్ధి బూనీన నీబుద్ధి చెడిపోవు ॥ నాతంత్రి వినరా । శెబాసు నిన్నేతంత్రిగనెరా ॥

భావము : శిష్యా ! నాబోధకు సరిపడునది నీబోధేకాని, ఇతరబోధలు నా బోధవంటివికావు. యెన్నివిధములుగ చెప్పినా ఆబద్ధులయొక్క బోధలు నాబోధకి సరిరావు. నాతంత్రీ వినుము. నీబోధ నేచెప్పినట్లుగా ఉన్నది శెబాష్. ఏతంత్రిగనెనో – నీకు ఆతంత్రి బోధే వచ్చినది శెబాష్. యీబోధను ఎన్నటికి విడువవద్దు ఇతరబోధను గ్రహించకుము. యేబోధ గ్రహించినా నీబోధ చెడిపోవును.

విశేషభావము : ఈపద్యములో బుద్ధి అనువదమునకు జ్ఞానము అనగా బోధ అని గ్రహించవలెను. గురుమూర్తి చెప్పిన విధముగానే శిష్యుడుబోధ సక్రమముగా తిరిగిచెప్పగలిగినందువల్ల, గురుమూర్తి సంతోషమునుజెంది నీతంత్రి బుద్ధికి (బోధకు) సరి పోయినది నీబుద్ధి. శెబాష్ అని మెచ్చుకొనుట గమనార్హము. యింతకన్న ఎక్కువబోధలేమియులేవు. ఇదే ఆఖరుబోధ పరిపూర్ణ బోధ, "గురుశిష్య ద్వయం రహితము కనుక గురువులేడు, వినేందుకు శిష్యుడులేడు.

---

286) కం॥ కొట్టితి తిట్టితి శ్రమలన్ । బెట్టితి నీమనవిచెవులం బెట్టక పెడచా। బెట్టితి మొట్టితివెడలన్।గొట్టితినీమనసు దెలియుకోపము

లేకా॥సరె తెలిసెనీవోపికపోక।పట్టుమిచ్చె దయింక నట్టిమియునిదయ। బుట్టియిచ్చితి బోధగట్టి వాడవురోరి ॥ కోపములేకా । సరె తెలిసె నీవోపికపోక ॥

బావము : శిష్యా : నిన్ను కొట్టితిని, తిట్టితిని, శ్రమ పెట్టితిని, నీవు చెప్పిన మాటలను వినకుండగ మొట్టితిని, వెడల గొట్టితిని. నీమీదనాకు కోపములేదు. నీమనస్సు ఈబోధయందు స్థిరముగా ఉండునోలేదో తెలుసుకొనుటకు, కష్టసుఖములయందు ఓపికయున్నదోలేదో చూచుటకే నేనట్లు జేసితిని. అన్నిటికి సరిపడి నావని తెలసి యీబోధ పట్టుముయిచ్చెదనని నీమీద దయపుట్టి యీ బోధ యిచ్చితిని. నేజేసిన పరీక్షలకు నిల్చిన గట్టివాడవు. అంతేకాని నీమీద నాకు కోపములేదు.

— —

287) కం॥ నీవెంతకొట్టితిట్టిన । నీవిడిచే వాడగాను నీ చర ణంబుల్ । చావైన పెండ్లియైనను । నేవిడువనటంటివట్టి నిజభక్తుడ వెర ॥ నేగనుగొంటినీ. నిష్టనౌరా ॥ కావున నీకిట్టి ఘనమైన యీ బోధ। నేవేగదయజేస్తి నీవిదివిడువకు ॥ నిజభక్తుడవెరా ॥ నేగను గొంటినీనిష్ఠనౌర ॥

బావము : శిష్యా ! "నీవెంతకొట్టి తిట్టిన నీపాదములను నేను విడచే వాడనుకాను. చావైనను, పెండ్లియైనను నిన్ను నేను విడువను" అని అన్నావు. అట్టి నిజమైన భక్తుడవే. నీయొక్క పట్టుదల (తీవ్రమైనమోక్ష అపేక్ష) తెలుసుకొంటిని. కనుకనె నీకు యిట్టి గొప్పబోధ దయతో యిచ్చినాను. దీన్ని నీవు విడువకుము.

........

288) కం॥ నానోటిమాట వెంబడి । తానెప్పుడు సంచరించెత గనీ చిత్తం । జేనదిగని యీబోధ । నిదానము నీకిస్తి దీన్నిదాచుకొ సుమ్మీ ॥ నిత్యము నీవు చూచుకొనమ్మీ॥ యేనరుడైన నిన్నీబోధ నడిగితే । వాని మనసరయక వానికిజూపేవు ॥ దాచుకొసుమ్మీ । నిత్యము నీవు చూచుకొనమ్మీ ॥

భావము : శిష్యా : నానోటిమాట యేవిధముగ వచ్చినదో అదేవిధముగా నీవు ఆచరించినావు. ఆవిధముగా నీసనన్ను నేను తెలుసుకొని, యీ బోధ విధానమును నీకు ఇచ్చినాను. దీనిని ఎక్కడపడితే అక్కడ వదలకుండగ దాచుకొని నిత్యము జమువు కొనుచు, మననము చేసుకొనుము. యెవ్వరైనవచ్చి నిన్ను ఈబోధ చెప్పమని అడిగినచో, వాని మనస్సు ఎట్టిదో తెలియనిదే యీబోధ చెప్పకుము.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే
శిష్య విజ్ఞాపనం నామ
వింశతమోఽధ్యాయమునకు
భావ, విశేషభావములు
సమాప్తము.

— —

# 21. గ్రంథ సంపూర్తి (3)

289) కం॥ కూడి గురుశిష్యులిద్దరు । వేడుకతో బయలు వున్న విధమెరిగెరుకన్ । వీడిరిదిలేనిదని । మాటాడుట కికయేమి దోచదదియేమొకానీ ॥ వింటిరె మీరలిది యిందులోని ॥ జాడమీ కెరుకని వేడితి వినుమంచు । యీడీకి సరిముచ్చట కాడుటకికదోచ॥ దదియేమొకాని । వింటిరె మీరలిది యిందులోనీ॥

భావము : గురు శిష్యులిద్దరు కలసి సంతోషముతో పరి పూర్ణమున్న విధమును ఎరిగి, ఎరుకలేనిదని విడిచిపెట్టిరి. ఇంక మాటాడుటకు యేమీతోచదు(సంకల్పములేదు) మీరుకూడ విన్నారు కదా ! యిందులోని భావము మీకు తెలియ బడుటకై వినుమని వేడుచున్నాను. దీనికి సరిపోయే భావము మాట్లాడుటకు ఏది యునులేదు.

— —

290) కం॥ శరశాస్త్ర స్వరహిమకర । (1765) పరిమితమై నట్టి శాలివాహనశకమం । దరయుగ శోభకృదనువ । త్సర మార్గ శిరంబు కృష్ణ చవితి నాటికినీ ॥ పద్యాల్పది తక్కువ మున్నూటి కినీ ॥ మురయుచుజేస్తి నెవ్వరు విన్న జదివిన । పరిపూర్ణమెరుకై లేనెరుక లేకుండునె ॥ చవితినాటికి నీ । పద్యాల్పది తక్కువ మున్నూటికినీ ॥

భావము : శాలివాహన శకము 1765 కు సరియగు క్రీస్తుశకము 1843 సం॥రము శోభకృన్నామ సం॥ర మార్గ శిర బహుళ చవితినాటికి 290 పద్యములు సంతోషముగా జేసితిని. వినిని ఎవరువిన్నా చదివిన పరిపూర్ణము తెలియబడి, లేనెరుక లేకుండాపోవును.

విశేష భావము : శర, శాస్త్ర, స్వర, హిమకర - ఇవి అంకెలకు సంస్కృతములో సాంకేతికపదములు. శర అనగా-అయిదు, శాస్త్ర - ఆరు, స్వర - ఏడు, హిమకర - ఒకటి. అనగా 1765 ఇది శాలివాహనశకము. దీనికి సరియగు క్రీస్తుశకము 1843 సం॥రము లో మార్గశిరమాస కృష్ణచవితినాటికి ఈపద్యముతో కలిపి 290 పద్యములు వ్రాసినట్లుగా కృష్ణప్రభువులు ఈ పద్యములో వ్రాసుకొనినారు. ఇందులో "పరిపూర్ణము ఎరుకై" అని వ్రాసినారు. అంటే పరిపూర్ణము-ఎరుక అవుతుంది అని అర్థముకాదు. పరిపూర్ణము తెలియబడి, లేనెరుక లేకుండాపోవును. అని గ్రహించవలెను.

---

291) కం॥ ఏపురుషుడు గురువర్యుని (శ్రీపాదము బట్ట లేదా సేలుగ నాతం। డీ పుస్తకమును జూచిన। యేపట్టున నిలువ కేగునిది నిజమయ్యా॥ నరులార మీరిది దెలియరయ్యా। యీపరమ గోప్యము యెవ్వరెరుగ రోరయ్యా! నాపల్కు మదిలోన నాటిన వారికి యిది నిజమయ్యా॥ నరులార। మీరిది దెలియరయ్యా॥

భావము : ఎవరైతే గురుమూర్తి యొక్క శుభమైన పాదము పట్టలేదో అతడు ఈ పుస్తకమును జూచినచో యెక్కడ ఉండక లేచిపోవును. యిదె నిజము. ఓనరులార ఈ విషయము మీరు దెలుసుకొనుడు. యిది పరమరహస్యము. ఎవ్వరూ ఎరుగరు, నేచెప్పిన యీమాటలు మనస్సున నాటిన వారికి యిది నిజము.

విశేషభావము : గురుపాదము పట్టని మానవుడు ఈపుస్తకమును జూచినచో, అతనికేమియు దెలియక, విపరీతముగ దోచి, అచ్చటనుండి వెళ్లిపోవును. ఎప్పుడూ ఈ గ్రంధమును తిరిగి చూడడు. అందుచే। ఈ పుస్తకము యొక్క భావము,

బోధ గురుమూర్తి పాదము పట్టి గురుముఖతా వినువారికి మాత్రమే యిందులోని మర్మ ధర్మములు తెలియబడునని కృష్ణప్రభువులు చెప్పక చెప్పెను. ఇది పరమరహస్యము. గురుకరుణచే మాత్రమే గురుముఖతా తెలియబడును. కనుక గురుపాదము నాశ్రయించని వార్కి ఎంతమాత్రము తెలియక లేచిపోవును. అనిభావము.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాఽద్వైత రహిత పరమతత్వే

గ్రంధ సంపూర్తి నామ ఏకవింశోధ్యాయమునకు

భావ - విశేషభావములు

సమాప్తము.

.........



# 22. గ్రంథ సమాప్తి (1)

292) కం॥ ఎరుక నెరుంగని బయలులో। గురుడును శిష్యుండు వారి గొడవయునేమీ । కెరిగించినవన్నియు మీ । రెరిగినవన్నియునుమీరలేను నుళ్ళక్కి ॥ వుళ్ళక్కి తానెప్పుడుళ్ళక్కి । మరియింక మాటాడ మాటే లేదాయెను । సరిపోయె సరిపోతె సరిపాయె సరిమీర ॥ లేను నుళ్ళక్కి । ఉళ్ళక్కి తానెప్పుడుళ్ళక్కి ॥

బావము : ఎరుకనెరుగనిపరిపూర్ణములో, గురుశిష్యులిద్దరు గూడి విచారించినదియు, దానిని నేను మీకెరిగించినదంతయు, మీరెరిగిన సమస్తమున్ను, మీరు, నేనున్ను అంతయు ఏమీలేదు "నేను" ఎప్పుడునూ లేనేలేదు. ఇంక మాటాడుటకు మాటలేదు. సరిపోయినది. అలా మీరు, నేను, మాట అంతయు సరిపోతే మరి ఏమియులేదు. సరిపోయెను. నేను మీరు ఉళ్ళక్కి ఏమియులేము.

విశేషబావము : ఇక్కడితో 'శుద్ధ నిర్గుణ తత్వ కందార్ధ దరుపులు అను గ్రంథము సమాప్తి చేసెను. ఇంతటి విచారణ అంతయు గురువు శిష్యుడు విచారించుకొనినట్లుగా చెప్పబడినది. ఈవిచారణపరిపూర్ణములోనేజరిగినది.విచారించినవారు గురుశిష్యులు- ఎరుకయే. విచారించిన సమస్తము ఎరుకయే. పరిపూర్ణములో ఎరుకలేదను,నిర్ణయమే ఈ గ్రంథంతో చెప్పబడినదినిరూపింపబడినది కనుకగురువు శిష్యుడు, విచారించిన సమస్తము, అట్టివిచారణవిన్న వారుఅంతాఎరుకే. ఇదంతయుకలవలె ఏమీలేనిదే. పరిపూర్ణబోధను మేల్కొను పొందుటచే, సమస్తకల ఇసుమంతయు లేకుండాపోయె ననుమాట సరిపోతే, ఇకచెప్పుకొనుటకు మాటలేదు. చెప్పేవాడు

లేడు. చెప్పుకొనేవారు, వినేవారు లేరు. ఏమియులేదు. ఇదేపునరా వృత్తిరహిత పద్ధతి.

— —

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాఽద్వైత రహిత పరమ తత్వే
గ్రంధసమాప్తి నామ ద్వావింశోఽధ్యాయమునకు

నితుందిన సగోత్రోద్భవుండును, సూర్యనారాయణావధాని
దత్తత పుత్రుండును, శ్రీ సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ
అరట్ల రామారాయ సద్గురు ప్రభు ప్రియ శిష్యుండును,
బుధజన విధేయుండును నగు, శ్రీ సమరస బోధానంద
వేంకటరామ కృత భావ – విశేషభావములు
సమాప్తము.

// సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు //



# తప్పొప్పుల పట్టిక



| పేజీ నెం. | వరుస నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 24 | అనభిష్వ ్గ: | అనభిష్వఙ్గ: |
| 9 | 8 | లౌనెందు | తానెందు |
| 10 | 11 | చేకొంటి | చేకొంటె |
| 10 | 19 | కలజోని | కలజోలి |
| 12 | 24 | పాటినులు | పాటిఅనుట |
| 13 | 6 | సల్ అసల్ | సత్ అసత్ |
| 13 | 19 | సపదార్ధ | సత్ పదార్ధ |
| 15 | 12 | తప్పోప్పు | తప్పొప్పు |
| 18 | 7 | మద్దుగా | ముద్దుగా |
| 18 | 22 | సద్యములో | పద్యములో |
| 19 | 5 | తోల్పెట్టి | తోల్పెట్టె |
| 20 | 10 | బ్రతుకె | బ్రతుకే పాటి |
| 20 | 13 | అంక్ష | ఆంక్ష |
| 20 | 17 | తప్పకలిగిన | తప్పుకలిగిన |
| 21 | 13 | నీయమని | నీయనని |
| 24 | 11 | అంటి | అంటె |
| 24 | 15 | గన్పిస్తి | గల్పిస్తి |
| 34 | 13 | లేని లేని | లేని |
| 44 | 20 | మెరుగ | మెరుక |
| 43 | 17 | చుట్టువలె | చట్టువలె |
| 43 | 17 | అన్నాను | అన్నారు |
| 44 | 5 | సట్లుగ | నట్లుగ |
| 44 | 7 | పరిపూరము | పరిపూర్ణము |
| 44 | 25 | వానలయాక | వానలనలయాక |
| 45 | 13 | పచించుట | వచించుట |
| 45 | 14 | నైనంభిందంతి | నైనంఫిందంతి |
| 45 | 14 | శస్తాణి | శస్త్రాణి |
| 46 | 6 | నూత్ర | మాత్ర |
| 46 | 9 | మేమీయు | మేమియు |
| 46 | 16 | మెరుకలేదు | మెరుకేలేదు |
| 46 | 24 | ఆచంచినను | ఆచరించినను |
| 47 | 1 | నవగా | ననగా |
| 47 | 18 | మేమిర | యేమిర |
| 49 | 4 | థంచబడి | దంచబడి |
| 51 | 6 | లౌనౌరా | తానౌరా |
| 51 | 8 | బయుట | బయలు |
| 51 | 9 | ప్యవ | వ్యవ |
| 53 | 14 | బయుట | బయలు |
| 57 | 5 | విద్యల | విద్యలు |
| 57 | 14 | నివర్తండే | నివర్తంతే |
| 57 | 17 | భావచమ్యము | భావగమ్యము |
| 57 | 17 | పచింప | వచింప |
| 57 | 18 | పలెను | వలెను |
| 57 | 21 | పరమార్ణము | పరమార్థము |
| 57 | 25 | యెక్కడికేరా | యెక్కడికౌర |
| 60 | 19 | జగత్తుసు | జగత్తును |
| 62 | 13 | గురుముఖతే | గురుముఖతా |
| 62 | 21 | వచ్చ్వనో | వచ్చునో |
| 63 | 22 | సుష్టుప్తి | సుషుప్తి |
| 64 | 1 | పరిపూర్ణము | పరిపూర్ణ |
| 64 | 3 | స్థానాలుమైవ | స్థానమందున్న |
| 64 | 20 | చేతస | చేతన |
| 65 | 9 | ఒంటచు | బటంచు |
| 65 | 17 | నేకవిధ | అనేకవిధ |
| 66 | 3 | పరమాత్మల | పరమాత్మల |
| 66 | 15 | పరద్రహ్మము | పరబ్రహ్మము |
| 66 | 20 | ఖండలుగ | ఖండములుగ |
| 67 | 8 | గుర్తించి | గుర్తించిన |
| 67 | 8 | మరుపకుండ | మరువకుండ |
| 67 | 22 | మధశ్శాభో | మధశ్శాఖో |
| 67 | 23 | యస్యర్ణాని | యస్యపర్ణాని |
| 68 | 4 | సాంపదాయ | సాంప్రదాయ |

| పేజీ నెం. | వరుస నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 69 | 7 | నెడశిన | నెడసిన |
| 69 | 10 | దెలునుకొ | దెలుసుకొ |
| 69 | 18 | బావయి | భావము |
| 70 | 4 | శరము | శరీరము |
| 70 | 9 | అపదు | అవదు |
| 70 | 11 | అని | అన్ని |
| 71 | 16 | మరురు | మరుపు |
| 81 | 17 | లోచబడి | తోచబడి |
| 82 | 5 | సర్వకాలము | సర్వకాలము |
| 82 | 17 | రహితమేప | రహితమేవ |
| 83 | 5 | రాజనును | తాజనును |
| 83 | 17 | తోచిస | తోచిన |
| 83 | 19 | తనకునేతా | తనకుతానే |
| 85 | 1 | దెల్లిక | దెట్లిక |
| 85 | 19 | సర్వలక్షణిక | సర్వంక్షణిక |
| 86 | 15 | దయల | దమల |
| 86 | 21 | కపపుచ్చు | కవవచ్చు |
| 88 | 6 | అసగా | అనగా |
| 89 | 20 | దనయు | దనియు |
| 90 | 5 | మెట్లేరా | మెట్లొరా |
| 90 | 15 | పరిపూర్ణము | పరిపూర్ణ |
| 91 | 11 | ఓకటి | ఒకటి |
| 92 | 8 | రజితు | రజిత |
| 92 | 13 | మెరుగుసు | మెరుగును |
| 93 | 10 | స్వరూపము | స్వరూపమని |
| 94 | 5 | రహిమై | రహితమై |
| 94 | 21 | కబద | కలదు |
| 99 | 21 | ఏన్నడ | ఎన్నడు |
| 99 | 3 | సూక్మము | సూక్ష్మము |
| 100 | 5 | నికు నీవిట్లు | నిను నీవిట్లు |
| 100 | 8 | అడుకొను | ఆడుకొను |

| పేజీ నెం. | వరుస నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 100 | 11 | నీపు | నీవు |
| 100 | 13 | వేసన | వేసని |
| 100 | 16 | మని | యని |
| 101 | 3 | నీపుకూడ | నీవుకూడ |
| 101 | 3 | వ్యపహార | వ్యవహార |
| 102 | 13 | (పంక) | (వంకర) |
| 102 | 14 | నేదీని | నేదీసి |
| 102 | 16 | మ్తైన | మైన |
| 103 | 19 | ఇటు | ఇట్లు |
| 105 | 20 | పలెనే | వలెనే |
| 106 | 1 | రూపకనుక | రూపముకనుక |
| 106 | 9 | నెపరుండే | నెవరుండే |
| 107 | 3 | గొనదాదా | గొనరాదా |
| 106 | 7 | లేదనన్తైన | లేదనన్తైన |
| 107 | 11 | అధిష్ఠానసమైన | అధిష్ఠానమైన |
| 107 | 21 | అయెరుక | ఆయెరుక |
| 108 | 29 | పమ్ముము | నమ్ముము |
| 110 | 5 | బొమ్య | బొమ్మ |
| 110 | 16 | సదతుపరి | నతదుపరి |
| 110 | 20 | పదెట్లస | వదెట్లన |
| 111 | 3 | కానినచో | కానినచో |
| 111 | 9 | తెలిసివప్పుడు | తెలిసినప్పుడు |
| 111 | 22 | బోట | బోధ |
| 111 | 23 | బోధాప | బోధాట |
| 113 | 7 | ఎరుగవట్లు | ఎరుగనట్లు |
| 113 | 14 | ఆన్యథా | అన్యథా |
| 114 | 1 | దిటు | దిట్లు |
| 115 | 1 | నటొయి | నట్లొయి |
| 115 | 23 | తానగానే | తానుగానే |
| 116 | 12 | యెరుకలొ | యెరుకతా |

| పేజీ నెం. | వరుస నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 117 | 2 | జానమున | జ్ఞానమును |
| 117 | 3 | కలుగునంత | కలుగనంత |
| 117 | 4 | విపత | విపరీత |
| 117 | 20 | పరిపూర | పరిపూర్ణ |
| 118 | 3 | గురున్వరూప | గురుస్వరూప |
| 118 | 7 | వాచా | వాచ్యా |
| 118 | 19 | లేనన్న | తానన్న |
| 118 | 21 | జీపుడు | జీవుడు |
| 119 | 22 | రెంటి | రెంట్ని |
| 120 | 2 | రంద్రము | రంధ్రములు |
| 120 | 17 | ఊడల | ఊడలను |
| 120 | 24 | అరూఢ | ఆరూఢ |
| 122 | 12 | అటే | అట్లే |
| 122 | 17 | భాపము | భావము |
| 123 | 1 | 5. మతాల | 7. మతాల |
| 123 | 22 | బోదము | బోధము |
| 124 | 2 | స్వరూపాప | స్వరూపావ |
| 124 | 21 | జీపశివు | జీవశివు |
| 125 | 6 | విడపెట్టకు | విడచిపెట్టకు |
| 125 | 7 | విడచిపె ్టము | విడచిపెట్టుము |
| 125 | 17 | జీపుడు | జీవుడు |
| 125 | 17 | శిపుడు | శివుడు |
| 125 | 17 | న్వయంభూ | స్వయంభూ |
| 126 | 23 | నాటింతునందున | నాటింతు |
| 127 | 13 | భెరి | భేరీ |
| 129 | 23 | నన్నాకలి | నన్నావలి |
| 131 | 15 | చతురాక్షిరి | చతురాక్షరి |
| 132 | 22 | యేర్పదిన | యేర్పడిన |
| 133 | 6 | జడముగాసు | జడముగాను |
| 133 | 14 | రదికము | రధికము |
| 134 | 7 | మాటలనెన్నో | మాటననెన్నినా |
| 134 | 21 | యసరాదు | యనరాదు |
| 135 | 20 | తనుపులో | తనువుతో |
| 137 | 13 | నుంచైవది | నుంచైనది |
| 137 | 17 | మేర్పా | యేర్పా |
| 137 | 14 | పోపును | పోవును |
| 137 | 22 | స్పిద్ధముగ | స్విద్ధముగ |
| 138 | 12 | చున్పది | చున్నది |
| 141 | 4 | పమాధి | సమాధి |
| 141 | 21 | సహజమే | సహజమౌ |
| 142 | 2 | సహజమే | సహజమౌ |
| 142 | 13 | సంతట | నంతట |
| 142 | 22 | నందులేక | సందులేక |
| 143 | 4 | బయందు | బయలందు |
| 143 | 22 | తేజస్స్వరూ | తేజస్స్వరూ |
| 144 | 4 | యెరుకయే | యెరుకలేదని |
| 146 | 5 | మౌక్తక | మౌక్తిక |
| 146 | 18 | పెట్లుకొందురు | పెట్టుకొందురు |
| 147 | 6 | యామరాగ | యానురాగ |
| 147 | 15 | పైరెండింటి | పైరెండింటి |
| 147 | 21 | బుది | బుద్ధి |
| 147 | 23 | నేన | నేననే |
| 147 | 23 | (పరిపూర) | (పరిపూర్ణ) |
| 148 | 13 | జేసితిలేని | జేసితివని |
| 148 | 16 | వరిపూర్ణ | పరిపూర్ణ |
| 151 | 9 | పాడై | పాడై |
| 152 | 17 | ఆదిగో | అదిగో |
| 152 | 18 | యెండుచేత | యొందుచేత |
| 155 | 5 | యెరుకపలెనే | యెరుకవలెనే |
| 155 | 5 | లేదంతే | లేదంత |
| 155 | 6 | పుండంగానే | వుండంగానే |
| 156 | 10 | ఎరిగిట్టిదంచె | ఎరిగిట్టి దట్టిదంచె |

| పేజీ నెం. | వరుస నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 156 | 20 | పరిపూర | పరిపూర్ణ |
| 157 | 5 | మలుపులు | మరుపులు |
| 157 | 5 | పరమవస్తు | పరవస్తు |
| 157 | 6 | పెటుము | పెట్టుము |
| 160 | 7 | పైలెండెవ్వి | పైరెండెవ్వి |
| 160 | 20 | వదిలేవు | పదిరేవు |
| 161 | 4 | పెటుము | పెట్టుము |
| 162 | 3 | నేన్మాటా | నేనన్మాటా |
| 162 | 7 | నంటితో | నంటివా |
| 162 | 8 | ఎట్టు | ఎట్లు |
| 163 | 7 | యుందేటి | యుండేటి |
| 163 | 12 | నిర | నిర్ణ |
| 164 | 4 | మేల్చ | మేల్క |
| 164 | 6 | లొప్పున | చొప్పున |
| 165 | 15 | రనెకెరుక | తనకెరుక |
| 165 | 17 | యొరిగితెవరి | యొరిగితెపరి |
| 167 | 20 | వేననిన | వేనవని |
| 168 | 8 | అన | అని |
| 168 | 9 | నేనని | నేననని |
| 168 | 12 | రుకవలన | ఎరుకవలన |
| 168 | 13 | పడని | పడదని |
| 169 | 1 | గలవని | గలపని |
| 171 | 5 | నిశ్చయమియె | నిశ్చయమిట్లె |
| 171 | 11 | ఆట్లెరిగితె | అట్లెరిగితె |
| 171 | 15 | చెప్పిస | చెప్పిన |
| 174 | 23 | పోయెయెరుకే | పోయేదియెరుకే |
| 178 | 16 | పరిపూర్థ | పరిపూర్ణ |
| 179 | 9 | అసుమాన | అనుమాన |
| 180 | 15 | ఆటేపరి | అదేపరి |
| 181 | 5 | యిరరుల్ | యితరుల్ |
| 182 | 13 | వరిపూర్ణ | పరిపూర్ణ |
| 182 | 15 | వృవహారము | వ్యవహారము |
| 183 | 8 | మేల్కనగా | మేల్కొనగా |
| 183 | 18 | కసుగొన | కనుగొన |
| 184 | 8 | ఆని | అని |
| 184 | 8 | అట్లి | అట్టి |
| 184 | 19 | అనుసది | అనునది |
| 190 | 6 | ఆని | అని |
| 190 | 8 | న్వరూపుడు | స్వరూపుడు |
| 190 | 16 | ప్రహ్మ | బ్రహ్మ |
| 190 | 19 | పుట్టువు | పుట్టువు |
| 194 | 19 | సంకాల్పము | సంకల్పము |
| 195 | 16 | పరిపూర్ష | పరిపూర్ణ |
| 196 | 7 | నిరతమే | నితరమే |
| 197 | 2 | న్నిటిని | అన్నిటిని |
| 197 | 18 | వేమూదు | వేమూరు |
| 198 | 7 | రెండుసూ | రెండునూ |
| 199 | 10 | యెరకను | యెరుకను |
| 199 | 16 | కరూరము | కర్పూరము |
| 199 | 19 | దాలో | దానిలో |
| 201 | 3 | సతియు | పతియు |
| 201 | 3 | సతికౌగిపి | పతికౌగిట |
| 202 | 3 | లేదులేదు | లేనిదిలేదు |
| 206 | 6 | వరిపూర్ణ | పరిపూర్ణ |
| 206 | 7 | నెరెగబడిన | నెరుగబడిన |
| 209 | 19 | నాకున్యమైన | నాకు అన్యమైన |
| 209 | 23 | లెల్లుక | లెరుక |
| 210 | 17 | అసగా | అనగా |
| 213 | 2 | లని నరాదు | లని అనరాదు |
| 214 | 10 | దీయందు | దీనియందు |
| 214 | 10 | క్రియలువ్న | క్రియలున్న |
| 215 | 2 | మెట్టమొదట | మొట్టమొదట |
| 215 | 3 | పటులకై | పట్టుటకై |
| 215 | 4 | సత్కార్మా | సత్కర్మా |
| 215 | 9 | సామాన్యము | సామాన్యము |
| 216 | 21 | చివరకు | చివరవరకు |

| పేజీ నెం. | వరుస నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 217 | 2 | జవి | జని |
| 217 | 22 | పరిపూర్టము | పరిపూర్ణము |
| 219 | 10 | దిఇవి | అది ఇది |
| 219 | 15 | దానిగుతెలి | దానిగుట్టుతెలి |
| 221 | 6 | చేరదు | చేరడు |
| 223 | 7 | ఎటు | ఎట్లు |
| 223 | 15 | యేగాధ | యేబాధ |
| 224 | 9 | గురువుపద్ద | గురువువద్ద |
| 226 | 3 | నిన్వృత్తి | నివృత్తి |
| 226 | 16 | సుండి | నుండి |
| 227 | 5 | వఠించి | పఠించి |
| 227 | 19 | ఉపవయకము | ఉపనయనము |
| 227 | 23 | వంస్కార | సంస్కార |
| 228 | 24 | ముఖము | ముఖముగా |
| 229 | 15 | నుంత్రము | మంత్రము |
| 231 | 8 | మసగా | మనగా |
| 233 | 7 | జంవుటకై | జంపుటకై |
| 233 | 11 | పాటికచి | పాటించి |
| 234 | 17 | ఏట్టి | ఎట్టి |
| 235 | 1 | ప్రవరన | ప్రవర్తన |
| 235 | 20 | చేయసెనని | చేసెనని |
| 236 | 9 | నీవు | నీకు |
| 236 | 13 | ముర్యములు | ముత్యములు |
| 237 | 3 | జాలరులకు | జారులకు |
| 237 | 3 | దుష్టాత్మనికి | దుష్టాత్మునికి |
| 241 | 14 | సరే సర్వ | సర్వేసర్వ |
| 244 | 5 | దియెట్ల | అదియెట్ల |
| 245 | 7 | పురుషదు | పురుషుడు |
| 245 | 14 | తుష్ణి | తుష్టి |
| 249 | 6 | దపరు | దనరు |
| 250 | 16 | రాకుందె | రాకుండే |
| 251 | 16 | తలిదంద్రి | తలిదండ్రి |
| 253 | 11 | కుచ్చిన | కుచ్ఛిత |
| 253 | 15 | యిటువలెతాం | యిటువలెతా |
| 253 | 16 | వస్తురా | వస్త్రిరా |
| 253 | 17 | దెలుమ | దెలుసు |
| 253 | 20 | యికటికి | యింటికి |
| 255 | 14 | అవలోపన | అవలోకన |
| 257 | 4 | లెలుసు | తెలుసు |
| 257 | 7 | దెలపి | దెలిసి |
| 258 | 1 | మసనందు | మనసందు |
| 258 | 3 | మనసునందు | మనసందు |
| 259 | 6 | మంద్రమని | మంత్రమని |
| 259 | 6 | సమ్మిక | నమ్మిక |
| 259 | 11 | యుడిన | యుండిన |
| 259 | 13 | వరనకు | నరునకు |
| 260 | 13 | తభ్యానప | తధ్యాన |
| 260 | 16 | జోధను | బోధను |
| 262 | 17 | అకాలము | ఆకాలము |
| 263 | 1 | పోస్టె | పోస్తె |
| 264 | 20 | స్థాసము | స్థానము |
| 264 | 21 | కూటస్లో | కూటస్థో |
| 264 | 22 | జీపుడు | జీవుడు |
| 265 | 2 | వస్మూ | వస్తూ |
| 266 | 7 | కరకములు | రకములు |
| 271 | 2 | అకదు | అందు |
| 271 | 4 | నిన్నావు | విన్నావు |
| 271 | 10 | బస్త్రీర | బస్తార |
| 275 | 14 | బౌధ | బోధ |
| 278 | 4 | బౌధాగ్ని | బోధాగ్ని |
| 278 | 6 | బౌధ | బోధ |
| 278 | 6 | బౌధాల | బోధల |
| 284 | 9 | శిరస్సువాల్చి | శిరస్సునదాల్చి |
| 284 | 9 | దరింప | ధరింప |
| 285 | 13 | సజ్జసు | సజ్జను |
| 285 | 15 | దుర్జసు | దుర్జను |
| 287 | 15 | తనముసు | తనమును |
| 287 | | లింవుమీర | లింపుమీర |
| 288 | 2 | యుకదు | యుందు |
| 293 | 10 | ఇట్లి | ఇట్టి |

ఓం

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# క్షరాఽక్షరోపాధి ద్వయదోషరహిత కందపద్యములు

(భావ విశేష భావ సహితము)


రచయిత

శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రులు

భావ విశేష భావ రచయిత

శ్రీ సమరస బోధానంద నేమాని వెంకటరామం

శ్రీ శివరామదీక్షిత అచల గుర్వాశ్రమము

వానపల్లి - 533228



ప్రకాశకులు

శ్రీ చిర్రగోని వీరాస్వామి అండ్ అదర్స్

రాజుల కొత్తపల్లి

వరంగల్ జిల్లా

# క్షరా క్షరోపాధి ద్వయదోషరహిత కంద పద్యము

## అకారాది పద్య విషయసూచిక


| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| | **అ - 17** | |
| 1 | అయమాత్మయనిన రీతిగ | 40 |
| 2 | అట్టిదియిట్టిది అనరానట్టిది | 42 |
| 3 | అది యిది యంచన రానిది | 43 |
| 4 | అబ్బీ యీ బయలున్నది | 49 |
| 5 | అచలమున మొదలు లేకనె | 91 |
| 6 | అష్టాంగ యోగముల | 99 |
| 7 | అనుభవ వేదాంతులమని | 110 |
| 8 | అందరి కల నీకల | 131 |
| 9 | అహమే తనువీ విశ్వం | 134 |
| 10 | అందరి మాటల కురికే | 155 |
| 11 | అని గురుడు బోధజేసిన | 203 |
| 12 | అని శిష్యుడన్న మాటకు | 206 |
| 13 | అని గురుడు తనను బల్కిన | 208 |
| 14 | అంగము లింగము గలుసుటె | 231 |
| 15 | అని మెచ్చి యే మిచ్చెద | 242 |
| 16 | అర్థము తెలియక గ్రంథము | 257 |
| 17 | అందరిని చణుకు చుందురు | 252 |
| | **ఆ - 5** | |
| 18 | ఆ దీక్షితుల కృపకు | 17 |
| 19 | ఆ సీతాపతి నతి | 20 |
| 20 | ఆనే నొనర్చి నాడను | 23 |
| 21 | ఆకాశ మనిన శూన్యము | 132 |
| 22 | ఆకాశ మనిన కాలము | 133 |
| | **ఇ - 3** | |
| 23 | ఇచ్ఛా రాహిత్యంబునె | 73 |
| 24 | ఇది గాదు బోధనే | 100 |
| 25 | ఇతర మెరుంగని | 261 |
| | **ఈ - 7** | |
| 26 | ఈకల కందములను | 1 |
| 27 | ఈక్షితి శివరామా హ్వాయ | 15 |
| 28 | ఈ నిర్మలమౌ బయలున | 52 |
| 29 | ఈ గుర్తెరిగే మేనును | 83 |
| 30 | ఈ వికాసించు గురుడు | 161 |
| 31 | ఈ అచల మొకటి బ్రహ్మని | 236 |
| 32 | ఈ చెప్పిన గురు బోధను | 253 |
| | **ఉ - 3** | |
| 33 | ఉన్నది గద నేజెప్పిన | 64 |
| 34 | ఉన్నలేనే మోయనకన్ | 69 |
| 35 | ఉన్నదానందు నిజముగ | 71 |
| | **ఎ - 10** | |
| 36 | ఎప్పటి కొక్క రీతిగ | 46 |
| 37 | ఎందరు లేదన్నను తా | 97 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 38 | ఎరుగుట జ్ఞానము | 121 |
| 39 | ఎరుక సుమీ బ్రహ్మానివను | 136 |
| 40 | ఎరుక లేనట్టి బయలున | 153 |
| 41 | ఎన్నో గ్రంథ జలధులను | 195 |
| 42 | ఎందరు దూషించితెయే | 113 |
| 43 | ఎరుకన మరుపన రానిది | 233 |
| 44 | ఎరుకన సత్వ గుణంబని | 234 |
| 45 | ఎవరీ పద్యము లన్నియు | 256 |
| | **ఏ - 4** | |
| 46 | ఏ కందమె కా కందమె | 3 |
| 47 | ఏయపేక్ష జనించిన | 74 |
| 48 | ఏ బోధశిష్యులకు గలదో | 184 |
| 49 | ఏ నిర్ణయమును జేయుడు | 145 |
| | **ఒ - 4** | |
| 50 | ఒక సారియైన వినకిన్ | 10 |
| 51 | ఒకరు విని మెచ్చ | 182 |
| 52 | ఒకచోట నవ్వుదును | 223 |
| 53 | ఒప్పకుమీ పరబోధలను | 245 |
| | **ఓ - 1** | |
| 54 | ఓ పాపరూప | 72 |
| | **క - 28** | |
| 55 | కథకాదు జనన మరణ | 5 |
| 56 | కేరుచుమిము వినుమని | 14 |
| 57 | కదలడట పరమ పురుషుడు | 31 |
| 58 | కదలనిది కదలదెన్నడు | 35 |
| 59 | కదలనిది కదిలెనన్నను | 36 |
| 60 | కలనీకు జగము కంతట | 44 |
| 61 | కలనేన్గు సింహమును | 45 |
| 62 | కానరా వారు మతములు | 57 |
| 63 | కలలోపల యేనుగుపై | 96 |
| 64 | కోపమె పాపంబున బడు | 114 |
| 65 | కొందరు భక్తి త్రయంబున | 118 |
| 66 | కొందరు వైరాగ్యంబున | 117 |
| 67 | కలత నను లేను కలనని | 120 |
| 68 | కలలో వానికి మేలుక | 142 |
| 70 | కలకాదు వాని చదువులు | 143 |
| 71 | కావేటి కాలువల వలె | 224 |
| 72 | కలరాజు సకల సంపద | 144 |
| 73 | కలవేళ్ళను యీ మేల్కొను | 54 |
| 74 | కట్టెలు పిడుకల లేకనె | 151 |
| 75 | కోటి విధంబుల చెప్పిన | 163 |
| 76 | కొత్త దంపతుల కూటమి | 179 |
| 77 | కమలంబులున్న కొలనుకు | 187 |
| 78 | కాకులవలె కూకలిడే | 192 |
| 79 | కనక సుమగంధ వాసన | 196 |
| 80 | కప్పురము విప్పు గలిసే | 201 |
| 81 | కూడకుమీ దుర్జనులను | 246 |
| 82 | కదలీనా మొదలీనా | 78 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| | **గ - 7** | |
| 83 | గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి | 8 |
| 84 | గురు శిష్యుల మాటలవలె | 25 |
| 85 | గురుడు తన నెంత మెచ్చిన | 168 |
| 86 | గురుశిష్యుల లక్షణములు | 169 |
| 87 | గురుడు తన యాజ్ఞ లోపల | 176 |
| 88 | గురు కను సంజ్ఞ గనుగొని | 177 |
| 89 | గురుని కపరాధి యగనా? | 191 |
| | **చ - 6** | |
| 90 | చిల్లర బోధల నన్నిట | 24 |
| 91 | చెప్పి చూపించ రానిది | 63 |
| 92 | చలనమన నీవు సుమాఈ | 82 |
| 93 | చలియించని దాకాశము | 84 |
| 94 | చందురుని చీమ | 241 |
| 95 | చెప్పదొడంగెను మును | 244 |
| | **జ - 12** | |
| 96 | జ్ఞాన కర్మ స్వరూపము | 51 |
| 97 | జ్ఞానా జ్ఞానంబులు యీ | 89 |
| 98 | జలమందు మొదలు లేకనె | 90 |
| 99 | జలధి జలచరము లోపల | 93 |
| 100 | జలరాశికి పుట్టవు గద | 94 |
| 101 | జింహ్వోపస్థల విషయము | 111 |
| 102 | జ్ఞానంబు సత్వగుణమన | 125 |
| 103 | జ్ఞానమగు నీవు | 127 |
| 104 | జ్ఞానము నేనన నొక్కటె | 129 |
| 105 | జంభాల పోతుగోరునె | 198 |
| 106 | జఠర జనితులైనను | 200 |
| 107 | జనులవలె జరుపు పనులను | 248 |
| | **త - 14** | |
| 108 | తక్కువ పాండిత్యము | 6 |
| 109 | తక్కిన భోదల వలె | 12 |
| 110 | తనకు తావచ్చిన సద్బోధ | 27 |
| 111 | తర్జనుల వలన జూపును | 103 |
| 112 | తనువును విడి బ్రహ్మను | 116 |
| 113 | తనకు దానొరులు | 140 |
| 114 | తనువున్నే గానంటే | 152 |
| 115 | తనువునే తాననింటివి | 154 |
| 116 | తాము తమ తప్పు నెరుగక | 157 |
| 117 | తన సంతతిపై గల దయ | 171 |
| 118 | త్ర్యక్షుని నిందించిన | 190 |
| 119 | తన హిత మెరుగని | 194 |
| 120 | తల్లివి, దండ్రివి, దాతవు | 205 |
| 121 | తనువుకు, నాకును వేరని | 212 |
| | **ద - 9** | |
| 122 | దక్షిణామూర్తి యనదగు | 16 |
| 123 | ధారుణ్యత్ర్యన సూయలు | 22 |
| 124 | దేహమున కొంత నిజమని | 81 |
| 125 | దీపము గతి కన్నులలో | 102 |
| 126 | ద్వైతా ద్వైత విశిష్టా | 109 |
| 127 | దప్పప్పున జనినట్లుగ | 158 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 128 | దేవుడుతే, తెమ్మనునా | 162 |
| 129 | దిచ్చు తనపు శిష్యుని | 167 |
| 130 | దీవించి యుస్తినే నీ | 202 |
| | **న - 39** | |
| 131 | నే ఛందము జది వెరుగను | 4 |
| 132 | నతిజేసెద నప్పయ్యన్ | 18 |
| 133 | నే పెద్దలచే విన్నది | 30 |
| 134 | నిను మేనును ప్రకృతి ద్వయం | 37 |
| 135 | నీవున్నచోట నుండును | 47 |
| 136 | నానా వికారములు గల | 48 |
| 137 | నేనీ వనని మహాత్ముని | 53 |
| 138 | నేనే తానైతే నావలె | 56 |
| 139 | నా మీది ప్రేమ చేతనె | 58 |
| 140 | నీ తండ్రి తాతలవలె | 59 |
| 141 | నీ తండ్రి జననిన మీదట | 76 |
| 142 | నీవె సుమీ జీవశివుల్ | 77 |
| 143 | నిరుపాధికమగు బయలున | 87 |
| 144 | నీరందు చేపలేకనె | 92 |
| 145 | నీకచ్చిరాని యూరును | 98 |
| 146 | నీరాంశము సృగ్వోదన | 106 |
| 147 | నిజ గురుబోధ నెరుగక | 115 |
| 148 | నీ కలను వచ్చి పోయిన | 130 |
| 149 | నా మాట నమ్మ వేమో | 147 |
| 150 | నేను గలమేను లేదని | 150 |
| 151 | నాబోతు రుచికి రుచినిడు | 156 |
| 152 | నీ మదికౌనిజ బోధన్ | 186 |
| 153 | నేనీకు చెప్పబూనిన | 189 |
| 154 | నా కొరకు కష్టపడితిరి | 204 |
| 155 | నే జెప్పినట్లు జెప్పర | 207 |
| 156 | నే మొదలులేని మేనును | 209 |
| 157 | నను రమ్మని పొమ్మని | 213 |
| 158 | నే నిల్వ జగము లేకను | 219 |
| 159 | నానా భాషల చేతను | 222 |
| 160 | నేనాడు దాన నౌదును | 225 |
| 161 | నేనుల మేనుల కుప్పను | 226 |
| 162 | నేనుగా కొకటి శుద్ధ | 227 |
| 163 | నేమాత్రముండు నని యెను | 228 |
| 164 | నేనన్ననహము హంబన | 229 |
| 165 | నేనన నాలవ దేహము | 230 |
| 166 | నన్నెరుగనట్టి బయలున్ | 235 |
| 167 | నా గురుడు నాకు దెల్పిన | 238 |
| 168 | నీవంటి గట్టి వాడిక | 240 |
| 169 | నరులంత మెచ్చి నడువను | 251 |
| | **ప - 19** | |
| 170 | పరమ పురుషు డును | 28 |
| 171 | పరమ పురుషడన నెవ్వడో | 29 |
| 172 | పురుగుక్క స్తంభంబును | 32 |
| 173 | పేరచల మనుచు | 38 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 174 | పరమ పురుషు డీ బయలని | 39 |
| 175 | పంచకోశముల సంచును | 65 |
| 176 | పురుషోత్తముడని పూజలు | 104 |
| 177 | పాషండమతము వారల | 112 |
| 178 | పుట్టదు గిట్టదు బయలని | 95 |
| 179 | పుట్టింది గిట్టు జ్ఞానము | 126 |
| 180 | ప్రకటమగు బింబమందున | 138 |
| 181 | ప్రాకటముగ నిద్దురయిక | 178 |
| 182 | పెద్దల నెవరిని జూచిన | 193 |
| 183 | పతిభక్తి గల యువతివలె | 199 |
| 184 | ప్రకటమగు బట్టబయలున | 214 |
| 185 | పదియిరువై యయిదులు | 255 |
| 186 | పాటసుమీ భక్తులకిది | 258 |
| 187 | పరమహంసా శ్రమధరుని | 259 |
| 188 | ప్రతి దినము జదివి | 260 |

**బ - 11**

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 189 | బుచ్చి వెంకమ్మ తల్లిని | 19 |
| 190 | భాగవత వంశ భవుడను | 21 |
| 191 | బయలెపుడు పుట్టిగిట్టదు | 60 |
| 192 | బయలనిన నిత్యవస్తువు | 61 |
| 193 | బయలనిన నేను లేనిది | 62 |
| 194 | బ్రహ్మెందు లేక కలిగిన | 86 |
| 195 | భ్రమరహిత సహిత జనులకు | 119 |
| 196 | భ్రమయనిన పుట్టుక నినను | 135 |
| 197 | బోధల కెల్లను | 160 |
| 198 | బంగారు వంటి యీ | 162 |
| 199 | భూమను భద్రాచలమను | 237 |

**మ - 24**

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 200 | మాటలేనట్టి బయలున | 2 |
| 201 | మెప్పైన బోధ గల | 9 |
| 202 | మూలము లేకనె | 50 |
| 203 | మేను జడమ జడము | 55 |
| 204 | ముడిబడి కర్మము జ్ఞానము | 67 |
| 205 | మేనని నను తెలసిన గతి | 79 |
| 206 | మేనొక్కటి నేనొక్కటి | 80 |
| 207 | మానసమున దేహి జీవుం | 88 |
| 208 | మంత్ర యంత్రములు | 101 |
| 209 | మన సన్నపు సూక్ష్మాంశము | 107 |
| 210 | మనమో బయలున | 124 |
| 211 | మనముచల మనదగదు | 128 |
| 212 | మాట సుమీ నేననినను | 133 |
| 213 | మనసుకు, వాక్కుకు దెలియని | 141 |
| 214 | మలకలులే నీ త్రోవను | 146 |
| 215 | ముద్దుగ యీ గ్రంథంబును | 149 |
| 216 | మనసున నొక్కటి దల్చును | 173 |
| 217 | మనసున, వాక్కున, దనువున | 174 |
| 218 | మేలైన బోధ వినుటకు | 175 |
| 219 | మన సరయనక ప్రజలను | 180 |
| 220 | మనము మన పెద్దలందరు | 216 |

| వరుస నెం. | పద్యం పేరు | పద్యం నెం. |
|---|---|---|
| 221 | మేను మజ్జనని నేనే | 217 |
| 222 | మేనున్నది నేలేకను | 218 |
| 223 | మిారకుమిా గురువాజ్ఞను | 247 |
| | **ర - 4** | |
| 224 | రెండు వస్తువుల నడుమ | 70 |
| 225 | రసమన దగనిది వస్తువ | 105 |
| 226 | రెండు రీతుల కనంబడు | 108 |
| 227 | రోగపు చేష్టలు బోయిన | 166 |
| | **ల - 9** | |
| 228 | లేని నేనీవు లేని | 41 |
| 229 | లేని నేనను శరీరము | 66 |
| 230 | లేనినీ కలిమి వంధ్యా | 75 |
| 231 | లేని నీరాకడె స్వప్నా | 139 |
| 232 | లేని నేలేక వచ్చిన | 210 |
| 233 | లేని నారాకపోకలు | 211 |
| 234 | లేని నే నెరుగ కుంటిన | 215 |
| 235 | లేనినే మాయమైనను | 220 |
| 236 | లింగము విక్షేంబన | 232 |
| | **వ - 5** | |
| 237 | వలదెక్కువ ముచ్చట్లిక | 85 |
| 238 | వీనుల వినడీ బోధల | 181 |
| 239 | విను భాష్యములను | 221 |
| 240 | విని శిష్యుని వచనోక్తులు | 239 |
| 241 | విని శిష్యుడు గురు మూర్తిని | 243 |
| | **శ - 3** | |
| 242 | శూరత్వ మాత్మ పనికై | 172 |
| 243 | శ్రద్ధ బోధలందు నిలిపి | 240 |
| 244 | శరధి కరితురగ | 254 |
| | **స - 14** | |
| 245 | సూరిజనులె యీ గ్రంథపు | 7 |
| 246 | స్వచ్ఛాన్వయ గుచ్ఛములని | 11 |
| 247 | సకలకార్య ప్రయత్న | 13 |
| 248 | సకల నిగమాగమాది | 26 |
| 249 | సురలందు దోచు స్వప్నము | 34 |
| 250 | సకలంబులేని బయలున | 68 |
| 251 | సురలందు దోచుకలవలె | 123 |
| 252 | సిద్ధాంతోక్తులు యివి | 148 |
| 253 | సాధనలు జెప్పి శిష్యుల | 159 |
| 254 | సదమల గురువెవరని | 165 |
| 255 | స్థిరముగ నిల్చేదైతే | 170 |
| 256 | సాధారణముగ దెల్పుకు | 183 |
| 257 | సురవర్యుడ హల్య కోసము | 188 |
| 258 | సంశయమె జన్మహేతువు | 250 |
| | **హ - 3** | |
| 259 | హరియందు దోచు విశ్వము | 33 |
| 260 | హెచ్చైన బోధ దెల్పే | 185 |
| 261 | హద్దుసుమా గురువాజ్ఞను | 197 |

శ్రీగురుభ్యోనమః

క్షరాఽక్షరోపాధి ద్వయదోష రహిత పరమ తత్వ

# కందములు.

## భావవిశేష భావములు

**కం॥ ఈకలకందములను విను। డోకల నరులారమీకు వొప్పిద మైనన్ । నేకల గనుక రచించితి। యాకల మోక్షమును జెంద నగునివివినినన్ ॥ 1**

**భావము:-** ఓకల నరులారా! నేను కల. కనుక ఈకల కందపద్యములను రచించితిని. మీకు అంగీకారమైనచో వినుడు. వినినచో కల, మోక్షమును పొంద వచ్చును.

**విశేషభావము :-** క్షరా అక్షర ఉపాధిద్వయదోషములను రహితపర్చిన ఈకంద పద్యములను శ్రీభాగవతుల కృష్ణదేశికప్రభువులు "నేను" అనునదే కల అని తెలియుము. అనే భావముతో ప్రారంభించిరి. నేనుకలకనుక నాచే రచించిబడిన ఈపద్యములు కలలో పలవరించినట్లుకలే. కనుక ఓకలనరులారా! మీకు అంగీకారమైనచో అనగా నేను మీరు సమస్తముకలే అనుభావము అంగీకారమైనచో అనిభావము. నేను కలగనుక, నాకు మోక్షము అనగాఏమి? నేను లేకపోవుటే. కలకుమోక్షము మేల్కొ. నేను అను కలకుమోక్షము నేను లేకపోవుటే. ఈ"నేను' ద్వయదోషముతో కూడినది. 1. క్షరోపాధి, 2. అక్షరోపాధి అను రెండు దోషము లతోకూడియున్నది. "క్షరసర్వాణిభూతాని! కూటస్థోక్షర ఉచ్యతే"॥ అని గీతావాక్యము. ఈకనుపించే సమస్త భౌతిక ప్రపంచము క్షరము. ఈ భౌతికప్రపంచము "నేను" అనుచైతన్యముచే ప్రకాశింపబడుచున్నది. నేను లేకపోతే ప్రపంచము లేదు కనుక, ఈ క్షరమును ఉపాధిగాగొని సమస్త వ్యవహారములు జరుగుచున్నది. కనుక "నేను" క్షరోపాధి అనవలసెను. 2. ఈ భౌతిక ప్రపంచమంతయు" యదృశ్యం తనఽశ్యతే" అను శృతిరీత్యా లేనిదే ఆభాసమాత్రము చేయున్నట్లు తెలియుచున్నది. కాని నిజమునకు ఇదేమియు లేదు. నేను అనుచైతన్యమే శాశ్వతమైనది. అని అనినచో ఈనేను తన యందలిమాయాశక్తిచే పురుషుడై అక్షరప్రాణ విశేషమును ఉపాధిగాగొని లేని

సమస్త జగత్తునకు అభిన్న నిమిత్తో పాదాన కారణమగు చున్నది. ఈఅక్షరుడు నశింపక, నేను అను అవ్యయ పురుష గర్భితుడై నిత్యుడై యుండును. కనుక ఈ "నేను" అక్షరుని ఉపాధిగా గొని జగత్తునకు నిమిత్తకారణుడన బడుచున్నాడు. కనుక విచారించగా "నేను" అక్షరోపాధి మరియు క్షరోపాధి అనుద్వయదోషములు కలిగియున్నది. ఈరెండింటిని విడిచి ఎన్నడును తాను ఒక్కటిగా నుండనేరదు. నేను స్వతశ్శిద్ధముగా నిర్వికారము అని శాస్త్రాదులలో నిరూపించినను, అక్షర, క్షరములు రెండును "నేను" గర్భమునందే ఉన్నవి. అవి మాయసంబంధమే కాని నేను సంబంధించినవి కావు అన్నను-ఆమాయ నేనుయందే విడివడని రీతిలో దీప - ప్రకాశన్యాయముగా ఉన్నది. కనుక క్షరాऽక్షరోపాధిద్వయదోషరహితమనగా "నేను" అను కల లేకపోవడమే. అదే పునరావృత్తి రహితము.



**కం॥ మాటలేనట్టిబయలున। మాటగలిగెననుట వినుటమాయ గదయ్యా। మాటమాయైతె మానెను । మాటను మాట్లాడిమనము మానుదమవలన్ ॥ 2**

**భావము :-** శబ్దము ఎంతమాత్రము లేని పరిపూర్ణములో శబ్దము కలిగినది అనుట, వినుట మాయ అనితెలియుము. శబ్దము మాయయే యైననూ, ఆశబ్దము దానివలన కలిగిన లేక తోచిన సమస్తము విచారించి, అవి లేనిదని తెలిసి ఆతరువాత దానిని విడుచుదము.

**విశేషభావము:-** మాట అనగా శబ్దము. అదే "ఓం నేను; జ్ఞానము, ఇవన్ని ఒక్కటే. దీనికే ఈపద్యములో "మాట" అనేపదము ప్రయోగించబడినది. మాటలేనట్టి బయలున - నేను లేనట్టి (ఓంలేనట్టి) పరిపూర్ణములో "నేను" కలిగెననుట మాయ. అనగా లేనిదే ఆభాసరూపముగా కలవలెతోచినది అనిచెప్పుట. అయినా ఆనేను గురించి ఆసాంతము విచారించి అదిలేనిదని గురుముఖతా గ్రహించిదానిని విడచుటయే ఈగ్రంథము యొక్కసారము.

**కం॥ ఏకందముకాకందమె। మాకందఫలరసరుచిని మరిపించు రుచిన్। మీకందములైనను వినుఁ। డీకందములన్నిసత్కవీంద్రుల్లారా ॥ 3**

**భావము :-** ఏకందపద్యమునకాకందపద్యము, మామిడి పండ్ల రసరుచులను మరిపించును. కనుక ఓ సత్కవీంద్రుల్లారా! మీకు అంగీకారమైనచో ఈకంద పద్యములను వినుడు.

**విశేషభావము**:- మామిడి ఫలజాతులుచాల కలవు. వాటియొక్క మాధుర్యరుచి ఏజాతిపండుది ఆజాతిదే. దేనిరుచి దానికుంది. అన్నీ మామిడి పండ్లే అయినా, వాటిరుచులు భిన్నములై అన్నిటిని గ్రహించతగినవే అయినట్లుగా, శ్రీకృష్ణదేశి కేంద్రులవారు రచించిన ఈ కందపద్యములు, ఏకందపద్యము యొక్క రసానుభూతి ఆకందపద్యముదే. అన్నిపద్యములు భిన్న భిన్నరుచులు గలదై, అన్ని పద్యములు గ్రహించదగినవే కాని, ఒక్కటియును విడువవలసినదిలేదు. అని "మామిడిండ్లరస రుచినిమించిన రుచి గలిగినవి ఈపద్యములు" అని పైపద్యములో చెప్పియున్నారు.

**కం॥ నేఛందముజదివెరుగను। నాచందంబిదియుగురుని నమ్మిర చిస్తిన్। యీచందపు పద్యములను। చూచందరు నగకదిద్దురుడీ సుకవుల్॥ 4**

భావము :- ఓసుకవులారా! నేనుఛందశ్శాస్త్రముజదివి యెరుగను. నాగురుమూర్తిని నమ్మి వారుపల్కించిన విధముగా రచించినాను. ఇది నావిధానము. యీ విధానముగల యీపద్యములు చూచి తప్పులున్నచో నవ్వక దిద్దవలయును.

**కం॥ కథగాదు జననమరణ । వ్యధమానుటకై రచిస్తి వరకవులారా। మథియించి చూచి దిద్దుడి। పథమేమాత్రంబుతప్పి పారకయుండన్॥ 5**

**భావము**:- ఓ శ్రేష్ఠమైన కవులారా! యిది కథ గాదు. జననమరణ వ్యధ బాపుటకై యీ గ్రంథము రచించితిని. దీనిని చక్కగా విచారించి, పరిశోధించి, తప్పులున్నయడల నాభావము (మార్గము) నకు విరోధము కలిగించకుండగ దిద్దుడు.

**కం॥ తక్కువ పాండిత్యముచే । నిక్కేపండితులు మెచ్చనేరరు వీటిన్। ఎక్కువ పాండిత్యము గల । చక్కని పండితులు మెచ్చి పరెనన్నట్లున్॥ 6**

**భావము** :- ఎక్కువ పాండిత్యముగల పండితులు దీనిని చదివిమెచ్చుకొని అంగీకించినట్లుగా, తక్కువ పాండిత్యము గల్గి అహంకరించేవారు దీనిని మెచ్చుకొనరు.

**విశేషభావము** :- దీనికి సమభావము 275 వ పద్యము. "చందురుడు దయంబందిన సింధువుచెలరేగినట్లు". అనుపద్యభావమును సరిచూచు కొనవలయును ఎక్కువ పాండిత్యము అనగా సమస్త శాస్త్రాదులు చదివి

అహంకారములేనివాడు అనిఅర్థము. అట్టివాడుపరిపూర్ణబోధను గ్రహించి స్థితిబొందగలడు. కాని తక్కువ పాండిత్యముచే సమస్తముతనకు తెలుసునని అహంకరించేవానికి దీనిభావము తెలియదు. కనుక సాంఖ్యతారక, అమనస్క, మహావాక్యవిచారణతోసహా, సమస్త ఆధ్యాత్మిక శాస్త్రము తెలిసుకొని "నేను" అనుభావము విడచి అంతా ఆబ్రహ్మమే అనుస్థితికి వచ్చిన తరువాత, అట్టివానికి పరిపూర్ణబోధ నేర్పుచే చెప్పినచో ఆ బ్రహ్మమే నేను అనేజ్ఞానము రహితమైపోగలదు. అని ఈపద్యభావము. అందుచే పరిపూర్ణభోధకు ఏరకమైన ఆధ్యాత్మిక శాస్త్ర భావములు పనికిరావనుట, విచారణలేనివారిమాట. అట్టి వారివలనే ప్రస్తుతము ఈసాంప్రదాయమునకు గ్రహణము పట్టినది.

**కం॥ సూరిజనులెఱయీ గ్రంథపు । సారముగనువారు గానిసంసార మహా । ఘోరవారాసిజేరిన । వారలుదీన్నిజూచివచియింపుదురే ॥7**

**భావము :-** పాండిత్యము గల్గిన సత్పురుషులె యీగ్రంధముయొక్క భావవిశేష మును గ్రహించగలరు గాని, జగత్సంసారమనెడు ఘోరసముద్రములో కొట్టుకొను పోవువారలు, దీన్నిజూచి వారికి అర్థముకాని కారణముచే ఏమాత్రము మెచ్చుకొన కపోవుదురు.

పైపద్యవిశేషభావమె దీనికిని అన్వయము.

**కం॥ గొప్పప్రతిష్ఠకు మిక్కిలి । తిప్పలబడున్నతతికెపుడుదీరదువినవీ । యొప్పులకుప్పగు బోధను । తప్పకనామాట నమ్మదగు తప్పనకన్ ॥ 8**

**భావము:-** లేనిఆడంబరములు, గొప్పత్రిష్ఠలు, కీర్తి గురించి, నానాయాతనలుపడే నరసమూహమునకు ఈగొప్పదైన బోధవినుటకు సమయముకుదరదు. నేను చెప్పిన యీమాట తప్పనక నమ్మతగ

**విశేషభావము :-** కీర్తికోరుకొనే వారు, కీర్తిని సంపాదించుకొనుటకు జనులతో అనేక విషయములతో తగుల్కొని, అహంకారభావము కల్గియుందురు. అహం కారులకు ఈగ్రంధభావము అబ్బదు. వారికి యీగ్రంధము చూచుటకు తీరిక లేకుండగ, ప్రజలయొక్క పనులకే వారిసమయము సరిపోక బాధపడు చుందురు. కనుక అట్టి కీర్తికాములు ఈబోధకు పనికిరారని భావము.

**కం॥ మెప్పైన బోధగలమా । యప్పలుతప్పుంటె దిద్దుదదినాకిష్టం । బిప్పగిదికందములనే । జెప్పితియీకవితజూచిశిడిముడిపడకన్ ॥ 9**

**భావము :-** గొప్పదైన యీబోధగలమా తండ్రులు, యిందులో తప్పులున్నచో దిద్దుడు. అదినాకిష్టమే. యీవిధముగా యీకందపద్యములనుజెప్పితిని. యీకవితను జూచి కోపగించక తప్పులుంటెదిద్దుడు.

**విశేషభావము :-** ఈపద్యములో "మెప్పైనబోధగలమాయప్పలనే" దిద్దమనిరి. అనగా గొప్పదైన పరిపూర్ణబోధతెలిసిన పెద్దలు శ్రేష్ఠులను మాత్రమే ఈ కవిత్వములో తప్పులున్నచో దిద్దమని. అంతేకాని ఎవరు పడితే వారు దిద్దుటకు వీలులేదు. ఎందుచేతనగా శాస్త్రమరాంద, పరిపూర్ణబోధ తెలియనివారు తప్పులు దిద్దుటకు అర్హులుకారు. కనుకనే "అప్పలు" అన్నపదప్రయోగము చేసిరి అప్ప అనగా ద్రవిడభాషలో శ్రేష్ఠవాచకప్రయోగము మరియు తండ్రి అనికూడ అర్థము కలదు. కనుక "మెప్పైన బోధగల మాయప్పలు తప్పులుంటె దిద్దుడు అదినాకిష్టమే". అన్నారు. (అప్పలు=తండ్రులు, శ్రేష్ఠులు)

**కం॥ ఒకసారియైనవినకన్। వికవికనవ్వేటికుకవివేత్తల్లారా। ప్రకటించక మీశౌర్యం। బికదాచుటె మీకు మాకు హితవైయొప్పున్ ॥ 10**

**భావము:-** ఈ పద్యములను ఒక్కసారి యైనను వినక, దీన్ని గూర్చి చులకనగా చూచే కుకవివేత్తల్లారా! మీ విద్యా శౌర్యము ప్రకటించకుండగ మౌనము వహించుటయె మీకు మాకు మంచిదగును.

**విశేషభావము :-** దీనిభావము సరిగా గుర్తించని చిన్నపండితులను కృష్ణప్రభువు ఈపద్యములో హెచ్చరించినారు. ఈగ్రంథమును చులకనగా చూడవద్దనియు, సామాన్యులకు తెలియబడేదికాదనియు, కనుక సామాన్యజనులు, సాధారణ పండితులైనవారు ఈ గ్రంథమును తక్కువ భావముతో విమర్శించవద్దనియు, ఆలా తక్కువగా అంచనావేసి తెలియకవిమర్శించే వార్కి తగిన విధముగా సమాధానముచెప్పి, వారివాదనఖండించగలమనియు, కనుక అట్టివారు దీన్ని గురించి విమర్శించక ఊరకుండుటయే మేలనియు, ఈపద్యరూపముగా హెచ్చరించినారు.

**కం॥ స్వచ్ఛాన్వయ గుచ్ఛము అని। పృచ్ఛయొనర్చెదరు కవులు పృధుయశులారా। యిచ్ఛజనించినజదువుడి। యచ్చాపద్యంబులివ్వి యూసాంతముగాన్ ॥ 11**

**భావము :-** ఓ మంచికీర్తివంతులారా! మంచిపండితులు దీన్ని స్వచ్ఛమైన పుష్పగుచ్ఛములని (దండలు) దీన్ని గూర్చి తెలుసుకొనుటకై ప్రశ్నచేయు చుందురు. కనుక మీకు కూడ కోరికపుట్టినచో, యివి చాలమంచిపద్యములు మొదటినుండి చివరవరకు చక్కగా చదువుడు.

**కం॥ తక్కినబోధలవలెనిది। చిక్కులు గల బోధగాదుచేట్టదగున్। మక్కువ తోమీమునుపటి। చిక్కులబోధలను చూర్ణజెక్కిముదమునన్ ॥ 12**

**భావము :-** తక్కినబోధలవలె యీబోధచిక్కులతోకూడినదిగాదు. కనుక మీకుతెలిసిన మునుపటి చిక్కులబోధలను విడచిపెట్టి సంతోషముతో ఆసక్తితో యీబోధను చేపట్టదగును.

**విశేషభావము :-** ఇతరమైన సమస్త బోధలు అనేక ప్రయాసలతో కూడినవి. మరియు వాదప్రతివాదములు అనగా పూర్వపక్షము. సిద్ధాంతములతో కూడి అనేక చిక్కులు గలవిగా ఉన్నవి. సమస్తము బ్రహ్మమే, బ్రహ్మైవేదసర్వం" అని ఒకసారి, యీ సమస్తము అనాత్మ. లేనిదే ఆభాసముగాకనిపించుచున్నదని మరొకచోట, యీవిధముగా ఏది బ్రహ్మమో, ఏదికాదో ఇదమిద్ధముగా తెలియ బడుటలేదు. బంగారము నుండి తయారైన సమస్త ఆభరణములు బంగారమునకు భిన్నము కాదు. కాని బ్రహ్మమునుండి ఏర్పడిన యీసమస్త జగత్తు బ్రహ్మముకాదు. ఇది అనాత్మ. కనుక బ్రహ్మముమాత్రమేశాశ్వతమియు, ఈజగత్తు అశాశ్వతమైనది క్షణికమైనది అనిచెప్పుచున్నారు. కనుక ఇట్టి చిక్కులతోకూడినవే అన్నిబోధలు. కాని ఈపరిపూర్ణబోధలో అట్టి చిక్కులుఏమిలేవు. బ్రహ్మము - జగత్తు అంతా ఉన్నదన్నాలేదన్నా ఫరవాలేదు. ఈతెలుసుకొనే "నేను" లేనిది అనిగ్రహించితాను లేకపోవడమేసరి, అనిచెప్పిన తిన్ననైన బోధ కనుక అందరు దీన్ని ఆసక్తితో వినదగును. అనిభావము.

**కం॥ సకలకార్యప్రయత్నజ । నకమగు వస్తువునుబట్టి నలచివైచుదీ న్నొకసారి వినినచదివిన । నికనింతకుయెక్కువైనవే బోధలయా ॥13**

**భావము :-** దీన్ని ఒక్కసారి చదివిన, వినినను, సమస్త సృష్టి కార్యక్రమములకు మూలమైన దేదిగలదో, దాన్నిలేకుండా చేయును. కనుక యింతకన్న యెక్కువైన బోధ ఏమిగలదు? అనగా మిగిలిన బోధలన్నియు దీనికన్న క్రిందబోధలేయని భావము.

**విశేషభావము :-** "యతో వా ఇమానిభూతానిజాయంతే" అన్నశృతిరీత్యా ఈ సమస్త సృష్టికి మూలమైనదే బ్రహ్మము. అది మాయతో కూడినదేకాని ఏక వస్తువుకాదని, యీబోధనిర్ణయముచేసి, మాయతోకూడినది మాయయేకాని బ్రహ్మముకాదని, అదికలవలె స్వతస్సిద్ధముగాలేనిదే తోచినదనియు, కనుక అదిలేనిదని నిర్ణయించును. కనుక దీనికన్న ఎక్కువ బోధమరేదియులేదని నిర్ణయము. మరియుతానే లేకపోవును కనుక, ఈబోధకన్న ఎక్కువైన బోధమరేదియు లేదను మాట నిశ్చయము.

**కం॥ కేరుచుమిమువినుమనినే । సారెకుమీచుట్టు దిరిగి సన్నుతిజేసే ।**
**తోరపుబోధకు మూలం । బైరెవ్వరొవార్నిదలచివరుసనుతింతున్ ॥ 14**

భావము :- పదేపదే మీచుట్టుదిరిగి ఈబోధచాలగొప్పది అని సన్నుతిజేయుచు, మిమ్ము వినండి అని చెప్పేయీగొప్పబోధకు మూలమైన పెద్దలను వరుసగా తలంచి నమస్కరింతును. అనగా గురుపరంపరను చెప్పుకొని నమస్కరింతును అనిభావము.

**కం॥ ఈక్షితిశివరామాహ్వయు దీక్షితులకు బోధజేసి దిద్దినసామ్యా ।**
**దక్షుని శ్రీధరమూర్తిని । నిక్షేపముగా దలంచినేవినుతింతున్ ॥ 15**

**భావము :-** ఈభూమిపై (ఈబోధపీఠస్థాపనజేసిన) శివరామఅనుపేరుగల దీక్షితులకు బోధజేసిచక్కదిద్దినస్వామి, రక్షకుడు, అయిన శ్రీధరస్వామిని, చక్కగా నామనస్సునందు భావించుకొని నమస్కరింతును. (దక్షుడు-రక్షకుడు)

**కం॥ దక్షిణామూర్తియనదగు । క్షితిశివరామమహాదీక్షితులనుచున్ ।**
**స్తోత్రింతు నార్యులతవి[illegible]ల్లను దండములిడిపెట్టి ప్రేమనుతింతున్ ॥ 16**

**భావము :-** శివరామదీక్షితులని పేరుకల్గిన ఆమహానుభావుడు, ఈభూమిపై దక్షిణామూర్తి అనదగినవారని పెద్దలుభావించెదరు. అట్టి శివరాములకుప్రేమతో స్తోత్రము చేయుచు, వారికి నమస్కరించెదను.

**కం॥ ఆదీక్షితులకృపకుదా । పాదైయ్యప్పమంత్రి పఠియించెనుయీ ।**
**మేదిని తద్బోధనతని । పాదములకు నతులొనర్చి ప్రార్థింతుమదిన్ ॥ 17**

**భావము:-** ఆశివరామదీక్షితుల కృపకు పాత్రులై, కంబాలూరి అప్పయ్య మంత్రి యీబోధవినితెలుసుకొనెను. అట్టిఅప్పయ్యమంత్రి వర్యులపాదములకు నమస్కరించి ప్రార్థించెదను. (నతి=నమస్కారము)

**కం॥ నతిజేసెదనప్పయ్యన్ । గతికైకొల్చితడుబోధగనెనోనేనా ।**
**ప్రతిలేనిపరశురామ । క్షితిసురవంశమణియైన సీతాపతికిన్ ॥ 18**

**భావము :-** అప్పయమంత్రిని, తనకు తిరిగి జన్మించని గతికొరకై ఆశ్రయించి యీబోధగైకొనిన, బ్రాహ్మణవంశమందు పుట్టిన ప్రతిలేని పరశురామసీతాపతికి నమస్కరించెదను.

**కం॥ బుచ్చి వెంకమ్మతల్లిని । చెచ్చెరపెండ్ల్యాడికాశిసేతువుదాకన్ ।**
**విచ్చలవిడియెగజల్లెను । సచ్చరితుల కచలబోధసాకల్యముగాన్ ॥ 19**

**భావము :-** ఆపరశురామసీతాపతి, బుచ్చి వెంకమ్మ అనుసాధ్వీమణిని పెండ్లి జేసుకొని, కాశీలగాయతు కన్యాకుమారి అగ్రమువరకు. (అనగాదేశమంతట) ఈఅచలబోధను మంచి లక్షణములు గల వారికి చెప్పి గొప్పప్రచారము జేసెను

**కం॥ ఆసీతాపతినతివి । శ్వాసమునంగొల్చికొంటిసర్వేశ్వరుడం ।**
**చీసద్బోధనుతేటగ । జేసితినివి సకలజనులు చెవియొగ్గివినన్ ॥ 20**

**భావము :-** ఆపరశురామసీతాపతిని, అతినమ్మికతో సర్వేశ్వరడను తలంపుతో భక్తితో సేవజేసి, ఈసద్బోధను గ్రహించితిని. ఆ సద్బోధను అందరకు తెలిసి చెవి యొగ్గి వినునట్లుగా యీ పద్యరూపముగా జేసితిని.

**కం॥ భాగవత వంశభవుడను । భాగవతోత్తములపాదపద్మంబు లకున్ । సాగిలిమ్రొక్కేవాడను । బాగుగ ననుజనులు కృష్ణభట్టందు రిలన్ ॥ 21**

**భావము :-** నేను (గ్రంథకర్త) భాగవత అనుయింటిపేరుగల వంశమందు పుట్టినవాడను. భాగవతోత్తముల పాదపద్మములకు సాష్టాంగనమస్కారము చేసేవాడను. నన్నుజనులందరు కృష్ణభట్టు అందురు.

**విశేషభావము :-** భాగవతోత్తములు అనగా భ-భక్తి, గ-జ్ఞానము, వ-వైరాగ్యము, త-తత్వము, ము-ముక్షత్వము. అనగా భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వము, ముక్షుత్వములు కల్గినవారిలో ఉత్తములైనవారు. (అనగా పరిపూర్ణబోధస్థులు అనిభావము) వారికి సాష్టాంగనమస్కారముచేసే వాడను అనిచెప్పుకొనుట కవి యొక్క అనహంకారత్వమును చెప్పుచున్నది. కృష్ణ భట్టు అందురు, అని తన నామమును జనులు అంటారు అనిచెప్పినారు. తనపేరు, గురువుయొక్కపేరు,

భర్తపేరు, తననోటితో చెప్పరాదనిశాస్త్రము. కనుక తనను జనులు "కృష్ణభట్టు' అందురు అని శాస్త్రసమ్మతముగా తనపేరును ఈ పద్యములో చెప్పుకొనుట గ్రంథకర్తయొక్క శాస్త్రవిజ్ఞతకు ఉదాహరణ.

**కం॥ ధారుణ్యత్ర్యనసూయలు ।వీరేయనిజనులుబొగడవెలసినవారల్। నారాయణ జానకియను । వారిరువురుగన్నయట్టివాడను సుమీ్మ ॥ 22**

**భావము :-** ఈభూమీ్మద అత్రిఅనసూయలంతటివారని జనులు బొగడిన నారాయణ, జానకీఅనుదంపతులు కన్నవాడను. (పుట్టినవాడను)

**కం॥ ఆనేనొనర్చినాడను । యీనిజకందముల గ్రంథమెప్పుడుదీనన్। వీనుల వినికన్నులగని । రేనట్టిజనంబుబల్కునేనేననుచున్ ॥ 23**

**భావము:-** ఆపైన జెప్పిన కృష్ణభట్టు అను నేను ఈ శాశ్వతమైన కందపద్యములతో కూడిన గ్రంథము జేసితిని. దీనిని విని కన్నులతో జూచినట్టిజనులు నేనే బ్రహ్మను అని పలుకగలరా ?

**విశేషభావము :-** ఆనేనొనర్చినాడను - అనగా ఆ పైన జెప్పిన కృష్ణభట్టు అనుపేరుగల నేను రచించితిని అని ఒకఅర్థము. ఇట్టిగొప్పభావముతో కూడిన పద్యములు మరొకరికి సాధ్యపడలేదు. ఇట్టిరచనమరెన్నడు ఉండదనుట నిర్వివాదము. గొప్పభావగర్భితము. పైకి బహుతేలిక అయినకవిత్వము. పరిపూర్ణబోధను ప్రకటించుటలో ఈపద్యములకు సాటియైన కవిత్వమేదియును లేదు. నేను రచించితిని అనుటలో "అహం" కనిపించుచున్నది. మరియు నేను అనునది జీవుడు. దీనిచే చెప్పబడినది భ్రమ ప్రమాదములతో కూడియుండును. అట్టి భ్రమప్రమాదములు లేనిది, నేను చేరచించనిది, కేవలము వేదము మాత్రమే. అందుకేవేదము ఎవ్వరూ రచించలేదు. బ్రహ్మముఖమునుండే వెలువడినదనుట ఆర్యోక్తి. ఆ బ్రహ్మమే "నేను" ఆనేను, అనగా నిర్మలుడై, దోషరహితుడైన ఆబ్రహ్మ, గురుస్థానము నందున్న నేను రచించినాడను అని అర్థము చెప్పుకోవలెను. కనుక ఈపద్యములలోని భావము వేదమువలె భ్రమ ప్రమాద రహితమైనది. అని నిస్సంశయముగ చెప్పవచ్చును. 2. యీ నిజ కందములు. అనగా నిజ అనుపదమునకు శాశ్వతమైన అని అర్థము. శాశ్వతమైనది ఒక్క పరిపూర్ణము మాత్రమే. అట్టి పరిపూర్ణమును గురించి తెలియపర్చిన కందపద్యములు కనుక "నిజకందములు" అని పదప్రయోగములుచేసినారు.

3. వీనులవిని కన్నులగనిరే - అనగా ఈ పద్యభావమును (బోధను) గురు ముఖతాచెవులార వినిమరియు అందుజెప్పబడిన పరమార్ధమును సత్యమును కన్నులతో చూచినవారు అనగా అపరోక్షజ్ఞానులైనవారు అనిచెప్పవలెను. అనగా ఎరుకనువిడచుటయే పరిపూర్ణమును ప్రత్యక్షముగా చూచుట అనిచెప్పవలెను. అట్టివారు 4. "నేనే ననుచున్ బల్కు," నేనేబ్రహ్మ "అహంబ్రహ్మాస్మి" అని పల్క గలరా? నేనులేనివారుకనుక నేనే బ్రహ్మను అని అనరు అనిభావము.

**కం॥ చిల్లరబోధలనన్నిటి। నొల్లరునిజ బోధ దెలసి యొప్పటిపెద్దల్।**
**పొల్లనియందుకెనేనవి। వల్లక యీ బోధయందెవర్తిస్తిజుమీ ॥ 24**

**భావము:-** పరిపూర్ణబోధ దెలసి ఆ రూఢులైన పెద్దలు, చిల్లర బోధలైన మిగిలిన అన్ని బోధలు వానియందు సారమెంత మాత్రము లేదని వాటిని అంగీకరింపరు. కనుకనే నేను వాటిని విడచి యీ బోధయందె వర్తించితిని.

**కం॥ గురుశిష్యుల మాటలవలె। పరిపూర్ణ బోధకంద పద్యఫణితిచే।**
**విరచిస్తి వినుడి ముందర। జరిగే ముచ్చట్లుమీకు సహ్యంబైనన్ ॥ 25**

**భావము :-** పరిపూర్ణబోధను గరుశిష్యులసంవాదమువలె కందపద్యరీతిగా రచించితిని. ముందుజెప్పేబోధమీకు ఇష్టతయైనచో వినుడు. (ఫణితి=రీతిగా)

**కం॥ సకలనిగమాగమాది। ప్రకరమహానారికేళఫలసారముదీ। సాక**
**గ్రంధముజేసితిలో । కికజనులోకవేళగొన్నకీడుదొలంగున్ ॥ 26**

**భావము:-** సమస్తవేద, శాస్త్రములుమొదలైన మహాగ్రంధముల యొక్క సారము దీసి ఈగ్రంధముజేసితిని. జనన మరణములతోకూడియున్న సామాన్యజనులు వారి పుణ్యవిశేషసంస్కారబలముచే ఈగ్రంధమును చూచినచో వారి కున్నకీడు పూర్తిగాతొలగిపోగలదు.

**విశేషభావము :-** కొబ్బరికాయ యొక్కలోపలి ముక్కనుతీసుకొనుటచాల కష్టమైనపని. కాయనుచెట్టునుండి కోయుటేకష్టము. ఆకాయను పైడొక్కవలచి పెంకు బద్దలుకొట్టి అందలి కొబ్బరినిపెంకునుండి బహునేర్పుగా విడదీయగల్గిన వారే ఆకొబ్బరిని అనుభవించగలరు. అట్లే వేదములు, శాస్త్రములు మొదలగు మహాగ్రంధములను చదివి వాటియొక్క భావమును గ్రహించుటకూడ కొబ్బరి కాయనుండి కొబ్బరినివేరుచేసి అనుభవించుటవలె బహు దుస్సాధ్యము. అని ఆశాస్త్రములసారము "నారికేళఫలసారము" అని ఈపద్యములో వర్ణించినారు.

అట్టిసారమును తీసి ఒకగ్రంథముగా చేసితిని అనిచెప్పినారు. దీనిని లౌకిక జనులు అనగా ఏరకమైన సాధనలు శాస్త్రజ్ఞానము వగైరా ఏమిలేని సామాన్య జనులుకూడ, ఒకకేళగొన్న అనగావారిపుణ్యకర్మసంస్కారముచే అనిఅర్ధము చెప్పవలెను. అట్టిసంస్కారముచేగాని, పూర్ణబోధదొరకదని ..ర్యోక్తి కలదు కనుక, "ఒకవేళగొన్న" అనుపదమునకు" సంస్కారబలముచే లభ్యమైనచో" అని అర్థము చెప్పవలెను. అనగా పూర్ణబోధశాస్త్రజ్ఞానమహాపాండిత్యముచేత గాకుండాగ, పూర్వజన్మ పుణ్యకర్మ సంస్కారబలముచే మాత్రమే లభ్యమగును. అట్లు లభించినచో వారికీడుదొలగును. అనగా వారికి అనాదిసిద్దముగా ఉన్న జనన మరణములచక్రభమణము తొలగును అనిభావము.

**కం॥ తనకు దావచ్చి సద్బో । ధనుదెల్పుమటంచుమ్రొక్కు తన శిష్యునకున్ । వినజెప్పదొణగెనొకగురు। డను మానించకనువాని కతిదయతోడన్ ॥ 27**

**భావము:-** తనంతతానుగా సద్గురుమూర్తి వద్దకు వచ్చి, నమస్కారపూర్వకముగా ఈబోధను తెలియపరచమని కోరిన శిష్యునకు సద్గురుమూర్తి అట్టి సచ్ఛిష్యుని యందు అనుమానములేకుండగ అతిదయతో ఈబోధను విన జెప్పనారంభించెను.

**విశేషభావము:-** "తనకు తావచ్చి" శిష్యుడు తన పుణ్యవిశేషముచే ఇట్టిసద్బోధను తెలుసుకొనవలెనను ఇచ్ఛజనించి సద్గురుమూర్తి వద్దకేగి ఆశ్రయించవలెను కాని గురువే శిష్యునివెతకి పట్టుకొని, వానికి కోరిక ఆపేక్ష లేకపోయినను ఈబోధ తెలుసుకోమని చెప్పుట తగదు. అనిపద్యభావము.

**కం॥ పరమపురుషుడును లేనిది । యెరుకయు గల దరసి లేని యెరుకనువిడుమం । చెరిగించినశిష్యుడు గురు । వరునడిగెను మ్రొక్కిరెంటివర్తనలపుడున్ ॥ 28**

**భావము :-** శిష్యా! పరమ పురుషుడును, లేని యెరుకయు గలవు. ఈరెంటిని చక్కగావిచారించి, లేని యెరుకనువిడువుము. అని గురుమూర్తిచెప్పగా గురు మూర్తికి నమస్కరించి, ఆరెంటిని గూర్చి వివరముగా చెప్పవలసినదిగా శిష్యుడు అడిగెను.

**విశేషార్థము:-** ఈపద్యములోను ఇంకాకొన్ని పద్యములలోను పరమపురుషుడు అనుపదము ఉపయోగించిరి. ఇచ్చటపరమపురుషుడు అనగాపరిపూర్ణము అని

అర్థము చెప్పవలెను. కాని పురుషోత్తముడు, పరబ్రహ్మము అనుభావము చెప్పరాదు. అట్లుచెప్పినచో అద్వైతభావము వచ్చును. ఇదికవిహృదయముకాదు. గ్రంథముయొక్క భావముకూడ కానేరదు.

**కం॥ పరమపురుషుడనెవ్వడో। యెరుకెట్టిదో తెల్పియవలయెరు కనువిడచే। తెరువెట్టిదోయిన్నియునా। కెరిగించుమటంచు బల్కనిట్ల నెగురుడున్ ॥ 29**

**భావము:-** గురువర్యా! పరమపురుషుడనగా ఎవరో, యెరుకనగానేదో, సవివరముగా తెలియపర్చి, ఆతరువాత యెరుకనువిడచే విధానముఏదో, ఇవన్నియు నాకెరిగించుముస్వామీ అని శిష్యుడు బల్కెను. అంతగురుడు ఈవిధముగా చెప్పుచున్నాడు.

**కం॥ నేపెద్దలచేవిన్నది। నీపైదయబుట్టి చెప్పనేబూనితినీ। కాపద్ధతి నంతయువిని। యేపద్ధతికాశపడకు మిదివిడువకుమీ ॥ 30**

**భావము :-** శిష్యా! నీయందు నాకు దయపుట్టి, నేను పెద్దలచే విన్నదంతయు నీకు చెప్పపూనుచున్నాను. ఆబోధఅంతయు విని మరియేయితరబోధలకు ఆశపడకుము. ఈబోధ విడచిపెట్టకుము.

**కం॥ కదలడట పరమపురుషుడు। కదలికమాయయట యిట్టి కదలిక కేదో। మొదలన పెద్దలు బల్కిరి। కదలనిదేకలదు లేదు కదలిక యనుచున్ ॥ 31**

**భావము :-** శిష్యా పరమపురుషుడు కదలడు అనగా చైతన్యము లేనిది. కదిలే సమస్తము మాయయనియు, ఈకదిలే దానికి మూలమేమియు లేదని పెద్దలు చెప్పిరి. మరియు చైతన్యరహితమైన దే శాశ్వతమైఉన్నదనియు, కదిలే మాయలేనిది అనియుచెప్పిరి.

**విశేషభావము:-** పరమపురుషుడు అనగా పరిపూర్ణము. దీనియందు కదలికలేదు. సర్వేసర్వత్రానిండి నిబిడీకృతమై, ములుగ్రుచ్చుటకు కూడ వెల్తిలేనిదైయున్నందున, కదలుటకుచోటులేనిది కనుక, కదలదు. అంతేకాదు. ఇతరమును కదిలింప జేయుచైతన్యము సత్తా కూడా లేనిది. ఇది అనాది. స్వతశ్సిద్ధము, ఇదియే శాశ్వత మైనది. కదిలేది అనగా తాను కదులునది మరియు ఇతరమును కదిలింపజేయు సత్తా కలిగినది. అదే మాయ లేక ఎరుక. ఇది మూలములేకుండగా పరిపూర్ణములో

తోచినది. పరిపూర్ణము దీనికి మూలముకాదు. కనుక ఈపద్యములో "కదలిక కేదో, మొదలు" అగా కదలికకుమూలము ఎదో? అనగా లేదు అని భావము చెప్పవలెను. కదిలేది అనగా వికారము గలది. మార్పు జెందు స్వభావము గలది అగును. కనుక అట్టిది నశించి తీరును. కనుకనే "కదలనిదేకలదు, లేదు కదలిక యెపుడున్ "కదలని పరిపూర్ణమె శాశ్వతమైనది. కదిలే మాయలేనిది అనిభావము.

**కం॥ పురుగుక్కుస్తంభంబును । కొరికినదనవీతిహోత్రుగొని [illegible]ంగె చెదల్ । ధరననినను మాయాపతి । హరిని చీకాకుగయొ[illegible]న నవిన దగునే ॥ 32**

**భావము :-** పురుగు ఉక్కుస్తంభమును దొలచివైచినదనినను, చెదుపురుగులు అగ్నిహోత్రునిపట్టితినివేసినదనినను, మాయ పరిపూర్ణమునకు వికారము పుట్టించినదనిన, ఈభూమీమ్మద ఇవన్నియు నమ్మదగినమాటలు కావుకదా !

**విశేషభావము :-** బ్రహ్మము నిర్వికారము. అందున్నమాయవలన బ్రహ్మవికార భూతుడై సృష్టికార్యక్రమములు జరుగుచున్నవి,అని ఇతరబోధలలో చెప్పబడినవి. కానిబ్రహ్మనిర్వికారుడు. మాయలేనిది. అట్టి మాయ శాశ్వతమైన వికారరహిత మైన బ్రహ్మను వికారపరచ గలదా? అనగా బ్రహ్మ నిర్వికారుడుకాదు, వికార గర్భితుడే. కనుక మాయ, బ్రహ్మను వికారపరచగలిగినది. కాని పరిపూర్ణమగు బ్రహ్మము కేవలనిర్వికారమైనది. దీనిని ఏమాయ, ఎరుక ఎట్టివికారమును కల్పింపనేరవు. కనుక పరిపూర్ణమే పరబ్రహ్మము "వికారరహితమేవ ఈశ్వరః" అనియన్నారు. కనుక పరిపూర్ణమే పరబ్రహ్మమని నిర్ణయము.

**కం॥ [illegible]యందుదోచు విశ్వము । నరస్వప్నము వంటిదనిరినానా జనముల్ । సురస్వప్నము వంటిదియనె । స్థిరమతి శివరామనా[illegible] దీక్షితులుధరన్ ॥ 33**

**భావము :-** శిష్యా! బ్రహ్మమునందుతోచబడిన జగత్తు మానవులకుస్వప్నము ఏలాకలిగినదో ఆలాలేకనే జగత్తుతోచినది అని అనేకమంది అనేకగ్రంథములలో వ్రాసిరి. కాని శ్రీశివరామదీక్షితులు జగత్తు దేవతల స్వప్నమువలె తోచినదని చెప్పిరి.

**విశేషభావము :-** నరస్వప్నము. అనగా నరుడు ఉన్నాడు అతనికి కలలేనిదే తోచబడినది. ఈకలకుఆధారము నరుడు. కనుక జగత్తు నరులకు దోచిన

కలకంటిది, అనగా జగత్తులేదు కాని జగత్తునకు ఆధారము హరి అనగా బ్రహ్మము. అనిఅర్థము. అయితే ఇక్కడ బ్రహ్మ ఆధార ఆధేయభూతమగు చున్నది. ఇది సిద్ధాంతవాక్యముకానేరదు. కనుక స్థిరమతియైన శ్రీ శివరామ దీక్షితులవారు సురస్వప్నమువంటిదనిరి. సురలు అనగాదేవతలు. వీరికి రెప్పపాటు లేదు. అనగా నిద్ర అవస్థలేదు. వారికి స్వప్నమెట్లుకలుగును. అనగా అసలు లేదు అని అర్థము. కనుక జగత్తు అసలు పుట్టనేలేదు అని దీక్షితులవారి అభిప్రాయమని భావము.

**కం॥ సురలందు దోచుస్వప్నము। హరియందువదోచు విశ్వము సురల హరిన్। యెరిగివ కల విశ్వముతా। మరుగవెతమతేమి వెరికి యలిబిడియమునన్ ।** 34

**భావము:-** శిష్యా! దేవతల యందు దోచిన స్వప్నము, హరియందుదోచినవిశ్వము, ఆదేవతలను, హరిని తెలుసుకొనినచో స్వప్నము, విశ్వమురెండును తాములేమని తెలుసుకొని తాములేకుండా పోవునుగదా !

**విశేషభావము:-** గురుముఖతా పరిపూర్ణమును గుర్తెరిగినచో దేవతలు, బ్రహ్మము, అందుదోచబడిన విశ్వము సమస్తము కలవలె, లేనిదేయని తెలియబడి పరిపూర్ణమె శాశ్వతమైనదని, మిగిలిన సమస్తము లేనిదేయనిలేకపోవుచున్నది. అనిభావము.

**కం॥ కదలనిదికదలదెన్నడు । కదలికగలదనిన దానికగుపడదు మొదల్ । కదలికలేదదిగావున । యిదిపరమరహస్యమెవ్వరెరుగరు దీనిన్ ॥** 35

**భావము :-** శిష్యా ! చలించనిది ఎన్నడు చలించదు. చలనముకలిగిన దానికి మూలము ఏదియులేదు. చలించుట, చలింపజేయుట దానికి లేదు కనుక దీనిని ఎవ్వరు ఎరుగరు. పరమరహస్యమైయున్నది.

**విశేషభావము :-** సాధారణముగా ఏవస్తువునైనను పరీక్షించినచో, ఆవస్తువు దేనివలన తయారైనదో, ఏయేగుణవిశేషములు కలిగియున్నదో, ఈవస్తువునుండి ఏవేవి ఉత్పన్నమగునో తెలిసికొనుట శాస్త్రలక్షణము. అట్లే, ఈదృశ్యమానజగత్తుకు ఆధారమేది? ఇందలిచైతన్యమెట్టిది? దీనికి మూలమైన పదార్థమెట్టి లక్షణము గలది? అనివిచారించిన ఆధ్యాత్మికశాస్త్రకారులు, జగత్తు చైతన్య రహితమైన దనియు, దీనికి ఆధారమైన బ్రహ్మము నిర్వికారము, చైతన్య గర్భితము

అనియు, ఆధారమును, ఆధేయమును పరిశీలించి ఆధారమైన బ్రహ్మము శాశ్వతమైనదని ధృవపరిచిరి. కాని ఆధారాధేయములు రెండును ఒక్కటేగాని రెండుకాదు. ఒక్కదానివల్ల రెండోది ఆలంబనమై ఏర్పడుచున్నది. కనుక రెండును ఒక్కటేగాని రెండుకాదు. రెంటివస్తువులందు చైతన్యము (కదలిక) చేతన, అచేతన అనురెండురూపములు కలిగి యున్నదే. బ్రహ్మము చైతన్య గర్భితమై అచేతనరూపముగా ఉన్నది. కానిజగత్తును చైతన్యవంతముచేయుటచే చేతనరూమైయున్నది. అట్లే జగత్తు స్వతస్సిద్ధముగా కదిలే లక్షములేనిది కనుక అచేతనము. కానికదిపితే కదిలే లక్షణము గలదగుటచే చేతనవస్తువు. కనుక బ్రహ్మము, జగత్తులు రెండును చేతన అచేతనరూపములే. ఈరెంటివర్కే విచారించిరికాని, వీటికి అతీతమైన పరిపూర్ణము జగత్తునకుగాని బ్రహ్మమునకు గాని ఆధారముకాదు. మూలముకాదు. చేతనముకాదు. అచేతనముకాదు. కనుక దీనిని ఎవ్వరు తెలిసికొనలేరు. కనుక ఇది పరమరహస్యమైనది. ఒక్క గురుమూర్తి ద్వారా మాత్రమే అట్టి సంస్కారులకు తెలియబడును.

**కం॥ కదలనిది కదిలెనన్నను । ముదమునవినదగదువారిముచ్చటనె పుడున్ । కదిలిన కదలనిదెట్లగు । నదిగావున కదలదనుచునమ్మదగు జుమీ ॥** 36

**భావము:-** శిష్యా! కదలనిబ్రహ్మము చైతన్యము కలిగినదని అనేవారి మాటలను ఎప్పుడును నమ్మరాదు. చైతన్యముకలిగిన వస్తువుకదలని దెట్లగును? కావున కదలనిది ఎన్నడూ కదలదు. అదే పరిపూర్ణము అని తెలుసుకొనుము.

**విశేషభావము :-** చలించని బ్రహ్మము నందు చైతన్యము కలదనియు, ఆ చైతన్యముచే జగత్తు ఏర్పడుచున్నదనియు, చెప్పిన మాటలు పూర్తినిజమైనదిగాదు. కదలుట, కదిలించుశక్తి రెండూ ఒక్కటే. కదలుటగాని కదిలించుశక్తిగాని ఉన్న వస్తువు, కేవల నిర్వికారము కానేరదు. కనుక శాస్త్రములో చెప్పిన బ్రహ్మము కదలకపోయినను, కదిలించు శక్తి కలిగియున్నందున, కేవల నిర్వికారము కాదు. వికార గర్భితము. కనుక అదియే బ్రహ్మము అన్న ముచ్చట వినదగినది కాదు. కావున చైతన్యమెంత మాత్రము లేని పరిపూర్ణ బ్రహ్మమే కదలనిది. శాశ్వతమైనది. కేవల నిర్వికారమైనది.

**కం॥ నేను మేనును ప్రకృతి ద్వయ । మని నిను నీమేను మృషని మానిరి నీజో । లిని పెద్దలు నీవెరుగక । నిను నీవొక కొండ నంటె నిజమామాటా ॥** 37

**భావము**:- శిష్యా! నేను, మేను ఈరెండును ప్రకృతి ద్వయములు. అందుచేతనే నీ మేనువలెనే నీవు గూడ మిధ్యయని పెద్దలు నీవే బ్రహ్మమనుట మాని వేసిరి. నీ సంగతి పూర్తిగా నీవెరుగక నేనే భూమను అని అంటె అది నిజమగునా?

**విశేషభావము** :- ప్రకృతి ద్వయములనగా ఆకలి - దప్పులు, ఆలు - మగలు ఆత్మ-అనాత్మలు, పురుష-ప్రకృతులు వలెనే నేను-మేను. ఈ రెండు ప్రకృతిలో సహజమైనవే. ప్రకృతి లక్షణము గలవే. నేను బ్రహ్మను అనియు మేను అనాత్మ మిధ్య అనియు వచింతురు. నేను లేని మేనులేదు. మేను ఉండి నేను లేకపోదు. నేను లోనే మేను గర్భితమై యున్నది. కనుక ఈ మేనుపోయినా తిరిగి నేను నుండి మేను ఉద్భవించుచున్నది. కనుక నేను - మేను రెండును ఒక్కటే కాని రెండు భిన్న లక్షణములు గలవి కావు. అన్యోన్యాశ్రయభూతములు. కనుక ఒకటి బ్రహ్మము శాశ్వతమైనది అనరాదు. ఈ విచారణ తెలిసిన మహానుభావులు నేను లేనిది అన్నారు. దాని జోలిని విడచిపెట్టిరి. ఇట్టి విచారణ తెలియనివారు నేను అనునదే భూమ (గొప్పది, పెద్దది) అన్నారు. అది అసలు లేనేలేదను విచారణ తెలియక.

ఈ పద్యమును ఈవిధముగా దండాన్వయము చేయవలెను.

నేను మేనును ప్రకృతి ద్వయమని, నిను నీమేను మృషని పెద్దలు నీ జోలిని మానిరి । నిను నీ వెరుగక, నీవొక కొండ (భూమ) నంటె నిజమా మాటా ॥ (కొండ=పెద్దది, అచలము, భూమ)

**కం॥ పేర చలమనుచుబయలని । పేరెప్పుడు లేని మనము బెట్టుట చేతన్ । పేరాయబయులు కిప్పుడు । పోరానివు నేను మృషనిపోతే జాలున్ ॥ 38**

**భావము** :- నామరూపములు ఎంత మాత్రము లేని పరిపూర్ణమునకు మనము దాని గురించి తెలుపుడు చేసుకొను నిమిత్తమై అచలము, బయలు అని వ్యవహారిక నామములు పెట్టుకొని వ్యవహరించుచున్నాము. కనుక "నేను" లేనిదని, మిధ్యయని తెలుసుకొని నీవు లేకుండా పొమ్ము.

**విశేషార్థము** :- పరిపూర్ణము నామ రూప క్రియా రహితమైనది. బుద్ధిచే కూడ తెలియరానిది. కాని దాని గురించి అన్వయ వ్యతిరేక భావములచే ఉన్నదని దానిని గుర్తించినప్పుడే "నేను" లేకపోవును. నేను లేకపోవుటే జన్మరహితము కనుక జన్మరహితమును చేయుటకై సద్గురుమూర్తి పేరులేని పరిపూర్ణమును -

పరిపూర్ణము, భూమ, బయలు, అచలము అని అనేకవిధములుగా మనకు తెలియు పర్చు నిమిత్తమై లేని పేరును పెట్టి వ్యవహరించిరి. నిజమునకు దానికే పేరు లేదు. రూపమున్న దానికే పేరు. రూపమున్నదానికే క్రియ. కనుక నామ - రూప - క్రియా రహితమైనది పరిపూర్ణమని భావము. నామరూపక్రియా సహితమైనది "నేను". దీనికి ఓం అని పేరు కలదు. సర్వస్వరూపము. సర్వక్రియాన్వితము. కనుక ఇది బ్రహ్మము కానేరదు. ద్వంద్వరూపమైనది. కనుక దీనివలన పునరావృత్తి రహితము కానేరదు.

**కం॥ పరమపురుషుడీ బయలని। గురుడెరిగించినను జూచి గొప్ప కురుచలై । యెరిగెటి నిను నేమృషనని । యెరిగరుగుము నీ వెమాయ విక బుట్టవిలన్ ॥ 39**

**భావము :-** పరబ్రహ్మమే యీ పరిపూర్ణమని గురుమూర్తి ఎరిగించగానే, అట్టి పరిపూర్ణము ఉన్నదని జూచి, సమస్తము నాలోనే యున్నదని నేను భూమననియు, అన్నిటియందు నేను ఉన్నాను కనుక అణువు కన్నా అణువుననియు ఇలా ఒకప్పుడు గొప్ప (పెద్ద)గను, మరొకప్పుడు చిన్న (కురుచ)గను అయే "నేను" మృషని, మాయయని తెలిసికొని "నేను" లేనని లేకపోయినచో పునర్జన్మము నీకు ఉండదు.

**విశేషభావము:-** "అణోరణీయాన్, మహతో మహీయాన్" పెద్దదాని కన్న పెద్దది, చిన్నదానికన్న చిన్నది. సమస్త బ్రహ్మాండములు దీనియందే ఉన్నవనుటచే పెద్దది అనియు భూమ అనియు, పిపీలికము నందు కూడ ఉన్నందువలన చిన్నదానికన్న చిన్నది అనియు అణువు అనియు "నేను" అను బ్రహ్మమును చెప్పుచున్నారు. ఒకప్పుడు ఒకలాగ, మరొకప్పుడు మరొకలాగ కనుపడునది తెలియబడునది మాయయే గాని, శాశ్వతమనరాదు. నిజమైనది శాశ్వతమైనది ఎప్పుడును ఒక్కతీరుగా ఉండవలెను. కనుక ఈ "నేను" మాయయని తెలిసి, దీనందు బ్రహ్మమనే భ్రాంతి విడచి, నేనువిడిచినచో, నేను లేకపోయిన కారణముగా పునర్జన్మకు వచ్చే "నేనే" లేకపోయినది.



**కం॥ అయమాత్మయనినరీతిగ। నయముగ బట్టబయలు నదిగో యనుటల్। అయమియమనియనుటుళ్ళ। క్కియయినన నవలసె నీదుకీడుడుగుటకై ॥ 40**

**భావము:-** శిష్యా! "అయమాత్మ బ్రహ్మ" అను మహావాక్యమును జెప్పి చూపించిన విధముగా, చక్కగ ఈ బట్టబయలును అదిగో అని చూపించుట సరియైనది కాదు. అయం ఇయం అని చెప్పేది ఉళ్లక్కి లేనిది. అయినా నీకు గుర్తింపునకై, నీవు తిరిగి పునర్జన్మకు రాకుండుటకై చెప్పి చూపింపరాని పరి పూర్ణమును అదిగో ఇదిగో అని చెప్పితిని.

**విశేషభావము :-** "అయమాత్మ బ్రహ్మ" అను మహావాక్యము. ఈ ఆత్మే బ్రహ్మమని అంతట నిండియున్నది అని చేతిచే అంతటను చూపించెదరు. అట్టి విధముగానే ఈ ఉత్తబట్టబయలు ఇదిగో అని గురుమూర్తి అంతటా ఉన్నది పరిపూర్ణము ఇదిగో అని చెప్పి చూపించిరి. అయమాత్మ బ్రహ్మను చూపించిన విధముగానే చూపించిరి. కాని పరిపూర్ణము చూసబడేదికాదు. మాటలచేత చెప్పబడేది కాదు. ఇదిగో అని నిర్దేశింపరానిది. అయినా శిష్యునికి పరిపూర్ణమే ఉన్నదని, నేనైన ఎరుక లేనిది అని దృఢముగ తెలియుటకై ఇదిగో పరిపూర్ణము. అంతటా ఉన్నది. ఈ చీకటి వెలుతురు కానిది, శబ్దరహితమైనది. మహాకాశమునకు కూడ మించి సర్వత్ర ఉన్న పరిపూర్ణము ఇదిగో. ఇది తప్ప మరేదీ లేదని ఇట్లు అనేక సూక్తులు, యుక్తులచే నిర్ణయము చేయుచున్నాడు. అట్లు నిర్ణయమైనప్పుడే నేను అను ఎరుక భ్రాంతి విడిపోవును. ఎరుక లేకపోవుటయే జన్మరహితము. ఈ జననమరణములనే కీడు తొలగుటకై చూపింపరాని పరిపూర్ణమును ఇదిగో అని చెప్పి చూపించెను. నిజమునకు పరిపూర్ణమును చూపించే వాడు లేడు. చూచేవాడు లేడు. అయినా ఇట్టిది అని తెలియవలెను కదా. సర్వత్రా అఖండమైన ఆత్మ ఇదిగో అని చెప్పినప్పుడు తాను, చెప్పే గురుడు ఖండ స్వరూపులై యున్నారు కదా! అట్లే ఇక్కడ పరిపూర్ణమును కూడ చెప్పి చూపించెను.

"అయ మియమనియనుటుళ్లక్కి" అనగా "స్వప్రకాశాపరోక్షత్వమయం' అని శాస్త్ర భాష్యము. అయం అనగా కుండ మొదలగు వస్తువుల వలె దృక్ సిద్ధము (చూడబడేది) కాదనియు, స్వర్గము, నరకముల వలె ఎప్పుడును కనుబడనిది కాదనియు, అర్థము చెప్పిరి. పరిపూర్ణము ఎప్పుడూ ప్రత్యక్షమే. ఎదురుగానే ఉన్నది. కాని దృశ్య వస్తువు కాదు. కనుక అయం అనుటుళ్లక్కి అని భావము.



**కం॥ లేనినే నీవు లేని । స్థానంబును కారణంబు సర్వమునకధి ।**
**ష్ఠానంబు సాక్షిసత్య । జ్ఞానానందంబు లనిన సత్యములగునే ॥41**

**భావము :-** శిష్యా! నేను, నీవు లేని స్థానము ఏదైతే కలదో, దానిని ఈ సమస్తమునకు కారణము, అధిష్ఠానమనియు, సాక్షియని, సత్య జ్ఞానానందము అనినచో ఆ మాటలు నిజమగునా?

**విశేషభావము :-** నేను - నీవు లేని స్థానము - పరిపూర్ణము. పరిపూర్ణములో నేను లేను. అనగా నేనైన ఆత్మ లేదు నీవైన జగత్తు లేదు. ఆత్మ - జగత్తులు లేనిది పరిపూర్ణము. ఆత్మ జగత్తులు లేని పరిపూర్ణము సమస్తమునకు కారణము, అధిష్ఠానము కానేరదు కదా. ఆత్మజగత్తులు గల యెరుకయే, సృష్టి స్థితి లయములకు కారణము. అధిష్ఠానము. సాక్షి, ద్రష్ట, సత్యజ్ఞాన ఆనంద స్వరూపము అని చెప్పిరి. పరిపూర్ణములో ఏమియు లేదు. ఉత్తది. ఇది కారణ కార్యములు కానిది. ఆధార ఆధేయములు కానిది, అని తెలియవలెను.

**కం॥ అట్టిది యిట్టిది యనరానట్టిది బయలనుచు దెలసియా మీదట నీ । వట్టిది యిట్టిది యనరా । నట్టిది బయలనిన దాని నరయుకు మెపుడున్ ॥ 42**

**భావము :-** శిష్యా! ఇట్టి లక్షణములు గలిగినటువంటిది అని చెప్పవీలు లేనిది (అనగా ఏలక్షణములేనిది) పరిపూర్ణమని తెలియుము. ఏ లక్షణము లేనిది పరిపూర్ణము అనితెలిసిన తెలివి అనగా "నేను" ను విడచిపెట్టుము.

**విశేషభావము :-** ఎట్టి లక్షణములు కానిది పరిపూర్ణము. ఏ ధర్మము లేనిది పరిపూర్ణము, సర్వలక్షణ, సర్వధర్మములు గలది ఎరుక. అనగా జ్ఞానము. ఈ జ్ఞానమే "నేను", నాయందున్న తెలివి. నాయందున్న తెలివి చేతనే ఏ లక్షణము లేనిది పరిపూర్ణమని గురుముఖతా తెలిసి, ఆ తెలిసిన తెలివియే "నేను" అని, ఎరుకని, దానిని విడచుటయే పరిపూర్ణస్థితి.

**కం॥ అది యిది యంచని యనరా నిది బయలని తెలిసి నీవు యిది యది యనరా। నిది బయలని తెలసిన నిను । వదిలుండుము లేన టంచు వరగుణవంతా ॥ 43**

**భావము :-** శిష్యా! అది యిదియని యనరానిది పరిపూర్ణమని తెలియుము. అది యిది యనరానిది పరిపూర్ణమని తెలిసిన తెలివి (నిన్ను) ని, లేదనుచు తెలసి దానిని విడువుము. (భావము పై 42వ పద్యము వలెనే).

**కం॥ కలనీకు జగము కంతట । గల బయలుకు గలిగి యున్న ఘనమగు తిప్పల్। కలయుగనిమేలు కనియా కలవలెమేలు కను జూచి కదులు ముళ్లక్కీ ॥ 44**

**భావము :-** శిష్యా! (కల అనగా భ్రమ) భ్రమ నీకు, జగత్తుకు, అంతటగల పరిపూర్ణమునకు ఉన్నచో ఘనమైన తిప్పలు (జనన మరణములు) తప్పవు. అనగా భ్రమ యెచ్చటగలదో అచ్చట జనన మరణములుండును అని తెలిసికొనుము. ఈవిధముగా విచారించినచో ఈభ్రమ దేనికున్నది? అని మేలుకొనుము. పరిపూర్ణమునకు తప్ప మరి అన్నిటికి భ్రమ యున్నది. భ్రమ అనగా పుట్టుక (135 పద్యము కం॥ చూడుము). కల మేలుకొన్నచో యేలా లేకపోవుచున్నదో అవిధముగా మేల్కొయయిన అనగా భ్రమలేని పరిపూర్ణమును భ్రమ అయిన నీవు జూచి, నీవు లేకుండా పొమ్ము.

**విశేషభావము :-** ఈ పద్యములో కల అను పదమునకు భ్రమ అని అర్థము. భ్రమ అనగా పుట్టుక, నేను, నీవు అని అర్థములు 135వ కంద పద్యములో చెప్పిరి. కనుక భ్రమ దేనికిఉండునో దానికి ఘనమగు తిప్పలు తప్పవని కలయుగనుము. అనగా విచారించుము. విచారించినచో అంతటగల బయలుకు భ్రమ లేదని తెలిసినది. అదియే మేల్కొ. ఆమేల్కొను జూచి కల అయిన నీవు లేవని లేకుండా పొమ్ము అని పద్యభావము.

**కం॥ కలనేన్గ సింహామునుక । న్నుల గల మృతి జెందినట్లు యుళ్లక్కగునీ। వల గురుకృపచే బయలున్। దెలసూరికె యుంటి వేని తీరును మాటా ॥ 45**

**భావము :-** శిష్యా! కలలో ఏనుగు సింహామును చూచినచో మృతిజెందిన విధముగా, ఆ గురుకృపచే పరిపూర్ణమును తెలిసి "నేను" లేదనియూరుకున్నచో నీవు ఉళ్లక్కి అగుదువు. అంత ఎరుకమాట తీరిపోవును.

**విశేష భావము :-** ఏనుగు సింహామును స్వప్నములో చూచినంత మాత్రమున నే ఏనుగు చనిపోవును. ఇది ఆర్యోక్తి. నిజమునకు సింహాము రాలేదు. చంప లేదు. స్వప్నములో చూచి చనిపోయినది. అట్లే పరిపూర్ణము ఉన్నదని ఎరుక తెలుసుకొన్నంత మాత్రముచే, ఎరుకే లేకుండాపోవును. ఇచ్చట, ఒకసత్యమును గ్రహించవలెను. పరిపూర్ణము చూడబడేదికాదు. పరిపూర్ణమును చూచి ఎరుక

లేకపోవుటకాదు. పరిపూర్ణమున్నదని చూచి అనగా పరిపూర్ణమె ఉన్నదని "నేను" లేను అని ఆరూఢమైతే అదే పరిపూర్ణము ప్రత్యక్షమగుట - ఎరుక లేకపోవుట అనబడును. ఇట్టి స్థితి శాస్త్రజ్ఞానాదులచే ఎంతమాత్రము కాదు. "అలగురుకృపచే" అనగా ఆ గురుకరుణచే అని అర్థము. ఆ-అనగా అఖండగురువుయొక్క కరుణ ఈ మానుషగురుమూర్తి ద్వారా శిష్యునియందు కల్గి పరిపూర్ణస్థితికలుగును. అని ఈపద్యభావము.

**కం॥ ఎప్పటికి యొక్క రీతిగ। తప్పకనిలచున్నదాన్ని దయతో గురుడున్। చెప్పినగనియు గణితమగు। తిప్పలు గల నిన్ను నీవు దీసి తెసరిరా ॥ 46**

**భావము :-** శిష్యా! సర్వకాల సర్వావస్థల యందు ఒకే రీతిగా, ఏ వికారము చెందకుండా, స్థిరముగా ఉన్న పరిపూర్ణమును, గురుమూర్తి ద యతో తెలియ పర్చినచో, దానిని చక్కగా విచారించి, లెక్కలేనన్ని తిప్పలు గలనిన్ను (అనగా "నేనును) లేవని నీకు నీవే దృఢపడితే సరిపోవును.

**విశేషభావము :-** ఎప్పటికి ఒక్కరీతిగ=సర్వకాలములందు ఒకే రీతిగా "ధిక్కాలా ద్యనవచ్ఛినము" దేశ, కాల, వస్తు బేధములచే మార్పు జెందనిది అని అర్థము; ఒక్కరీతిగ=ఏవికారము లేకుండగ, ఏ మార్పులేకుండగ,, తప్పక నిలచున్న దాన్ని=స్థిరముగా ఉన్న పరిపూర్ణము. శాశ్వతమైనది. భూత, భవిష్య, ద్వర్తమాన ముల యందు ఎల్లకాలము శాశ్వతమై ఉన్నటువంటిది పరిపూర్ణము అని అర్థము. ఇది గురుకరుణచే మాత్రమే ఉన్నదని తెలియవలెను. కనుక "దయతో గురుడున్ చెప్పిన" అని అన్నారు.

**కం॥ నీవున్నచోటనుండును। నీవివిధ విచిత్ర జగమునీతో గూడన్। నీవు లేనట్టిచోటను। నీవివిధ విచిత్ర జగమునిలువదుకుర్రా ॥ 47**

**భావము :-** శిష్యా! నీవు ఉన్నచోటనే, ఈవివిధ విచిత్రములతో కూడిన జగత్తు నీతో కూడియుండును. ఇట్టి జగత్తునీవులేని చోట ఎంత మాత్రము నిలువదని తెలుసుకొనుము.

**విశేషభావము :-** నీవు అనగా "నేను" ఎంత వర్కు ఉన్నదో అంత వర్కు జనించుట, గతించుట అను జగత్తు ఉండును. జగత్తుకు సత్తా ఇచ్చేది నేను. నేను లేని జగత్తు ఉండదు. కనుక "నేను", అహం, ఎరుక అనునది ఎంత

వరకు ఉండునో అంత వర్కు జగత్తు ఉండుననుట నిస్సంశయము. ఈ జనించి గతించే జగము "నేను" లేనిచోట ఉండనేరదు. నేను లేనిచోటు పరిపూర్ణము, పరిపూర్ణములో నేను లేదు కనుక, పరిపూర్ణములో జగము లేదని తెలిసికోవలెను. పరిపూర్ణము సర్వత్రా ఉన్నది కనుక నేను జగము ఎంతమాత్రము లేనిదని గురుముఖతా దృఢ పర్చుకొని, తారహితమగుటయే జన్మరహితము.

**కం॥ నానా వికారములు గల । నానావిధనామ రూపనటనలు గలయీ। నీనా దశదిశలను గల । దీనందే లేక మనము తిరుగుట మప్పా ॥ 48**

**భావము :-** శిష్యా! నానా విధములుగా మార్పు జెందుచు, నానావిధములైన నామరూపక్రియలతో గూడిన యీ జగత్తు -ఆత్మలకు, దశదిశల నిండియున్న యీ పరిపూర్ణము నందే, మనము లేక తిరుగుచున్నాము.

**కం॥ అబ్బీయీ బయలున్నది । దబ్బున గురుడెరుక జేయదబ్బర ననుచున్ । వెబ్బకు మాయము గాకను । కబ్బము జెప్పటకు నిల్వగలవే నీవున్ ॥ 49**

**భావము :-** శిష్యా! యీపరిపూర్ణమెయ్యుది అని రూఢిగ సద్గురుమూర్తి తెలియజేయగా నీవు (ఎరుక) లేనిదని మాయము గాకుండగా కథలు జెప్పటకు నిల్వగలవా! (అనగా నీవు లేకుండా పోదువు ఎరుక లేకుండా పోవును అని భావము.)

**కం॥ మూలములే కనెవచ్చిన । నీ లీలలు జూచుకొని నీవెమురు తువే । బైలున్నదనుచుదో చితె । నీలేమిని నీవెరింగి నిలువవు కుమ్రా ॥ 50**

**భావము :-** కుమారా! నీవు (ఎరుక) మూలము లేకుండగ తనకు తానుగానే వచ్చి, ఎన్నో చిత్రవిచిత్రములైన కార్యములు చేయుచు, ఆ పనులు చూచి తానే ఎంతో సంతోషమును పొందుచున్నది. అట్టి నీవు (ఎరుక) యీ బయలున్నదని రూఢిగ తోచినచో, అందునీవులేవని తెలిసి ఒక్క క్షణమైనను నిలువక లేకపోదువు.

**కం॥ జ్ఞాన కర్మస్వరూపము । గాని బయల్ నదిగొ చూచి కల కాలము యీ । జ్ఞానకర్మ స్వరూపం । బౌనిను నీవెరిగి మృషని పనివినవో యీ ॥ 51**

**భావము :-** శిష్యా! జ్ఞానకర్మ స్వరూపము గాని పరిపూర్ణము సర్వకాలము ఉన్నదని చూచి, యీ జ్ఞాకర్మస్వరూపమయిన నిను నీవు మృషని యెరుగుటయే నీ పని అని తెలుసుకొనుము. అనగా జ్ఞాన కర్మస్వరూపమయిన నిను అనగా ఎరుక మృషని నీవు యెరుగుటయే నీవు పుట్టినందులకు తెలుసుకోవలసిన పని అని తెలుసుకొనుము.

**కం॥ ఈ నిర్మలమౌ బయలున । నానాగమనిగమ కల్పనాయు నటంటే । యేనరులు నమ్మరిందుకు । నానీయందున నటంటె నమ్మిన మాడ్కిన్ ॥ 52**

**భావము :-** శిష్యా! యీ స్వచ్ఛమైన పరిపూర్ణములో నానా[illegible]లైన వేదశాస్త్రాదులు కల్పింపబడినవి అన్నచో యే నరులు నమ్మరు. ఆ శా[illegible]స్త్రాదులు నీ-నా మధ్యనే కల్పింపబడినవి అనినచో అందరు నమ్మగలరు.

**విశేషభావము:-** నిర్మలమౌ బయలున శబ్దరూప రస, గంధాదులే[illegible]గాని, నామరూప నటనలు గాని ఏమియులేనందున స్వచ్ఛమైనది. దీనికి సాటి మరొకటియేది లేనందున యిది స్వచ్ఛమైనది పరిపూర్ణము అని చెప్పవలెను. వేదశాస్త్రములు శబ్దము వలన యేర్పడినది. అనగా ఓం అను శబ్ద బ్రహ్మవలన ఏర్పడినది గాని, స్వచ్ఛమైన పరిపూర్ణము వలన, ఏర్పడినదికాదు. సకల సృష్టికి ముందుగా వేదము (జ్ఞానము, శబ్దము) పుట్టినది. దానినుండి సమస్త సృష్టి కార్యము యేర్పడినది. అందుచే స్వచ్ఛమైన పరిపూర్ణము-ఏమీలేనిది, ఉత్తది కనుక పరిపూర్ణము వలన ఏ రకమైన శబ్ద జ్ఞానము పుట్టలేదు. ఆ శాస్త్రాదులన్నియు అనగా సమస్త జ్ఞానము నీ-నాయందుననే కలిగినది. నీ అనగా జగత్తు, నా అనగా ఆత్మ. ఇంకనూ వివరించవలె నంటే, నీ - అనగా అవ్యక్తము (మాయ) నా - అనగా బ్రహ్మ. బ్రహ్మ అవ్యక్తముల సమ్మేళనమే సమస్తమైన జ్ఞాన, కర్మ స్వరూపమయిన ఆత్మజగత్తులు. కనుక బ్రహ్మ+అవ్యక్తముల మధ్యనే సమస్త వేదము కల్పింపబడినది.

**కం॥ నేనీవనని మహాత్మని । కీ నిగమాగమ విచార మిష్టతి యౌనా। నే నీ వని యీ పల్కే । నానీకే యిష్టతౌ రనా నాయన్నా ॥ 53**

**భావము :-** శిష్యా! నేనని, నీవని అనని మహాత్మునికి యీ వేద, శాస్త్ర విచారము ఇష్టత ఉండదు. నేను, నీవు అని పలికే నాకు నీకే యీ వేద శాస్త్ర విచారము ఇష్టత అగును నాయనా.

**విశేషభావము :-** నేను, నీవు అనని మహాత్ముడు అనగా తానని ఇతరమనే యీ ద్వయదోషములు లేని మహాత్ముడు అని అర్థము. నేను ఆత్మను నీవు అనాత్మవు అని కాని, నేను జ్ఞానస్వరూపుడను, నీవు అజ్ఞానివి అని గాని రెండుగా జూచుట ద్వయదోషములు కల్గియుండుట, మరియు నేనే సమస్తము అనుట "అహంబ్రహ్మ" స్వయదోషము. ఇట్టి ద్వయదోషము కాని, స్వయ దోషము కాని లేనివాడు పరిపూర్ణ స్థితి గలవాడు. అట్టివానికి ఏ రకమైన విచారణ, వాదోపవాదములు, గ్రంధపఠనము, మొదలగునవి అక్కరలేదు. ఇష్టపడడు, కోరడు, ఇవన్నియు నేను, నీవు అని పల్కే జ్ఞానులకు (నా) అజ్ఞానులకు (నీకు) మాత్రమే యిష్టత అగును అని భావము. జ్ఞానాతీతులకు ఏమియు అక్కర లేదు.

**కం॥ కలవేళ్లను యీ మేల్కను । గల యీ బయలుండజూచి కలమేల్కాంలలో। గలలేని నిన్ను నీమే । నులు లేవని దెలిసి యుండుము చాలున్ ॥ 54**

**భావము :-** శిష్యా! జాగ్రత స్వప్నములందు శాశ్వతముగా యున్న యీ పరిపూర్ణము ఉన్నదని జూచి జాగ్రదావస్థలోను స్వప్నావస్థలోను లేని నీ మేను నిన్ను, లేవని దెలసికొని యూరకుండుము.

**విశేషభావము :-** శాశ్వతమైన పరిపూర్ణ మొక్కటియే జాగ్రదవస్థలో ఏలా ఉన్నదని తెలియబడినదో, స్వప్నావస్థలో కూడ ఎట్టి మార్పు లేకుండగ అదే విధముగా ఉన్నది. కనుకనే పరిపూర్ణము శాశ్వతమైనది. వికార రహితమైనది. అనవలసి వచ్చినది. "నేను" - "మేను" లు ఈ రెండును లేనివే. ఉన్నట్లుగా తోచబడుచున్నది. విచారిస్తే లేనేలేవు. కల -కలకనేటప్పుడు లేనిదే, జాగ్రదలోను లేనిదే. అదేవిధముగా నేను-మేనులు రెండును కలలోను లేవు. జాగ్రదలోను లేవు. కనుక వీటియందు భ్రాంతి విడచి లేనివని నిర్ణయములో ఉండవలెను.

**కం॥ మేనుజడ, మజడమనినను । నేననుమీ, రెండు గలసి నేనన బడుస్వ । ప్నానందమెమదవస్థగు । నేనే వనుమృషని తెలియనే మృషనౌదున్ ॥ 55**

**భావము :-** శిష్యా! శరీరము జడము (అచేతనము) నేను అజడము అనగా చైతన్యము. ఈమేను-నేను రెండును గలసియే "నేను" అనబడును. దీనికి స్వప్నానందమే అవస్థ. అనగా లేనిదే ఉన్నట్లు అనుభవించుటయే అవస్థగా గలిగినది. ఇట్టి "నేను" లేనిదని తెలియగానే నేను లేకపోవును.

**విశేషార్థము :-** మేను అనగా శరీరము ఇచ్చట శరీరమనగా స్థూలశరీరము చెప్పుట కన్న సూక్ష్మ శరీరమును "మేను" అని చెప్పుట యోగ్యము. సూక్ష్మ శరీరము స్వతః జడము. ఆత్మచైతన్యముచే మాత్రమే ప్రకాశించి పనిచేయును. కనుక ఆత్మ (నేను) అజడము. అనగా చైతన్యము. సూక్ష్మశరీరము (మేను) ఎప్పుడును ఆత్మను అంటియే యుండునుకాని విడిగా ఉండదు. కనుకనే ఆత్మతో సూక్ష్మ శరీరము కూడ పోవుచున్నది. కూడవచ్చుచున్నది. పంచ భూతముల వల్ల తయారైనది కాదు. కనుక నేను (ఆత్మ) మేను (సూక్ష్మశరీరము) ఈరెండును కలిసి నేను అనబడును. అని ఈ పద్యములో చెప్పబడినది. కలలో ఆనందము ఏలా లేనిదో అలాగున"ఇది ఉన్నది" అనుట భ్రమ. కనుక దీని అవస్థ స్వప్నానందము అని చెప్పబడినది.

**కం॥ నేనేతానైతె నావలె। యూనేలేనట్టి బ్రహ్మనే ననకున్నే। నేనందునేను లేనిదె। మేను జగత్తులయితోచి మృషనా కొంచున్ ॥ 56**

**భావము :-** శిష్యా! నేనే తానైతే (నేనే పరిపూర్ణ బ్రహమునైతే) యీ నేను లేని పరిపూర్ణ బ్రహ్మ "నేను" అనకుండునా? నేను పరిపూర్ణము నందులేనిదే, నేనే -మేను జగములయి తోచబడచు లేకపోవుచున్నది.

**విశేషబావము :-** "అహమేవ బ్రహ్మ" అన్న ఆర్యోక్తి ప్రకారముగా నేనే పరిపూర్ణ బ్రహ్మను అయినచో ఆ పరిపూర్ణపరబ్రహ్మ కూడ "నేను" అనవలెను. కాని అనుటలేదు. కనుక నేను పరిపూర్ణము ఒక్కటికాదు. పరిపూర్ణ పర బ్రహ్మము నందునేను లేను. అందులో నేను లేనిదే "నేను" తోచబడినది. యీ నేనే, మేను- జగములుగా తోచబడి ఉన్నట్లుండి, విచారించు సరికి లేకపోవుచున్నది.

**కం॥ కానరావారుమతములు। నానాగమనిగమ సమితి నామము రూపం। బేనులేనప్పుడు నాకై। నేనరుదెంచినను వెంటనెయవి వచ్చున్ ॥ 57**

**భావము :-** శిష్యా! "నేను" లేనప్పుడు అనగా "నేను" లేకపోయినచో ఆరు మతములు, వేదములు, శాస్త్రములు మొదలగు నానా విధ సమూహ జగత్తు పేర్లు రూపములు క్రియలు ఇవేమియు లేకుండును. "నేను" వచ్చినచో ఇవన్నియు, ఆపైన చెప్పిన సమస్తము వచ్చును.

**విశేషభావము :-** వేదములు, శాస్త్రములు, ఇతిహాసములు జగత్తు నామరూపాదులు ఇవన్నియు "నేను" నుండియే వచ్చినవి. అనగా "ఓం"

(ఇదియే నేను) నుండి అకారాదిక్షకార పర్యంతమైన శబ్దప్రపంచమున్ను, పంచ భూతములతో కూడిన వస్తు ప్రపంచమున్ను, ఓం తత్సర్వం" ఏర్పడినట్లుగా శాస్త్రము చెప్పుచున్నది. కనుక శబ్ద ప్రపంచము అనగా వేద, శాస్త్ర ఇతిహాసాది సమస్తమున్ను, వస్తు ప్రపంచమనగా నామరూప క్రియా విశేషములతో కూడిన భౌతిక జగత్తున్ను, ఓంకారము నుండే పుట్టినవి. అనగా "నేను" నుండి యే వచ్చినది. అనగా నేను ఉంటేనే అవన్నియు ఉండును. "నేను" లేకపోయినచో అవేమియు ఉండుటకు వీలులేదు.

**కం॥ నామీదిప్రేమ చేతను । యీ మనుజులునిలుప దలచి యెన్నో యుక్తుల్ । తామొనరించిన నిల్తునె । నే మృష, మృష నిల్వగలదె నిశ్చయము వలెన్ ॥** 58

**భావము :-** శిష్యా! నామీద ప్రేమచేత అనగా "నేను" అనునది బ్రహ్మ అను భావముచేత, యీ మనుజులు నేను శాశ్వతమని, చెడనిది, పరబ్రహ్మమని, యెన్నో శాస్త్రములు యుక్తులు కల్పించి చెప్పినారు. కాని "నేను" మృష, మిధ్య, లేనిదే, ఆభాసము. ఇట్టి మిధ్య, శాశ్వత వస్తువలె నిలబడగలదా! అనగా "నేను" శాశ్వతమైనది కాదు. మిధ్య అనిభావము.

**కం॥ నీతండ్రి తాతలవలెనె । నీ తనయులు నీవుజనుట నిశ్చయమె కదా । మీ తోటిరాదు గదబయ లీ తెరగెరిగిపుడు శూన్యమేదో కనరా ॥** 59

**భావము :-** శిష్యా! నీ తండ్రి, తాత గతించినారు. అట్లే నీవు నీతనయులు గతించెదరనుట నిజమే కదా! కాని మీతో బయలురాలేదు, కనుక మీతో బయలు పోయేదికాదు. ఈవిధముగా చూస్తే శూన్యమేదో చూడుము. అనగా పరిపూర్ణము గతించేది కాదు శాశ్వతమైనది. ఎరుక అయిన "నేను" శూన్యము అని భావము.

**కం॥ బయలెప్పుడు పుట్టిగిట్టదు । బయలెపుడు ముట్టుకోదు బ్రహ్మాండంబున్ । బయలెపుడు వన్నెరుంగదు । బయలెపుడు చేయ బోదు పనులెల్వైవన్ ॥** 60

**భావము :-** శిష్యా! పరిపూర్ణము ఎన్నడు పుట్టదు- చావదు. పరిపూర్ణము ఎన్నడు బ్రహ్మాండమును అంటి యుండదు. అనగా బ్రహ్మాండము పరిపూర్ణము

వలన వచ్చుట పోవుట జరుగదు. పరిపూర్ణము ఎన్నడు "నేను" అను ఎరుకను ఎరుగదు. అనగా పరిపూర్ణములో ఎరిగే గుర్తులేదు. పరిపూర్ణము ఎన్నడు ఏ పనులు చేయదు. అనగా సృష్టి స్థితి లయములు పరిపూర్ణము చేయుటలేదు.

**కం॥ బయలనిన నిత్యవస్తువు । బయలన నొకరీతియుండు**
**బ్రహ్మాండములో । బయలనిన కండ్లబడనిది । బయలన**
**బ్రహ్మాండము వెలబరగెడిది సుమీ ॥** 61

**భావము :-** శిష్యా! పరిపూర్ణమనగా శాశ్వతమైనది. నశించేది మార్పు జెందేది కాదు. బ్రహ్మాండములో ఒకేరీతిగా మార్పులు గాని ఎట్టి ఉపాధులను పొందుట గాని లేకుండ ఉన్నది. పరిపూర్ణమనగా కంటికి కనబడునది గాదు. దృక్ సిద్ధము కాదు. (కనుక నశించదు). పరిపూర్ణమనగా బ్రహ్మాండమునకు ఆవలకూడ ఉన్నదని గుర్తించుము. (మించిఉన్నదని భావము)

**కం॥ బయలనిన నేను లేనిది । బయలనిన నుపాధిగాన బడనిది**
**యెప్పుడున్ । బయలనిన పలుకులేనిది । బయలిట్టిది యనుచు**
**దెలియ బడదెవ్వరికిన్ ॥** 62

**భావము :-** శిష్యా! పరిపూర్ణములో "నేను" (ఎరుక) లేదు. పరిపూర్ణమునకు ఉపాధి యేమియులేదు. దీనందు శబ్దము లేదు. పరిపూర్ణము ఈవిధముగా ఉన్నదని ఎవ్వరికి తెలియబడదు.

**విశేషభావము :-** నేను అనగా ఎరుక. అనగా ఎరిగేది. జ్ఞానము, అజ్ఞానము అని అర్ధము 1. పరిపూర్ణము నేను లేనిది-అనగా జ్ఞానము అజ్ఞానముకానిది. 2. ఉపాధి గానబడనిది. ఎరుక ఉపాధి సహితము క్షరమును ఉపాధిగా కలిగినది మరియు అక్షరమునకు ఉపాధి అయి యున్నది. అట్టి ఉపాదిలేనిది పరిపూర్ణము. కనుకనే క్షరా-అక్షరోపాధి ద్వయ దోషరహితమైనది పరిపూర్ణము. ఉపాధి అనగా ఆధార-ఆధేయములతో కూడినది అని అర్ధము. పరిపూర్ణమునకు ఆధార, ఆధేయములు లేవు. 3. పలుకులేనిది, "ఓం" శబ్దము లేదు. శబ్దము కలిగినది నామ రూపక్రియలు గలిగియుండును. శబ్దముచే వర్ణింపబడి చెప్పుటకు వీలు కలుగును. పరిపూర్ణము నందు శబ్దము-నిశ్శబ్ద రూపముగా కూడలేదు. కనుక దీనికి నామరూపములు లేవు. మరియు శబ్దము చేత వర్ణించలేము. శబ్దముచే తెలియబడదు. 4. ఇట్టిది అట్టిది అనుచు తెలియబడ దెవ్వరికిన్. అనగా తెలియబడదు. బుద్ధికి గూడ ఊహించ వీలుకానిది. కనుక

అగ్రాహ్య, మచింత్య, మబుద్ధకం, తెలియబడిన సమస్తము తెలివికన్న చిన్నది. తెలివికి లోబడినదే అగును. పరిపూర్ణము తెలియబడదు ఎవ్వరికైనను, కనుక తెలివికి జ్ఞానమునకు మించినది. జ్ఞానా జ్ఞానములు కానిది. కనుక ఇదే "భూమ' అని చెప్పవలెను.

**కం॥ చెప్పి చూపింపరానిది । యప్పాయల్లదిగో చూడుమని నేనీకున్ । చెప్పి చూపిస్తి మరువకు । యెప్పటికిది నమ్మిలేని యెరుకను విడరా ॥ 63**

భావము :- శిష్యా! చెప్పుటకు గాని చూచుటకు, చూపుటకు గాని వీలుగాని పరిపూర్ణమును, అయ్యా! అదిగో చూడుమని నేను నీకు అనేక యుక్తులచే చెప్పి చూపించినాను. మరువకుము. యెప్పటికిని దీన్ని నమ్మి లేని యెరుకను విడచి పెట్టుము.

**కం॥ ఉన్నది గదనే జెప్పిన । దన్నా దాన్నుండ జూచి తలగుము మృషయౌ । నిన్నంటి యున్న సంపద । లన్నియు గొని నీవు వచ్చి నట్లు మృషగుచున్ ॥ 64**

**భావము :-** శిష్యా! నేజెప్పిన పరిపూర్ణము ఉన్నదిగదా! (ఉన్నట్లు దృఢముగా తోచబడినదికదా) అయ్యా! దాన్ని ఉన్నదని జూచి మృషయైన "నిన్ను" అనగా ఎరుకను విడువుము. ఆ యెరుకతో కూడ లేని యీ జగత్సంపదలన్నిటిని గొని అది ఏలా వచ్చినదో అలా లేకుండ పోవలెను.

**విశేషభావము :-** పరిపూర్ణమె ఉన్నది. ఎరుకలేదని దృఢము కావలెను. అట్లు ఎరుకలేదని దృఢమైనచో ఎరుకయు ఆ ఎరుకతో వచ్చిన సమస్త సంపదలు అన్నియు కూడ ఏలా వచ్చినవో అలానే లేకపోవును. అనగా లేక, కలవలె వచ్చినది. మేల్కొను జూడబోవుసరికి కలలేక పోయినది. అట్లే ఎరుక, ఎరుకతో వచ్చిన జగత్తు, సమస్తము పరిపూర్ణమనే మేల్కొ ఉన్నదని చూచుసరికి, కించిత్తు కూడ లేకుండాపోయినది. లేకవచ్చినది లేకనే పోయినది. అనగా రావడము అబద్ధమే, పోవడము అబద్ధమే.

**కం॥ పంచకోశముల సంచును । మించినదీ యెరుక యనుట మేలా బయు । లంచెంచిన దగు నా ముచ్చట । నంచిత సద్భక్తి యుక్త అమితాసక్తా ॥ 65**

**భావము:-** ఓ అంతులేని మంచి భక్తి గలిగి బోధ యందు అమితమైన ఆసక్తిగల ఓ శిష్యా! పంచకోశములనే సంచులను మించినది ఈ యెరుక అనుట బాగుగాలేదు. ఆ మాట పరిపూర్ణమునకు మాత్రమే చెప్పనగును.

**విశేషభావము :-** పంచకోశములనగా 1. అన్నమయకోశము, 2. ప్రాణమయ కోశము, 3. మనోమయకోశము 4. విజ్ఞానమయకోశము, 5. ఆనందమయ కోశము. కోశము అనగా సంచి అని అర్థము. అందుకే పంచకోశముల సంచును అనగా పంచకోశములనే సంచిని అని అర్థము.

"అవస్థాత్రయములకు సాక్షియు, పంచకోశ వ్యతిరిక్తుడను అయినది ఆత్మ" అని శాస్త్రవచనము. అన్నమయాది పంచకోశములు అవ్యయుని పంచకళలు. ( ఈ వివరణ నాచే వ్రాయబడిన పరిపూర్ణ బోధపాఠములు" అను వ్రాతప్రతిలో "చతుష్టయం వా ఇదం సర్వం" అను పాఠములో వివరించి యున్నాను.) ఆత్మలేక ఎరుకయే బ్రహ్మాండములో పురుషోత్తముడు అనబడును. ఇతడే అవ్యయుడు, సంసార, నిస్సారముల రెంటికి కారణభూతుడు . అక్షరరూపముగా సమస్తమునకు కర్తగాను, అవ్యయరూపముగా అకర్తయు అయియున్నాడు. భగవద్గీతలో "కర్తారమపి మాంవిద్ధ్య కర్తారమవ్యయం" అన్నారు. నేను సమస్తము నకు కర్తనే అయినప్పటికి, అవ్యయరూపముగా అకర్తను అని తెలిసికొనుము. అన్నారు గీతాచార్యులు. కనుక అవ్యయుడే పురుషోత్తముడు. పురుషోత్తముడే "నేను", ఎరుక. అని తెలియవలెను. ఈ అవ్యయుడు పంచ కళాత్మకుడు, ఆనంద, విజ్ఞాన, మనః ప్రాణ, వాక్కులను పంచకళలతో కూడినవాడు. ఈ పంచకళలే పంచకోశములు అని చెప్పబడును. కనుక ఈ పద్యములో కృష్ణ ప్రభువులు ఎరుక పంచకోశములతో కూడియున్నదే కాని, మించినది అని చెప్పుట మేలు కాదు. అని చెప్పిరి. మరియుపరిపూర్ణమునకు పంచకళలు గాని పంచకోశములు గాని ఏమియులేవు. కనుక "పంచకోశముల సంచును మించినదీ బయలంచెంచిన దగు నాముచ్చట" అని చెప్పబడినది.

**కం॥ లేని నేనను శరీరము । లోనబయట గలిగినట్టి లోకసమితి కిన్ । లోన బయటగల బయలిది । దీనందే లేకమనము తిరుగుట మనఘా ॥ 66**

**భావము :-** శిష్యా! ఓ పాపరహితుడా! లేని నేను అనే శరీరమునకు లోపల బయటగల లోకసమూహమునకు, లోపల బయట సర్వత్రా నిండియున్న పరిపూర్ణములోనే, మనము లేక తిరుగుచున్నాము.

**విశేషభావము :-** నేను అను శరీరము అనగా గుర్తెరిగే శరీరము. గుర్తు (సహస్రారము) ఎరిగే శరీరము (ప్రతిబింబమైనది ప్రత్యగాత్మ) ఇది మహాకారణ శరీరము. సమస్తమును తెలుసుకొనుచున్నది కనుక దీనిని ఎరిగే శరీరమన్నారు. ఇది ఆత్మ యొక్క ప్రతిబింబము. ఆత్మబింబము. దీనికే గుర్తు అని మన సంప్రదాయకులు అన్నారు. బింబ ప్రతిబింబములు రెండును ఒక్కటే కనుక. గుర్తు- ఎరిగే శరీరము కలిపి గుర్తెరిగే శరీరము అన్నారు. గుర్తునే "నేను" అందురు. కనుక ఈ పద్యములో నేనను శరీరము. ఇదిలేనిది కనుక "లేని నేనను శరీరము" అన్నారు. ఈ లేని నేనను శరీరము లోపల బయట గల లోక సమితి అనగా బ్రహ్మాండ మంతయు అని అర్థము. శరీరము లోపల వెలుపల, బయట ఉన్న బ్రహ్మాండము లోపల వెలపల అంతటా నిండియున్నది పరిపూర్ణము. అని భావము ఈ పరిపూర్ణములోనే మనము- బ్రహ్మాండము, లేక తిరుగుచున్నాము.

**కం॥ముడిబడి కర్మము జ్ఞానము । విడువక వారెండు వెలపె విశ్వమనవదే । కడువేద్యబయలు గనెవా । ఘడియైనను నిల్వలేక కల్లైపోవున్ ॥** 67

**భావము :-** శిష్యా! కర్మము-జ్ఞానము ఈరెండును ముడిపడి విడువక కలిసియున్నవి. ఆరెంటి వలన వచ్చినదే విశ్వము. ఆ కర్మ జ్ఞానము (అమితమైన వేదుకతో) పరిపూర్ణమును జూచినచో ఒక్కక్షణమైనను నిలువక లేకుండాపోవును.

**విశేషభావము :-** కర్మము-జ్ఞానము. ఈ రెండు విడదీయరానిది. రెండు కలిసియున్నదే బ్రహ్మము-(ఎరుక) కనుక బ్రహ్మ,కర్మ అన్నారు. బ్రహ్మము జ్ఞానము, కర్మ-కర్మము (క్రియారూపశక్తి) బ్రహ్మకర్మలు రెండు కలిసియే యున్నవి. విడదీయ రానిది.కనుకనే బ్రహ్మము నుండి విశ్వము యేర్పడుచున్నది. బ్రహ్మము నందే కర్మ క్రియా రూపశక్తి ఉన్నది. కనుకనే విశ్వము యేర్పడినదని చెప్పవలెను. కర్మ బ్రహ్మ స్వరూపము అను ఆర్యోక్తియు గలదు. "కర్మమె నరులకు దైవము" అన్నారు భారతంలో. ఇట్టి కర్మజ్ఞాన స్వరూపమైన ఎరుక పరిపూర్ణము ఉన్నదని తెలుసుకొనినచో తన లేమిని తెలిసి ఒక్క క్షణమైనను నిలువక లేకుండా పోవును. లేనిదే ఉన్నట్లు తోచబడి, నిజంగా లేకపోవుటచేత "కల్లైపోవున్" అని చెప్పినారు.

కం॥ సకలంబు లేని బయలున। సకలము లేనిదిటకొచ్చి చనెనా లేనం । చుకనితాలేచిపోయిన । నికనిలచే బయలు నెరుగనే దుండునురా ॥ 68

**భావము :-** శిష్యా! ఏమియులేని ఉత్త పరిపూర్ణములో సమస్తము కలిగియున్న ఎరుక తనంత తానుగా వచ్చినది. తానులేనని లేకపోయినచో ఇక మిగిలియున్న పరిపూర్ణమును ఎరిగే వారెవరుందురు? అనగా పరిపూర్ణమున్నదని ఎరిగేదేమియు లేదని భావము.

కం॥ ఉన్నలేనేమోయనకన్। వున్నదిబయలనుచు యేమోవుం... లేనం। చెన్నులేనట్టి నిన్నును । పన్నుగగని లేని నీవు పరుగిడవోయి ॥ 69

**భావము :-** శిష్యా! ఉన్నదో లేదో యనకుండగా, వృథముగా ఉన్నట్టి పరిపూర్ణమును, ఉన్నదని, ఉన్నానో లేనో అని అనుకొనే లేని నిన్ను... ...గా విచారించి లేనని, నీవు లేకుండపొమ్ము.

కం॥ రెండు వస్తువులనడుమన । ఖండంబిదె కానుపించు గద దీనినీ। వుండికమగొని చనందగు। మండితసత్కీర్తిసాంద్రమానవచంద్రా ॥ 70

**భావము :-** శిష్యా! గొప్పదైన కీర్తిగల మానవశ్రేష్ఠుడా! రెండు వస్తువుల మధ్యనున్నదే - అది అఖండ స్వరూపముగా కనుపించును గద. దానిని నీవు ఉండి విచారించి తెలుసుకొని, నీవు లేనని లేకుండా పొమ్ము.

**విశేషభావము :-** రెండువస్తువుల నడుమ ఏ బయలున్నదో అది ఖండము అఖండముగా నట్టి అఖండ స్వరూపమైన పరిపూర్ణముగా గ్రహించమని ఈ పద్యములో చెప్పిరి. ఇచ్చట కొద్ది విచారణ కావలయును. రెండు వస్తువుల నడుమ ఉన్న ఖాళీ విచారిస్తే మూడు విధములైనది ఉన్నది. 1. భూతాకాశము. ఇది పంచభూతములలో నొక్కటైనది. ప్రతివస్తువునందు ఖండముగాను వస్తువులు లేనపుడు అఖండము గానువున్నది. పగలు సూర్యప్రకాశముచే తెలుపుగను (వెలుతురు), రాత్రి కాలమందు ప్రకాశము లేకపోవుటచే నలుపుగను (చీకటిగను) ఉన్నది. శబ్ద గుణము కలది. కాకి వలె నల్లనిరూపముగా గలది. ఇట్టి లక్షణ ములు గలది పరిపూర్ణము కాదని, దీనిని బుద్ధిచే లేదనితీసివేస్తే ఉన్న ఖాళీ. 2. మహాకాశము. ఇది పిండాండములో ఖండముగను, బ్రహ్మాండములో

అఖండముగను, చీకటి వెలుతురు కానిదై సమస్తమునకు సత్తా ఇచ్చునదై, అమృతస్వరూపమై, కారణకార్యమై ఉన్నది. ఇదికూడ పరిపూర్ణము కాదు. ఇదే ఎరుక. ఇదికూడ పరిపూర్ణముకాదు కనుక, ఇదికూడ లేదని బుద్ధి విశేషముచే తీసివేయుగా, మిగిలినది. ఉపాధిరహితము. కనుక ఖండ స్వరూపము కానిది. అఖండ రూపమైనది. కారణ కార్యములు, అమృతము, సత్తాకానిది. ఉత్తది. ఇదే పరిపూర్ణము అని తెలియవలెను. మందబుద్ధిచే శూన్యమను కొందురేమో! శూన్యమనరాదు. సర్వకాలము సృష్టికి ముందు, సృష్టిఉన్నపుడు, సృష్టిలేక పోయినపుడు ఎప్పుడు ఒకే రీతిగా ఉండే అఖండ రూపము. కనుక ఈ పద్యములో "రెండు వస్తువులనడుమ అఖండంబుగ కానిపించును" అని వ్రాసినారు.మిగిలిన రెండూ ఖండముగను అఖండము గను ఉన్నవి. కాని పరిపూర్ణము ఉపాధి గతము కాదు కనుక అఖండ రూపమే కాని ఖండూపమన రాదు. ఇట్టి పరిపూర్ణమును "నీవుండి కనుగొని చనందగు" నేను ఉండి తెలుసుకోవలెను. జ్ఞానము చేతనే తెలుసుకోవాలి. ఆలా తెలుసుకొని, తెలుసు కొన్న జ్ఞానము లేదని లేకపోతే సరిపోతుంది. ఉండి తెలుసుకోవాలి గాని లేక తెలుసుకోలేము. తెలుసుకొని లేక పోవలెనని విశేషభావము (మండిత= అలంకరింపబడిన)

**కం॥ ఉన్నదానందు నిజముగ। నెన్నడు లేనట్టి మనము యేతించి**
**టయూ । తిన్నని ముచ్చటలాడితి । మిన్నియికన్ మనముబోతె**
**యేదిరమాటా ॥ 71**

**భావము :-** శిష్యా! శాశ్వతమై ఎప్పుడూ ఉన్నపరిపూర్ణమునందు, నిజమునకు ఎన్నడూలేని మనము, (ఎరుక) యిచ్చటకువచ్చి, స్వచ్ఛమైన ఈ మాటలను మాట్లాడితిమి. యిక మనము లేకపోతె ఆమాటేది? అనగా ఎరుకలేకపోతే ముచ్చట్లు ఏమియులేవు అనిభావము.

**కం॥ ఓపాప రూపబయు। లేపరమాత్మనుచు నమ్మిలేనట్టినినున్ ।**
**ఆపోజ్యోతిననుచుదెల । సీపట్లనెలేనటంచు చేరు ముల్లక్కిన్ ॥ 72**

**భావము :-** ఓ (కను) పాపరూప! శిష్యా! పరిపూర్ణమై పరమాత్మని నమ్ముము. నిన్ను (అనగా "నేనును") ఆపోజ్యోతి రూపమని దెలిసి ఇప్పుడే నీవు (నేను) లేవని లేకుండా పొమ్ము.

**విశేషభావము :-** "నేను" అనునది ఎరుక. అది ఆపోజ్యోతి రూపము. అనగా కనుపాపలో ఉండి, సమస్తమును గుర్తించునది కనుక ఆపోజ్యోతి అన్నారు. నేను పరమాత్మను కాను ఆపోజ్యోతివని తెలియుము అని ఈపద్యభావము. ఇంద్రియ అవయువములో ఉండి కన్నుమూస్తే లేకపోయేది. కనుక పరమాత్మకాదు. శాశ్వతమైనది వికారరహితమైనది పరిపూర్ణమే పరమాత్మగా తెలిసికొని నీవు లేవని, లేనిదే ఉన్నట్లు తోచబడే మిధ్యాస్వరూపమని, నేను లేనని లేకపోతే సరి. అంతయు ఉల్లక్కి.

**కం॥ ఇచ్ఛారాహిత్యంబునె। స్వచ్ఛంబగు బోధయనుచు సజ్జను లనిరీ। యిచ్ఛనెకూడనిదనిరా। స్వచ్ఛందుల మాటలన్ని సత్యము వినరా ॥ 73**

**భావము:-** శిష్యా! ఎరుకను రహితపరచునదె స్వచ్ఛమైన బోధయని సజ్జనులనిరి. యీ యెరుక కూడనిది. మంచిదికానిది అనిరి. అట్టి మహాత్ముల మాటలన్నియు సత్యమైనవి వినుము.

**విశేషభావము:-** ఇచ్ఛఅనగా యెరుక అని అర్థము చెప్పవలెను. ఎరుక యొక్క పేర్లు వివరించుటలో 60వ కందార్థదరువులో "సంకల్పమని నా యిచ్ఛనినన్' అన్నారు. కనుక ఇచ్ఛ అనగా యెరుక అని అర్థము చెప్పవలెను. ఈ ఎరుకను రహితపరచే బోధ పరిపూర్ణబోధ. అదే స్వచ్ఛమైనబోధ. ఎందుచేతననగా తిరిగి జన్మకు రాకుండ జేసేది కనుక. జన్మరహితపరచలేని యితరబోధలు శాస్త్రదృశ్యములతో కూడి యున్నను, స్వచ్ఛమైన బోధ అనుటకు వీలులేదు.

**కం॥ ఏ యాపేక్షజనించిన । నాయాపేక్ష లెల్ల మాయయని తెలియ దగున్ । ఆయా సమౌనుదానను! ఛీయనియవి విడువ దగును సేమముకొరకై ॥ 74**

**భావము :-** శిష్యా! ఏ అపేక్షపుట్టినా, ఆ అపేక్షలన్నియు మాయయేయని తెలియుము. ఆ అపేక్షలను తీర్చుకొనుటకు, బహుప్రయాసలు పడవలసి వచ్చును. ప్రయాసే తప్ప ప్రయోజనమేమియు లేదు కనుక, ఛీ అని అపేక్షల యందు బుద్ధి విడచి ఉండుము.

**విశేషభావము:-** మోక్షమునందు అపేక్ష కల్గిన వాడైయుండవలెను అనుచుందురు. అదియును అపేక్ష, కోరికయే. మోక్షము ఒకరిచ్చేదికాని, ఒకరు తెచ్చుకొనుటకు సంపాదించుకొనేదికాదు. నాకు మోక్షము కావలెను, అనుట సరియైనది కాదు.

నేను లేకపోవుటయే మోక్షము. "మోహః క్షయః" ఇతి మోక్షః అన్నారు. అనగా భ్రాంతి రహితమే మోక్షము. కనుక కోరికలు ప్రయాస తెచ్చిపెట్టేవి. నేను" యందు భ్రాంతిని విడచి, తానులేనని లేకపోవుటయే మోక్షము. జన్మరహితము. అని చెప్పుటయే ఈ పద్యభావము.

**కం॥ లేనినీ కలిమివంధ్యా! సూనునివలె పుష్కరప్రసూనము వలె స్వ। ప్నానందమువలె గంధ। ర్వానీకస్థానమువలెనని తెలియదగున్ ॥ 75**

**భావము :-** శిష్యా! లేని నీ ఉనికి - వంధ్యాపుత్రునివలె, ఆకాశపుష్పము వలె, స్వప్నానందమువలె, గంధర్వ నగరమువలె లేనిదే, మిధ్యయే అని తెలియుము.

**కం॥ నీ తండ్రి జనినమీదట। నీతనయుడు రాకమునుపు నీవున్న పుడున్। యే తత్వమంతటనుగల। దాతత్వము నరసి మృషని తలపుము మిమ్మున్ ॥ 76**

**భావము :-** శిష్యా! నీతండ్రి పోయినతరువాత, నీకుమారుడు రాకముందు, నీవున్నప్పుడు యేతత్వమైతే అంతటను గలదో, ఆ తత్వమును విచారించి చూచి, మిమ్ములను మృషని తెలుసుకొనుము.

**విశేషభావము :-** నీ తండ్రిపోయిన తరువాత అనగా భూతకాలమునందు, నీతనయుడు రాకముందు అనగా భవిష్యత్కాలము నందు, నీవున్నప్పుడు అనగా వర్తమాన కాలమందు అని అర్థము. అనగా మూడుకాలముల యందు అనగా ఎల్లప్పుడు ఏ తత్వముగలదో? పరిపూర్ణమె ఉన్నది. సృష్టికి పూర్వము, సృష్టిపోయిన తరువాత, సృష్టి ఉన్నప్పుడు మూడుకాలము లందును ఏ మార్పులేని తత్వము పరిపూర్ణము మాత్రమే ఉన్నది. కనుక పరిపూర్ణము మాత్రమే శాశ్వతమైనది. మిగిలిన సమస్తము మిధ్యయే.

**కం॥ నీవెనుమీ జీవశివుల్। నీవెనుమీమేనుజగమునీవేనుమీమ్మ। జీవశివైక్యము బయలున। నీవు గలుగలేదు లేదునీ మొదలెచటన్ ॥ 77**

**భావము:-** శిష్యా! జీవుడు, శివుడు నీవే. నీవే మేను, జగము. జీవశివైక్యము నీవే. పరిపూర్ణములో నీవు గలుగలేదు. నీకు మొదలు (మూలము) ఎచ్చటను లేదు.

**విశేషభావము :-** ఈ పద్యము శిష్యునితో చెప్పుచున్నట్లుగా చెప్పినందున నీవు అని చెప్పిరి. నీవు అనగా నేను అని అర్థము చెప్పుకోవలెను. నేనే జీవుడను. నేనే అధిష్ఠానచైతన్యము. అదే జీవుడు, శివుడు, శరీరము జగము. జీవుని ఆవరణ

శరీరము. శివుని ఆవరణ జగము. 'జీవ-శివ ఐక్యమయిననూ నేనే కదా! ఇట్టి "నేను" పరిపూర్ణమందున లేక తోచబడినది. దీనికి మూలము ఏమియు లేదు.

**కం॥ కదిలీనా మెదిలీనా। కదలని యీ బయలునిన్ను గనలేదుగదా। మొదలెక్కడగనరాదిక। కదులుము నీకలిముల్లక్కిగా దల్చీసుతా ॥ 78**

**భావము :-** శిష్యా! నీవు కదిలినను, పరిగెత్తినను, కదలని యీ పరిపూర్ణము నిన్ను జూడలేదు. ఇట్టి నీకు మొదలెక్కడ కనుపించుటలేదు (అనగా మూలములేదు) కనుక నీ ఉనికి లేనిదని, కలవంటిదని తెలిసి లేకుండా పొమ్ము కుమారా!

**కం॥ మేననినను దెలసిన గతి। నేననినది బయలుగాను నీవెరుగోయీ । నేననినది నేననదని । నేనను నేనరయ మృషనినే మృషనౌదున్ ॥ 79**

**భావము :-** శిష్యా! ఈ గుర్తెరిగే శరీరమే నేను అని తెలిసినవిధముగా, "నేను' అహం అననిదే పరిపూర్ణముగా తెలుసుకొనుము. నేను అనని పరిపూర్ణము ఎన్నటికి "అహం" అనదనియు, ఈ నేను మృషయని విచారించి తెలుసుకొనినచో నేను లేకుండును.

**కం॥ మేనొక్కటి నేనొక్కటి। నేనీ మాటలను విడచి నినునీతనువున్ । నేనేనని, యచలముగని । నేననునీవే గవోయినే మృషననుచున్ ॥ 80**

**భావము :-** మేనువేరు, నేనువేరు అనే ఈ మాటలను విడచి, నీవు నీతనువు ఈ రెండుకూడ నేనే యని తెలిసి, పరిపూర్ణమును విచారించి ఉన్నదని తెలిసి, నేననే నీవు మృష, మిధ్యయని తెలిసి నీవు లేకుండుము.

**విశేషభావము :-** ఈ పద్యమును "మేనొక్కటి, నేనొక్కటనే । నీ మాటలను విడచి" అని విడదీయ వలయును.

**కం॥ దేహమున కొంత నిజమని। మోహంబున నిల్చుకొనుటె మోసంబుగురు । ద్రోహమగు గాన విడువుము । మోహంబును మేల్కని కలమునిగిన రీతిన్ ॥ 81**

**భావము :-** శిష్యా! దేహమున కొంత నిజమని మోహముచే అది సత్యమని నిల్పుకొనుట, నిన్ను నీవు మోసము చేసుకొనుటయే కాగలదు. మరియు గురువుచెప్పిన విషయమునకు భిన్నముగా భావించుటచే గురుద్రోహమగును. కావున దేహములో కొంత నిజమని మోహము చెందినదానిని, మేల్కొయందు కలలేక పోయినట్లుగా విడువుము.

**విశేషభావము :-** దేహి - దేహము. దేహము జడము, దేహిచైతన్యము. దేహిచైతన్యముచే దేహము చైతన్యవంతమగుచున్నది. దేహి-దేహములు రెండుగా కనుపించినను విచారించగా, దేహిని విడచి దేహముకాని దేహమును విడచి దేహిగాని ఉండనేరదు. కనుక రెండును దీపప్రకాశముల వలె ఒక్కటేయని తెలియవలెను. అట్లు విచారించక దేహి సత్యమైనది; దేహము మిధ్య అనుట తన్నుతాను మోసగించు కొనుటయే. గురువు దేహిదేహములు రెండును ఒక్కటే అని చెప్పగా శిష్యుడు కొంత నిజము అనగా దేహి నిజము అనుట గురుద్రోహము అగును. అందుచే తిరిగి పునర్జన్మకు వచ్చును. అదే తన్నుతాను మోసగించుకొనుట, కావున మేల్కొలో కలలేక పోయినవిదముగా, పరిపూర్ణములో యీదేహి దేహములు లేవని, దేహి నిజమనే మోహమును విడచి తాలేకపోవలెను.

**కం॥ చలనమున నీవు సుమ్మీ । చలనరహితమనిన బయలు, చలనమె కల, యీ । చలనము చలనరహితము । గలదని కని తొలగమేలు కగునో యప్పా ॥ 82**

**భావము :-** శిష్యా! నీవు (నేను) చలనము. చలనములేనిది ఒక్క పరిపూర్ణము మాత్రమే. చలనము కలవలె అబద్దము. యీ చలనము అనగా "నేను" పరి పూర్ణమున్నదని విచారించి చూచి లేకపోవుటయే; చలనమనె కలకు మేల్కొయగును.

**కం॥ ఈ గుర్తెరిగే మేనును । బాగుగ విడచుండు మిందుబట్టకు దేనిన్ । ఆగడమౌదానసువిని । త్యాగమునీకుంటె మంచిదౌరా వోరీ ! ॥83**

**భావము :-** ఓరీశిష్యా! ఈ గుర్తెరిగే శరీరమును (నేను) బాగుగ విడువుము. ఇందు కొంతభాగమును ఆశ్రయించకుము. పూర్తిగా విడచి ఉండుము. కొంతభాగమును ఆశ్రయించుట వెర్రి పని అగును. విడువగల (త్యాగము) బుద్ధి ఉంటే నీకు మంచిదౌను. (ఆగడము=వెర్రిపని)



**కం॥ చలియించని దాకాశము? చలనంబే వాయువనుచు సాటింప దగున్ । చలనమె విశ్వము నేనన్ చలనమె తను వెరుకల నిన జగమనిన సుతా ॥ 84**

**భావము :-** కుమారా! ఆకాశము చలించనిదా? కాదు చలనమే. చలనమే వాయువు అని చెప్పుము. చలనమే విశ్వము, "నేను" అనేది, తనువు, ఎరుక, జగత్తు యివన్నియు చలనమే. (అచలము ఒక్క పరిపూర్ణము మాత్రమే)

**విశేషభావము:-** ఈ పద్యమును మొదటిపాదము ప్రశ్నార్థకముగా గుర్తించవలెను. "చలియించని దాకాశము? చలనంబే। చలనంబె వాయువనుచు సాటింపదగున్। అని చదివి అర్థము చేసుకోవలెను.

**కం॥ వలదెక్కువ ముచ్చట్లిక। చలనము లేనట్టి బయలుచందము గనియూ। చలనమగు నీకు నీవే। తలిదండ్రుల టంచుదెలిసి తలగుము చాలున్॥ 85**

**భావము:-** శిష్యా! ఇక ఎక్కువ ముచ్చట్లు వద్దు. చలనములేని పరిపూర్ణమును చక్కగా తెలిసి, చలనమగు నీకు నీవే తలిదండ్రులని తెలిసి లేకుండా పొమ్ము చాలును.

**విశేషభావము :-** చలనము అనగా కదులుట మరియు కదిలించు శక్తి అని తెలియవలెను. తాను కదలకపోయినను కదిలించు శక్తి గలిగినదానిని కదిలేది అనవలెను. కనుక అధిష్ఠాన చైతన్యమైన యెరుక తాను కదలకపోయినను కదిలించే శక్తి గలిగినది కనుక చలనమే అగును. ఆకాశమనగా భూతాకాశము అనుటకన్న మహాకాశము అని అర్థము చెప్పుటమేలు. ఇచ్చట పరిపూర్ణమే కదలనిది అనియు మహాకాశమైన యెరుక కదిలేదేగాని చలనిది కాదని చెప్పుటయే ఈ పద్యభావము. చలనముగల వాయువునకు భూతాకాశము మాతృక కనుక ఆకాశము కూడా చలనమే. ఒక్క పరిపూర్ణము మాత్రమే చలనరహితమైనది. నీకు నీవే తలదండ్రులు అనగా నీకు నీవేమూలము. నీకు మరేదియు మూలముకాదు. నీకు అనగా "నేను" ఎరుకకు మూలము యేదియు లేదు. తనకు తానే మూలము అనిభావము.



**కం॥ బ్రహ్మందులేక కల్గిన।బ్రహ్మము నేన నెటి మాయప్రబలె జగంబై।బ్రహ్మమగని తానే గుటె।బ్రహ్మవనేమాయకు వని బ్రహ్మందు జూమీ॥ 86**

**భావము** :- శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మమందు లేకతోచిన "నేనేబ్రహ్మను" అనే మాయ ఒకటి తోచి, జగత్తై విస్తరిల్లినది. ఇట్టి నేను అనే మాయ పరిపూర్ణ బ్రహ్మను విచారించి చూచి, పరిపూర్ణ బ్రహ్మలో తాను లేనని, మాయనని గుర్తించి, తాను లేకపోవుటయే బ్రహ్మ అనే మాయకు పని సుమా ॥

**కం॥ నిరుపాధిక మగు బయలున।మరిలేకనె కలిగినట్టి మారుత మునకే। పరియాయ నామములగు।కరువలియన యెరుకయనిన కడుమాయయునన్ ॥ 87**

**భావము** :- శిష్యా! ఉపాదిరహితమైన యీ పరిపూర్ణములో లేకతోచబడిన వాయువునకే కరువలి, యెరుక, మాయ అనే పర్యాయపదములు కలవు.

**విశేషభావము** :- ఇక్కడ వాయువునకు యెరుక అని చెప్పిరి. జీవులందు ఈ వాయువే ప్రాణము హంస అనే నామములతో వ్యవహారము కలదుకదా. చనిపోతే వాయువు, హంస యెగిరిపోయినది. అని మరణమునకు చెప్పు చున్నారు. అంతేకాని ఆత్మ పోయినది అనుటలేదుకదా. అందుకే ఈ పద్యములో సమస్త జీవులందు ప్రాణరూపముగా నున్నవాయువును ఎరుక అని వ్యవహరించిరి.

**కం॥ మానసముదేహి జీవుం।డానందము సత్తుచిత్తులహము జగదధి।ష్ఠానంబు సాక్షి సత్య।జ్ఞానము ద్రష్టనిన నీవె సత్యము సుజ్ఞా ॥ 88**

**భావము** :- ఓ మంచి జ్ఞానము గలవాడా! మనస్సు, దేహి, జీవుడు, సత్తు, చిత్తు, ఆనందము, అహము, జగదధిష్ఠానము, సాక్షి, సత్యజ్ఞానము, ద్రష్ట ఇవన్నియు నీవే ఇది సత్యము. (అనగా నేను అను యెరుకయే.)

**కం॥ జ్ఞానా జ్ఞానంబులు యీ।జ్ఞానంబువె కాని వేరుగావెన్నటికీ। జ్ఞానాజ్ఞానానికి పని।జ్ఞానాతీతమును గాంచి చనుటయె సుమ్మీ ॥ 89**

**భావము** :- శిష్యా! జ్ఞానము అజ్ఞానము యీ రెండును జ్ఞానమె. అనగా ఎరుగుట, ఎరుగకపోవుట అనుపనులు జ్ఞానమునకే అని అర్థము. కనుక జ్ఞానము వేరు అజ్ఞానమువేరుకాదు. రెండును ఒక్క జ్ఞానమే. అట్టి జ్ఞానాజ్ఞానము జ్ఞానాతీతమైన పరిపూర్ణమును తెలిసి తానులేకపోవుట యే దాని పని సుమా॥

కం॥ జలమందు మొదలులేకనె।జలచరములు బుట్టి పెరిగి సమసిన రీతిన్।అలపరిపూర్ణములోనీ। విలసజ్జననంబు స్థితియు విలయములౌర ॥ 90

**భావము :-** శిష్యా! నీటియందు మొట్టమొదటగా లేకనే జలచరములు (మీనములు) పుట్టి, పెరిగి, నశించినట్లుగా, ఆ పరిపూర్ణములో నీవు కూడ ఈ మంచి పుట్టుక పుట్టుట, పెరుగుట, లేకపోవుట జరుగుచున్నది.

**విశేషభావము :-** నీటియందు మొట్టమొదటి చేప తనంత తానుగా భూమి నీటి రాపిడికి పుట్టునని శాస్త్రదృశ్యము. ఆ తరువాత సృష్టిలక్షణము గానే అనేక మీనరాశి పుట్టుచున్నది. అనగా నీటియందు లేకనే చేపలు పుట్టినవి. అని భాగవత కృష్ణప్రభువుల వారు శాస్త్ర దృశ్యమును ఆధారము చేసికొని ఈ పద్యములో చెప్పినారు. అట్లే మన మందరము ఈజగత్తు సమస్తము ఆ పరిపూర్ణములో లేకనే జనించి, పెంపొంది లయమగుచున్నట్లుగా తెలిసి కొన వలెనని ఈపద్యభావము.

కం॥ అచలమునమొదలులేకనె। సచరాచరజంతునిచ యు జనన మగుయ। పృచ్ఛయమున లేని జలచర।నిచయము జన్మించినట్లు నిశ్చయము సుమీ ॥ 91

**భావము :-** శిష్యా! జలనిధి యందు లేని జలచర సమూహము పుట్టినట్లుగా, పరిపూర్ణములో మొదటలేకనె యీ చరాచర జంతు సమూహము పుట్టినట్లుగా దృఢముగా గుర్తించు సుమా ॥

**విశేషభావము :-** "అచలమునమొదలులేకనె సచరాచర జంతుని చయము జననమగుట" అనగా పరిపూర్ణములో మొట్టమొదటగా లేకనే సమస్త చరాచర సమూహము జన్మించినది అని ఒక అర్థము. మరియు పరిపూర్ణములో ఈ చరాచర జంతు సమూహము అంతయు మూలములేకనె జన్మించినది అని విశేషార్థముగా రెండవ అర్థము.

కం॥ నీరందు చేపలేకనె।నీరున జన్మించి మించి నీల్గిన రీతిన్। తోరమగు బట్టబయటను।వారక గుర్తెరుగు మేను వచ్చున్ పోవున్ ॥ 92

**భావము :-** శిష్యా! నీటియందు చేప లేకనే నీటియందు జన్మించి, పెంపొంది నశించిన విధముగా, గొప్పదైన పరిపూర్ణములో గుర్తెరిగే శరీరము లేకనె వచ్చు చున్నది తిరిగి లేకపోవుచున్నది.

**కం॥ జలధిజల చరము లోపల। గలదా జలరాశిలోని జలచరము వలెన్। జలధి నిత్యంబ నిత్యము। జలచర మట్లచల చలముల సరణులు గనుమీ॥ 93**

**భావము:-** సముద్రము చేపలో గలదా! లేదు. సముద్రము నందే జలచరములు గలవు. సముద్రము నిత్యమైనది. జలచరములు అనిత్యము. వస్తూ పోతూ ఉండేవి. అట్టి విధముగా అచలము జగత్తుల విధమును తెలిసికొనుము.

**విశేషభావము:-** సముద్రములో జచరములు కలవు. కాని జలచరము లోపల సముద్రము (నీరు) లేదు. జలచరములో సముద్రములేదు, అన్నంత మాత్రమున సముద్రము వెల్తిలేనిదే కదా. పూర్ణస్వరూపమై ఉన్నది. జలచరములు పుట్టుచూ చచ్చుచున్నవి. నిత్యమైనది కాదు. సముద్రముఎప్పుడును ఒక్కరీతిగా నిండి యున్నది. పరిపూర్ణము వెల్తిలేనిది. నిండియుండి శాశ్వతమైనది. అందులేక ఉన్న సమస్త చరాచర విశ్వమంతయు అనిత్యము. వస్తూపోతూ ఉండేదే. జలచరములో నీరు (సముద్రము) లేని విధముగా నీయందు పరిపూర్ణము లేదు. ఉన్నదంటే, పరిపూర్ణమునకు ఆధార-ఆధేయ రూపమైన ద్వయ దోషము కలుగును. ఆత్మ ఆధార-ఆధేయ రూపమైన ద్వయ దోషము కల్గినది. అనగా, ఆత్మ ఉపాధిని ఆధారముచేసికొని, తన ఉనికి గల్గించుకొనుచున్నది. అందుచే శరీరము ఆత్మకు ఆధారము. ఆత్మఆధేయము అగును. ఇట్టి ద్వయ దోషము లేనిది పరిపూర్ణము, అని గుర్తింప జేయుటకై పరిపూర్ణము మనయందు లేక పోయినను, జలచరములో నీరు లేకపోయినను సముద్రము వెల్తిలేనివిధముగా, పరిపూర్ణము వెల్తిలేక నిండి యున్నదని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు చక్కగా ఈ పద్యములో నిరూపించినారు. పరిపూర్ణము శాశ్వతమైనది. అందులో లేక ఉన్న చరాచర విశ్వమంతయు అనిత్యము లేనిదే యని భావము.

**కం॥ జలరాశికి పుట్టవు గద।జలచరములు వాటికవ్వెజనియించు గదా।కలకాలమిట్లు బయలెరు।కలగాంచిన సంశయంబు కడకేగు జుమీ॥ 94**

**భావము :-** శిష్యా! జలచరములు సముద్రమునకు పుట్టవుగదా! వాటికవే పుట్టుచున్నవి. ఈవిధముగా ఎల్లకాలము పరిపూర్ణమెరుకలను విచారించి తెలుసుకొనినచో నీ సంశయమంతయు లేకపోవును సుమా.

**విశేషభావము :-** జలరాశియందు జలచరములు వాటంతటి అవే జన్మించి నశించుచున్నవి. జలరాశి వలన జలచరములు పుట్టుట లేదని గ్రహించవలెను. అట్లే పరిపూర్ణములో ఎరుక తనంతతానుగా ఏర్పడి లేకపోవును. అంతేకాని పరిపూర్ణము వలన ఎరుక పుట్టుచున్నదనరాదు. ఎరుకకు పరిపూర్ణమునకు ఏ విధమైన సంబంధము లేదు. పరిపూర్ణము వలన ఎరుక పుట్టుట లేదను సత్యమును బాగుగ గ్రహించుటకై "జలరాశికి పుట్టవు గద జలచరములు" అను ఉపమానమును ఈ పద్యములో చూపించినారు. కనుక ఎరుక తనంత తానుగ పరిపూర్ణములో లేకతోచి, విస్తరించి, లేకపోవుచున్నది. అని తెలుసు కొనవలయును.

**కం॥ పుట్టదు గిట్టదువొకరిని।పుట్టించదు చంపబోదుభూమ,**
**యెరుకదా। పుట్టును గిట్టును వొకరిని।పుట్టించును సమయజేయు**
**భూమకితరమై ॥ 95**

**భావము :-** శిష్యా! పరిపూర్ణము పుట్టదు, నశించదు మరియు వొకరిని పుట్టించదు, నశింపజేయదు. యెరుక తనకు తానే పుట్టును, నశించును, వొకరిని పుట్టించును, నశింపజేయును. కనుక పరిపూర్ణమునకు ఎరుక వేరైనదిగా తెలుసుకొనుము.

**విశేషభావము :-** 'జాతస్యహిధృవో మృత్యుః" పుట్టిన సమస్తము మరొకప్పుడు చచ్చితీరును. అన్నట్లుగానే పుట్టి చచ్చేదే మరొక దానిని పుట్టించుట చంపుటయు కూడ చేయగలదు. ఇదంతయు నామ,రూప, క్రియా సహితమైన ఎరుక లక్షణము. నామరూపక్రియా రహితమైన పరిపూర్ణము, నామ,రూప,నటన, స్తోమము ఆవంతయు లేనిది కనుక, తాను పుట్టుట, చచ్చుట, ఒకరిని పుట్టించుట, నశింపజేయుట అనునది లేదని ఈ పద్యభావము. "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవన్తి, యత్ప్ర యంత్యభి సంవిశన్తి, తద్బ్రహ్మ" అను శృతి రీత్యా - ఈ సమస్త భూత ప్రపంచము దేని వలన పుట్టుచున్నదో, వృద్ధి పొందుచున్నదో, మరియు నశింప జేయబడుచున్నదో అదే బ్రహ్మ అని చెప్పబడుచున్నది. ఇది బ్రహ్మమునకు తటస్థ లక్షణముగా శృతుల యందు చెప్పబడుచున్నను, ఎట్టి లక్షణము కల్గినను అది నామ రూప క్రియాసహితమైనది. నామరూపక్రియ కల్గినది బ్రహ్మము కానేరదు. అదే ఎరుక, దీనికి వ్యతిరిక్తమైనదే పరిపూర్ణము. అదే బ్రహ్మ అని ఈ పద్యభావము.

**కం॥ కలలోపల యేనుగ్పైగల దొరమేల్కనిన నిల్వగలడా గురుడున్। తెలపి బయలు, నీవులేవిక।దలపకు మన నీకు నిల్వదరమా తలపన్ ॥ 96**

**భావము:-** శిష్యా! స్వప్నములో తాను ఏనుగుపై అంబారీలో కూర్చొని ఊరేగుచున్నట్లు కలగనినవాడు, మేల్కొనగనే ఆ ఊరేగింపు ఏనుగ, ఉత్సవముతో నిల్వగలడా! అవన్నియు కలయే అనగా లేనిదే. అట్లే గురుమూర్తి, పరిపూర్ణమును తెలిపి, "నీవు" లేవనియు, దానిని తలపవద్దని దృఢపరిచినచో "నీవు" అనగా యెరుక నిల్వగలదా! అనగా లేకుండా పోవునని భావము. యెరుక కలవంటిదనియు, పరిపూర్ణమను మేల్కయందు కల అయిన ఎరుక లేకపోవుచున్నది అని భావము.

**కం॥ ఎందరులేదన్నను తా। నెందుకు లేకుండు బయలు నే నీవనకన్। యెందరుకలదనియన్నను।యెందుకు కలిగుండు యెరుకనేనీ వనుచున్ ॥ 97**

**భావము:-** శిష్యా! (మూర్ఖత్వముచే) ఎందరులేదని యన్నను, నేను, నీవు అని అనే పలుకులేని పరిపూర్ణము యెందుకు లేకుండును? అనగా శాశ్వతమై ఉన్నది. అట్లే (మూర్ఖత్వచే) నేను, నీవు అని పలికే యెరుక ఎందరు ఉందని వాదించినను, అది నిశ్చయముగా ఉండనిదే, లేనిదే. అని తెలియుము.

**విశేషభావము:-** నేను-నీవు అని పలుకులేనిది పరిపూర్ణము. నేను ఆత్మను, నీవు జగత్స్వరూపము. నేను శాశ్వతము, నీవు అనిత్యము అని ద్వంద్వముతో కూడినది యెరుక. ఇట్టి ద్వంద్వము లేనిది పరిపూర్ణము. శాస్త్రజ్ఞానమును మాత్రమే కలిగి, విశేషమైన గురు బుద్ధి లేనివారు ద్వంద్వ సహితమైన యెరుకయే శాశ్వతమని చెప్పినను, ఎరుకయెంత మాత్రము నిలిచేది కాదు. కలవంటిదే. లేనిదే, మరియు వారు పరిపూర్ణమును చక్కగా గుర్తించ లేక అదిలేదు, శూన్యమని వాదించిననూ, పరిపూర్ణము శాశ్వతమైనది. పరిపూర్ణము మాత్రమే ఉన్నది. అందులో ఎరుక ఎంతమాత్రము లేదు. అనిభావము.

**కం॥ నీకచ్చిరాని యూరున।నీకేగృహమచ్చనట్లు నీవామేనన్। నీ కచ్చిరాదు నీవునిను।చేకొనుటము మానవయ్యశ్రేయస్కామా! ॥ 98**

**భావము:-** శిష్యా! ఓ శ్రేయస్సును కోరువాడా! నీకు అచ్చిరాని గ్రామములో ఏ గృహము నీకు అచ్చిరాదు నచ్చదు. అట్లే నీవే అయిన శరీరము నీకు అచ్చిరాదు. కనుక నీవు నిను అనగా "నేను" అను దానియందు భ్రాంతి మానవయ్యా.

**విశేషభావము:-** ఈ పద్యములో శిష్యుని "శ్రేయస్కామా" అని సంబోధించిరి. శ్రేయస్సు కోరువాడా అని అర్థము. జన్మరహితమైన మోక్షమార్గము శ్రేయస్సు అనియు, పునరావృత్తి సహితమైన లౌకిక మార్గము నిశ్రేయమనియు శాస్త్ర వచనము. శిష్యుడు పునరావృత్తి రహితమైన మోక్షమార్గమును కోరుచున్నవాడై నందున కృష్ణదేశి కేంద్రులవారు శిష్యుని "శ్రేయస్కామా" అని సంబోధించినారు.

అచ్చిరాని గ్రామములో ఏ గృహమైనను అచ్చిరాదు. తననామమును బట్టి ఒక పేరుగల గ్రామము వానికి అభ్యున్నతి కారణమగునో కాదో గ్రామార్వణమను శాస్త్రములో చెప్పబడినది. అభ్యున్నతికి కారణము కాని అట్టి గ్రామములో వాడు ఏయింటి యందు ఉన్నను, ఔన్నత్య కారణము కానేరదు. ఆ ఊరు అతనికి అచ్చిరాలేదు. అట్లే "నేనే" లేనిది. ఇది ఉన్నదని భ్రాంతి పడుట జన్మకారణమగుచున్నది. కనుక "నేను" లేనిదని గురువాక్యముచే విడువ వలయును. "నేను" ను విడచినవాడు శరీరమునందు భ్రాంతి పడుట తగదు కదా! ఎందుచేతననగా నేను-మేనులు ఒక్కటే నేనును విడచుట యనగా మేను సహితమైన "నేను" ను విడుచటయే అగును. నీవు శ్రేయస్సును కోరుకానేవాడివే అయినచో మేనుతో సహా నేను యందు భ్రాంతి విడువుము అని ఈ పద్యభావము.

**కం॥ అష్టాంగయోగములనతి।కష్టించే ప్రజలవలెనె కష్టించకయూ।**
**స్పష్టమగు బోధవినునీ।కష్టములన్నియును దొలగికడకేగు సుమీ ॥99**

**భావము:-** శిష్యా! అతి కష్టములచే అభ్యసించు అష్టాంగ యెగులవలె కష్టపడక, యెట్టి వంకర లేని స్పష్టమైన (ప్రత్యక్ష ప్రమాణముగా తెలియబడే) యీ పరిపూర్ణబోధవిని సమస్త కష్టములు కల్గిన పునర్జన్మ లేకుండా పొమ్ము.

**విశేషభావము:-** అష్టాంగయోగములు-యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనునవి. బహుకష్టసాధ్యములు. కాని జన్మ రహితము కానేరదు. పునరావృత్తిని కల్గించునవే. ఒక్క పరిపూర్ణ బోధ వలన మాత్రమే పునరావృత్తి రహితమగును. ఇది ప్రత్యక్షమే ప్రమాణముగా గలది, కనుక స్పష్టమైనది పరిపూర్ణ బోధ అని చెప్పబడినది.

**కం॥ ఇదిగాదు బోధనేదె। త్పెద రమ్మని నీకు వేరే పేరిడి యవలన్। ముదమున నే బ్రహ్మననుచు। వదరుమనిన వాడె మాయ వసుమతి లోనన్ ॥ 100**

**భావము :-** శిష్యా! నీవు తెలుసుకొనినది పరిపూర్ణబోధకాదు. వేరే ఏదో పేరు పెట్టి, కొత్త బోధ యిది, దీనివలన మాత్రమే పునర్జన్మ లేకుండాపోవును, అట్టి దీనిని నీవు తెలుసుకొనుమని రమ్మని పిలచి, చివరకు "నేనే" బ్రహ్మనని తెలియుచెప్పిన వాడే మాయ అని గుర్తించుము. అట్టి ఇతరమైన బోధస్థుల దరిజేరకమని భావము.

**కం॥ మంత్రయంత్రములు ముద్రలు।తంత్రంబులు నీకు దెల్పి ధనమడిగెటియా। మంత్రజ్ఞుల మంత్రములకు। యంత్రములకు తంత్రములకు నీ గకుకూనా! ॥ 101**

**భావము :-** శిష్యా! కుమారా! మంత్రములు, యంత్రములు, ముద్రలు, తంత్రములు దెలియపర్చి ధనము దోచుకొనే మంత్రగాళ్ల మంత్రములకు, యంత్రములకు, తంత్రములకు నీ మనసు పోనీయకుము.

**కం॥ దీపము గతికన్నులలో। పాపవలెన్ వెలగు నిన్ను పరమాత్మ్మదవం । చి ప్రజలు దలతురెరుగక । నీ పాట్లెరుగుండి నేను నిను నమ్మ్మదునే ॥ 102**

**భావము :-** శిష్యా! కనుపాపలో ప్రకాశరూపమై ఆపోజ్యోతిగా తెలియబడే నిన్ను (నేననుచైతన్యము) ఎరుగని ప్రజలు పరమాత్ముడవని దలంతురు. కాని నీ (నేను) పాట్లు (జనన-మరణములు) ఎరిగిన నేను (ఆపోజ్యోతిని) నమ్ముదునా? అది యెరుకే యని తెలిసి విడచి [illegible] భావము.

**కం॥ తర్జనుల వలన జూపును। నర్జున వర్ణగత నీలమని శిష్యుల కున్ । దౌర్జన్య గురుడునీవు వి । సర్జింపుమ సత్యమనుచు సజ్జన తిలకా ॥ 103**

**భావము :-** శిష్యా! తర్జనీ వ్రేలితో (చూపుడువ్రేలు) కనురెప్పలు మూసి లో దృష్టిచే చూడుము ఎరుపు రంగు మధ్య నీలిరంగుతో ప్రకాశించునదే పరమాత్మ యని దౌర్జన్య గురువులు చూపించెదరు. అవన్నియు అసత్యమని విసర్జింపుము. ఓ సజ్జనులలో శ్రేష్ఠుడా!

**కం॥ పురుషోత్తముడని పూజలు । వరులొనరింపుదురు భువిని నావాచోట్లన్ । ధర మొదలగు భూతములను । చిరుత శిశువు లాడుకొనెటి చేష్టల రీతిన్ ॥** 104

**భావము:-** శిష్యా! చిన్నపిల్లలు బొమ్మలతో పెళ్ళిళ్ళు చేసుకొని ఆటలాడుకొను... ఆనందించినరీతిగా అనేక చోట్ల అనేకమంది జనులు పృథివ్యాది పంచభూతములు వగైరాలను పరబ్రహ్మమని పూజలు చేయు... (అదంతయు యెరుకేయని తెలియుము).

**కం॥ రసమనదగనిది వస్తువ। బసవన్నకదెట్టులెరుక ప్రభువుకు దెలుసున్। రసమైతె విషము సగుణము। పసిగాదా ముచ్చటంత చెవులవినుటకై ॥** 105

**భావము:-** శిష్యా! పరిపూర్ణము అమృతమనదగని వస్తువు. అట్టి పరిపూర్ణము. అజ్ఞానులకెట్లు తెలియును. గురు ప్రభువులకు మాత్రమే దెలియును. అమృత మైనదియేదో అదేవిషము (మృతము) కూడ అగును. కావున ఆమాటలు వినుటకు ఎంతమాత్రము బాగుండలేదు.

**విశేషభావము :-** రసమనగా నిర్విశేషరసము అని అర్థము. ఇది బ్రహ్మము కాదు. ఇది బ్రహ్మము కాదని తీసివేయగా అనగా బుద్ధిచే వేరు చేయగా చిట్టచివరకు బాగా శేషించిన అమృత పదార్థమునకు నిర్విశేషరసమని పేరు. ఇదియే బ్రహ్మమని, ఏకమేవా ద్వితీయం బ్రహ్మమని చెప్పబడినది. ఇది ఒక్క అమృత రూపము, ఒక్కటే అయినచో సృష్టి ఇందుండి ఏర్పడే అవకాశములేదు కనుక ఇందులో "రసము"న కు భిన్న ధర్మములు కల "బలము" అను పదార్థము ఖండఖండాయమానములు గాయున్నది. కాని రస, బలములు ఎంత మాత్రము విడదీయరానివి. దీప-ప్రకాశముల వలె భిన్నధర్మములు కల రెండు పదార్థముల సమ్మిశ్రమ పదార్థమే అయినను నిర్విశేషరసము- బలము ఈ రెండును ఎన్నడూ, ఎప్పుడూ, విడదీయబడవు. కనుక ఒక్కటే. దీనినే సదసత్పదార్థము అనికూడ అందురు. దీనినుండియే బ్రహ్మాండములు అనంత సృష్టి ఏర్పడుచున్నది. ఇదియే అద్వైత బ్రహ్మ పదార్థము. అమృతము. పరిపూర్ణము ఇట్టి నిర్విశేష రసము కానిది. సదస ద్రహితపదార్థము. రసమునకు అతీతమైనదే పరిపూర్ణమని, పరిపూర్ణబోధగురువునకు తప్ప మరి యితర

సిద్ధాంతులకు తెలియదు. రసమే పరిపూర్ణమని భావించెదరు. రసము, అమృతము-మృతము, రెండు భిన్న పదార్ధముల మిశ్రమమే కదా! కనుక రసమైతే-విషము సగుణము అన్నారు. రసము-అమృతము, నిర్గుణము. అందలి బలము-విషము మృతము, సగుణము. ఈ రెండును కలిసియున్న కారణము వలననే, అందుండి సృష్టి ఏర్పడుచున్నది. సృష్టి లేని స్థానము కాదు. సృష్టికి మూలమైనది. కనుక అదే జన్మరహితమైన స్థానము అనుట సరికాదు. అని ఈపద్యములో చెప్పబడినది.

**కం॥ నీరాంశము సృగ్వోదన। సారము రేతస్సు రెంటి సమ్మిశ్రంబే। ధారుణితను వైనిలుచును। నారీ నరసంగమమున నయగుణరత్నా॥ 106**

**భావము:-** శిష్యా! మంచి గుణములు కలవాడా! నీటియొక్క అంశము శ్రోణితము. అన్నము యొక్క అంశము రేతస్సు (శుక్రము) స్త్రీ పురుష సంయోగముచే ఈ శుక్రశ్రోణితముల కలయికే శరీరధారియై భూమిపై యేర్పడుచున్నది.

**విశేషభావము :-** నీరు వలన రక్తము యేర్పడుచున్నది. ఈరక్తము యొక్క అంశయే శ్రోణితము (సృక్) అన్నము యొక్క సూక్ష్మభాగము సప్తధాతువులు. అదే రేతస్సు (శుక్రము). 83వ కందార్ధ దరువు విశేష భావము చూడనగును.

**కం॥ మనసన్నపు సూక్ష్మాంశము। వినుజల సూక్ష్మాంశ వలన వెలసెను ప్రాణం। బును రెండు గలసి పిండం। బన బ్రహ్మాండం బనంగబరగును వత్సా॥ 107**

**భావము :-** కుమారా! అన్నము యొక్క సూక్ష్మాతి సూక్ష్మ భాగము వలన మనస్సున్ను, జలము యొక్క సూక్ష్మాతిసూక్ష్మ భాగము వలన ప్రాణమును ఏర్పడి ఈ మనఃప్రాణములు కలసి పిండ బ్రహ్మాండములుగా యేర్పడుచున్నది.

విశేషభావము :- బ్రహ్మాండములో ఉన్న చైతన్య విశేషమునకు పురుషుడు లేక పురుషోత్తముడు అందురు. ఈ పురుషుడు త్రిపురుషైక మూర్తి. 1) అవ్యయ పురుషుడు, 2) అక్షర పురుషుడు, 3) క్షర పురుషుడు అని మూడు విధములు. వీరే బ్రహ్మాండ, పిండాండ వ్యవహారకర్తలు, క్షరపురుషుడు - ఉపాదాన కారణము. అక్షరపురుషుడు - నిమిత్తకారణుడు, అవ్యయపురుషుడు - సృష్టి చేయుటలో ఎట్టి నిమిత్తము లేనివాడయ్యెను, కుండలు చేయుటలో భూమి

వలె సర్వాలంబన కారణము. అందుకే భగవద్గీతలో "కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయం" అని చెప్పబడినది. నేను ఈ సృష్టి(అక్షర రూపములో)కి కర్తనే అయినను, అవ్యయ రూపములో అకర్తనుగా తెలియుము అన్నారు. ఇట్టి అవ్యయ పురుషునకు 5 కళలు కలవు. 1) ఆనంద, 2) విజ్ఞాన, 3) మనః, 4) ప్రాణ, 5) వాక్కులు. మూడవ దైవ మనస్సే 4వ దైవ ప్రాణభాగముతో చేరి నపుడు పిండాండములో పిండాండవ్యవహారమును, బ్రహ్మాండములో బ్రహ్మాండ వ్యవహారము అనగా సమస్త సృష్టికి కారణమగు చున్నది. మనస్సు ప్రాణ భాగమును విడచి ఆనంద విజ్ఞానములతో కలసినప్పుడు సృష్టిలయ మొంది ముక్తి కారణ మగుచున్నది. ( ఈ పాఠము పూర్తి వివరము, నాచే సంకలనము చేయబడిన వేదాంత పాఠములు అనుపుస్తకములో "ఇదం బ్రహ్మ చతుష్పాత్' అను పాఠములో కలదు). కనుక మనః పాణముల కయిక వల్లనే పింద బ్రహ్మాండములలో సమస్త సృష్టి వ్యవహారములు జరుగుచున్నవి అని ఈ పద్య భావము.

**కం॥ రెండు రీతుల గనంబడు । చుండే యీమేని చేత చూచి బయలును । ద్దండత దీనినుళక్యని । యుండుము దీనందువాంఛ నుంచకశిష్యా! ॥ 108**

**భావము :-** శిష్యా! సగుణ, నిర్గుణ రూపములుగా తెలియబడే ఈ గుర్తెరిగే శరీరము (నేను) చేత పరిపూర్ణమున్నదని చూచి, ఈ గుర్తెరిగే శరీరము లేదని సంశయరహితముగా దృఢపడి, ఇట్టి గుర్తెరిగే శరీరమునందు భ్రాంతిని విడువుము.

**విశేషభావము:-** భ్రూమధ్య స్థానాంతర్గతమైన ఎరిగే శరీరమే మేను అనబడును. ఇది సహస్రారమందలి ఆత్మయొక్క ప్రతిబింబము. ఆత్మయే "నేను". 'గుర్తు' అనబడును. ఆ స్థానమునందు ఆత్మ నిర్గుణ రూపమై ఎరిగే లక్షణము లేనిది. కాని ఆ ఆత్మయే భ్రూమధ్య స్థానమునందు సమస్తమును ఎరుగుచున్నందున, ఈ స్థానమునందున్న ఆత్మ ప్రతిబింబిత చైతన్యమును "ఎరిగే శరీరము" లేక "ప్రత్యగాత్మ" అని వ్యవహారము. బింబ-ప్రతిబింబములుకు భేదము లేదు కనుక ఆత్మ - ప్రత్యగాత్మలకు అనగా గుర్తు - ఎరిగే శరీరములకు అభేదము. కనుక రెంటిని కలిపి గుర్తెరిగే శరీరమని ఏకత్వముతో చెప్పుట శ్రీ దీక్షిత సాంప్రదాయము. ఇట్టి గుర్తెరిగే శరీరము (మేను) భ్రూమధ్య స్థానమున సగుణ

రూపమై సర్వక్రియా సమన్వితముగను, సహస్రార మందు నిర్గుణరూపమై నిష్క్రియగాను రెండురూపములుగా వ్యవహరించుచున్నది. కనుక యీ మేను అనగా "నేను", రెండు రూపములుగా గనుపడుచున్నది. యిట్టి నేను చేతనే పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నదని గురు ముఖతా గుర్తించి, గుర్తించే "నేను" లేదని ఈ నేను బ్రహ్మము కాదని భ్రాంతిని విడుచుటయే ఈ పద్యభావము.

**కం॥ ద్వైతాఽద్వైతవిశిష్టా । ద్వైతులమని కీచులాడు దయ్యము లవలెన్ । ద్వైతాఽద్వైతవిశిష్టా । ద్వైతులతో కీచులాడ దగునే నీకున్ ॥ 109**

**భావము :-** శిష్యా! ద్వైత, అద్వైత, విశిష్టా ద్వైత సిద్ధాంతులు మా సిద్ధాంతము గొప్పదంటే మా సిద్ధాన్తమే గొప్పదని తగువు లాడుకొను నీచులవలె నీ సిద్ధాంత మే గొప్పదని ఇతర సిద్ధాన్త వాదులతో ఎన్నడును వాదించకుము.

**విశేషభావము:-** జీవుడు - శివుడు రెండునూ స్వయంభువులే ఒక దానియందు మరొకటి ఎన్నడును లయమొందునవి కావు కనుక "జీవ బ్రహ్మైక్య సిద్ధాన్తము తప్పని ద్వైత సిద్ధాంతులున్ను, జీవ-శివులు మొట్టమొదటగా రెండు కావు ఒక్కటే శివరూపమనియు, నిప్పు నుండి విస్ఫులింగముల వలె శివుని నుండి అనేక జీవులు ఏర్పడినవనియు, అట్లు శివుని నుండి వేరుపడిన జీవులు, పాల నుండి విడివడిన వెన్న తిరిగి పాలలో కలవనట్లుగా, తిరిగి శివరూపము నందైక్యము, కాలేవనియు, అందుచే జీవ - శివైక్యము అసంభవమని విశిష్టా ద్వైతులున్ను, ఏక స్వరూపమే అయిన శివుడు ఒక్కటే తప్ప జీవులు వేరుగా ఎన్నడూ లేవనియు "జీవో(బ్రహ్మైవనాపర" అని జీవుడే శివుడు అను సిద్ధాన్తముతో అద్వైతులున్ను వాదించుకొందురు. ఇట్టి సిద్ధాన్తములతో పునరావృత్తి రహితము కానేరదు. అట్టి శివుడు, జీవుడు రెండును ఎరుకయే కాని బ్రహ్మము కానేరదు. పరిపూర్ణమే శాశ్వతమైనది అను సిద్ధాంతము కల ఈ అచల పరిపూర్ణ సిద్ధాంతులకు ఇతర వాదములతో పనిలేదు. మాది గొప్ప సిద్ధాన్తము అనుమాట అహంకారులకు మాత్రమే కాని, అహం రహితులకు వాదప్రతివాదములతో పనిలేదు కనుక ఎట్టి సిద్ధాంతవాదుల తోను వాదించ పనిలేదనుటయే యీ పద్యభావము.

**కం॥ అనుభవ వేదాంతులమని। తినరాని పదార్ధమెల్లతిను దుర్జను లన్ । కనబోకుముతద్బోధను । వినబోకుము యెన్నటికి వివేక విచారా ॥ 110**

**భావము :-** మంచియేదో చెడుయేదో శాస్త్రాధారముతో విచారించే ఓ శిష్యా! లోకములో కొందరు అనుభవ వేదాంతులమని చెప్పుకొనుచు, తినరాని పదార్థములను తినే దుర్జనులను, ఎన్నడు కలియకుము. వారు చెప్పే బోధను వినకుము.

**విశేషభావము :-** తినరాని పదార్థములు :- కల్లె, మలమూత్రములు, వీర్యము, వమనము ఈపదార్ధములను మానవులు తినరాదని శాస్త్ర వచనము. కొందరు వేదాంత గురువు తన యొక్క వీర్యమును కల్లుతో కలిపి శిష్యసమేతముగా త్రాగివేయుదురు. అనగా ఎరుకనుమ్రింగి వేసితిమి అందురు. అలాగే శాక్తేయ మతములో త్రాగి కక్కిన వమనమును "భైర్క" పేరుతో ఆ భక్తులు ప్రసాదముగా త్రాగుదురు. వీరందరూ అనుభవ వేదాంతులమని చెప్పుకుందురు. ఇవి దురా చారములు. ఎంత మాత్రము వినదగినవి కావని ఈ పద్యభావము.

**కం॥ జంహ్వో పస్థల విషయము । లెవ్విగలవా వాటి విడువలేని గురువులన్। యెవ్వరుజేరికొలుతురో। యివ్వసుధను వారుజెడుదు రిదినిజము సుమీ ॥ 111**

**భావము :-** శిష్యా! జింహ్వా చాపల్యము ఉపస్థచాపల్యములు ఈ రెంటిని విడువలేని గురువులను చేరికొల్చిన శిష్యబృందము చెడిపోవుదురు. యిది నిజము సుమా!

**విశేషభావము :-** జింహ్వా చాపల్యము అనగా అతి తిండి మరియు రుచులను విడువలేక పూర్వపు విధముగనే నానారకములైన తిళ్లు శిష్యులచే తెప్పించు కొని తినుట. కొందరు గురువులు శిష్యుల యింటికి వచ్చినప్పుడు మొదలు, వెళ్లేవర్కు రకరకములైన మాంసాహారములు చెప్పి వండించుకొని సంతోషముతో తినిపోయెదరు. ఇది దురాచారము. రాజస తామస హారములను జ్ఞాన సము పార్జనచేయు వారు తినరాదు. అట్లే స్వభార్యతో దాంపత్య సుఖమును అను భవించ తగును కాని ఎంత మాత్రము వ్యభిచారము పనికి రాదు. ఇది యే ఉపస్థ విషయమై చాపల్యము అనబడును. భార్యలేనివారు కొందరు, తనువును

ధారపోసితివి గదా అని స్త్రీ శిష్యులతో పొందుచేయు కొందరు గురువులు ఈనాడు ఈ సాంప్రదాయములో పెరిగి పోవుచున్నారు. ఇది ఎంతటి దౌర్భాగ్యమో గమనించ వలయును. ఇట్టి దౌర్భాగ్యగురువులను చేరి కొల్చే శిష్యులు తప్పక చెడిపోయి, జ్ఞానహీనులయి, నరకము పాలయ్యెదరు.

**కం॥ పాషండమతము వారల । వేషంబులు జూచి శిష్య వితతి భ్రమించున్। ఈషత్తీ బోధెరుగక। దూషింతురు విన్నకన్న దుర్భాషణ లన్ ॥ 112**

**భావము:-** శిష్యా! కాపాలికాది పాషండ మతము వారల యొక్క వేషభాషలను జూచి, ఈ బోధకొంచెమైన ఎరుగని శిష్య జనసమూహము భ్రమ చెందుదురు. వారినిజస్థితిని తెలిసినవారు, వారిని జూచినను, లేదా వారి మాటలు విన్నను దుర్భాషలనాడెదరు.

**కం॥ ఎందరు దూషించితెయే। మందరు మనవారెకాని యన్యు లెనీవా। యందరితో వాదించక। నందంబౌనిట్టి బోధన రయరతండ్రీ ॥ 113**

**1) భావము :-** శిష్యా! (తెలియక) ఎందరు దూషించెతేయేమి? అందరు మనవారే కాని ఇతరులా? ఆ అందరితో నీవు వాదించక చక్కని యీ బోధను బాగుగ తెలుసుకొనుము తండ్రీ!

**2) భావము:-** శిష్యా! నిజబోధ నెరుంగక ఎన్నిమతవాదులు నిన్ను దూషించితె యేమిపోయినది? వారందరు మనలాంటి వారే, కాని ఇతరులే. (మనతో సమానమైన వారుకారు). అట్టి వారితో నీవు వాదించక చక్కని యీ బోధను బాగుగ గ్రహించుము.

**కం॥ కోపమెపాపంబనబడు। గోపమెహంకార మనచుకొని యూఢ బడున్ । కోపమెతాపంబనబడు । గోపమె మృత్యువనబడుమ కుటిలవిరహితా ॥ 114**

**భావము :-** శిష్యా! కుటిలత్వములేనివాడా!కోపమె పాపమనబడును. అనగా కోపమువలన పాపకర్మచేయబడును, కోపమె అహంకారమునకు మూలము. కోపము వలన ఉగ్రమైన తామస ప్రవృత్తి యేర్పడును. చివరకు కోపము వలన కఠినమైన మృత్యువు కూడ యేర్పడుచున్నది. కనుక జ్ఞానసముపార్జన చేయు

వారు కోపమును తప్పక విడువవలయును. (కోపము అనగా ప్రతికార యోచన అని గ్రహించవలెను).

**కం॥ నిజగురు బోధ నెరుంగక । గుజగుజ శిష్యులకు జెప్పు గురువుల బోధల్ । భుజగవిషోపమగు సుమీ । సుజనౌఘము మెచ్చదట్టి సుద్ది నిబద్ధీ । 115**

**భావము:-** శిష్యా! ఓ ని బద్ధీ (నిజస్వరుడా!) స్వచ్ఛమైన పరిపూర్ణబోధ పూర్తిగా నెరుగక, గురువులై బాధించుచు, శిష్యులకు చెప్పే గురుబోధలు పాము విషముతో సమానమైది సుమా. సజ్జన సమూహము అట్టి వారి మాటలను వినరు. (గుజగుజ - పీడితము)

**కం॥ తనువును విడి బ్రహ్మనునే । నను, మునుపటి నీ విచార మటు బెట్టిపుడున్ । నినునీతనువును వేరని। యనకను పరిపూర్ణ మరసి యువి విడువదగున్ ॥ 116**

**భావము :-** శిష్యా! శరీరమును విడచి (అనగా శరీరము అశాశ్వతమైనదని దీనందు మనసు విడచి) "నేను బ్రహ్మనే" అనే పూర్వపు విచారణ మానివేసి, ఇప్పుడు పరిపూర్ణమును గురుముఖతా తెలిసి నిన్ను నీ శరీరము ఈరెండు వేరని యనకుండగ, ఆ రెండు లేనివేయని విడచిపెట్టుము.

**కం॥ కొందరు వైరాగ్యంబున। కొందరు తీర్థాటనమున కొందరు కర్మం। బందున వ్రత జపతపములు। కొందరు నటియింతురట్టి కోర్కెల మనుజుల్ ॥ 117**

**భావము:-** శిష్యా! కొందరు వైరాగ్యముచే సన్యాసలుగను, మరికొందరు కాశీ ప్రయాగాది తీర్థములు తిరుగుచును, మరికొందరు యజ్ఞయాగాది కర్మములు చేయుచు, మరికొందరు జపములు తపములు చేయుచు ఈ విధముగా అనేక మంది అనేక కోర్కెలచేత అనేక విధములుగా నటించుచుందురు.

**కం॥ కొందరు భక్తిత్రయమువ। కొందరు యోగముల యందు కొందరు జ్ఞానం। బందురమింతురువారల। కందరికీ బోధ యిష్టతౌనా నాయన ॥ 118**

**భావము:-** శిష్యా! కొందరు కర్మ, భక్తి, తపస్సు లనెడు భక్తి త్రయమందునను, మరికొందరు యోగాభ్యాసముల యందును, మరికొందరు జ్ఞానస్వరూపంబైన పరబ్రహ్మ తత్వమందున వారి మనస్సు సంచరించును. అట్టివారికి ఈ పరిపూర్ణ బోధ ఇష్టత అగునా తండ్రీ!

**కం॥ భ్రమరహిత సహిత జనులకు। సుమనసులను నరుల సమము జూచిన విశ్వం। బమరిలేకుండు నుండును। క్రమమున కలవంటి దగుచుకడు నిజము జూమీ॥** 119

**భావము :-** శిష్యా! భ్రమతో కూడిన జనులునరులు. వీరికి విశ్వము (జగత్తు) నిజమైనదనే భావము కల్గియుందురు. భ్రమ రహితమైన వారు దేవతలు వంటివారు. వారికి జగత్తు కలవంటిదై లేకుండును అని భావము.

**విశేషభావము :-** ఈ పద్యము క్రమాలంకారములో చెప్పబడినది. కనుక ఈ పద్య భావమును ఈ విధముగా విడగొట్టవలయును. భ్రమరహితజనులకు, సుమనసుల సమముజూచిన విశ్వంబ మరి లేకుండును కలవంటి దగుచు॥ భ్రమ సహిత జనులకు నరుల సమము జూచిన విశ్వంబమరి కడునిజము జూచి (అనుచు) ఉండును.

ఈ పద్యములో "భ్రమ" అనగా ఎరుక అని అర్థము. ఎరుకతోకూడిన వారు నరులు అనగా జనన మరణములతో నుండువారు. వారికి జగత్తు నిజమై ఉండుననే భావము కల్గియుందురు. ఎరుకను విడిచినవారు (భ్రమరహిత జనులు) దేవతలతో సమానము. అనగా జనన మరణములు లేనివారని అర్థము చెప్పవలయును. అట్టి భ్రమరహితులకు ఈ జగత్తు కలవంటిదై లేక పోవును. తానే కలవంటిది కనుక తనతో కూడిన జగత్తు కలవంటిదై లేకపోవును.

**కం॥ కలతననులేను కలనని । తలపోసెటి వారి మాట తమకే నిజమౌ । కలలేని వారు కలవా । రలువీరలె నొకరి నొకర రయరి రువురున్ ॥** 120

**భావము:-** శిష్యా! యదార్థముగ "నేను" లేను. కలవంటిది యని భావించే వారి మాటవారికి మాత్రమే నిజము. "నేను" లేనివారు, "నేను" ఉన్నవారు, వీరిని ఒకరినొకరు యిద్దరు చూచుకొనలేరు. అనగా ఒకరి భావము మరొకరికి సరిపడదు అని భావము. (కలత=యదార్థము).

**విశేషభావము:-** "నేను" కలవంటిది. కనుక లేను అని దృఢమైన వారి యొక్క భావము వారికే నిజము కాని కలలో ఉన్నవారు అనగా ఎరుకలో నున్న వారికి నిజముకాదు. ఎరుకలో ఉన్నవారు, ఎరుక విడచినవారు వీర్దిరు ఒకరినొకరు చూడలేరు అనగా ఎరుకలో ఉన్నవారు ఎరుక విడచిన వారి భావమును గ్రహించలేరు. ఎరుక విడచినవారు తామే లేనివారు కనుక ఎరుకలో ఉన్నవారిని (కలను) చూడలేరు.

**కం॥ ఎరుగుట జ్ఞానము దానను। జరిగే పని కర్మమనుచు జనులెన్నిరియా। యెరుకయు కర్మము లేనిదె। పరిపూర్ణము వీటి నీవుబట్టకు మెపుడున్ ॥ 121**

**భావము:-** శిష్యా! ఒక విషయము తెలిసికొనుటయే జ్ఞానము. దానివలనజరిగే పనియే కర్మము అని పెద్దలు నిర్ణయించిరి. ఇట్టి జ్ఞానము, కర్మము లేనిది పరిపూర్ణము. కనుక కర్మజ్ఞానముల రెంటియందు మనసు ఉంచక విడచిపెట్టుము.

**విశేషభావము :-** ఎరుగుట జ్ఞానము. ఈ సమస్త జగత్తును గుర్తించే సత్తా కలిగినదే జ్ఞాన స్వరూపమయిన పరబ్రహ్మము. అట్టి పరబ్రహ్మము యొక్క సత్తాచే ఏర్పడినది కర్మ స్వరూపమయిన జగత్తు. ఈ రెండును అన్యోన్యా శ్రయ సంబంధము కలిగినవి. కనుక రెండును ఒక్కటే. ఇట్టి బ్రహ్మ జగత్తుల కతీతమై నది పరిపూర్ణము. పరిపూర్ణములో గుర్తించే సత్తాలేదు. కనుక జగత్తు కూడలేదు. ఏమియులేనిది కనుక ఉత్తది. ఇట్టి పరిపూర్ణమే ఉన్నదని గురుముఖతా గుర్తించి, ఆ గుర్తించిన గుర్తులేనిదని విడువవలయును.



**కం॥ కలవారికి మేలుకలో। గలవారికి జాగ్రతందు కలహము గలదా। కలహించిరేనివారలు। కలవారలె మేల్కవారు గారెన్నటికిన్ ॥ 122**

**భావము :-** శిష్యా! స్వప్నావస్థయందున్న వారితో జాగ్రతావస్థయందున్న మేల్కవారు ఎన్నడును కలహించుట జరుగదు. అట్లే ఎరుకలో ఉన్నవారు (కలవారు) తో, మేల్కయందున్న వారు (కలవిడచినవారు అనగా ఎరుకను విడచినవారు) ఎన్నడను కలహించరాదు. అట్లు కాకుండ కలహము చెందినచో మేల్కవారు కారు. అనగా పరిపూర్ణులు కారు. ఎరుకలోని వారే అగుదురు. కనుక ఈ అచల పరిపూర్ణులు ఎరుకలోని వారితో ఎట్టివాదోపవాదములు చేయరాదని పెద్దలయొక్క భావముగా గుర్తించవలెను.

కం॥ సురలందుదోచుకలవలె। నరుదెంచును బ్రహ్మయందు నఖిల జగంబుల్ । యరుదెంచి యజునిగన్గొని। బిరబిరతామేగు నిల్వబిడి యంబగుచున్ ॥ 123

**భావము:-** శిష్యా! దేవతలయందుదోచిన కలవలె, పరిపూర్ణ పరబ్రహ్మములో ఈ సమస్త జగత్తు తోచినది. అట్లుతోచిన జగత్తు పరిపూర్ణమున్నదని గుర్తించినచో తాను లేనను విషయము తెలిసి, సిగ్గుపడి లేకుండా పోవును.

**విశేషభావము:-**దేవతలకు స్వప్నములేదు. కనురెప్పపాటు లేని వారు దేవతలని పెద్దల వాక్యము. అందుచే వారికి స్వప్నము ఉండదు. అందుచే "బ్రహ్మయందు దోచు నఖిలజగము" అనగా పరిపూర్ణములో దోచిన సమస్త జగము, సురలందు దోచిన స్వప్నము వంటిది అనగా లేనేలేదని భావము. ఇచ్చట జగము అనగా "నేను" తో సహా జగత్తు అని అర్థము. అందుకే " అఖిలజగము" అని పదము ప్రయోగించినారు. ఇట్టి "నేను" అజునిగ న్గొని అనగా పుట్టని వానిని చూచి అనగా పరిపూర్ణమును .జూచినచో, తానే లేనని సిగ్గుపడి లేకుండాపోవును అని భావము.

కం॥ మనమీ బయలునలేనిదె। మనకు మనమె వచ్చి నిల్చి మన మేగినయే। మనక మనజోలిగొనకన్ । తనకై తానుండి యున్నదది గోకనరా ॥ 124

**భావము:-** శిష్యా! మనమందరము ఈ పరిపూర్ణములో లేనిదె మనకు మనమే వచ్చితిమి. (మనకు మూలమేమియు లేదు) అట్లు మనమందరము రాక ముందు, ఉన్నప్పుడు, మనము పోయినప్పుడు, నిత్యమై, శాశ్వతమై యున్న పరిపూర్ణము, మనసంగతియెంత మాత్రము తెలియక తనంతతానుగా స్వత స్సిద్ధమై ఉన్నది అదిగో చూడుము. తెలుసుకొనుము.

కం॥ జ్ఞానంబు సత్వగుణమను । దానకి జన్మించెవనుచు దామో దరుడా । మేనత్త కొడుకుతో వనె । జ్ఞానమువకు జన్మమొకట్టి గలిగె గదోయీ ॥ 125

**భావము :-** శిష్యా! జ్ఞానము సత్వ గుణమునకు కలిగినదని భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పెను. కనుక జ్ఞానము కూడ పుట్టినదే కదా!

**విశేషభావము :-** "సత్వా త్సంజాయతే జ్ఞానం" అని భగవద్గీత గుణత్రయ విభాగ యోగములో 17వ శ్లోకములో చెప్పబడినది. కనుక జ్ఞానము సత్వ గుణమునకు పుట్టినదని ఈ పద్యములో చెప్పిరి. పుట్టుక కల్గినది నశించును. కనుక జ్ఞానము ద్వంద్వ గుణమాత్రమైనదని గుర్తించ వలయును.

**కం॥ పుట్టింది గిట్టు జ్ఞానము । పుట్టెననుచు కృష్ణమూర్తి పురు హూతజుడా । నట్టి తన ముద్దు మరిదికి । గట్టిగ వినజెప్పె నింధు కల తేమోయీ ॥ 126**

**భావము :-** శిష్యా! పుట్టిన సమస్తము నశించును కదా. జ్ఞానము పుట్టినదని శ్రీకృష్ణుడు తన ముద్దు బావమరిది అయిన అర్జునునితో దృఢముగ జెప్పెను గదా. ఇంకను జ్ఞానము శాశ్వతమని భ్రమ చెందె దవెందుకోయీ! అనగా జ్ఞానము కూడ లేనిదే అని నమ్ముము.

**కం॥ జ్ఞానమగు నీవు జ్ఞేయం । బైన బయలు గాంచి జ్ఞానమగు నిను నీవే । లేనంచుదెలియు మని తా । నానరునకు వాసుదేవుడా నతి యిచ్చెన్ ॥ 127**

**భావము :-** జ్ఞాన స్వరూపమైన నీవు, జ్ఞేయవస్తువైన పరిపూర్ణమును (ఉన్నదని గురుముఖతా) తెలసి, జ్ఞానమైన "నిన్ను" నీవేలేవని తెలియవలసినదిగా - అర్జునునకు శ్రీకృష్ణుడు ఆజ్ఞ యిచ్చెను.

**కం॥ మన మచల మన దగదు తగ । దనుటము మన మచలము నకు తగవే రని రెండనిలేవు మనమచల మని । విను, మన ముళ్లక్కి తెలియవిడు మనము మనన్ ॥ 128**

**భావము:-** శిష్యా! మనమే అచల స్వరూపులము అని అనకూడదు. అచలమునకు మనము వేరని అనుట కూడ తగదు. మనము, అచలము అని రెండు ఎన్నడును లేవు. పరిపూర్ణము (అచలమును) తెలియగనే మనము ఉళ్లక్కియని తెలసి మనమే లేక పోదుము.

**విశేషభావము:-** అచలము అనగా పరిపూర్ణము. పరిపూర్ణము - నేను (మనము) ఒక్కటి ఎన్నడును కాదు. ఆలాగని పరిపూర్ణము నాకు వేరని కూడ అనరాదు. ఎందుచేతననగా పరిపూర్ణము - నేను అని రెండెన్నడు లేవు. పరి పూర్ణమే

ఉన్నది. "నేను" ఎన్నడు లేను, అను విషయము గురు ముఖతా దృఢమైనచో "నేను" లేకపోవును. పరిపూర్ణమొక్కటియే త్రికాలములయందు శాశ్వతమై ఉన్నది. ఇంతకన్న రెండవ వస్తువు ఎన్నడునూ లేదు. ఉన్నదనుట భ్రాంతి మాత్రమే.

**కం॥ జ్ఞానమువే నననొక్కటె । జ్ఞానమువే వేరటంచు గనబోకు సుమీ । జ్ఞానము వచ్చును బోవును । జ్ఞానాతీతమును తాను గాంచిన దాకన్ ॥** 129

**భావము :-** శిష్యా! జ్ఞానము "నేను" ఒక్కటే. నీవు జ్ఞానమునకు వేరు గాదు. రెండును ఒక్కటే. ఈ జ్ఞానము పుట్టుట, చచ్చుట (మార్పు జెందుట) జరుగుచుండును. జ్ఞానమునకు అతీతమైన పరిపూర్ణమును గురుముఖతా తెలియువర్కు ఈ జ్ఞానము వచ్చుచూపోవుచుండును. అనగా పరిపూర్ణమును ఉన్నదని గుర్తించినచో, గుర్తించిన జ్ఞానము ఏమియు లేకుండ పోవును అని భావము.

**కం॥ నీ కలను వచ్చి పోయిన । లోకుల లోకముల వలెనెలో నినుగనుమీ । నీకలను నీవు మేల్కని । యీ కలనటువలెనె జూస్తె యెటు నిల్వవురా ॥** 130

**భావము:-** శిష్యా! నీ కలలో లోకులు లోకములు వస్తూ పోవుచున్నవి. అట్లే నీవు కూడ ఎరుకను కలలో వచ్చుచూ పోవుచున్నట్లుగా నీవు తెలుసుకొనుము. కనుక ఎరుకనే కల నుండి నీవు మేల్కొని, ఆయెరుకనే కల కూడ పరిపూర్ణములో లేక దోచినదే యని తెలిసికొన్నచో, ఏ లోకమునందు నిల్వ కుండ లేకపోదువు.

**విశేషభావము:-** స్వప్నములో వచ్చిన సమస్తము మేల్కలో లేకపోయినవి. అట్లే ఎరుక అనే కల(అధిష్ఠానమైన ఎరుక)లో నీవు కూడ కలవలె వచ్చినట్లు తెలుసు కొని, మేల్క అయిన పరిపూర్ణమును గురుముఖతా గుర్తించినచో నీవు, ఎరుక లేకుండ పోవును.

**కం॥ అందరికల నీ కలెకద । అందరు నీ కలను వచ్చి అగుపడి పోవన్ । కందువు గద నిన్నట్లనె । మందమతీ కనగదోయి మరి లేననుచున్ ॥** 131

**భావము :-** శిష్యా! అందరి యొక్క స్వప్నము నీ స్వప్నము వంటిదే కదా! నీ స్వప్నములో అందరు కనుపడి లేకపోవుట చూచుచున్నావు గద. అట్లనే అందరు నీ కలలో అగుపడి లేకపోయినట్లుగా నీవు లేనట్లు గుర్తించవోయీ మందమతీ! అని భావము.

జనులందరు నీ స్వప్నములో అగుపడి లేకపోవుచున్నారు. అట్లే అందరి స్వప్నములోను నీవు అగుపడి లేకపోవుచున్నావు అని తెలుసుకొనుము. కనుక స్వప్నములో కనపడినవి లేనివే అని తెలుసుకొన్నట్లుగా, నీవు అందరి స్వప్నములో కనపడినప్పుడు, నీవును లేకపోవుచున్నావు, గదా. నేనే స్వప్నము అని తెలుసు కొన్నచో నేను లేనను నిశ్చయము నీకు తెలియబడునని భావము.

**కం॥ ఆకాశమనిన శూన్యం । బాకాశంబనిన సగుణ మాకాశ మనన్। కాకివలె నల్లరూపుది। ఆకాశము మితము లోన నణగుండు జుమీ ॥ 132**

**భావము :-** శిష్యా! ఆకాశమనగా శూన్యము. ఏమీ లేనిది. మరియు ఆకాశ మనగా సగుణము, కాకివలె నల్లని రూపము గలది. పరిమితమైనది అని తెలుసుకొనుము.

**విశేషభావము :-** "ఆకాశంగగనంశూన్యం" అని అమరకోశము చెప్పుచున్నది. కాళీ ప్రదేశమునకు ఆకాశము అనిపేరు. మరియు "అవకాశస్య ఆకాశః" "ఆకాశస్య గుణశ్శబ్దః" అనియు చెప్పబడుచున్నది. ఒక వస్తువు ఉండుటకు అవకాశము నిచ్చు కాళీకి ఆకాశము అనిపేరు. ఇది శబ్ద గుణము కలది. ఆకాశమున్నచోటే శబ్దము ఏర్పడును. ఆకాశము లేనిచోట శబ్దము పుట్టదు. కనుక ఆకాశమునకు నామ, రూప, క్రియలు గల్గినది కనుక సగుణము అని చెప్పబడినది.

**కం॥ ఆకాశమనినకాలం । బాకాశంబనిన విలంబమాకాశమనన్ । లోకమున చంచలంబగు । వాకాశము శబ్దరూపమగు వినవోయీ ॥ 133**

**భావము :-** శిష్యా! ఆకాశమనగా కాలము. ఆకాశమనగా వస్తువు ఉండుటకు వీలు కల్గించు జాగా. ఆకాశమనగా చంచలము మరియు ఆకాశమనగా శబ్దరూపమైనదని వినుము.

**విశేషభావము :-** ఆకాశము నల్లని రూపము గలది. అనగా చీకటి. సూర్యుని వలన పగలు, ఆకాశము వలన చీకటి (రాత్రి) కలుగుచున్నది. పగలు - రాత్రి

కలసి 1 రోజు అనుకాలము ఏర్పడుచున్నది కనుక ఆకాశమనగా కాలము అని ఈ పద్యములో చెప్పబడినది. ఆకాశము అవకాశమిచ్చునది కనుక వస్తువులు అందులో ఒకచోట నుండి మరొక చోటుకు చలించుటకు అవకాశ మిచ్చుచున్నది. చలించనిది అయినా చలించుటకు కారణమైనదైనను చలించు స్వభావముగా గలది అని చెప్పవలెను. కనుక ఆకాశములోకమున చంచలము అని చెప్పిరి.



**కం॥ అహమే తనువీ విశ్వం । బహమే జీవేశ్వరులన నహమె తదైక్యం । బహమే యహముకు మూలం । బహమణగిన నణగు నన్నియనఘచరిత్రా ॥** **134**

**భావము :-** శిష్యా! ఓ పాపరహితమైన చరిత్ర గలవాడా! అహమే శరీరము, విశ్వము. అహమే జీవుడు, ఈశ్వరుడు. అహమే జీవేశ్వర ఐక్యము. ఇట్టి అహమునకు మూలము అహమే. మరేదియు మూలము కాదు. ఇట్టి అహము లేకపోయినచో జీవ, శివ, శరీర విశ్వములన్నియు లేకపోవును.

**విశేషభావము :-** అహ మనగా సర్వాధిష్ఠాన చైతన్యమైన "నేను". దీని నుండియే జీవ-శివ రూప బేధములు ఏర్పడినవి. ఈ అహము వలననే జీవ పురుషుని బట్టి శరీరమనియు, ఈశ్వర పురుషుని బట్టి విశ్వమనియు ఆవరణ రూపములు ఏర్పడినవి. జీవ-ఈశ్వరులు రెండును ఒక్క అహమే ఉపాధి భేధముచే వేరుగా చూడబడుచున్నది. కనుక సమస్తము ఒక్క అహము వలననే ఏర్పడుచున్నది. అట్టి అహము ఒక్కటి లేకపోయినచో సమస్తము లేకపోవునని తెలియవలెను.



**కం॥ భ్రమ యనిన పుట్టుకనినను । భ్రమకే నామంబులిట్టి భ్రమ నేనీవున్ । భ్రమె యీమేను జగత్తులు । భ్రమె యెరుకయు మఱవు రెండు భ్రమె భ్రమవివరా ॥** **135**

**భావము :-** ఓ శిష్యా! భ్రమరూపా! భ్రమయనినను, పుట్టుకనినను, నేను, నీవు, యీ శరీరము, జగత్తు, యెరుక, మఱపు సమస్తముకూడ భ్రమయని తెలుసుకొనుము.

**విశేషభావము :-** "భ్రమ మూలమిదం జగత్తు" అన్న ఆర్యోక్తి ప్రకారంగా భ్రమ అనగా లేనిదే ఉన్నట్టుగా కనుపించే, తోచే సమస్తము భ్రమయని అర్థము. ఒక్క పరిపూర్ణము తప్ప సమస్తము లేనిదే ఉన్నట్టుగా తోచబడుచున్నది. తోచబడునది,

తోచిన వస్తువు ఎవరికో వారితో సహా సమస్తము భ్రమయే. అట్టి భ్రమ కానిది ఒక్క పరిపూర్ణము మాత్రమే. కనుక పరిపూర్ణము ఇట్టిదని తెలియశక్యము కానిది. కనుకనే "భ్రాంతి రహితమిదం మోక్షం " అన్నారు.

**కం॥ యెరుక సుమీ బ్రహ్మానినను । యెరుక సుమీమాయ యనిన యెరుకే జీవుం । డెరుకసుమీ ఈశ్వరుడన । యెరుక సుమీ నేను విశ్వమిది సత్యము రా॥ 136**

**భావము :-** శిష్యా! బ్రహ్మయనినను, మాయయనినను, జీవుడనినను, ఈశ్వరుడనినను, నేనన, విశ్వమనినను యెరుకే. ఇది నిజము సుమా!

**కం॥ మాటసుమీనేననినను । మాట సుమీ మాయయనిన మరి జీవ శివుల్ । మాట సుమీ బ్రహ్మానినను । మాట సుమీ మేను జగము మాటే సుమ్మీ ॥ 137**

**భావము :-** శిష్యా! నేననినను, మాయ యనినను, జీవ, శివులనినను, బ్రహ్మ, జగత్తులనినను ఇవన్నియు మాటే సుమా. అనగా ఎరుకే సుమా!

**విశేష భావము :-** మాట అనగా పలుకు, వాక్కు. ఈ వాక్కు పరా, పశ్యంతి, వైఖరీ అని మూడు విధములు. ఈ వాక్కు మొట్టమొదట సహస్రార స్థానమున నిర్గుణ సంకల్ప రూపముగా యేర్పడును. ఇది పరావాక్కు. భ్రూమధ్య స్థానమున సగుణ సంకల్ప రూపముగా అనగా పశ్యంతి వాక్కుగా మారి, నోటి వెంట వైఖరీ రూపముగా మాటయేర్పడుచున్నది. మాట మొదటి రూపము. ఇచ్ఛ, తరువాత సంకల్పము, తరువాత శబ్దరూపము పొందుచున్నది. సహస్రార స్థానము, భ్రూమధ్య స్థానము రెండును, ఎరుకయే కనుక "మాట" అనగా ఎరుక అని అర్థముగా, ఈ పద్యములో చెప్పబడినది. సమస్తము సంకల్ప రూపము, సంకల్పము, సంకల్పించునది, సంకల్పముచే యేర్పడిన సమస్తము యెరుకయే కనుక ఈ పద్యములో సమస్తము "మాట" సుమీ అని చెప్పిరి.



**కం॥ ప్రకటమగు బింబమందున । ముకురము ముకురస్థ బింబములు లేవెపుడన్ । ముకురంబు వలన బుట్టును । ముకురస్థము దానివలన ముకురముదోచున్ ॥ 138**

**భావము :-** శిష్యా! ప్రసిద్ధముగా తెలియబడే పరిపూర్ణములో అద్దము, అందు కనుపించే ప్రతిబింబములు ఎప్పుడును లేవు. అద్దము వలన బింబము, బింబము వలన అద్దము ఏర్పడుచున్నవి. (ప్రకటము=ప్రసిద్ధము.)

**విశేషభావము:-** ఈ పద్యములో ప్రకటమగు బింబమందున" అన్న పదమునకు ప్రసిద్ధముగా ఉన్నట్లు తెలియబడే పరిపూర్ణము"లో అని అర్థము చెప్పవలెను. పరిపూర్ణములో బ్రహ్మ, జగత్తులు ఎప్పుడును లేవు అనగా పరిపూర్ణము వలన బ్రహ్మ-జగత్తులు ఏర్పడలేదు. ముకురము అనగా అద్దము. స్వచ్ఛమైన అద్దములో ప్రతిఫలించే జగత్తు ముకురస్థము. అనగా బ్రహ్మ వలన జగత్తు, జగత్తు వలన బ్రహ్మ యేర్పడుచున్నవి. ఆ రెంటికి మూలము పరిపూర్ణము కాదని చెప్పుటయే యీ పద్యభావము.

**కం॥ లేనీనీ రాకడే స్వ। ప్నానందము నీకు గురుడు పరిపూర్ణం బున్।**
**పూని తెల్పి మేల్కొల్పిన । నేననకను నీవుబోవనీ మేల్కదిరా ॥139**

**భావము :-** శిష్యా! లేని నీవు పుట్టుట కలవంటిదని తెలుసుకొనుము. నీకు గురుమూర్తి ప్రయత్నముచే పరిపూర్ణమును తెలియపర్చి, ఆకలనుండి మేల్కొల్పినవెంటనే, నేనే బ్రహ్మననే మాటను విడచి, నేను లేనని లేకపోవడమే, నీ మేల్కయని తెలియుము.

**కం॥ తనకు దానొరులు చణకిన । ధ్వనిబుట్టనిచోట బ్రహ్మతను దానొరలున్ । చణకిన ధ్వని గలచోటది । వినుమాయయు లేనిమాయ విడులేననినన్ ॥ 140**

**భావము :-** శిష్యా! తనకుతానుగాని, తనను ఇతరులు గాని తాకినచోధ్వని గలుగనిచోట బ్రహ్మయనియు, తనకుతానుగాని తనను ఇతరులు గాని తాకినచో ధ్వని పుట్టిన చోటును మాయయని తెలిసికొని ఆలేని మాయను లేదని విడువుము.

**విశేషభావము :-** శబ్దము సాధారణముగా రెండువస్తువులు తాకినప్పుడు కల్గును. కుడిచేతియందు శబ్దములేదు, ఎడమచేతియందు శబ్దములేదు. కాని రెండు చేతులను తాకించినపుడు శబ్దము కలుగుచున్నది. దీనినే అన్యోన్యాభావము అని అందురు. కాని భ్రూమధ్యస్థానమునందు తనకుగా "ఓం" అను ప్రణవ శబ్దము ఏర్పడుచున్నది. ఈ శబ్దము సహస్రార మందలి

చైతన్య సత్తావలన ఏర్పడుచున్నది. అందుచే తనకుతానుగా తాకినచో శబ్దము కల్గుచోటు, సహస్రారముభ్రూమధ్యస్థానములు, మరియు తన్ను ఒరుల అనగా ఇతరులు తాకిన చోటు అనగా జాగ్రద స్వప్నావస్థలలో మనః ప్రాణముల కలయికవలన శబ్దము కలుగుచున్నది. అందుచే జీవుడైనను, ప్రత్యగాత్మ అయినను లేక సహస్రార మందైనను శబ్దము పుట్టేచోటు కనుక, ఇది అంతయు ఎరుకే. అట్టి శబ్దములేనిచోటు పరిపూర్ణము మాత్రమే. ఇతరమంతయు ఎరుకే అని నిర్ణయము. ఈ పరిపూర్ణమునే ఈపద్యములో "ధ్వని" బుట్టనిచోటు "బ్రహ్మ" అని చెప్పిరి. బ్రహ్మ అనగా పరిపూర్ణము అని అర్థము చెప్పుకోవలెను.

**కం॥ మనసుకు వాక్కుకు దెలియని। ఘనవస్తువు బయలటంచు గనియారెంటిన్। నిను నను విశ్వముగా గని। విను మూలములేని వీటి విడరా శిష్యా । 141**

**భావము :-** శిష్యా ! మనస్సుచే ఊహించుటకుగాని, వాక్కుచే వచయించుటకుగాని వీలుకాని గొప్పదానిని పరిపూర్ణమనియు, మనస్సు వాక్కుల కలయికచే యేర్పడిన జగత్తును, మనోవాక్కులను మాయయని తెలిసికొని మనోవాక్కులరెంటిని మూలము లేనివని తెలిసి వాటిని విడచిపెట్టుము.

**విశేషభావము:-** మనః ప్రాణ - వాక్కులే కన్పించే సమ్మముగా పరిణమించినది. కనుక మనో-వాక్కులచే సమస్తము అంటే ఆత్మవస్తువు సహితమైన సమస్త జగత్తు తెలియబడుచున్నది. అట్టి మనః - వాక్కులకు అందని ఘనవస్తువు పరిపూర్ణమనియు,మనః - వాక్కులచే తెలియబడే నిను, నను, విశ్వము ఇదంతయు మూలములేనిదే తమంతతాముగా కలవలె ఏర్పడినవి కనుక, అవిలేనివని విడువవలయును.

**కం॥ కలలో వానికి మేలుక । గలదని గుర్తెరుగ వశమె కలమేల్కనినన్। కలవాడు గలడె తెలియను । తలపోయుము నిన్ను నీవు తగ నీ రీతిన్ ॥ 142**

**భావము :-** శిష్యా! కలలో ఉన్నవానికి మేలుక గలదని గుర్తించ శక్యమా? ఆకల నుండి మేల్కొనిన వానికి వెనుకటి కల కలిగియుండునా? అనగా కల

- మేల్కొ రెండును ఒకదానిని మరొకటి గుర్తించదు అని భావము. అట్లే నిన్ను నీవే కల అని గుర్తించి మేల్కొ అయిన పరిపూర్ణమున్నదను మేల్కొపొందినచో కల అయిన నీవు లేకపోదువు.

**కం॥ కలవాడు వాని చదువులు। గలవాతామేలుకొనిన గనుగొను మటులన్। కల నిన్ను నీదు చదువును। ఫలమేమిక చాలు పెక్కు పలుకులు తండ్రీ! 143**

**భావము :-** శిష్యా! తండ్రీ! కలలో ఒకడు అనేక శాస్త్రములు విద్యలు చదువుకొన్నట్లు కలగని, వాడు మేల్కొగన్నతరువాత వానికి ఆ విద్యలు శాస్త్రములు ఉన్నవా? లేవు. అటులనే నీవు నీ చదువు సమస్తము కలవంటిదే. పరిపూర్ణమనే మేల్కొపొందినచో,నీవు నీ చదువు అంతయులేకపోవును. అందుచే ఇంతకన్న ఎక్కువ మాటలు ఎందుకు?

**కం॥ కలరాజు సకలసంప। త్కలితుండై తానుమేలుకొనలే డెచటన్। కలనిన్ను వానివిధమున। దలపుము తలచితెవె చాలు ధన్య చరిత్రా! ॥ 144**

**భావము :-** శిష్యా ! ఓ ధన్యచరిత్రా! కలలో రాజ్యాధిపత్యము సకల సంపదల కలిగినవాడు మేల్కొనగానే, ఆ రాజ్యము సంపదలు వానికి ఉండునా? వాని విధముగానే నీవే కల అని తలపోయుము, మేల్కొ అయిన పరిపూర్ణమును గన్నచో నీవే లేకపోదవు. అంతే చాలును.

**కం॥ ఏ నిర్ణయమును జేయడు । నే నవని మహాత్ముడెప్పుడు నేననువాడే । నానావిధాల వదరును । నేనను తనవంటి వారి నెప్పుడు గనినన్ ॥ 145**

**భావము :-** శిష్యా! "నేను" అనని మహాత్ముడు ఎట్టి నిర్ణయములు చేయడు. నేను అనేవాడే తనవలె నేను అనేవారిని ఎప్పుడు చూచిన అనేక విధములుగా మాట్లాడుచుండును.

**విశేషభావము:-** బ్రహ్మసత్యం, జగన్మిథ్యావంటి నిర్ణయములు, నేనే బ్రహ్మను అనేవాడు అనగలడు. నేను లేను, నే నే యెరుక కలవంటిది, కనుక నేనులేను. అనేవాడు బ్రహ్మ అనేది ఫలానా అనిగాని, పరిపూర్ణము ఉన్నదని గాని, నేను లేను అని గాని నిర్ణయములు చేయడు. ఏ నిర్ణయము జేసినా "నేను" ఉన్నానవే

వాడే, "నేను" ఉన్నాననే వారితో మాత్రమే అట్టి నిర్ణయములు చేయగలడు. వినేవాడు ఉంటేనే చెప్పేవాడు ఉండును కనుక, "నేను" లేనను వాని వద్ద "నేను" ఉన్నాననే వాడు నిర్ణయవాక్యములు పలుకలేడని కూడ అర్థము.

**కం॥ మలకలులే వీత్రో వను । చులుకనగా దెలియవచ్చు సుజనులకెల్లన్ । తలుపదగు దీని నెప్పుడు । మలకల త్రోవలకు బోకమాన్యచరిత్రా! ॥ 146**

**భావము :-** పొగడదగిన చరిత్ర గల ఓ శిష్యా । ఈ పరిపూర్ణ బోధ ఏ విధమైన చిక్కులు లేని మార్గము. మరియు సుజనులైన వారికి సులభముగా తెలిసి కొనవచ్చును. కనుక నీవు చిక్కులు గల ఇతర సిద్ధాంతముల జోలి పోకుండా దీనిని తలచ దగును.

**కం॥ నామాటనమ్మవేమో । నీ మానస మెరుగకంటినే నీ మాటన్। నా మాట పథ్యమైనను । యే మారకుదీన్ని నీవికెప్పటి కప్పా । 147**

**భావము :-** ఓ తండ్రీ! నీ మనోభావము తెలియక నేను ఈ మాటను (పైపద్యభావమును) అన్నాను. నా మాట యందు నీకు నమ్మకము లేదమో! నా మాట నీకు ఇష్టమైనచో ఇక ఎప్పటికి దీన్ని మరచిపోకుము.

**కం ॥ సిద్ధాంతోక్తులుయి వినీ । బుద్ధికి దెలసుండి చదువబోకుము వీటిన్ । బద్దుల వినుమని వారలు । యుద్ధమునకు కాలు ద్రువ్వు చుందురు పెలుచన్ ॥ 148**

**భావము :-** శిష్యా! వాదోపవాదములచే స్థిరీకరింపబడిన స్థిరమైన వాక్యములు, ఈ పరిపూర్ణ బోధ (సిద్ధాంతోక్తులు). వీరు బొంకులాడేవారని (బద్దులు) నీ బుద్ధికి తెలిసినచో, వారి వద్ద ఈ బోధను చదువబోకుము. ఎందుచేతననగా ఈ బోధను విని వారు ఆగ్రహముచే నీతో యుద్ధమునకు కాలు దువ్వుచుందురు.

**కం॥ ముద్దుగ యీ గ్రంథంబును । పెద్దలముందరవచింపపిరి దివియకుమీ । దిద్దెదరు తప్పులున్నను । వద్దనకను దిద్దనివ్వు వరకీర్తినిధీ ॥ 149**

**భావము :-** ఓ శ్రేష్టమైన కీర్తిగలవాడా! చక్కగా యీ గ్రంధమును పెద్దల ముందర చెప్పుటకు భయపడి వెనుదీయకుము. ఒకవేళ తప్పులున్నచో చక్కజేతురు. అట్లు వారు దిద్దుటకు వద్దనకుము.

**విశేషభావము :-** ఈ పద్యములో పెద్దలు అనే పదమునకు వయోవృద్ధులు అని భావము కాదు. "ఎవరు గుణవృద్ధులో వారు వృద్ధులు కాని, యేండ్లు మీరిన వారావృద్ధులు?" అని నీతిశాస్త్ర వాక్యరీత్యా ఈ పద్యములో పెద్దలు అను పదమునకు ఈ పరిపూర్ణ బోధశాస్త్ర విహితముగా ఆరూఢముగా తెలిసినవారు అని అర్థము. వారి ముందర ఈగ్రంథమును ముద్దుగ చదువమని చెప్పినారు. అనగా "న బ్రూయాత్ సత్యమప్రియం" అని తైత్తరీయోపనిషత్తు వాక్యరీత్యా సత్యవచనములైనను అప్రియముగా, కఠిన పదజాలముతో ఈ గ్రంథమును జదువక, వినువారికి శ్రావ్యముగా ఉండులాగున జదువమనే అర్థము. కనుక యీబోధయితరులకు గాని మన పెద్దల ముందుగాని చదువు నప్పుడు ఈ నియమమును పాటించమని శ్రీకృష్ణదేశికేంద్రుల మనోభావము.

**కం॥ నేను గలమేనులేదని । మేనువనీ వుండి యిట్లు మిడుకుటమేలా । మేనును విడిచను వినియెద । మానుగ నీవనక యున్న మాయవెసుమ్మీ ॥ 150**

**భావము:-** శిష్యా । "నేను" ఉన్నాను. మేను అనగా జగత్తు, లేక శరీరము లేనిదని మాయయని యనుట మంచిదికాదు. ఎందుచేతననగా శరీరమందే నీవు ఉండి బ్రతుకుచున్నావు. ఇట్టి శరీరరమును విడచి "నేను" అని అనుము. ఎలా అందువో వినియెదను. అట్లు అనలేకపోయినచో నీవు మాయవే సుమా!

**విశేషభావము:-** నేను బ్రహ్మను అనే వాక్యము శరీరమందుడే అనవలెను కాని శరీరము విడచి అనలేరు. అనగా నేననే చైతన్యమునకు మేను ఆధారము. నేను ఆధార ఆధేయములతో కూడినదే కనుక "నేను" బ్రహ్మకాదు. మాయయే యని నిర్ణయము.

**కం॥ కట్టెలు పిడుకలు లేకను । యెట్టుంబలెనిప్పు నిల్వకేగునా వుడమిన్ । అట్టుంబలెనే నీవును । యిట్టి శరీరములేక వెందుందువురా ॥ 151**

**భావము :-** శిష్యా! కర్రలు, పిడకలు లేకుండా నిప్పు యెలా నిలచియుండదో అట్లే నీవు యీ శరీరము లేకుండగ ఎచ్చట ఉండగలవు?

**విశేషభావము :-** "నేను" బ్రహ్మ అయినచో శరీరమును ఆధారము లేక స్వతంత్రముగా ఉండవలెను. అప్పుడే బ్రహ్మసత్యము అనవచ్చును. కాని "నేను" శరీరము లేకుండగ (స్థూల శరీరమే కాదు సూక్ష్మశరీరమైనను లేకుండగ)

ఎచ్చటను యీ నేను ఉండదు. యీ లోకములో స్థూలశరీరముతోను, పైలోకములలో సూక్ష్మశరీరముతోను ఉండును కాని యే శరీరములేకుండగ యెన్నడు ఉండదని భావము.

**కం॥ తనువు న్నేగానంటే । ఘన సుఖదుఃఖములు రెండు గనుపడెనీపై । గనక తనువునీ వొక్కటె । వినరావామాటనిట్టి వెఱ్ఱివ బడకన్ ॥** 152

**భావము :-** శిష్యా! శరీరము నేనుగాను అని అంటే గొప్పవైన సుఖదుఃఖములు నీవు అనుభవించుచున్నావు. స్థూల శరీరమును ఉపకరణముగా చేసికొని సూక్ష్మశరీరముచే సుఖదుఃఖములను "నీవే" అనుభవించుచున్నావుగద. కనుక శరీరము నీవు ఒక్కటే, వేరుగాదు. అట్టి వెఱ్ఱితనమును విడచినే చెప్పినమాట వినుము.

కం॥ ఎరుక లేనట్టి బయలున । బిరబిర నరుదెంచి యెవరు బిలువనిదే తా । నరసిపరిపూర్ణమున్నది । యెరుకేగితెచాలు లేనిదెరుక నిలేకన్ ॥ 153

**భావము :-** శిష్యా! ఎరుకలేని పరిపూర్ణములో, ఎరుక యెవరు బిలువనిదే తనంతతానుగా సత్వరముగ ఏతెంచినది. అట్టి యెరుక పరిపూర్ణమున్నదని చూచి తాను లేనని లేకపోతె చాలును.

**కం॥ తనువువే గాననంటివి । విను సుఖదుఃఖములు యెవరి విరవాతోడన్ । వినజెప్పుము నేవినియెద । తనయా తప్పితివె నిన్ను దండింతు జుమీ ॥** 154

**భావము :-** కుమారా! శరీరము, నేను గాను అంటున్నావు. అయితే సుఖదుఃఖములు అనుభవించుచున్నది యెవరో నాతో వినజెప్పుము. తప్పుడు మార్గములో విచారించితివా, నిన్ను దండించెదను సుమా !

కం॥ అందరి మాటలకురికే । వెందుకు నా మాటనమ్ము మిదే చాలును యీ । యందరు లేనిబయలుగని । యందున నీలేమి నెరిగి యరిగితె సరిరా ॥ 155

**భావము:-** శిష్యా! పలువిధ సిద్ధాంత వాదుల మాటలకు ఉత్సాహ పడెదవెందుకు ఈ బోధ చాలును, నామాట నమ్ముము. ఏమియులేని ఈ ఉత్త పరిపూర్ణమును జూచి, అందులో నీవు లేనని తెలిసిలేకపోతే సరిపోవును. (ఇక జన్మకురావు)

**కం ॥ నాబోతు రుచికి రుచినిడు। నీ బోధనపేక్ష చేత నేర్చినవారిన్। యే బాధలు బాధింపవు। బాబూ యిదినీవు నేర్చి పఠింయించగదే ॥ 156**

**భావము:-** శిష్యా ! పటికబెల్లం రుచికన్నా, ఆశించి ఈ బోధనేర్చినవారికి యీ బోధ ఎక్కువ రుచిని కల్గించను. యీ బోధవలన సమస్త బాధలు నశించును. కనుక బాబూ దీన్ని నీవు నేర్చుకొని పఠించుము.

**విశేషభావము :-** నాబోతు అనగా పటికబెల్లము, కలకండ అని అర్థము. ఇది దేశీయవాడుక పదమే కాని గ్రాంధిక పదము కాదు. శ్రీకృష్ణప్రభువుల కాలములో ఆదేశమున ఎక్కువగా వాడుకలో ఉండి ఉండవచ్చును. ఈ పద్యములో నాబోతు ప్రయోగము ఒక విధముగా జరిగి ఉండవచ్చును. ఈ పద్యములు చాటువులు. అనగా ఒకానొక సమయములో ఒకానొక సంఘటన గూర్చి ఆశువుగా చెప్పెడు పద్యములను చాటు పద్యములు అందురు. ఈ పద్యములు వ్రాయు సమయములో శిష్యుడు ఒకడు పటికబెల్లం తీసుకునివచ్చి గురువుగారి చేతిలో పెట్టి నమస్కరించెను. అంత గురువుగారు (కృష్ణప్రభువు) పటికబెల్లం ముక్కను కొంచెంతానుతిని మిగిలిన ముక్కను అచ్చట ఉన్న శిష్యులందరకు పెట్టెను. ఆ ముక్కల ను ఆశిష్యులు తింటూ ఒకానొకడు పటికబెల్లము చాలా రుచిగా ఉన్నదండీ స్వామీ! అని అనవచ్చును. అంత శ్రీకృష్ణప్రభువు నాబోతు రుచికి రుచినిడు ఈ బోధ" అని ఆశువుగా అని ఉండవచ్చును. ఇది నావ్యక్తిగత భావము మాత్రమే. లేకపోతే నాబోతు (పటికబెల్లము) నకు అంతరుచిని కల్పించుట ఏల?

**కం॥ తాముతమ తప్పునెరుగక। నామాటలు తప్పులనుచు నవ్వే జనముల్। సామాన్యలనుచు దెలియుము। నీ మానస మందు లెస్సనిరుపమ సుగుణా ॥ 157**

**భావము:-** పోల్చదగిన ఉపమానములేని సుగుణములు కలవాడా! తమ తప్పు నెరుగక, నా మాటలు తప్పులని నవ్వేజనులు, సామాన్య జనులని నీ మనస్సులో బాగా తెలుసుకొనుము. వారి మాటలను లెక్కజేయకుము అని భావము.

కం॥ దప్పప్పున జనినట్లుగ। నిప్పున చలిబాసినట్లు నిజమోగిరమున్।
ఒప్పుగ దిన్నప్పుడెక్షుధ। దప్పినగతి బోధ విన్నదప్పును బాధా ॥ 158

**భావము:-** శిష్యా! దాహము మంచినీరు త్రాగుట చేతను, నిప్పుచేత చలిపోయిన ట్లుగను, అన్నము తినుటచే ఆకలి తీరినట్లుగను, ఈ పరిపూర్ణబోధ విన్నచో సమస్త బాధలు తీరిపోవును. అనగా బాధలకు మూలమైన "నేను" లేకపోవును అని భావము.

కం॥ సాధనలు జెప్పి శిష్యుల। బాధలపెట్టేటి గురునిబాట వదలియే।
బాధలు లేనీబోధను। సాధులసేవించి వినుము సద్గుణశాలీ! ॥ 159

**భావము :-** ఓ సద్గుణశాలీ! యమ నియమాది సాధనలు జెప్పి శిష్యులను బాధలకు గురిజేసే గురువుల మార్గమును వదలి, యే బాధలు లేని యీ పరిపూర్ణ బోధను సద్గురువుని ఆశ్రయము పొంది సేవించి తెలుసుకొనుము.

కం॥ బోధలకెల్లనుగురువగు। బోధసుమీ దీన్ని నీకు బోధిస్తిని యీ।
బోధను వదలకుమెప్పుడు। సాదుజనస్తుత వివేక సతతాశోకా॥ 160

**భావము :-** సాధుజనలచే స్తోత్రము చేయదగిన వివేకము కలవాడా! ఎల్లప్పుడు దుఃఖము లేనివాడా! సమస్త ఆధ్యాత్మిక బోధలలో కెల్లా గొప్పదైన యీ పరిపూర్ణ బోధను నీకు బోధించితి సుమా. ఇట్టి బోధను ఎప్పుడును విడచి పెట్టకుము.

కం॥ ఈవికాసించుగురుడును। నావద్దొక కాసులేదు నన్నడుగకు
పో। పోవయ్యయనెటి శిష్యుడు। కేవలహీనాత్ములనుచు కీర్తింప
దగున్ ॥ 161

**భావము:-** శిష్యా! శిష్యుడు ఎంత ధనము ఇస్తాడా! అని ఆశించే గురుడు, నావద్ద ఇద్దామంటే ఒక్క కాసైనా లేదు అని లోభత్వముచే ఉండే శిష్యుడు, ఇట్టివారు కేవల హీనాత్ములని చెప్పవచ్చును.

కం॥ దేవుడుతే తెమ్మనునా। జీవుడు లేదనుచు మదిని శిడిముడి
పడునా। భావమున దెలిసి యుద్దరు। నావిధమున నడువవలయు
నందరు మెచ్చన్ ॥ 162

**భావము :-** శిష్యా! దేవుడు భక్తుని సొమ్ము (దక్షిణ) ఫలహారములు వగైరా తెమ్మనునా? అట్లే భక్తుడు తన వద్ద ఏమీలేదని కోపముచే బాధపడునా? వారివారి భావములచే యిద్దరు తెలుసుకొని ఆవిధముగ నడువవలయును.

కం॥ కోటివిధంబులజెప్పిన । చేటౌదవేటితనదు పూర్వ చేష్టలు విడక । చాటున నేటున ద్వివిధము గాటనవెునరించు నతనికతుకునెబోధా ॥ 163

**భావము :-** శిష్యా! ఈ బోధ కోటివిధములుగా చెప్పినను, దుఃఖమును తెచ్చి పెట్టే తన యొక్క పూర్వపు చేష్టలు విడువక, చాటుగా నిశ్చయముగా రెండు విధములుగా నటించేవానికి ఈ బోధ అతుకదు. (నేటున=నిశ్చయముగ)

కం॥ బంగారు వంటియీబో । ధాంగీ కరుణులను జేరియు దివినివారిన్ । భంగపరచదలచేయా । వెంగళులకు జెప్పకుమని వేడెదనిన్నున్ ॥ 164

**భావము :-** శిష్యా! బంగారము వంటి యీ బోధ తెలిసిన పెద్దలను జేరి బోధ విని, ఆ పెద్దలను అవమానపరిచేటి ఆ వెర్రివెంగళులకు ఎన్నడు యీ బోధ చెప్పవద్దని వేడుకొనుచున్నాను.

కం॥ [illegible]దమల గురువెవరనినను । యిదిగో బయలిదిగో తేవి గురుతెరిగే । టిదగు శరీరము దీనిని । వదులు మనుచు నీకు జెప్పవచ్చినవారే ॥ 165

**భావము :-** మలినము లేని మంచి గురువెవరనగా - పరిపూర్ణము యిదిగో అనియు, లేని గుర్తెరిగే శరీరము యిదిగో అని ప్రత్యక్షముగా జూపించి యీలేని గుర్తెరిగే శరీరమును వదలుమని నీకు చెప్పినవారేయని తెలుసుకొనుము.



కం॥ రోగపుచేష్టలుబోయిన । రోగముగలదనిన మాడ్కి రోయ కనిన్నున్ । నీ గుర్తె రుగుటమణగిన । నేగలనన నీదుమాట నిశ్చయమటరా ॥ 166

**భావము :-** శిష్యా। రోగలక్షణములుపోయిన తరువాత రోగము ఉన్నదనుమాట నివగించుకొనని విధముగా, "నేను" లేనని దృఢపడిననీవు, నేను ఉన్నానను నీమాట నిశ్చయమగునా?

**విశేషభావము :-** ఒకనికి జ్వరమువచ్చినది. జ్వరములో వాంతులు, వికారము తలనొప్పి మొదలగులక్షణములు ఉండెను. నాలుగు రోజులుమందు సేవించిన పిదప వానికి వాంతులు, వికారము, తలనొప్పి వగైరా రోగలక్షణము లన్నియు

తగ్గిపోయినవి. అతనిమిత్రుడు ఆనాడు కలసి పలుకరించగా "నాకు రోగము వచ్చినది నాలుగు రోజుల నుండి పచ్చుటకు రావటములేదు అని చెప్పెను." ఈ మాట చెప్పినప్పుడు అతనికి రోగము పోయినది కదా! రోగము వచ్చినది అని అంటున్నాడేమని పరిగించు కొనవల్లెనా, "రోగపు దేహమునకు, రోగము గలవనిన మాట్కరోయక నిన్నుగ్" అని అర్థము. "నీ గుర్తెరుగుట మరచిన నేగలవన నీకు మాట నిశ్చయమనుటరా" అనగా నేను లేనని దృఢపడి ఎరుకయందు "నేను' యందు ఎట్టి భ్రాంతియు లేనివాడైనను, సందర్భవశమునే లోకములో "నేను ఉన్నాను" అని అన వలసి వచ్చు అప్పుడుకి, నాడు ఉన్నానను మాట నిశ్చయమైనది కాదు. లేనుమాటే నిశ్చయము.

**కం॥ దిద్దుతనప్పు శిష్యునిమది । నొప్పునధనమిచ్చుచునుచు నూహించి మదిన్ । యిచ్చకములాడబోకను । చెచ్చెర దండించు వాన్ని సద్గురుడైతే ॥** 167

**భావము:-** శిష్యా! ధనము బాగా ఇచ్చే శిష్యుని యొక్క మనస్సు నొచ్చే విధముగా దండించినచో, ధనము ఈయడని మనసులో అనుకొని, అట్టి శిష్యుడు తప్పొనరించినచో మంచిగా మాటలాడక, సద్గురునైనవాడు అట్టి శిష్యుని వెంటనే దండించును.

**కం॥ గురుడు తననెంత మెచ్చిన । వరశిష్యుడులొంగి తిరుగవలయును మదిలో । గురసిభయభక్తిలేకను । తిరిగిన చేటౌదప్పు నిజము తెలియుగ దోయీ ॥** 168

**భావము :-** శిష్యా! గురుమూర్తి తన నెంత మెచ్చుకొనినను శ్రేష్ఠమైన శిష్యుడు అణకువ, వినయముతో తిరుగవలయును. అట్లు గాకుండగ గురుమూర్తి తనను మెచ్చుకొను చున్నాడు గదా యని సంతోషించి, భయభక్తులు లేకుండగ శిష్యుడు తిరిగినచో వానికి పాపము వచ్చునను నిజమును తెలిసికొనుము. అందుచేతనే భర్తృహరి "క్షమాగురుజనే" అని సుభాషితములో చెప్పెరి. గురువు యెదుట శిష్యుడు కష్ట సుఖములు, సుఖదుఃఖములు, సంతోషాసంతోషముల యందు సమభావము కల్గి ఓర్పు వహించి వినయ విధేయతలతో ఎల్లప్పుడు మెలగవలయునని భావము.

**కం॥ గురుశిష్యుల లక్షణములు । గురుశిష్యుల బోధరీతి గురు గీతార్థం । బెరిగిన నరులకె మెప్పగు । నెరుగని యామూఢనరుల కిష్టతి యౌనే ॥ 169**

**భావము :-** శిష్యా! గురు శిష్యుల లక్షణములు, గురుశిష్యుల బోధ విధానము, గురుగీత అర్థము తెలిసిన వారికే సరిపడును గాని, గురు గీతార్థ మెరుగని మూఢ్య జనులకు విపరీతముగా తోచబడును.

**కం॥ స్థిరముగ నిల్చేదైతే । పరుగెత్తక భ్రాంతి నిల్వబడదా భువిలో । నరులు విమర్శించినతా । నురుకుట మది యెందుకోన మూహను కనరా॥ 170**

**భావము :-** శిష్యా! యెరుక శాశ్వతమైనదైతే, పూర్ణబోధస్థులు విమర్శించినపుడు నిలిచి యుండలేకపోవుట యెందుకో ఊహించి తెలుసుకొనుము. అనగా పరిపూర్ణ బోధస్తులు యెరుక పరిపూర్ణములను విమర్శించి తెలుసుకొనినపుడు ఎరుక శాశ్వతమైనది కాదు కనుక, లేకుండా పోవుచున్నది. ఈ విషయము ఊహించి తెలుసుకొనుము. అని భావము.

**కం॥ తన సంతతిపై గలదయ । తన శిష్యుల మీద నుంచదగు గురు డెపుడున్ । తన ధనము మనసు తనువులు । తన గురువి వటంచు దల్పదగు శిష్యునకున్ ॥ 171**

**భావము :-** గురువునకు తన సంతానముపై ఎట్టి దయ కల్గియుండెనో అట్టి దయ తన శిష్యులపై ఉండవలెను. శిష్యుడు తన యొక్క శరీరము, మనసు, ధనము సమస్తము తన గురువుదే కాని, నాది అను భావము లేకుండ భావించవలెను.

**విశేషభావము :-** గురువు తన సంతానముపై ఎట్టి అవ్యాజానురాగము కల్గియుండునో అట్లే తన శిష్యులపై కూడ అట్టి అవ్యాజానురాగము కల్గియుండ వలెను. శిష్యులను పుత్ర సమానులుగా చూచుకొనవలెను. వారు పాడైపోతే మనకేమి? అను భావము ఎన్నడు గురువు భావించ రాదు. అందుచే శిష్య ధనముపై బ్రతుకరాదు. దేవుడు భక్తుని దక్షిణ అధికముగా ఇయ్యి అని ఎట్లు అడగడో అట్లే శిష్యుని ధనకనక వస్తువాహనాదులపై ఆశపడరాదు. అందుకే గురుగీతలో "గురవో బహువస్సంతి । శిష్య విత్తాపహారకాః । తమేకందుర్లభం

అన్యే । శిష్య హృత్తాపహారకాః ॥" అన్నారు. శిష్యుల ధనమును హరించెడు గురువులు చాలమంది ఉన్నారు. కాని శిష్య హృదయ తాపమును హరించెడు ఒక్క గురువు కూడ దొరకుట దుర్లభము అని చెప్పిరి. కనుక గురువులు శిష్యుల శ్రేయస్సునే కోరవలయును. మరియు శిష్యులు తన యొక్క శరీరము, మనస్సు, ధనము సమస్తము గురుమూర్తిదే. నాదే మియులే గను భావము కల్గి యుండవలెను. దీని విశేష భావము శుద్ధ నిర్గుణతత్వ కందార్థములలోని 232 వ పద్యములో చెప్పబడినది. దేవుడు తెమ్మని కోరక పోయినను తన భక్తి, శక్తి కొలది ఏవిధముగా భక్తుడు దేవునికి దక్షిణ వస్త్రాదులు ఇచ్చునో అట్లే సచ్ఛిష్యుడు తన గురుమూర్తికి "ఆసనం శయనం వస్త్రం । వాహనం భూషణాదికం । సాధకేన ప్రదాతవ్యం । గురుసంతోషకారణం" అన్నట్లుగా వస్త్ర వాహనభూషణాదులు తన శక్తికొలది గురు సంతోషకారణముగా శిష్యుడు ఇయ్యవలెను. శక్తికి మించి ఈయరాదు.

**కం॥ శూరత్వ మాత్మ పనికై । వైరాగ్యము గురుని గొల్పు వర్తన కెపుడున్ । యీ రీతి వృత్తి గలిగిన । నారీ నరులేగిచార రెనరకము లోనన్ ॥ 172**

భావము :- శిష్యా! తన స్వంత కార్యక్రమములు చేయుటకు మిక్కిలి పట్టుదలతో పని పూర్తి చేసుకొనుట, గురు కార్యముల యందు నేనెంత నిమిత్త మాత్రుడను, ఆ గురుమూర్తి దయ ఉంటే ఆ పని పూర్తవతుందనే వైరాగ్య భావముతో గురు కార్యముల యందు శ్రద్ధ లేని జనులు తప్పక ఘోరనరకముల పాలగుదురు.

**కం॥ మనసున నొకటి దలచువా । క్కు నొకటి బలుకు చుండు కుటిలుడు మరితా । తనువున నొక్కటి జేయును । వినువానికి బోధ దెల్ప విహితమటోయీ ॥ 173**

**భావము** :- శిష్యా! మనస్సులో ఒక విధముగా తలపెట్టి, నోటితో చెప్పునపుడు మరొక విధముగాను చివరకు ఆ విషయము కార్యరూపము దాల్చునప్పుడు ఇంకొకవిధముగా అనగా మనోవాక్కాయ శుద్ధి లేకుండగా కార్యములు, మాటలు జరిపించునట్టి వానికి యీ బోధ తెల్పుట మంచిది కాదని వినుము.

**కం॥ మనమున వాక్కున తనువున । పనియొక్కటి జరుపునట్టి భక్తునికి దయన్ । వినిపించుము వినుమనియీ । ఘనబోధనువాని కతుకగలదుడుగకుమీ ॥ 174**

భావము :- శిష్యా! మనోవాక్కాయములచే అనగా త్రికరణశుద్ధిగ పని ఒనరించునట్టి భక్తునికి యీ ఘనమైన పరిపూర్ణ బోధను వినుమని వినుపించుము. అట్టివానికి యీ బోధ అతుకగలదు. విడచి పెట్టకుసుమీ ॥

**కం॥ మేలైన బోధ వినుటకు । చాలా విఘ్నములు వచ్చి పమ కూడినయే । లీలన్ విడు సచ్ఛిష్యుడు । వాలాయము బోధ యందెవర్తించుజుమీ ॥** 175

భావము :- శిష్యా! మేలైన యీ పరిపూర్ణ బోధ వినుటకు అనేక విఘ్నములు ఏర్పడుచున్నను, సచ్ఛిష్యుడైనవాడు యేదో విధముగా ఆవిఘ్నముల నుండి విడివడి అవశ్యముగ (తప్పనిసరిగ) యీ బోధయందె ఉండును సుమా! (వాలాయము=అవశ్యముగ, తప్పనిసరిగ)

విశేషభావము :- "శ్రేయాంసిబహు విఘ్నాని" మంచి పనిచేయుటకు అనేక ఆటంకములు కలుగునని ఆర్యోక్తి. అన్ని పనులలోకి చాలమంచి పని జ్ఞానమును తెలుసుకొనుట. కర్మ, భక్తి పనులకు లేని ఆటంకములు జ్ఞానము తెలుసుకొనుటకు తప్పక కలుగుట, లోకములో చూచుచున్నాము. ఇట్టి ఆటంకములనే చెప్పుచు "మాకు సరిగా కుదురుట లేదండి" అని అనడము మనకందరకు తెలిసినదే. కనుక జ్ఞాన సంబంధమైన విషయము అనగా వేదాంత విచారణ చేయునపుడు గురు శిష్యులిద్దరు కలసి శాంతి పాఠము చెప్పుకొని గురుమూర్తిని ప్రార్థన చేసి విచారణ ప్రారంభించుట మహా ఋషి కాలమునుండి వచ్చుచున్న ఆచారము. ఇది మన సాంప్రదాయము వారిలో ఈ మధ్య కాలములో పూర్తిగా నశించినది.

"ఓం సహనావవతు । సహనౌభునక్తు । సహవీర్యంకరవావహై । తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై । ఓం శాంతిః శాంతిః శాంతిః ॥అని శాంతి పాఠము గురుశిష్యు లిద్దరు కలసి చెప్పుకొనవలెను. దీని భావమేమనగా "ఓం - ఓంకార స్వరూపుడైన పరబ్రహ్మ (గురుస్వరూపము)మునకు నమస్కారము, "సహనావవతు"- (అపరబ్రహ్మము) శిష్యాచార్యులమైన మమ్మిద్దరును (గురు శిష్యులిద్దరను) కాపాడుగాక; "సహనౌభునక్తు" - మమ్మిద్దరను సహభోజనముచే పోషించుగాక; "సహవీర్యంకరవావహై" - మేమిద్దరము కూడ విద్యానిమిత్తక సామర్థ్యము (శక్తి)ను పొందుదుముగాక; "తేజస్వినావధీతమస్తు" - మేధావంతులమగు మాచే అధ్యయనము చేయబడిన యీ విద్యను అర్థము చేసికొని గ్రహించువారమగుదుము గాక; "మావిద్విషావహై"- మేమిద్దరము పరస్పర

ద్వేషము లేకుండా ఉండుముగాక; "ఓం శాంతిః" - ఆ పరబ్రహ్మము మాకు ఆధ్యాత్మిక తాపమును శాంతింప జేయును గాక; "శాంతిః" - ఆదిభౌతిక తాపమును శాంతింప జేయునుగాక; "శాంతిః" - ఆదిదైవిక తాపమును శాంతింపజేయును గాక. అని భావము. ఆధ్యాత్మిక తాపము, శరీరమునకు జ్వరము వగైరా బాధలు, ఆదిభౌతికతాపము - క్రిమి కీటక పశుపక్షి మనుష్యాది భూతజాలము వలన కలుగు బాధలు, ఆధిదైవిక తాపము - దైవికముగా అనుకోకుండగ హఠాత్తుగ సంభవించెడు ప్రమాదములు. ఇవే విఘ్న కారణములు. ఈ విఘ్నములు రాకుండ నివారించగలందులకు ఆ పరబ్రహ్మమును అనగా గురుమూర్తిని గురుశిష్యులిద్దరును కలసి వేదాంత విచారణ చేయుటకు ముందుగా తప్పని సరిగా మనము చెప్పుకొనుట ప్రశస్తమైన ఆచారము కాగలదు.

**కం॥ గురుడు తన యాజ్ఞ లోపల । చరియింపగ గోరునట్టి శిష్యునకె పుడున్ । దురితంబువృద్ధియైతా । నరకమునన్ గూలకున్నె నరనుత చరితా ॥ 176**

**బావము** :- శిష్యా! ఏ శిష్యుడు తన యాజ్ఞలో గురుమూర్తి నడుచుకోవాలని కోరుకొనునో, (అట్టి పరిస్థితులు గురుమూర్తికి కల్పించునో) అట్టి శిష్యునకు పాపము పెరిగి ఘోరనరకము పాలవకుండా ఉండునా! ఓ మానవులచే పొగడ దగిన చరిత్ర గలవాడా!

**విశేషభావము** :- శిష్యుడు ఎల్లప్పుడు గురువాజ్ఞకు బద్ధుడై యుండవలెను. గురువు వద్ద వినయ విధేయతల్లో మెలగవలయునే కాని గురువును కట్టడి చేసి తను చెప్పినటుల నడుచుకొనేలా చేయాలని ఎన్నడును తలంచరాదు. అందుకే తైత్తరీయోపనిషత్తు శిక్షావల్లి భాగములో - "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథిదేవోభవ, యాన్యనవద్యానికర్మాణి, తానిసేవితవ్యాని, నో ఇతరాణి . . . ." అని చెప్పబడినది. తల్లి దైవము, తండ్రి దైవము, గురువు దైవము, అతిథి దైవము. నింద్యములైన పనులను విడచి నింద్యముకాని పనులనే చేయుము" అని చెప్పి యున్నారు.

**కం॥ గురుకనుసౌంజ్ఞనుగనుగొని । పరిచర్యయొనర్చుచుండు భక్తుడు భక్తిన్ । పరిపూర్ణబోధ జెందును । పరమోదార ప్రచండబంగరు కొండా ॥ 177**

భావము :- గొప్ప ఉదార స్వభావము గల నా ముద్దుల శిష్యా! గురుకనుసౌంజ్ఞా విశేషముచే భక్తుడైన శిష్యుడు గురువునకు సమస్త సేవలు అతి భక్తితో చేసి, వారివలన యీ పరిపూర్ణ బోధను పొందును. (ఇదియే భావ శుశ్రూషయనబడును.) గురువు నోటితో అడుగనిదే భావమును దెలిసి సేవించుకొనుట.

కం॥ **ప్రాకటముగ నిద్దుర యిక । యేకథలను వినిన రాదు యీ బోధందున్ । రాకుండదదేమిచిత్రము । ప్రాకృత నరమూక కెల్ల పావన చరితా॥** 178

భావము :- శిష్యా! పుణ్యచరిత్రా! ప్రసిద్ధముగ యే కథలు విన్నను నిద్రరాదు. పూర్వ కర్మలచే కట్టబడిన నరసమూహమునకు యీ పరిపూర్ణ బోధ వినునప్పుడు తప్పకుండగ నిద్ర వచ్చును. అదేమి చిత్రమో? (ప్రాకటముగ=ప్రసిద్ధముగ)

**విశేషభావము** :- పురాణ గాథలు, హరికథలు మొదలగు విశేషములయందు నిద్ర లేకుండా చక్కగా వినగల్గుదురు ఎన్ని రోజులైనను. కాని అట్టి జనులు యీ పరిపూర్ణ బోధ వినునప్పుడు వారి యొక్క పూర్వకర్మదౌర్భాగ్యముచే నిద్రపోవుచు ఎంత మాత్రము ఈ బోధ వినలేక పోవుదురు. ఇది మనము చూచుచున్నదే. ఇట్టి వారందరు పూర్వ కర్మదౌర్భాగ్యులని కృష్ణ ప్రభువు చెప్పుచున్నారు.

కం॥ **కొత్త దంపతులకూటమి । నెత్తెరుగున లేమలంత నిదురలు పోకన్ । మొత్తములై కనునటువలె । బత్తల దిరిగేటి చిన్ని బాలల కగునే ॥** 179

భావము :- శిష్యా! కొత్త దంపతుల సంయోగమును స్త్రీలు అందరు నిదురమాని సమూహముగా చూచుచుందురు. (తరచు జరిగే విషయమిది) ఈ పని భర్తలతో కాపురము చేయు స్త్రీలే తరచుగ చేయుదురు కాని చిన్న బాలికలు ఆవిధముగ తిరుగరు కదా!

**విశేషభావము** :- భర్తలతో కాపురము చేసుకుంటున్న స్త్రీలు, కొత్తదంపతుల కూటమినాడు నిద్రమాని ఆ గదిచుట్టు ఏ విశేష వాక్యములైన వినబడునో యని తిరుగుచుందురు. ఈ పని భర్తల సాంగత్య విశేషము తెలియని చిన్ని బాలికలు చేయరు. అటులనే యీ పరిపూర్ణ బోధ చెప్పే పెద్దలు ఎవరు ఎచ్చటకు వచ్చి చెప్పినా, ఆ బోధ రుచి ఎరింగినవారు, ఆబోధ వినుటకై ఆయాచోట్లకు వెళ్లి విందురు కాని, బోధ తెలియని సామాన్యులు వెళ్లరని ఈ పద్యభావముగా గ్రహించవలయును.

కం॥ మన సరయక ప్రజలను విను । మని చదువకు బోధ బాధయని యింట్లలో । పనులన్నియాదిజేసుక । చనియెద రాసమయ మందసహ్యాము నసుతా! ॥ 180

భావము :- ఓ సుకుమారా! జనుల యొక్క మనోభావము తెలిసికొనకుండగ వారికి ఎంతో బోధ వినుమని చదువవద్దు. అట్లు చదివినచో ఆబోధ యందు అయిష్టము కల్గి యింట్లోని పనులు జ్ఞాపకము చేసికొని, ఆ పనులు అన్నియు చేసుకోవాలి, ఇక్కడ కూర్చుంటే ఎలా? అని అప్పటినుండి వెళ్ళి పోయెదరు.

కం॥ వినులవినదీబోధను । నేనే బ్రహ్మనని నిక్కి నిల్చెటివాడున్ । మానికము గానవచ్చిన । దానిని రాయనుచుదలచు తార్కికుని గతిన్ ॥ 181

భావము :- శిష్యా! "నేనే" బ్రహ్మనని గర్వముచే వచ్చువాడు ఈబోధను చెవులతో వినడు. (అదెట్లనగా) ఎల్లప్పుడు సంశయ మనస్సుతో నుండువాడు మంచి మాణిక్యమునుగూడ గాజురాయి అని తలంచును గదా!

విశేషభావము :- ఈ పద్యములో తార్కికుడు అనగా తర్కశాస్త్రము తెలిసిన వాడు అని అర్థము చెప్పరాదు. ప్రతి విషయమునందు సంశయము కలవాడని అర్థము చెప్పవలెను. "సంశయాత్మా వినశ్యతి" అనగా సంశయ మనస్సు గలవాడు బాగా చెడిపోవును, అను ఆర్యోక్తి కలదు. అట్టి సంశయ మనస్సు గలవాడు (తార్కికుడు) మాణిక్యము దొరకినప్పుడు కూడ, ఇది గాజురాయేమో? మాణిక్యమైతే ఇక్కడ ఎందుకుంటుంది? అని సంశయించి దానిని విడిచివేయును. అటులనే "నేనే" బ్రహ్మనని (అహమేవబ్రహ్మ) గర్వించి తిరిగే జనులు పరిపూర్ణ బోధను వినరు. అహమేవ బ్రహ్మనని గర్వించేవారు అనగా పరిపూర్ణ బోధలో ఏమి చెప్పుదురో? ఎన్నింతలో తప్పే ముంది? అది కూడ తెలుసుకొని అది గొప్పదైతే దానియందే వర్తించగలము కదా అనే ఆలోచన లేనివారని అర్థము. ఇంతకన్న ఎక్కువ బోధలు ఏమీ లేవు అని గర్వించి తిరుగువారు పరిపూర్ణ బోధకు రారు అని భావము. మరియు తార్కికుడు అనగా ఎల్లవిషయములందు శంకించు వాడని అర్థము. ఇట్టివానికి దుఃఖమే మెండు అని "ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, పరభాగ్యోపజీవి, నిత్యశంకితుడను వారార్గురును దుఃఖభాగులని నీతిశాస్త్రములో చెప్పబడినది. తార్కికుడు అనగా నిత్యశంకితుడు కనుక మాణిక్యమును జూచినకూడ రాయి యనే శంక

గలిగినవాడై దానిని పారవేయును. కనుకనే అట్టి తార్కికుని గతి వలెనే సాధారణముగ దొరకని పరిపూర్ణ బోధను కుసంస్కారులైన వారు వినుటకు మనసు రాక లేచిపోవుదురని భావము.

**కం॥ ఒకరు విని మెచ్చవలెనని । సకల పురాణములు వేదశాస్త్ర శ్రౌత ప్రకరమును నేర్చు విద్వ । న్నికరంబీ బోధ మెచ్చ నేర్చునె సుమతీ ॥** 182

**భావము :-** మంచి బుద్ధిగల ఓ శిష్యా! ఇతరులు విని మెచ్చి సన్మానములు చేసెదరనే భావము కల్గి పురాణములు, చతుర్వేదములు, శాస్త్రములు, మొదలగు వేద, సాహిత్య సమూహమును నేర్చుకొనే విద్వజ్జనులు, ఈ బోధ నేర్చుకొనుటకు సమ్మతించరు.

**విశేషభావము:-** "ఏకం వేదాంత విజ్ఞానం స్వానుభూత్యేవిరాజితే" ఒక్క వేదాంత విజ్ఞానము మాత్రము స్వానుభవము వలన మాత్రముననే ప్రకాశించును అని పెద్దల వచనము. అనగా సమస్త శాస్త్రములు, వేదములు, పురాణములు మొదలగు శ్రౌత సమూహమంతయు పండితుడు అగుటకు, ఇహ, పరలోక సాధనము కొరకు సమస్త భోగముల కొరకు లేక పొట్టపోషించుకొనుటకు మాత్రమే ఉపయోగించును కాని, మోక్షసాధనము కొరకు ఎంతమాత్రము కానేరదు. ఒక్క వేదాంత విజ్ఞానము మాత్రము పై విద్య వలె భోగసాధనము కాదు. కేవలము తిరిగి రాని మోక్షమును సంపాదించుకొనుటకు అనగా స్వానుభవమునకు మాత్రమే ఉపయోగించును కాని మిగతా విద్యలవలె ఎంత మాత్రము ఉదరపోషణకు పనికి వచ్చేది కాదు. ఉదరపోషణకు ఈ విద్యను ఉపయోగించుకొనే వారివద్ద ఈ విద్య ఎంతమాత్రము ప్రకాశించదని గ్రహించవలెను.

**కం॥ సాధారణముగ దెల్పకు । మీధర మానవులబిల్చి యీ బోధను బల్ । మేధానిధి యాచించిన । బోధించుము వద్దు లోభబుద్ధి సుబుద్ధీ ॥** 183

**భావము :-** మంచి బుద్ధి గల ఓ శిష్యా! యీ బోధను సామాన్య మానవులను బిల్చి సాధారణముగ ఎన్నడూ చెప్పవద్దు. చక్కని బుద్ధి సంపద గల సంస్కార విశేషవంతుడు యీ బోధ తెలియపర్చండి అని నిన్ను యాచించిన, లోభత్వము మాని వానికి చక్కగా బోధించుము.

కం॥ ఏ బోధ శిష్యులకు గల । యా బాధల నణచి వేసునదె సద్బోధా । ఆబోధయేది యనినను । యీ బోధే సుమ్మి దీన్ని యిక విడువకు మీ ॥ 184

**భావము** :- శిష్యా! శిష్యులకు ఆ బాధల నణచి వేసునది ఏ బోధో, అదే మంచిబోధ అనబడును. అట్టి మంచి బోధయేది యనగా యీ పరిపూర్ణ బోధే సుమా. కనుక దీన్ని ఎప్పుడును విడువవద్దు సుమా!

**విశేషభావము** :- ఆ బాధలు అనగా, ఆ అనే పదముచే ప్రత్యేక భావము చెప్పనగును. బాధలు, సామాన్యమైన బాధలని అర్థము చెప్పరాదు. ఆ బాధలు అనగా కేవలము పుట్టుట చచ్చుట తిరిగి తిరిగి నివారింప శక్యము కాని ఆ బాధలు అని అర్థము చెప్పవలెను. అట్టి పునరపి జనన మరణముల నణచివేసే బోధ యీ పరిపూర్ణ బోధ మాత్రమేయని గ్రహించవలెను.

కం॥ హెచ్చైన బోధదెల్పే । సచ్చరితులకియ్యలేరు జనులు ధనంబుల్ । గచ్చులు గొట్టే దిచ్చుల । కిచ్చినక్రియ నిట్టి నృతతి నే మననోయీ ॥ 185

**భావము** :- శిష్యా! గొప్పదైన యీ పరిపూర్ణ బోధ తెలియపరిచే మంచి చరిత్ర గలవారికి తగినంత ధనమును జనులు ఇయ్యలేరు. ఆ జనులు డాబుసరి పొగడ్తలతో మనస్సు ఉబ్బించే మాటలు చెప్పే నీచులకు చాల ధనము ఇచ్చెదరు. అట్టి జనులను (నర సమూహమును) ఏమని చెప్పను?

కం॥ నీ మదికీ నిజబోధన్ । ప్రేమతో నాటించదలచి పెక్కు విధములన్ । నే మొదలు బెట్టి జెప్పితి । దే మాత్రము రాత్రి బవలు యే మారకుమీ ॥ 186

**భావము** :- శిష్యా! నీ మనసులో ఈ స్వచ్ఛమైన బోధను దృఢపరచుటకై ప్రేమతో అనేక సూక్తులు యుక్తులు జెప్పుచు, యీ బోధ మొదలుపెట్టి చెప్పినాను. దీనిని ఏ మాత్రము రాత్రింబవళ్లు మరవకు సుమీ! అనగా ఎల్లప్పుడు మననము చేసికొనుచుండుము అని భావము.

కం॥ కమలంబులున్న కొలనుకు । భ్రమరములే తెంచినట్లు బాగుగ బోధన్ । తమమదిగోరి గురునిపద । కమలములను గొల్వ సుజనగణమే తెంచున్ ॥ 187

**భావము** :- శిష్యా! తామర పద్మములున్న సరస్సునకు పద్మములలోని మకరందమును తీసుకొనుటకు భ్రమరములు వచ్చినట్లుగా, యీ స్వచ్ఛమైన పరిపూర్ణ బోధను తమ మనస్సులో తెలుసుకొనవలెననెడు కోరికతో సుజనులైనవారు పరిపూర్ణ బోధ గురుదేవుని పాదపద్మములను సేవించుటకై (గుర్వాశ్రమమునకు) వచ్చెదరు.

**కం॥ సురపద్యుడహల్యకోసము । మరులొందిన రీతి నెపుడు మరుగు దురజ్ఞుల్ । పొరుగూరి సాధకులకు తమ । పురమున గల సాధులందు బుద్ధి నిలువకన్ ॥** **188**

**భావము** :- శిష్యా! ఇంద్రుడు అహల్య కోసము మనసు పడి వెళ్లినట్లుగా, అజ్ఞానులైన జనులు తమ గ్రామమందే ఉన్న పరిపూర్ణ బోధ గురువుల వద్ద చేరక, దూరముగా నుండే తాంత్రికములు మాయలు జేసే గురువుల జేరుటకై పోవుదురు.

**కం॥ నేనీకు జెప్పబూనిన । యీనిజసద్బోధ మనసు కిమిడిన వెనకన్ । నీనా పనిదీరునురా । వోనా ముద్దుల కుమార వో నగధీరా॥** **189**

**భావము** :- శిష్యా! నేను నీకు జెప్ప ప్రారంభించిన యీ స్వచ్ఛమైన పరిపూర్ణ బోధ, నీ మనస్సుకు దృఢ పడిన తరువాత, నీ - నా పని తీరిపోవును ఓ ముద్దుకుమారా! ఓ పర్వతము వంటి ధైర్యశాలీ!

**విశేషభావము** :- యీ పరిపూర్ణబోధ మనస్సుకు దృఢపడి ఆ రూఢస్థితి ఏర్పడినప్పుడు మాత్రమే "నేను" రహితమగును. అంతేకాని బోధ చెప్పుకున్నంత మాత్రమున, బోధ స్థితి కుదిరినట్లు కాదు. కనుకనే ఈ పద్యములో "యీ సద్బోధనీకిమిడిన, వెనుకన్" అన్న పదము ప్రయోగించినారు. అట్టి బోధ స్థితి కుదిరినచో నీ - నా పని తీరిపోవును. గురువునకు - శిష్యుని పని, శిష్యునకు - గురువు పనిలేదని భావము. అనగా బోధ అవసరము లేదని చెప్పుట మరియు నీ - నా అనగా నేనని, జగత్తని అనే ద్వంద్వము రహితమగునని విశేష భావము. ఇంత స్వచ్ఛమైన బోధ చలించని మనస్సుతో, ఇతర విషయవాంఛలు లేకుండగ గురువు వద్ద బోధ విన్నాడు కనుక గురువు ప్రేమాతిశయముచే శిష్యుని ముద్దుల కుమారా! అనియు నగధీరా అనగా పర్వతము చలించక నిలబడి యుండినట్లుగా

విషయవాంఛల యందు చలించక బోధ యందే వర్తించిన మనస్సు గలవాడై యుండుట వలన, నగధీరా! అనియు సంబోధించెను.

**కం॥ త్ర్యక్షుని నిందించినయా । దక్షుని గని ప్రాణమిడిన త్ర్యక్ష సతివలెన్ । యీక్షితి తన దేశికునిను । పేక్షించిన జనుల దాను పేక్షించ దగున్ ॥ 190**

**భావము :-** శిష్యా! శివుని నిందించిన దక్షుని జూచి ఆ శివపత్నియైన సతీదేవి ప్రాణము విడిచినదిగదా! అట్లే యీ భూమిమీద ఎవరైనను తన గురువును నిందించినచో అట్టి నిందించినవారిని శిష్యుడు తప్పక విడచి పోవలెను. (కనుకనే గురు నింద వినరాదు) అని పెద్దల నుడి.

**కం॥ గురునికపరాధియగునా । నరనాథుని ద్రుపదునాతను నరుని విధము నన్ । ధర సచ్ఛిష్యవరుడు తన । గురుశత్రుని చేతనైతె క్రొవ్వణచ దగున్ ॥ 191**

**భావము :-** గురువైన ద్రోణాచార్యునికి అపరాధము చేసిన ద్రుపదరాజును అర్జునుడు ఓడించినట్లుగా సచ్ఛిష్యుడు తన గురువునకు శత్రువైన వానిని చేతనైతే దండించవలెను.

**విశేషభావము :-** 190 వ పద్యములో గురువును నిందించిన వానిని శిష్యుడు విడచి పెట్టదగును అని చెప్పెను. 191వ పద్యములో అట్లు నిందించిన వానిని శిష్యుడు చేతనైతే దండించవలెను. అని చెప్పబడినది. అనగా చేతనైతే అను శబ్దము ప్రయోగించుట వలన శిష్యుడే బలవంతుడైతే గురుశత్రువుని దండించవలెనే కాని చేతకానప్పుడు, అవతల శత్రువు అన్ని విధముల బలవంతుడైనపుడు 190వ పద్యములో చెప్పినట్లుగా ఉపేక్షించవలెను. అనగా విడచి పెట్టవలెను. అనగా అట్టివానిని ఏ విషయములోను కలవరాదు అని చెప్పినట్లు గ్రహించవలెను.

**కం॥ కాకులవలె కూకలిడే । లోకులకే కలకు బెదరిలో గుందకటన్। మూకత్వమూను చాలువి । వేకుడవై యుంటివేని విని నామాటా ॥ 192**

**భావము :-** శిష్యా! కాకిమూకలు అరచినట్లుగా సందర్భము లేకుండగా, ఎదుటి వారిని మాటాడనీయకుండా కేకలు వేసే జనులకు బెదరిపోయి మనసులో బాధపడకు. నేను చెప్పేమాట ఏమంటే అట్టి సందర్భములలో నీవు తెలివైనవాడవయితే మౌనము వహించుటయే మేలని వినుము.

కం॥ పెద్దల నెవరిని జూచిన । ముద్దుగ మాట్లాడి వారు ముదమున జెప్పే । సుద్దుల కడ్డము జెప్పక । నొద్దికతో మ్రొక్కి వినుమ వో పుణ్యతమా ॥ 193

**భావము :-** శిష్యా! పెద్దలైన వారెవరిని జూచినను, వారితో ముద్దుగ మాట్లాడి, వారు సంతోషముతో చెప్పే మాటలకు అడ్డుచెప్పక అనుకూలముగా వారికి మ్రొక్కి వినుము ఓ పుణ్యచరిత్రా! ॥ (ఒద్దికతో=అనుకూలముగ)

**విశేషభావము :-** ఈ పద్యభావము అందరము గమనించ దగినది. పెద్దల నెవరిని జూచిన అన్నారు. అంటే మన సాంప్రదాయ పెద్దలనే అర్థము కాదు. ఎట్టి సిద్ధాంత పెద్దలైనను అని భావించవలెను. ఎందుచేతననగా, సన్యాసులు, మతాచార్యులు, వైద్యులు మున్నగువారితో వాదించుట, భేదించుట తగదని శాస్త్ర వాక్యము. సన్యాసులు ఏ సిద్ధాంతులైనను గృహస్థుడు వినయముతో నమస్కరించి తీరవలెనని శాస్త్రము ఆదేశించుచున్నది. కనుక అట్టి వారెవరైనను వారితో మంచిగా మాట్లాడి వారు చెప్పే మాటలను వినయముతో వినుము. వారితో వాదించుట తగదని కృష్ణ ప్రభువులు ఈ పద్యములో చెప్పినారు. "వినదగు నెవ్వరు జెప్పిన" అన్న సుమతి శతక వాక్యము గ్రహింపనగును. విన్నంత మాత్రముచే ఆ సిద్ధాంతమును మనము అంగీకరించినట్లుగాని మన సిద్ధాంతమును కించపరచుకొన్నట్లుగాని కానేరదు.

కం॥ తన హిత వెరుగని మనుజుడు । విన దాప్తజనోక్తి దుష్టవృత్తి గల సుయో । ధనుడు దశాననుడు విహిత । జన వాక్యము వినకగాదె సమసె రిరువురున్ ॥ 194

**భావము :-** తన మంచిని తెలుసుకోలేని మానవుడు, తన మంచికోరే వానియొక్క మాటను వినడు. దుష్ట స్వభావము గల దుర్యోధనుడు, రావణుడు వారి ఆప్తుల మాటను వినకపోవుట వలననే వారిద్దరు మరణించిరి కదా!

**విశేషభావము :-** "పోగాలముదాపురించినవాడు మిత్ర వాక్యమును, అరుంధతిని, దీప నిర్వాణ గంధమును - వినరు, కనరు, మూర్కొనరు" అని నీతి శాస్త్రములో చెప్పబడినది. అనగా చావు దగ్గర పడినవాడు హితవాక్యమును వినడు, అరుంధతిని కనలేడు, దీపము ఆరిపోయినప్పుడు వచ్చేడు వాసనను గ్రహించలేడు. కనుకనే దుర్యోధనుడు, హితుడైన విదురుడు మున్నగు పెద్దలు చెప్పినట్లు వినలేదు.

అట్లే దశాననుడు అనగా పది ముఖములు గల రావణుడు విభీషణుడు చెప్పిన మంచి మాటలు విన లేదు. కనుకనే దుర్యోధనుడు, రావణుడు మహా బలవంతులైనను, హిత వాక్యమును వినిపించుకొనక యుద్ధములో చనిపోయిరి. కనుక "గురు బుద్ధి విశేషతః" గురువు కన్న బుద్ధిమంతుడు, హితుడు మరొకరు లేరు కనుక శిష్యుడు గురువాక్యమును పాటించక పోయినచో తప్పక పాడైపోవునని ఈ పద్యభావము.

**కం॥ ఎన్నో గ్రంథ జలధులను । తిన్నగ మథియించి చూస్తె తేలెను సారం । బున్న బయలుగని మృషయగు । నిన్నున్ నీమేను మృషని నిలువకు మనుచున్ ॥ 195**

**భావము :-** శిష్యా! ఎన్నో భావగర్భిత గ్రంథములను చక్కగా విచారించి చూచినచో, ఉన్న పరిపూర్ణమును చూచి, లేని నిన్నును, నీ శరీరము లేనివని లేకుండా పొమ్మని, ఈ సారాంశము తేలినది. అనగా పరిపూర్ణమె ఉన్నది "నేను" మృషయని సమస్త గ్రంథములు నిర్ణయించినవని భావము.

**కం॥ కనక సుమగంధవాసన । తనకొనగాదలచి షట్పదము గొనదటులన్ । వినదు లేనహమె బ్రహ్మం । చనిపత్కే నృతతి నిల్వనని యీ బోధన్ ॥ 196**

**భావము :-** శిష్యా! భ్రమరము తనకు చివరిరోజుగా తలచి సంపంగి పువ్వు సువాసనను గ్రహించ తలచదు. అటులనే లేని అహమే బ్రహ్మని పలికే నర సమూహాము తానే లేకుండా పోతాననే భయముచే యీ బోధను "నేను" వినదు.

**విశేషభావము :-** కనక సుమ మనగా సంపెంగ పువ్వు. సంపంగి పువ్వు వద్దకు భ్రమరములు రావు. భ్రమరము సంపంగి పువ్వు మీద వ్రాలినచో చనిపోవును. అందుచే భ్రమరములు మాత్రము సంపంగి పువ్వు మీద వ్రాలుటకు "తన కొనగాదలచి" అంటే వ్రాలినచో అదే తన యొక్క చివరగా తలచి అంటే చనిపోవును కనుక అని అర్థము. అట్లే నేను అనే యెరుక ఎన్ని సిద్ధాంతముల లోనైన తానే బ్రహ్మమని ఔన్నత్యము, ఈలేని ఎరుకకు ఏర్పరిచినవి. కాని ఈ పరిపూర్ణ బోధలో "నేను" లేదని లేకుండా చేసినది. కనుక "నేను" తాను లేకుండా పోవుదుననే భయముచే యీ పరిపూర్ణ బోధను అంగీకరించలేదని కృష్ణ ప్రభువులు చమత్కరించినారు. ఎదుటివారిని ఎంతమందినైనా చంపుటకు అంగీకరించుదుము కాని తన్ను తాను చంపుకొనుటకు అంగీకరించ లేకపోవుట సహజమె కదా!"

కం॥ హద్దు సుమీ గురువాజ్ఞన । ముద్దుసుమీ గురుని సేవముద మునజేయున్ । పద్దుసుమీ యిట్లుండుట । వద్దుసుమీ గురుని తోటి వాదించుట మున్ ॥ 197

భావము :- శిష్యా! గురువాజ్ఞను ఆజ్ఞగా గ్రహించుము. అనగా ధిక్కరించ రాదని భావము. గురుసేవ చక్కగా చేయుట శిష్యునికి ముద్దు సుమీ. గురునితో ఎన్నడును వాదించుట తగదు. యీ విధముగా ఉండుటకు ప్రతిజ్ఞ చేయవలెను. (గురుసేవ సంతోషముగా చేయుట ఆదరించ తగినది సుమా అనగా తప్పక ఆచరించవలెనని భావము) (ముద్దు - ఆదరించుట) (పద్దు=ప్రతిజ్ఞ)

కం॥ జంభాలపోతుగోరునె । సంభవనాశములబాపు చక్కని బోధన్। కుంభిని షండున కుండునె । రంభా సంభోగవాంఛ రంభను గనినన్॥ 198

భావము :- శిష్యా! భూమి మీద నపుంసకుడు రంభను చూచినను ఆమెను సంభోగించుటకు అతనికి మనసు రాదు. అట్లే తిండిపోతు భవనాశములు బాపే యీ చక్కని బోధ అయిన పరిపూర్ణ బోధను కోరడు. (జంభాలపోతు=తిండిపోతు)

కం॥ పతిభక్తి గల యువతి వలె ।సతతము గురుభక్తి గలిగి సచ్ఛిష్యుడిలన్ । స్థితి గుదురసేవజేయును । ప్రతిరహితాద్భుత చరిత్ర పరమ పవిత్రా ॥ 199

భావము :- సాటిలేని గొప్పదైన నడవడిగల పరమ పవిత్రుడైన వాడా! ఓ శిష్యా! పతిభక్తి గల (పతివ్రత అయిన) స్త్రీ వలె, సచ్ఛిష్యుడైన వాడు బోధస్థితి గుదురుటకై ఎల్లపుడు గురుభక్తి కలిగి గురుసేవ చేయుచుండును.

విశేషభావము :- బోధస్థితి కుదురుటకై గురుసేవ చేయవలెను. అనగా బోధస్థితి గురుకరుణచే మాత్రమే కుదురును. ఈవిషయము శుద్ధ నిర్గుణతత్వకందార్థము 101లో విశేష భావముగా వ్రాయబడినది. కనుక గురుసేవ వలన మాత్రమే బోదస్థితి కుదురును గనుక, సచ్ఛిష్యుడు బోదస్థితి కుదురుటకై గురుసేవ చేయవలెను.

కం॥ జఠర జనితులైనను బహు । కఠిన మనస్కులకు ఘోర కలుషాత్ములకున్ । శఠులకు జడమతులకివకు । పఠనాసక్తులకు బోధ పట్టు మటంచున్ ॥ 200

**భావము :-** శిష్యా! కడుపున పుట్టినవారైననూ బహు కఠిన మనస్సు గలవారికి మహాపాతకులకు, కుత్సితులకు యీ బోధ చెప్పవద్దు. దీని యందు ఆసక్తి గల (శుద్ధసత్వప్రధానులకు) వారికి మాత్రమే యీబోధ చెప్పుము.

**విశేషభావము :-** జఠర జనితులు అనగా మానవులు అని అర్థము చెప్పుట కలదు. అది సరైన అర్థము కాదు. జఠర శబ్దమునకు కడుపు అని నిఘంటువులో చెప్పబడినది. కనుక కడుపున పుట్టినవారు అని అర్థము. అనగా నీకు పుట్టిన వారైనను కఠినులకు, పాపులకు, కుత్సితులకు యీ బోధ చెప్పవద్దు అన్నారు. అందుకే గురుగీతలో

"శ్లో॥ కర్మభ్రష్టాః క్షమానష్టా । నింద్యతర్కైశ్చవాదినః । కామినః క్రోధినశ్చైవ । హింసా చండాశ్శఠాస్తదా ॥ జ్ఞానలుప్తాశ్చకర్తవ్యా । మహాపాపాస్తథా ప్రియే । ఏభ్యో భిన్నో గురుస్సేవ్య । ఏకభక్త్యా విచార్యచ ॥ అనియు "అభక్తే వంచకే ధూర్తే పాషండే నాస్తికాదిషు । మనసాపినవక్తవ్యా ॥అని చెప్పినట్లుగా వేదోక్త కర్మరహితులై, ఓర్పులేనివారికి, నింద్యములైన తర్కముచే వాదించువారును, కాముకులు, మహాకోపము గలవారు, హింసా ప్రవర్తకులు, తీవ్ర స్వభావము గలవారు, కుత్సితులు, జ్ఞానహీనులైన వారు, భక్తిలేనివారు, మోసగాళ్లు, ధూర్తులు, పాషండులు యీ మొదలైనవార్కి యీ బోధ చెప్పరాదని గురుగీతలో చెప్పబడినది. శుద్ధ సత్వ ప్రధానులైన గురుభక్తి పరాయణులకు మాత్రమే బోధ చెప్పదగును. ఈనాడు నాకు ఇన్ని వందలమంది శిష్యులు గలరని చెప్పుకొనే గురువులు ఈ లాంటి పద్యములు చెప్పిన కృష్ణ ప్రభువుల మనస్సును గ్రహించగలరు.

**కం॥ కప్పురము నిప్పుగలసే । చొప్పున వెలిగవల కండ్ల జూస్తుండగనే। తప్పున గన రావట్లనె । యిప్పుడు నిను నన్ను బోధ నెరుగుము బుద్ధిన్ ॥ 201**

**భావము :-** శిష్యా! కర్పూరము నిప్పు గలసి వెలిగి, ఆ రెండును చూస్తుండగనే వెంటనే ఏమియు లేకుండపోవును. అట్టి విధముగానే ఈ పరిపూర్ణ బోదచే నిన్ను - నన్ను నీ బుద్ధిచే తెలుసుకొనుము.

**విశేషభావము :-** కర్పూరము నిప్పు కలసి వెలిగి చివరకు రెండును కూడ లేకపోవునట్లుగానే, పరిపూర్ణ బోధవలన గురుడు - శిష్యుడు ఇద్దరును లేకపోవుదురు. ఒకరుండి మరొకరు లేకపోవుట కాదు. గురుడు శాశ్వతము. శిష్యుడు లేకపోవును అని చెప్పుట విన్నాను. అందులో వారి భావము గురుడు

పరిపూర్ణము కనుక శాశ్వతమని చెప్పుచున్నారు. అది తప్పు గురుడు పరిపూర్ణము ఎంత మాత్రము కాదు. ఎరుకయే. అయితే జ్ఞానస్వరూపుడు. శిష్యుడు - ఎరుకయే. కనుక కర్పూరము - నిప్పు రెండును లేకపోయినట్లే, జ్ఞానాఽజ్ఞాన స్వరూపులైన గురుశిష్యులిద్దరును, పరిపూర్ణ బోధవలన లేకపోవుదురు.

**కం॥ దీవించి యిస్తి నేనీ । సేవించిన సేవ మెచ్చి చిత్తములో నన్। కావించుమెపుడు గానము । భావించిది ముఖ్యమనుచు పావన శీలా ॥ 202**

**భావము :-** శిష్యా! పవిత్రమైన శీలము గలవాడా! నీవు చేసిన గురుసేవకు నా హృదయములో సంతసించి, బోధ స్థితికుదరగలందులకు ఆశీర్వదించి, యీ బోధ నీకిచ్చుచున్నాను. ఇది చాల ముఖ్యమైన బోధయని భావించుము.

**కం॥ అనిగురుడు బోధ జేసిన । విని శిష్యుడు హర్షమొంది వేడుకతోడన్ । తన గురుని తోటి విజ్ఞా । పనమీరీతి గనొనర్చె పటువాక్ప్రౌఢిన్ ॥ 203**

**భావము:-** పై విధముగా బోధ జేసిన బోధను విని, శిష్యుడు చాల సంతోషమును పొంది, చక్కని వాక్యపటుత్వముచే సంతోషముగా తన గురునితో ఈవిధముగా విజ్ఞాపన చేసికొనెను.

**కం॥ నా కొరకు కష్టపడితిరి । మీకై మీరిటకు వచ్చి మిముబొగడుటకా । కాకోదరేశుడోపం । డాకార్యము నాతరంబె యచలమనస్కా ॥ 204**

**భావము :-** గురుదేవా! మీకై మీరు ఇక్కడకు వచ్చి నా కొరకు కష్టపడితిరి. ఇంతటి ఔదార్య బుద్ధి గల మిమ్ములను పొగడుటకు ఆ ఆదిశేషువున కైనను వశముగాదనినచో, ఆ పనినా వలన అగునా? ఓ అచలమనస్కా!

**విశేష భావము :-** గురుమూర్తి అనగా సాక్షాత్పరబ్రహ్మము అని చెప్పబడినది కదా. పరబ్రహ్మము స్వయంభు. తనంతట తానుగా మూలము లేనిదే ఏర్పడినది. అట్టి పరబ్రహ్మ స్వరూపుడైన గురు ప్రభువుకూడ స్వయంభువుగా భావించవలెను. కనుకనె యీ పద్యములో "మీకై మీరిటకు వచ్చి" అన్నారు. మీ అంతగా మీరు ఇచ్చుటకు నా కొఱకు వచ్చిరి. అందుకే భగవద్గీతలో "తథాత్మానం సృజామ్యహం'

నన్ను నేనే సృజించు కొనుచున్నాను. అన్నారు. కనుక గురుమూర్తి తనకు తానే వచ్చెనని ఈ పద్యములో శ్రీకృష్ణ దేశి కేంద్రుల వారు చెప్పినారు.

భ్రాంతి ఉన్నంతవరకు మనస్సు చలించుచునే ఉండును. గురు దేవుడు భ్రాంతి రహిత స్థితిని పొందినవారు. కనుక వారి మనస్సు చలన రహితమైనది. కనుక గురుమూర్తిని ఈ పద్యములో "అచల మనస్కా!" అని సంబోధించిరి.

**కం॥ తల్లివి దండ్రివి దాతవు । వల్లభుడవు బాంధవుడవు వసుధీశుడ వున్। తెల్లమిగదేవుడవునీ । వల్లగదా యిట్టి బోధవర్తన వినుటల్ ॥ 205**

**భావము :-** గురుదేవా! నీవు నాకు తల్లివి, తండ్రివి, అధిపతివి. సకల బంధు స్వరూపుడవు, మహారాజువి. మరియు స్వచ్ఛమైన దేవుడివి. ఇట్టి నీవలన గదా యింతటి గొప్ప బోధ యొక్క పద్ధతి వినుట జరిగినది. (తెల్లమిగ=స్వచ్ఛమైన)

**కం॥ అని శిష్యుడన్నమాటకు । మనమున హర్షించి గురుడు మరియిట్లనియెన్ । వినవోయి శిష్యరాయా । విని నా కోరికను దీర్చవేడుక యైనన్ ॥ 206**

**భావము :-** పైవిధముగా శిష్యుడు పలుకగా, గురుమూర్తి సంతోషించి యిట్లు పలికెను. ఓ శ్రేష్ఠమైన శిష్యా! నే చెప్పునది వినుము. విని నీ మనస్సున కిష్టమైనచో నా కోర్కెను తీర్చుము.

**కం॥ నేజెప్పినట్లు జెప్పర । నే జెప్పిన బోధ లెస్సనీ కలికుంటే । నే జూతునీచమత్కృతి । రాజిత సుగుణైక-సార రమ్య విచారా ॥ 207**

**భావము :-** శిష్యా! ప్రకాశవంతమైన మంచి గుణములన్నియు కల్గినవాడా! చక్కని విచారము గలవాడా! నే చెప్పిన బోధ నీ మనస్సున కలికినచో, నేను చెప్పిన విధముగనే తిరిగి నాకు చెప్పుము. నీ నేర్పు ఎట్టిదో చూచెదను.

**కం॥ అని గురుడు తనను బల్కిన । విని శిష్యుడు లేచి మ్రొక్కి వినుతించి ముదం । బునజెప్పదొణగెమునుతా । వినినట్లుగ గురుని మదికి వేడుక దోపన్ ॥ 208**

**భావము :-** అని పైవిధముగా గురుమూర్తి అడుగగా విని శిష్యుడు లేచి గురుమూర్తికి ప్రార్థన పూర్వకముగా నమస్కరించి, తాను ముందు గురుమూర్తి ద్వారా వినిన బోధను, గురుమూర్తి మనస్సుకు సంతోషము కలుగులాగున ఉత్సాహముతో చెప్ప పూనెను.

**కం॥ నేమొదలు లేని మేనును । నా ముచ్చట స్వప్నమనుచు నమ్మదగు సుమీ । నేమేలుకొన్నలేనని । నా ముచ్చట నేను నిల్వ నరఘుడి యైనన్ ॥ 209**

**భావము :-** ఆర్యా! మొట్టమొదట నుండి లేని నేను యీమేను నా ముచ్చట సమస్తము కలవంటిదని నమ్మవచ్చును. అట్టి స్వప్నము నుండి మేల్కొనినచో నేను, నా ముచ్చట సమస్తము అరనిముషము కూడ ఉండక లేకపోవుదుము.

**విశేషభావము:-** నేను అనగా ఎరుక మొదటి నుండి లేదు. మొట్టమొదటి నుండి ఎవ్వరు ఎరుగక పూర్వము నుండి తనంత తానుగా స్వతస్సిద్ధమై సర్వవ్యాప్తమై యున్నది పరిపూర్ణము. అందులో కలవలె లేక తోచబడినది "నేను" అనే యెరుక. దానివలన ఏర్పడినది జగత్తు. ముచ్చట అని ఈ పద్యములో అన్నారు. ముచ్చట అంటే మాట, అందము అని అర్థములు. ఇచ్చట మాట అని అర్థము చెప్పవలెను. పలుకువల్ల ఏర్పడినదే జగత్తు ఎందుచేతననగా పలుకు - పలుకున గలిగిన అర్థము రెండు ఒక్కటే కదా. కనుక ముచ్చట అనగా ఇచ్చట జగత్తు అని అర్థము చెప్పవలెను. నేను - నా ముచ్చట అనగా యెరుక - జగత్తు అని అర్థము. పరిపూర్ణము ఉన్నదని గురుముఖతా మేల్కొనినచో యెరుక జగత్తులు లేవు.

**కం॥ లేనినే లేకవచ్చిన । నేనేగిన నుండు బయలునే నెరుగను యీ । నేనుండి దాన్ని గనుగొని । నేనేగితె మరల బుట్టని కనెన్నటికిన్ ॥ 210**

**భావము:-** గురుదేవా! లేని యీ "నేను" లేకనె వచ్చును. "నేను" లేకపోయినను, పరిపూర్ణము శాశ్వతమై యుండును. అయినా దాన్నినే నెరుగను. యిట్టి "నేను" ఉండి, పరిపూర్ణమున్నదని విచారించి చూచి, "నేను" లేనని లేకపోయినచో "నేను" ఎన్నటికి తిరిగి పుట్టను.

**కం॥ లేని నా రాకపోకలు । దేనందున దోచబడెనదె బయలు సుమ్మీ । దానిని గురుకృప చేగని । నేనేగిన రానుపోను నిజమెన్నటికిన్ ॥ 211**

**భావము:-** హే స్వామీ! లేని "నేను" పుట్టుట, చచ్చుట దేనందున తోచబడునో, అదే పరిపూర్ణము. అట్టి పరిపూర్ణమును గురుకృపచే ఉన్నదని విచారించి చూచి, లేని నేను లేనని లేకపోయినచో "నేను" తిరిగి పుట్టుట, చచ్చుట జరుగదు. ఇది నిజము.

కం॥ తనువుకు నాకును వేరని । యన గూడద దెట్టులనిన నన వరతంబున్ । పనులన్ని తనువు నేతే । కనుజేయఁగ వశము గాదు గావున సామీ ! ॥ 212

భావము :- హే స్వామీ! తనువు, నేను వేరని యనగూడదు. ఎందుచేతననగా ఎల్లప్పుడు పనులన్నియు నేను లేకుండ చేయలేను గదా! కావున నేను, తనువు ఒక్కటే ప్రభూ!

కం॥ ననురమ్మని పొమ్మనితా । నన దుసుమీ బట్టబయలు నాకై నేనే । తనువును జగమును గైకొని । చనుదెంచుట చనుట నాకు సహజము తండ్రీ ॥ 213

**భావము :-** తండ్రీ గురుదేవా! పరిపూర్ణము నను రమ్మని గాని పొమ్మని గాని అనదు. అనగా నను పుట్టమని గాని, నీ కాలము అయిపోయినది చనిపోవలెను అని గాని అనదని భావము. నాకు నేను గానే నేను, శరీరము, జగత్తులతో వచ్చుట (పుట్టుట) పోవుట (చచ్చుట) జరుగును. ఇది నా సహజ లక్షణము.

కం॥ ప్రకటమగు బట్ట బయలున । సకలముతో లేకవచ్చి చనుద రఘుడి యన్ । వొకకోటి మాట్లనేరా । నొకవేళ్లను లేనటంచు నూహబొడమినన్ ॥ 214

**భావము:-** ఓ ప్రభో! ప్రసిద్ధమైన పరిపూర్ణమునందు సమస్త జగత్తుతో నేను లేకనె వచ్చి అరఘుడియలో అనేక భావములతో నుండి, చనుదును. ఒకానొక సమయములో నేను లేనని తెలుసుకొనినచో తిరిగిరాకుండా పోవుదును.

**విశేషభావము :-** ఒక కోటి మాట్లు అరఘుడియలో సకలముతో లేక వచ్చి చనుదును అని ఒక అర్థము. మరియు ఒక అరఘుడియలో సకలముతో లేక వచ్చి ఒక కోటి మాటలు (భావములు లేక సంకల్పములతో) కలిగి ఉండి లేక పోవుదును అని కూడ అర్థము చెప్పవచ్చును. అట్టి రాకడ పోకడలతో కూడిన "నేను" నా పూర్వ జన్మ సుకృతము వలన గురుకరుణ కలిగిన ఒకానొక సమయమున "నేను" లేనని తెలసి నచో తిరిగిరాకుండగ పోవుదును అని భావము.

కం॥ లేనినే నెరుగకుండిన । మేనుండదు నేను నిల్వమే నుండక యీ। మేనగు నాజో లొల్లని । దానిని గుర్తెరిగి నేను తలగితె చాలున్॥ 215

**భావము :-** స్వామీ! యీలేనినేను ను తెలియని శరీరము నిలబడి ఉండదు. శరీరము లేకపోయినచో నేను నిలబడియుండదు. యీనేను మేనుల విషయము ఎంతమాత్రముతెలియని పరిపూర్ణమును నేను గురుముఖతా గుర్తించి, నేనులేనని లేకపోతేచాలును.

**విశేషభావము :-** "లేనినే నెరుగకుండినమే నుండదు" అనగా "లేనినేను" ను శరీరము ఎరుగదు. శరీరమునకు ఎరిగే లక్షణములేదు కదా "నేనే" సమస్తమును తెలుసుకొనును. జడమగుశరీరమునకు తెలుసుకొనే సత్తాలేదు. అయినను మేనులేకుండగ "నేను" గాని "నేను" లేకుండగ మేనుగాని ఉండదు. యీనేను-మేనులు రెంటిని పరిపూర్ణము యెరుగదు. పరిపూర్ణములో గుర్తులేదు. కనుక తనగురించిగాని, ఇతరమునుగురించిగాని పరిపూర్ణము గుర్తించలేదు. అట్టి పరిపూర్ణము ఉన్నదని గురుముఖతా యీ "నేను" గుర్తించినచో, నేను-మేనులు రెండునులేకుండా పోవుననిభావము.

**కం॥ మనము మనపెద్దలందరు। చనుదేరకమునుపు వారుచనివన్ గలయీ । ఘనమును గని మనమేగిన। చనదుగదా మనను బోలి సారవిచారా ॥ 216**

**భావము:-** ఓ శ్రేష్ఠమైన విచారణచేయుగురుదేవా! మనము మనతాత తండ్రులు రాకముందు, మరియుపోయిన తరువాత (అన్నికాలములయందు) స్థిరముగ ఉన్నయీపరిపూర్ణమును విచారించిచూచి, మనములేనిదేయేర్పడినట్లు తెలుసుకొని, మనము లేకపోయినను, యీ పరిపూర్ణము మనములేనట్లుగా లేకపోదు గదా! అనగా ఎల్లకాలము శాశ్వతమై ఉండుననిభావము.

**కం। మేను మజ్జనని నేనే। మేనికి జనకుడను, నేను మేనులొకటియై। దేనందు సంచరింతుమొ। దానిని పరిపూర్ణమను చుదలచెదనయ్యా॥ 217**

**భావము :-** స్వామీ! శరీరమునాకుతల్లి, శరీరమునకు తండ్రిని"నేనే", యీనేను మేనులొకటై, దేనందు తిరుగుచున్నదో, దానినే పరిపూర్ణమనుచు భావించెదనయ్యా!

**విశేషభావము :-** శరీరము నాకుతల్లి, శరీరమునకు తండ్రిని నేను అని అనుట ఒకదానివలన మరొకటి కల్గుచున్నదను భావము మాత్రమే. శరీరమువలన నేను, నేను వలన శరీరము అస్తిత్వము పొందుచున్నది. అన్యోన్యాశ్రయములు అని తెలుసుకొనవలెను.

కం॥ మేనున్నదినే లేకను । నేనెరుగను మేనులేకనే నిల్వనుయీ ।
మేనుకు నేనుకు మూలము। గానను మముమేమె సృజన గావింతు
మయా ॥ 219

**భావము :-** దేవాధిదేవా! జగత్తులేనిదే "నేను" నిల్వదు. "నేను" లేకపోయినచో జగత్తు ఉండదు. ఇది నిజము. యీజగత్తు-నేను లేనప్పుడు, ఉన్నదానినే పరి పూర్ణమని తెలియవలెను.

**విశేషభావము :-** పై 218 పద్యములో (పిండాండములో) నేను-మేనులులేనిది పరి పూర్ణము అని వివరించబడినది. ఈ 219వ పద్యములో నేను-జగములు లేనిది పరి పూర్ణమని (బ్రహ్మాండములో) చెప్పబడినది. ఇచ్చట నేను అనగా జగదధిష్ఠానమైన ఎరుక అని అర్థము. యీ జగమున్ నేనును లేనప్పుడు గల దానిని పరిపూర్ణము"ని దెలియవలెను. అనగా ఎరుక జగములుకు ముందే (పూర్వమే) ఉన్నదానిని పరిపూర్ణము అని ఒక అర్థము. ఎరుక జగములు లేనపుడే అనగా లేవని ఆ రూఢమైతే ఉన్నది పరిపూర్ణమని మరొక అర్థము. ఎరుక జగములు తోచబడుచున్నంత కాలము పరిపూర్ణము గుర్తింపబడలేదు. బోధమాత్రమే చెప్పగలిగి ఉండవచ్చును కాని స్థితి కుదరలేదు. ఎప్పుడైతే గురుకరుణచే యెరుక జగములు లేవని ఆ రూఢమైనదో, పరిపూర్ణమె ప్రత్యక్షమని ఈ పద్యభావము. అనగాతానేలేడు.

కం॥ లేనినే మాయమైనను । మానవులది మరుపు, మూర్ఛ, మరణంబునుగా । ధానిద్రయు, నిర్నిద్రన । నేనవివిని మృషని నమ్మనేర్తునెవాటిన్ ॥ 220

**భావము :-** స్వామీ! యీలేని "నేను" లేకపోతె, దానిని సామాన్య జనులు మరుపని (కోమా) మూర్ఛఅని, మరణమని, గాఢనిద్రయని, లేక నిర్నిద్రయని అంటారు. అట్టి మాటలు వినినేను అవన్నియు మృషగా భావించి వాటిని నమ్మలేను.

**విశేషభావము :-** "లేని నేమాయమైనను" అనగా నేను లేకపోవడము. అనగా పరిపూర్ణమును గని లేకపోవడమని భావించరాదు. సహజముగ మరుపు జెందుట యేయని తెలియవలెను. అట్టి అవస్థలకే మూర్ఛ, మరణము, సుషుప్తి వగైరా మాట అంటారు గాని వాటిని నేను నమ్మలేను. అట్టి అవస్థలలో నేను మాయము కాలేదు. ఉన్నాను. మరుపు జెందడమైనది. అవన్నియు యీ నేనుకు

సహజలక్షనములే, కనుక ఆమాటలన్ని అబద్ధముగా భావించి ఆ అవస్థలలో నేను లేనంటే నమ్మను అని భావము.

**కం॥ వినుభాష్యములను త్రాళ్ళను। జనములు నను గట్టి యుంచ జన కనిలుతునా। చనుదొత్తునాకునేనై। కనుకనె నునునమ్మరెపుడు ఘనులగువారల్ ॥ 221**

**భావము :-** అయ్యా! స్వామీ! పెద్దపెద్ద భాష్య (విచారణగ్రంధము) ములనే త్రాళ్లచే జనులు ననుచలించకుండగ కట్టియుంచినను, నిలకడగా, ఉందునే? (అనగా లేకపోవుదును అనిభావము) నా అంత నేనే (ఎవరి ఆధారము లేకుండముగా) వస్తూ పోతూ ఉంటాను. అలా వచ్చుటపోవుట కలదానిని గనుకనే, మహాపెద్దలు (పరిపూర్ణ బోధస్థులు) ఎప్పుడునను నమ్మరు.

**విశేషభావము:-** విను, భాష్యములను త్రాళ్లను, ఇచ్చుట విను శబ్దమునకు వినుట అని అర్థము చెప్పరాదు. ఈ పద్యము శిష్యుని నోటి వెంట చెప్పబడినది. కనుక గురు దేవులను "విను" అనుపదము ప్రయోగించరాదు. విను అన్నమాట ఆజ్ఞా పూర్వకమైన పదము. కనుక "విను" అనగా ఆకాశము అని అర్థము గలదు. ఇచ్చుట ఆకాశ శబ్దము అర్థరహితము. కనుక సంబంధిత భావము పెద్ద అని భావించుట అర్థవంతము కాగలదని నాభావము.

భాష్యములనగా బ్రహ్మసూత్రాదులకు వ్యాఖ్యానగ్రంధములు. పెద్ద పెద్ద భాష్యములు వ్రాసి "నేను" శాశ్వతమైనదని నిలబెట్టి చెప్పబడినది. కాని పరిపూర్ణ బోధయందు "నేను" శాశ్వతముకాదు, అసలులేనిది. కనుక భాష్యములనే త్రాళ్లచే పోకుండగ కట్టిపడవేసినను పోకుండ ఉండగలనా? చలన స్వభావము గలది. వచ్చుటపోవుట సహజ లక్షణము గాగలది. మరియు పరిపూర్ణమున్నదని చూచినచో, లేకుండా పోయేదే. కనుక పరిపూర్ణభావజ్ఞులు యీ "నేను"ను నమ్మరు.

**కం॥ నానాభాషలచేతను। నానావిధశాస్త్ర తతుల నను నమ్ముటకై। నేనే రచించి పెట్టితి। నానాదేశముల యందు నరరూపమునన్ ॥ 222**

**భావము :-** గురుదేవా! అనేక దేశముల యందు "నను" నమ్ముటకై మానవ రూపములో అనేక భాషలలో అనేక శాస్త్ర సమూహమును "నేను" రచించినాను. అనగా ఎరుక చేతనే, ఎరుకయే పరమార్థమని నమ్ముటకు అనేక శాస్త్రములు నరరూపములో వ్రాసెనని భావము.

**కం॥ ఒకచోట నవ్వుదునువే । రొకచోటను మిడుకుచుందునొక చోటనునే । ప్రకటమగుదు లేకుందును । నొకచోటను, యిట్టి చేష్ఠలుండునునాకున్ ॥ 223**

**భావము :-** ఆర్యా! "నేను" (ఎరుక) ఒకచోట నవ్వుదును. మరొకచోట త్రుళ్లి పడుచుందును. నొకచోట ప్రసిద్ధమై ఉందును. వేరొకచోట లేకపోవుదును. యీ విధమైన అన్ని పనులు "నేను" అనేక రీతులలో చేయుచుందును (మిడుకుట=త్రుళ్లిపడుట).

**కం॥ కావేటి కాలువలవలె । నావల్లనె కల్పనౌను నానా విద్యల్ । యీ విశ్వమందు విశ్వము । నా వెంటనె వచ్చు పోవు నావలెను సుమీ ॥ 224**

**భావము :-** పురుషోత్తమా! నదీ కాలువలు అనేక చోట్లకు అనేక రీతులుగా పారినట్లుగా, యీ విశ్వమందు నానా విద్యలు (అనేకముగా) అనేకచోట్ల నా (నేను) వల్లనే కల్పించబడినవి. యీ విశ్వము నావలెనే నాతో వచ్చును తిరిగి నాతోనే లేకుండా పోవును.

**కం॥ నేనాడుదాననౌదును । నేనే మగవాడనౌదు నేనే నన్నున్ । నే నీ వటంచు గూడుదు । నేనే నను జెరుప మనుప నీగుదు సుమ్మీ ॥ 225**

**భావము:-** గురు సార్వభౌమా! "నేనే" ఆడుదాననగుదును, మగవాడునగుదును. "నేనే" రెండుభిన్న రూపములుగా నన్ను నీవు అని కలియుచుందుము. "నేనే" నన్నుపాడు చేయుదును, రక్షించెదను మరియు నివర్తించెదను. (నీగుట= నివర్తించుట, (చచ్చుట))

**కం॥ నేనుల మేనుల కుప్పను । నేను బయల్ నన్నెరుగదు నే చను దొత్తున్ । మేనై నిముషములోనిది । మానుగనా వృత్తినేనే మాయను సుమ్మీ ॥ 226**

**భావము :-** విశ్వేశ్వరా! నేనుల, మేనుల సమూహమును నేనే. అనగా అనేక నేను లుగా అనేక మేనులతో ఉన్నది "నేనే". పరిపూర్ణము నన్ను ఎంతమాత్రము ఎరుగదు. ఒక్క నిముషములో శరీరధారినై వస్తాను. పోతాను. ఇది నా యొక్క స్వంతపని. కనుక "నేనే" మాయను సుమా!

కం॥ నేనుగాకొకటి శుద్ధ । జ్ఞానము గలదనుచు బల్కు జ్ఞానుల మాటల్।
పూనివిన దగదుశుద్ధ । జ్ఞానంబన నేనె నేను లేనిది యానే ॥ 227

**భావము :-** బ్రహ్మాండనాయకా! "నేను" గాని పరిశుద్ధమైన జ్ఞానమొకటి గలదు, అదే బ్రహ్మమనుచు పలికే జ్ఞానుల మాటలు వినదగదు. శుద్ధజ్ఞానమనిన "నేనే." నేనులేనిది మాత్రము కానేరదు.

**విశేష భావము :-** పిండాండములో హృదయస్థానమున జీవుడు - మలిన జ్ఞానమనియు, భ్రూమధ్యస్థానమున నున్న చైతన్యము - మిశ్రమ జ్ఞానమనియు, సహస్రార మందలి చైతన్యమునకు శుద్ధజ్ఞానమని అదే బ్రహ్మమని కొందరు చెప్పెదరు. ఈ మూడు స్థానముల యందు ఉన్నది ఒక్క జ్ఞాన స్వరూపంబగు నేనే. అట్లే బ్రహ్మాండములో మహత్తు మిశ్రమజ్ఞానము అనియు, హృదయస్థానము ననున్న అక్షరుడు - మలిన జ్ఞానమనియు, బ్రహ్మాండ సత్యలోక స్థానమున నున్న చైతన్యమునకు శుద్ధజ్ఞానమనియు అందురు. పిండాండములో వలె, బ్రహ్మాండములోని ఈ మూడు కూడ ఒక్క జ్ఞానస్వరూపమైన "నేనే". పిండబ్రహ్మాండములు రెండు ఉపాధులని, ఉపాధి రహితమైనచో ఉన్న "నిర్విశేషరస" పదార్థమె శుద్ధ జ్ఞానమని అది "నేను" కాదని కొందరు చెప్పెదరు. ఆ శుద్ధజ్ఞానమె ఇన్ని రూపములుగా ఏర్పడుచున్నది. కనుక అదియును "నేనే" అని చెప్పవలయును. నేను కానిది ఎంతమాత్రము కానే రదని తెలియవలయును. "నేను" కానిది ఒక్క పరిపూర్ణము మాత్రమే.

కం॥ నే మాత్రముందునని యెను । నా మాయలకూతలన్నియు
రసిన సుప్తిన్। యే మాయ మరణమప్పుడు । యే మాయను గురుని
మాటనే మాయనయా ॥ 228

**భావము:-** దేవాధిదేవా! "ఈ సమస్త జగత్తు నశించిపోయినను "నేను" శాశ్వతముగా ఉందును అనే నా మాయ మాటలన్నియు, గాఢనిద్రయందు, మరణమందు విచారించి చూసినచో యేమాయెను. అట్టి యెడ గురుదేవుని మాటయే మాయెను. అనగా గురుదేవునిమాట అయిన నేను శరీరము ఒక్కటే అన్న మాట నిజమాయెను కదా! కనుక "నేను" మాయనే సుమండీ ॥

**విశేషభావము :-** అద్వైత సిద్ధాన్తరీత్యా "నేను" శాశ్వతము నశించునది కాదు. జగత్తు మిథ్య లేనిది, అన్న ఆ సిద్ధాంత వాక్యములు ప్రకారము గాఢనిద్ర

యందు, మరణమునందు శరీరము మరుగు చెందినపుడు "నేను" అను గుర్తు లేదు కదా. అనగా శరీరము ఉన్నప్పుడే నేను ఉనికి గలదు. కనుక శరీరము నేనుకు ఆధారము. ఆధార ఆధేయములు ఒక్కటే కనుక నేను-మేనులు రెండును ఒక్కటే అను గురుని మాట నిజమాయెను. కనుక "నేను" మాయేసుమా, బ్రహ్మము కానేరదు అని భావము.

**కం॥ నే నన్ననహ మహంబన్న । నేను సుమీ యహమటంచునే నెపుడంటే । నేనపుడు బుట్టుటదిజన । నేను గతించుట మటంచు నీ వెరుగయ్యా ॥ 229**

**భావము :-** ఓ నిరంజన గురుదేవా! నేననగా "అహము", అహమనగా "నేను" అని తెలియవలెను. "అహము" అనుభావము, అనగా నేను శాశ్వతము అను భావముచే అప్పుడు "నేను" పుట్టుచున్నాను. "నేను" లేకపోవుటయే. నేను చని పోవుట, లేకపోవుట అని భావము.

**విశేషభావము :-** "అహమస్మి" నేను ఉన్నాను. నేను శాశ్వతము అను భావము కల్గి ఉన్నవారందరు తప్పక జననమునకు రావలసినదే. శరీరము నుండి నేను పోవుటే చావు. ఇది నిజమైన చావుకాదు. కనుక ఈ పద్యములో "అది జన నేను గతించుట" అన్నారు. అనగా "అహము" లేదు అను దృఢభావముచే నేను గతించుట జరుగును అని భావము.

**కం॥ నేననునాలవ దేహము । మేనన నాలోని మూడు మేనులు సుమ్మీ। నేను మేన నన దొక్కటె । గా, నిది తన మూల మరయ గనరాదు సుమీ ॥ 230**

**భావము :-** ఆర్యా! నేను అనగా నాల్గవ శరీరమైన మహా కారణ శరీరము. మేను అనగా మిగిలిన మూడు శరీరములు అయిన కారణ, సూక్ష్మ, స్థూల శరీర సమూహము. కనుక ఈ నేను, మేనులు ఒక్కటే గదా. ఇది తన మూలము ఏది అని విచారణ చేసినచో ఎక్కడను లేకుండా పోవును.

**విశేషభావము :-** ఈ పద్యములో "నేను" అనగా నాల్గవశరీరము అనగా మహా కారణ శరీరమైన ప్రత్యగాత్మగా చెప్పిరి. అట్టిచో సహస్రారమందున్న చైతన్యము నేనుకు అతీతమైనది. శాశ్వతమైనది అని భావించరాదు. సహస్రారచైతన్యమే భ్రూమధ్య స్థానమునందు ప్రతిబింబితమై ప్రత్యగాత్మ అనబడుచున్నది. అనగా

రెండును బింబ - ప్రతిబింబములు. రెండునూ ఒక్కటే. అనగా సహస్రార చైతన్యము, భ్రూమధ్య స్థాన నాల్గవ శరీర ప్రతిబింబము రెండును కలసియే "నేను" అని ఈ పద్యభావముగా తెలియవలెను. మిగిలిన మూడు శరీరములు, కారణ, సూక్ష్మ, స్థూలశరీరములు మూడును మేననబడును. పైన చెప్పిన నేను ఈ మేనులు రెండును ఒక్కటే అనగా లేనివే అని గుర్తించవలెను.

**కం॥ అంగము లింగము గలసుటె। లింగ శరీరంబటంచు లెక్కకు వచ్చెన్ ॥ లింగం బంగము నెడసిన। లింగముళక్యేను నేనెలింగం బనినన్ ॥ 231**

**భావము :-** స్వామి! అంగము, లింగము రెండు గల సుటె లింగశరీరమని లెక్కకు వచ్చెను. ఈ లింగము అంగము నుండి విడిపోయినచో లింగము లేకుండ పోవును. లింగమనగా "నేనే" స్వామిః ॥

**విశేషభావము :-** అంగము అనగా శరీరము. లింగమనగా శరీరమందలి చైతన్య మయిన "నేను". ఈ రెండు కలిసినదే లింగశరీరము. అనగా కారణ శరీరము అని అర్థము. ఈ కారణ శరీరము రెంటి సమన్వయము. అవిద్యా యుతమై కర్మ సంచితమై యున్నందున ఇటుశరీరము వచ్చుటకు, మరియు విద్యవలన సద్గురుమూర్తి కరుణవలన ముక్తికి (లేకపోవుట) కారణమగు చున్నందున దీనికి కారణశరీరమని పేరు. మరియు ఇది ఆత్మకు ఆవరణ యుతమై ఆత్మను విడచి ఎన్నడు ఉండదు. కనుక ఆత్మ అనబడును. కనుక లింగ శరీరమన్నారు. కనుకనే తిరిగి జన్మకు రాకుండా పోవలెనన్నచో ఈ లింగ శరీరమే భంగము కావలెనన్నారు. ఇదే హృదయగ్రంథి. దీనిని విడిపించుటయే సద్గురు మూర్తి చేసే పని. అందుకే "హృదయ గ్రంధి విడుటకై" అన్నారు. ఈ కారణ శరీరము సూక్ష్మ శరీర స్థూల శరీరములకు చైతన్యవంతమై ఉన్నది. కనుక అటు ఆత్మకు, ఇటు శరీరమునకు ఉభయాత్మకమైయున్నది. ఆత్మ ఈ లింగ శరీరమునుండి విడి పోయినచో ఇంక లింగము లేదు. శరీరము లేదు. ఇదే తిరిగి జన్మకురాని పద్ధతి.

**కం॥ లింగము విక్షేపంబన। నంగంబావరణ మనినవగు నీరెండే। లింగ శరీరము దీనికి భంగము తన మూల మరయబడినప్పుడ గున్ ॥ 232**

**భావము:-** గురుదేవా! లింగమును విక్షేపమనియు, అంగమును ఆవరణమనియు, ఈ ఆవరణ విక్షేపములు కలిసి లింగ శరీరము అనబడును. ఇట్టి లింగ శరీరమునకు భంగము (అనగా తిరిగి జన్మకు రాకుండుట) తన యొక్క మూలము ఏది? అని గురుముఖముగా విచారించి తెలుసుకొనినప్పుడు అగును.



**కం॥ ఎరుకన మరుపన రానిది । పరిపూర్ణం బీశ్వరుడన బడు నెరు కెరుకన్ । మరచిన జీవుండనబడు । నెరుక చలమునెరుగ నరుగు నెరుక మరుపులున్ ॥ 233**

**భావము:-** కులేశా! ఎరుక, మరపులు కానిది పరిపూర్ణము. ఈశ్వరుడనగా ఎరుక యున్ను, ఎరుకను మరచిన జీవుడని అనబడును. ఇట్టి ఎరుక, పరి పూర్ణమును గురుకరుణచే దెలిసినచో, ఈ ఎరుక మరుపులు లేకుండా పోవును.

**విశేషభావము:-** ఎరుక అనగా జ్ఞానము. ఇదే ఈశ్వరుడు అనబడును. అట్టి జ్ఞాన స్వరూపమును తెలియక పోవుటయే అజ్ఞానము, అవిద్య, మరపు అనబడును. ఇదియే జీవుడు. జీవుడనగా జ్ఞాన స్వరూపము అయిన బ్రహ్మతత్త్వము నెరుంగ కుండుటయే. ఇట్టి అజ్ఞానయుతమైన జీప స్వరూపము నుండి విద్యాయుతమైన ఈశ్వరు నెరుంగవలెను. అప్పుడు జీవుడు ఈశ్వరు డగుచున్నాడు. ఇప్పుడు జ్ఞానియై యున్నాడు. ఇట్టి జ్ఞాని అనగా ఎరుక, పరిపూర్ణమున్నదని, ఎరుక లేనిదే కలవలె పరిపూర్ణములో లేనిదే తోచబడినదని గురుముఖతా గుర్తెరిగి, తానే లేక పోయినచో ఎరుక - మరుపులు రెండును అనగా ఈశ్వరుడు - జీవుడు రెండును లేకపోవును.

**కం॥ ఎరుకన సత్వ గుణంబని । మరుపన తామ సమటంచు మరి యీ రెండున్ । సరియైన రాజసంబని । నరులెన్నిరి మూటి విడువ నర్హము సుమ్మీ ॥ 234**

**భావము :-** మహానుభావా! జ్ఞానము సత్వ గుణమనియు, అజ్ఞానము తమో గుణమనియు జ్ఞాన - అజ్ఞాన మిశ్రమమైన మిశ్రమ జ్ఞానము రజో గుణము అని మానవులనిరి. ఈ మూడింటిని విడుచుట తగినపని అగును.

**కం॥ నన్నెరుగనట్టి బైటన్ । యెన్నడులే నట్టి నేను యీ విశ్వమునై। వున్నట్టులుండి నేలేం । దున్నది గని నేను బోతెదుందణగుసుమీ ॥235**

**భావము :-** గురుదేవా! "నేనైన" యెరుకను ఎంత మాత్రము యెరుగని పరి పూర్ణములో, యేకాలమందున లేని "నేను" యీ జగత్తు ఉన్నట్టు ఉండి, నేను లేని పరిపూర్ణము ఉన్నది అని విచారించి "నేను" లేనని లేకపోతె, మిడిసి పాటు తన మంతయు పోవును. (దుందు=మిడిసిపడుట)

**కం॥ ఈ అచలమొకటి బ్రహ్మని । మాయమయమైన విశ్వ మంతయు నేనన్ । చాయ మెరుంగక ననునరు । లీయడ బ్రహ్మం బటంచు లెక్కడ నగుదున్ ॥ 236**

**భావము :-** స్వామి! ఈ అచల మొక్కటే బ్రహ్మనియు, మాయతో కూడిన విశ్వమంతయు "నా" వలె అయినదని యెరుగక, "నను" జనులు బ్రహ్మమని అపేక్షపడి ఎన్నిక జేయగా, నాకు నవ్వు వచ్చుచున్నది.

**కం॥ భూమను భద్రాచలమని । రాములనుచు లేని నన్న రక్షణము ననే । మీ మాట నెరిగుళక్యని । నా మాటను మరచియునికి నయ మనితోచెన్ ॥ 237**

**భావము :-** సద్గురు మూర్తి ! భద్రాచలమే పరిపూర్ణమని, అందులో లేని 'నేను' రాములని తెలసి, మీ మాట తెలసికొని ఆ రక్షణములో నేను లేనని తెలసి "నా' అను మాటను విడచిన స్థితి మంచిదని తోచుచున్నది.

**విశేషభావము:-** పరిపూర్ణములో లేక తోచిన నేను అనగా ఎరుక. ఈ పద్యములో భద్రాచలము అనగా భద్రమైన అచలము. చలనగర్భితమైన అచలము ఎరుక. పరిపూర్ణము కేవల అచలము. చలించుట లేక చలింపజేయు సత్తాగాని లేనిది. కనుక భద్రమైన అచలము భద్రాచలము అన్నారు. అట్టి పరి పూర్ణములో, లేక తోచిన రాముడు 'నేను' అనగా ఎరుక. అట్టి యెరుక, మీ మాట తెలసికొని అనగా గురువాక్యమైన "మూలము లేని గుర్తెరిగే శరము ఏమీ లేదని" విచారించి తెలసుకొని, ఎరుక లేనిదని, విడచిన స్థితి చాల మంచిది. అట్టి స్థితి కలిగిన వానికే పునరావృత్తి లేదని నిర్ణయము.

**కం॥ నాగురుడు నాకు దెల్పిన । యీ గురుబోధంత మీకు యిప్పుడు నేనున్ । బాగుగ విన జెప్పితి సుమి । యోగురు వర్య యని శిష్యుడూరకయున్నన్ ॥ 238**

**భావము :-** గురువర్యా! నా గురుమూర్తి నాకు తెలియపర్చిన యీ గురు బోధంతయు యిప్పుడు నేను మీకు వినజెప్పితినని, శిష్యుడూరకుండెను.

**కం॥ విని శిష్యుని వచనోక్తులు । మనమున హర్షించి గురుడు మస్తకమున చె । య్యునిచి తొడ మీద జేర్చుక । తన శిష్యుని మేను నివిరి తానిట్లనియెన్ ॥ 239**

 

**భావము:-** (పై విధముగా) శిష్యుడు చెప్పిన బోధను విని, గురు మూర్తి మనసులో సంతోషపడి, శిష్యుని హస్తమస్తక సంయోగముచే ఆశీర్వదించి, తొడ మీద కూర్చోపెట్టుకొని తన శిష్యుని శరీరమును తన చేతితో ప్రేమచేతడివి యీ విధముగా అనెను.

**కం॥ నీ వంటి గట్టి వాడిక । భూవలయము నందు ముందు బుట్టడు వెనుకన్ । నేవినలే దున్నాడం । చీవేళకు నిన్నె జూస్తినిట భళిశిష్యా ! ॥ 240**

**భావము :-** శిష్యా! నీవంటి ఆరూఢ ప్రజ్ఞాశాలి భూమ్మీద తిరిగి పుట్టడు. ఇట్టి వాడు వెనుక కాలమునందు కూడ పుట్టినాడని నేను వినలేదు. అట్టి స్థితి గల నిన్ను ఈ సమయములో ఇక్కడ జూచితిని. శెభాష్ శిష్యా!

**కం॥ చందు రుని చీమ ముద్దా । డిందని నట్లిపుడు నీవు యీ సద్బోధన్ । జెందితివి నీకు సరిజగ । మందెవ్వరు లేరు నిన్ను మది మెచ్చితిరా ॥ 241**

**భావము:-** శిష్యా! చంద్రుని చీమ ముద్దాడినట్లుగ, ఇప్పుడు నీవు యీ గొప్ప దైన బోధను పొందుటకూడ అట్టిదే. నీతో సరియైన వారు జగత్తునందెవ్వరు లేరు. (పుట్టని వానికి పోలిక ఉండదు కనుక) నిన్ను నామనస్ఫూర్తిగా మెచ్చుకొనుచున్నాను.

**కం॥ అని మెచ్చియే మిచ్చెద । వని గురుదక్షిణ నటంచు నతడ డిగినన । న్ననిపల్కె శిష్య రత్నము । విని యిది యికముట్టబోక విహరించుమనన్ ॥ 242**

**భావము:-** అని గురు మూర్తి మెచ్చుకొని, గురు దక్షిణ యేమిచ్చెదవని అడుగగా, "నన్ను" అని శిష్యరత్నము పలికెను. ఆ మాటను విని గురుమూర్తి దానిని యిక ముట్టక వ్యవహరించు మనెను.

**విశేషభావము:-** గురువు వద్ద విద్య అభ్యసించుట పూర్తి అయిన పిదప, గురువు నకు శిష్యుడు గురువును సంతోషపెట్టుటకై వారడిగిన దక్షిణ నొసంగి వారి వద్ద శెలవు తీసుకొని ఇంటికి వెళ్లుట వేదకాలము నుండియు ఆచారము. ఈ విషయము తైత్తరీయోపనిషత్తులో "ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య" అని చెప్పబడినది. గురువునకు ఇష్టమైన ధనమును ఇమ్ము. ఇచ్చుట గురువు వద్ద శిష్యుడు పరిపూర్ణబోధ తెలుసుకొని తిరిగి ఆ బోధంతయు గురువునకు

వప్పగించెను. బోధ తప్పు లేకుండగ తన మనసుకు నచ్చినట్లుగా శిష్యుడు చెప్పినందున ఇక తన వద్దనుండి శిష్యుని పంపి వేయనుద్దేశముతోను, బోధ చక్కగా చెప్పుట పూర్తి అయినందునను గురువు శిష్యుని దక్షిణ ఏమి ఇచ్చెదవు? అని ప్రశ్నించగా శిష్యుడు "నన్ను" అని పలికెను. ఇదియే ఈ బోధలోని విశేషము ధన,కనక,వస్తు వాహనములు గురుడు అడుగను లేదు. శిష్యుడు అట్టివి ఇచ్చెదనని చెప్పనూ లేదు. ఎందుచేతననగా బోధను కోరి శిష్యుడు గురువు దగ్గరకు వచ్చినప్పుడు ఉపదేశమునకు ముందుగా తను, మన, ధనములు గురుపాదములుకు ధారపోసెను. ఇంక ఇప్పుడు ఇచ్చుటకు శిష్యుని వద్ద "నాది' ' అనునది ఏమున్నది. అంతయు గురుమూర్తిదే. ఇంక ఉండిపోయినది - నిర్గుణ ప్రజ్ఞాన ఘన వస్తువైన "నేను" మాత్రమే ఉన్నది. అట్టి "నేను" చేతనే బోధను అడిగి తెలుసుకొన్నాడు. నేను ఉన్నంతవరకు జన్మతప్పదు. జన్మరహితమును కోరి శిష్యుడు గురువువద్దకు వచ్చెను. అందుకు అంగీకరించి గురువు బోధ చేసెను. బోధ మాత్రమే వచ్చినది కాని తాను లేని స్థితి రాలేదు కదా! అందుకే గురుదక్షిణగా "నన్ను" ఇచ్చెదను. అని శిష్యుడనగా - గురు మూర్తి "యిది యిక ముట్టబోక విహరించు మనెన్". అట్టి "నేను"ను ముట్టక వ్యవహరించుమని చెప్పెను. ఇది యే షోడశాక్షరి మహామంత్రములో కీలకము. "నిర్గుణ ప్రజాన రహిత కీలకం" అన్నారు. ఈ కీలక విచారణను చక్కగా తెలుసుకొనవలెను. "నేను" ను గురుదక్షిణగా ఇచ్చి వేసినందున తాను లేని స్థితి కలిగి నేను లేకుండగ సమస్త వ్యవహారములు స్వప్నములో కలవరించినట్లుగా చేయును. ఇది తెలియ వలెనంటే అంతటి వారికి మాత్రమే అవగతము. ఇతరులకు తెలిసేది కాదు.

**కం॥ వినిశిష్యుడు గురుమూర్తిని । గనుగొని చిత్తరువు ప్రతిమగా నిలచున్నన్ । తన శిష్యుని హస్తములన్ । గొని దగ్గర దీసుకొని కొడుకాయనుచున్ ॥ 243**

**భావము:-** అని చెప్పగా విని శిష్యుడు గురు మూర్తి వద్ద విగ్రహము, ప్రతిమ వలె నిలచుండి పోయెను. అట్టి శిష్యుని గురుమూర్తి తన చేతులతో దగ్గరకు దీసుకొని, కుమారా యని..... (తరువాతి పద్యముతో సమన్వయము)

**కం॥ చెప్ప దొణంగెను మునుతా । జెప్పని ముచ్చట్లు కొన్ని సేమము కొఱకై । యొప్పులకుప్పావోమా । యప్పాయని దువ్వ కొనుచు నతి దయతోడన్ ॥ 244**

భావము :- (గురుమూర్తి శిష్యుని జూచి) తన దగ్గరకు దీసుకొని కుమారా! మంచి పనులుచేసెడివాడా! ఓ నా తండ్రీ అని శిష్యుని శరీరమును దువ్వుచు (ప్రేమ చేత) అతి దయతో పూర్వమందు చెప్పని మాటలు కొన్నిటిని అతని క్షేమము కొఱకై చెప్పసాగెను.

**విశేషభావము :-** గురుమూర్తి ఇంతవరకు బోధను మాత్రమే చెప్పెను. బోధ పూర్తిగా చెప్పుట అయినది. చెప్పిన బోధ అంతయు శిష్యుని మనస్సులో దృఢ పడినది. ఇక శిష్యుని తన వద్ద నుండి బయట ప్రపంచములోనికి పంపించు చున్నాడు. శిష్యునికి బోధ వచ్చినది. కాని బయట ప్రపంచములో నడక కూడా తెలియవలెను. ఎవరి వద్ద ఏలా మెలగవలెనో, ఏ పనులు చేయవలెనో, ఏది మంచో, ఏది చెడో ఇలాంటి విషయములు చెప్పి విడచి పెట్టవలెను. లేనిచో ఎంతబోధ వచ్చినా జనులతో నడక తెలియకపోయినచో ఇబ్బందుల పాలు కాకతప్పదు. కనుకనే ఈ పద్యములో "మునుతా జెప్పని ముచ్చట్లు" బోధలో చెప్పని విషయములు, అతని సేమము కొఱకై, శిష్యుడు లోకములో ఇబ్బందుల పాలుపడకుండగ ఉండుటకై, ప్రవర్తన విషయములును చెప్పసాగెను. ఈ విధానము శిష్యుని తన వద్ద నుండి ఇంటికి పంపునప్పుడు గురుమూర్తి చెప్పిన విధానము తైత్తరీయోపనిషత్తు శిక్షావల్లిలో "సత్యాన్నప్రమిది తవ్యం" లగాయతు ఏష ఆదేశః, ఏష ఉపదేశః" అన్న పర్యంతము శిష్యునికి చెప్పిన ప్రవర్తన నియమావళి. అదే విధములో ఈ బోధయందు గూడ గురువులు బోధ పూర్తి అయిన శిష్యులకు ప్రవర్తన, నియమావళి గూడ చెప్పవలెనని కృష్ణప్రభువుల ఆదేశముగా గుర్తించవలెను.

**కం॥ ఒప్పకు మీపరబోధల । తప్పకు మీ బోధనెపుడు దలచుట మదిలో । రొప్పకు మీ సచ్ఛిష్యుల । చెప్పకు మీ దీన్ని దుష్ట చెన టుల కెపుడున్ ॥ 245**

**భావము :-** శిష్యా! ఇతర సిద్ధాంతబోధలను తప్పుకానివిగా గ్రహించకుము (అనగా మంచివి కావు). ఈ పరిపూర్ణబోధ నెన్నడు నీ మనస్సునందు మననము చేయుట మానవద్దు. సచ్ఛిష్యుల యెడకోపించకుము. ఈ పరిపూర్ణబోధను దుష్టులు, కుత్సితులకు ఎప్పుడును చెప్పవద్దు. (రొప్పుట=కోపించుట)

**కం॥ కూడకుమీ దుర్జనులను । వీడకు మీ సాధుమనుజ వితతి స్నేహం । బోడకుమీ గురుసేవకు । పాడకు మీ పరుల నిందపాటల రీతిన్ ॥ 246**

**భావము:-** శిష్యా! దుర్జనుల సహవాసము చేయకు. సాధు పురుష సమూహము యొక్క స్నేహము విడువకుము. (సత్సాంగత్యము విడువకుము). గురుసేవ చేయుటకు సంకోచించకుము. ఇతరులను నిందించుచు పాటల విధానములో పాడకుము. (ఓడకు=సంకోచించకు)

**విశేషభావము:-** "పాడకుమీ పరులనింద పాటలరీతిన్" అని ఈ పద్యములో శ్రీకృష్ణప్రభువులు ఈ సాంప్రదాయకులకు 1862వ సం॥రములో చెప్పినారు. మనసాంప్రదాయకులు తన తరువాతి తరముల వారు ఎట్టి దుష్ప్రవర్తకులగు దురో ముందుగానే వారు గ్రహించి ఈ మాటలు చెప్పినట్లు కనపడుచున్నది. బ్రహ్మంగారి కాలజ్ఞానమువలె ఈ పద్యములో మన వారి దుష్ప్రవర్తన ముచ్చటించి నారు. ఇతరులను నిందించుచు పాటల రీతిగా పాడుచు ఈనాడు నగర సంకీర్తన చేయుచున్నారు. మన పెద్దల మాటలను కూడ మనము ఆచరించ లేని గురుభక్తులము. "శంకరాచార్య బొంకులకు జంకే లేదా!" అనే మొదలైన పాటలు కలవు. అది శిష్టాచారము కాదు. మన బోధ పద్ధతులను చెప్పుకొనవచ్చును. గురువు శిష్యులకు బోధచేయునప్పుడు ఏయే సిద్ధాంతములలో ఏ విధముగా చెప్పినారో? అందున్న మంచి చెడులను విమర్శించి చెప్పవచ్చును. చెప్పవలసి నదే. కాని వీధులలో నగర సంకీర్తనలలో పాటల రీతిగా పాడుట మన పెద్దల ఆజ్ఞను ఉల్లంఘించుటయే.

**కం॥ మీరకుమీ గురువాజ్ఞను। చేరకు మీదుష్టులంత చేరిన చోటన్। దూఱకుమీ బోధనువిని। యేరకుమీ సాధుజనుల యందు నతప్పుల్ ॥ 247**

**భావము:-** శిష్యా! గురువాజ్ఞను ఎన్నడూ దాటవద్దు.దుష్టజనులు చేరిన ప్రదేశము నందు నీవు ఉండవద్దు. ఈ బోధనువిని నిందించకుము. (బోధను అనగా బోధ స్థులను నిందించకుము. అనికూడ అర్ధము చెప్పవచ్చును). సాధుజనులయందలి తప్పులు ఎంచవద్దు.

**విశేషభావము:-** సాధుజనులతో వాదించవద్దు. అట్లే వారు చెప్పిన దాంట్లోగాని నడతలో గాని తప్పులుంటే మౌనము వహించుట యే సచ్ఛిష్యలక్షణము. ఆ తప్పులు మనం చెప్పుట ఆచరించుట తగదు. అట్లనివారి తప్పులను ఎంచి చూపవద్దు. ఈ నియమము అట్టి పెద్దలకన్న చిన్న వారికి మాత్రమే. వారి పెద్దలకు కాదు అని గ్రహించవలెను.

**కం॥ జనులవలె జరుపు పనులను। నను నిను జనవితతి దిట్టనడు**
**వకు మెపుడున్। నిను నీవు బొగడుకోకుము। నిను బోల రటంచు**
**జనులనిందించకుమీ ॥ 248**

**భావము :-** శిష్యా! పదిమంది జనులు ఏ విధముగా ఆచరించుచున్నారో, అదే విధముగా పనులన్నియు జరిపించుము. జన సమూహము నన్ను నిన్ను తిట్టేలాగున ఎన్నడు ప్రవర్తించకుము. నీకు ఎవ్వరు సరికాలేరని నిన్ను నీవు పొగడుకొనవద్దు. నీకు ఎవ్వరు సరిపోలరని జనులను ఎన్నడూ నిందించకు సుమా!

**విశేషభావము :-** జనులందరూ లౌకిక విధానమైన కార్యక్రమము లన్నియు ఏ విధముగా ఆచరించుచున్నారో మనము కూడ అదే విధానముగా ఆచరించవలెను. ప్రజలు దేవాలయములకు పవిత్ర దినముల యందు వెళ్ళి పూజలు చేయుచుందురు. నీవు వారిని విమర్శించవద్దు. అది నిజము కాదు అని తెలిసినను, విమర్శించవద్దు. ఎందుచేతననగా "పదుగురాడు మాట పాటియై ధరజెల్లు। ఒక్కడాడు మాట ఎక్కదెందు" అన్నారుకదా! అట్లు విమర్శించినందువలన వారు నీమాటను వినరు, సరికాదా నీకు చెప్పిన గురువెవరురా? మీది అంతయు నాస్తిక బోధయని, నిన్ను నీ గురువును కూడ నిందించెదరు. కనుక అట్టి వారిని వారించక భావములో నీ గురుస్వరూపమును, వారందరితో కలసి ఉన్నప్పుడు వారి పనులను చేయుట మేలు, నీ భావములో మార్పు చేసికొనవలసిన పని యుండదు. అట్లే నీ బోధే గొప్పదని కాని, నిన్ను ఎవ్వరు పోలరని గాని పొగడుకొనవద్దు. భగవద్గీతలో జ్ఞానిలక్షణములలో మొట్టమొదటి లక్షణము "అమానిత్వము' అనగా నిన్ను నీవు పొగడుకొనకుండుట. అందుచేతనే శంకరాచార్యులు కూడ "జనకృపానైష్ఠుర్యము సృజ్యతాం" - జనులకు నిష్ఠూరముగా నడచుకొనవద్దు, అన్నారు. అదే "జనులవలె జరుపు పనులను" అనే దానికి అర్థము.

**కం॥ శ్రద్ధబోధందు నిలిప । శ్రద్ధను నీ నేర్పు చేత ఝాడించితివా।**
**బద్ధత్వ మంతబాయును । బుద్ధికి సరిపడితె దీన్ని బూనగదోయీ॥ 249**

**భావము:-** శిష్యా! బోధయందు శ్రద్ధవహించి, నేర్పుగా అశ్రద్ధను మాపు చేసినచో నీ యొక్క బంధనమంతయు విడచిపెట్టగలవు. ఇది నీ బుద్ధికి సరిపోయినచో ఈ బోధను, ఆచరణను పూనవచ్చును గదా।

**విశేషభావము :-** "నీ బద్ధత్వ మంత బాయును" అనగా బద్ధత్వము అనగా కట్టుబడియుండుట. నీవు ఈ శరీరమును ఈ లోకమును విడచిపోయినను (కర్మ

బంధముచే) తిరిగి జన్మించుట అనే బద్ధత్వము కలగు. అట్టి బద్ధత్వము నుండి విడిపడగలవు అనగా తిరిగి జన్మకు రావు అని అర్థము.



**కం॥ సంశయమె జన్మ హేతువు । సంశయమే గురు నిమాట చవిగా ననియదీ । సంశయమెకీడు నొదవును । సంశయమెడ బాస్తి వేని చాలునువత్సా ॥ 250**

**భావము :-** కుమారా! సంశయమే జన్మకు కారణమైనది. ఆ సంశయమె గురు మూర్తి చెప్పిన మాటను వినిపించుకొననిది. సంశయమె సమస్త ఆపదలకు మూలమైనది. అట్టి సంశయమును వదలితే చాలును. (అంతయు మంచిదే) ఇచ్చట ఈ పద్యములో "సంశయము" అనగా "ఎరుక" అని అర్థము చెప్ప వలెను.

**కం॥ నరులంత మెచ్చనడువను । హరిహర విధి శతమఖామరాదు లకైనన్ । తరముగా దనగ మనకిక । తరమౌనన వశమెచూడు ధాత్రిని పుత్రా ! ॥ 251**

**భావము :-** కుమారా! జనులందరు మెచ్చుకొనులాగున ప్రవర్తించుట విష్ణు మూర్తికి, శివునకు, బ్రహ్మకు, దేవేంద్రాది సమస్త దేవతలకు కూడ వశము కాలేదు. అట్టిచో మనకు మాత్రము తరమౌనా ॥

**కం॥ అందరిని చణుకు చుందురు । కొందరు దుర్మా ర్గవృత్తి కుటిల జనంబుల్ । యొందరినొ గిచ్చి కరచుచు । మందల వలె కోతులుండు మాడ్కిని కుర్రా ॥ 252**

**భావము :-** ఓ కుమారా! మందలవలె కోతులు వచ్చి యెందరినో గీచి కరిచిన విధముగా కొందరు కుటిల జనులు వారి యొక్క దుర్మార్గవృత్తిచేత అందరిని కొట్టుచుందురు.

**కం॥ ఈ చెప్పిన గురుబోధను । తాచెవినిడి బయలు గాంచి తమ లేమి నిజం । బైచనియె శిష్యుడప్పుడు । లేచెను గురుడవల మాటలేదా మీదన్ ॥ 253**

**భావము :-** ఈ విధముగా చెప్పిన గురుబోధను శిష్యుడు చక్కగా విని పరి పూర్ణమును గాంచి తానులేనను నిజమును తెలిసి, తాను లేకుండా పోయెను. అంత గురు మూర్తి ఆవల మాటలేదని లేచిపోయెను.

(అనగా ఇక చెప్పేది - వినేదిలేదు. విసే శిష్యుడు లేకపోవుటచే, చెప్పే గురుమూర్తి కూడ లేకపోయెను).

**కం॥ శరదికరితురగసితకర । పరిమితమైనట్టి శాలివాహన శకమం। దురచిస్తి మాఘ పౌర్ణిమ । వరకివి దుందుభియనేటి వత్సరమపుడున్॥ 254**

**భావము :-** (శరది - సముద్రము, కరి - ఏనుగు (మదము కనుక) తురగ - గుఱ్ఱము, సితకర - చంద్రుడు. ఇవి సంఖ్యాసూచకములు. సంస్కృతములో అంకెలు కుడి నుండి ఎడమకు చెప్పబడును) కనుక చంద్రుడు ఒకటి, తురగము - గుఱ్ఱము. సూర్యుని గుఱ్ఱములు ఏడు కనుక తురగము అనగా 7, కరి-ఏనుగు మదమునకు చిహ్నితముగా మదములు అష్టవిధములు కనుక 8, శరధి - సముద్రము. చతుస్సముద్రములచే చుట్టబడిన భూమి అని శాస్త్రము కనుక సముద్రము అనగా 4. అందుచే 1784 ఇది శాలివాహన శకము) అనగా శాలివాహన శకము 1784 సంవత్సరమునకు సరియైన దుందుభి సంవత్సర మాఘపౌర్ణిమికి ఈ పద్యములు వ్రాయబడినవి అని భావము. ఇందుకు క్రీస్తు శకము 1862 సంవత్సరము.

**కం॥ పది యిరువై యైదులు యీ । సదమలకందములు వీట్ని సదయామతులై । ముదమున మీరు వినెదరని । మదిలోపల దలచి చేస్తి మానవులారా! ॥ 255**

**భావము :-** ఓ మానవులారా! రెండువందల ఏబది యీ మలిన రహితమైన మంచి కందపద్యములను, దయతో కూడి సంతోషముతో మీరు వినెదరని నా మనస్సునందు తలచి రచించితిని.

**కం॥ ఎవరీ పద్యములన్నియు । వివరింతురో వారికెల్ల విద్యాఽ విద్యల్ । దవిలి బాధింప వెన్నడు । భవనాశస్థితులు లేక ప్రబలుదు రెపుడున్ ॥ 256**

**భావము :-** ఎవరు ఈ పద్యములన్నిటిని చక్కగా వివరించెదరో వారికి జ్ఞానాఽ జ్ఞానములు తగులుగొని భాదింపవు. మరియు పుట్టుక, స్థితి, నాశములు లేకుండును. అనగా పునర్జన్మ లేని వారగుదురని భావము.

**కం॥ అర్థము దెలియక గ్రంథము । వ్యర్థంబని నిందసేయు వ్యర్థులమాటల్ । వ్యర్థములని యీ గ్రంథం । బర్థము సద్గురుని వలన బాగుగ వినుడీ ॥ 257**

**భావము:-** ఈ గ్రంధ భావము దెలియక ఈ పద్యములన్నియు వ్యర్ధము, పనికి రానివని, నిందించే పనికి మాలిన వారి మాటలు, పనికి మాలిన మాటలుగా గుర్తించి, దీని యొక్క సరియైన భావము సద్గురుమూర్తి ద్వారా బాగుగా వినండి.

**విశేషభావము:-** ఈ గ్రంధము యొక్క భావము అశరీరసద్గురు సాంప్రదాయక సద్గురుమూర్తి వలన మాత్రమే తెలియబడును. అయినను వినువాడు సచ్ఛిష్యుడు, సాధన సంపత్తి పరుడు పూర్ణబోధనెరుగుటకు తగిన సంస్కారవంతుడు మాత్రమే గురుని వద్ద వినిన దీని యొక్క భావమును చక్కగా గ్రహించగలడు. అట్టివారు కాని వారు ఈ కాలమునందు ఈ గ్రంధమును విపరీతముగా వితర్కించెదరని ఆనాడే శ్రీకృష్ణదేశి కేంద్రులవారు తెలుసుకొని ఈ పద్యమును చెప్పినట్లు తోచుచున్నది. ఒక మహానుభావుడు "భాగవత కృష్ణదేశి కేంద్రుల మతి లేని కందార్ధములు" అను పుస్తకమును వ్రాసినట్లు చాలామంది గుర్తించి యుందురు. అట్టి పనికిరాని వారి పనికి మాలిన మాటలు వినక, ఈ పద్యములలో చెప్ప బడిన భావము సరియైన గురుమూర్తి ద్వారా వినమని ఈ పద్య భావము.

**కం॥ పాట సుమీ భక్తుల కిది । బాట సుమీ బోధ జెంద భ్రమ రాకుండన్ । కోటసుమీ కందములను । తోటసుమీ దీన్ని తొలగ ద్రోయక వినుడీ ॥ 258**

**భావము :-** భక్తులు ఈ పద్యములను పాటల వలె నిత్యము పాడుకుంటూ ఉండవలెను. ఇవి పరిపూర్ణబోధకు చక్కని మార్గమును చూపించును. ఎరుక భ్రమ ఏర్పడకుండగ ఈ కంద పద్యములనే తోట, కోటవలె కాపాడును.

**కం॥ పరమహంసాశ్రమధరుని । పరిపూర్ణపు బోధవాని పనులు సమమెవా । వైరిగెరుగక నుతి నిందలు । గరపిన తత్ఫలము ప్రజల కగు నిజము జుమీ ॥ 259**

**భావము:-** ఉత్తమ సన్యాసాశ్రమధరుని వలె పరిపూర్ణబోధస్థుడు కూడ ఆచరించ వలెను, సమస్తము నందు వైరాగ్య భావము కలిగి సంసారము చేయునివాడై యుండవలెను, అని పరమహంసా శ్రమధరుని ఎరిగి, పూర్ణస్థితి పరుని ఎరుగని వారు పరమహంసాశ్రమధరుని పొగడుచు, పరిపూర్ణబోధస్థుని నిందించుదురు. అట్టి పజలకు, దాని యొక్క ఫలితమును తప్పక పొందెదరు. అనగా అట్టి నింద జేయు ప్రజలు జననమరణ ప్రవాహములోనే యుందురు అని భావము.

కం॥ ప్రతి దినము జదివియెవరీ। ప్రతినర్చనచేతు రట్టి ప్రజలకు బోధ। స్థితి కుదరగలదు గురుకృప। కతిపాత్రులు వారు వారి కడ్డము గలదే॥ 260

**భావము :-** యెవరు యీ గ్రంధమును ప్రతిదినము జదివి, యీ గ్రంధమును పూజించెదరో అట్టి భక్తులు గురుకృపకు అర్హులగుదురు. అందుచే వారికి పరిపూర్ణబోధ స్థితి కుదురగలదు. అట్టివారికి జనన మరణ ప్రవాహము లేకుండ జేసికొనుటకు ఆటంకము ఏమియు యుండదు.

**విశేషభావము :-** "యెవరీ ప్రతి నర్చన జేతు రు" అనగా యెవరీ గ్రంధమును పూజింతురో అని అర్థము. గ్రంధమును పూజించుట అనగా దేవతా మందిరములో ఈ గ్రంధమును ఉంచి పుష్పాదులచే పూజించుట అని అర్థము కాదు. ఈ గ్రంధములో చెప్పబడిన విధముగా భావమును గురు ముఖతా అధ్యయనము జేసి, చక్కని ఆచరణ గలిగి, అట్టి బోధ స్థితి గుదురుటకై అహర్నిశములు ఆ గ్రంధములోని భావమును హృదయ పద్మమునందు స్థాపించుకొనుట యే గ్రంధమును పూజించుట అని గుర్తించవలెను. అట్టి వారికి గురుకృప కలిగి నిరాటంకముగ జనన మరణ ప్రవాహమును దాటగలుగుదురు.

కం॥ ఇతర మెరుంగని సతమం। దతి మృష్టయై కానుపించు నట్టి మనము యీ। కృతి గురుశిష్యులు వారల। యిత రేతర వాగ్విలాసమివి మృషలు సుమీ॥ 261

**భావము :-** ఇతరము ఎంత మాత్రము ఎరుంగని శాశ్వతమైన పరిపూర్ణములో అతిమృష్టయై కనిపించే మనము, యీ గ్రంధము, గురు, శిష్యులు వారల యొక్క యితరుల యొక్క వాదప్రతివాదములతో కూడిన చర్చనీయాంశములు అన్నియు లేనివే సుమా॥

**విశేషభావము :-** సతము - అనగా శాశ్వతమైనది, అని అర్థము. ఇతర మెరుంగని సతమందు. అనగా ఇతరమును కాని తనను కాని ఎరుగని శాశ్వతమైన బట్టబయలు నందు. మిగిలిన సమస్తము లేవు. ఈ చెప్పబడిన అంశములు, చెప్పిన గురుశిష్యులు, యితరము సమస్తము అంతయు కలవలె లేనిదే.

(సతము అనగా లోతైన, రహస్యమైన, శాశ్వతమైన అని అర్థములు కలవు. ఇచ్చట శాశ్వతమైనది అని అర్థము చెప్పవలెను).

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత, క్షరాక్షరోపాధి
ద్వయదోష రహిత కంద పద్యములకు
శ్రీ సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ, అష్టతను
నిరసన శ్రీ ఆరట్ల రామారాయ గురుసార్వ భౌమ
ప్రియశిష్యుండును, నితుందినస గోత్రోద్భవ
శ్రీ సూర్యనారాయణావధాని దత్త పుత్రుండును అగు
శ్రీ సమరస బోధానంద వెంకట రామ
నామధేయునిచే వ్రాయబడిన
భావ - విశేష భావములు
సమాప్తము.

*॥సర్వం శ్రీ సద్గురు చరణా రవిందార్పణ మస్తు॥*

జైగురు



# మేలుకొలుపు (పాట)

## (భ్రాంతి రహిత శ్లోకములు - భావముతో)

మేలుకో ఓ దేశికేంద్ర । మేలుకో ఓ పూర్ణసాంద్ర ।
మేలుకో శివరామదీక్షిత । మేలుకోవయ్యా ॥ దేవా -
మేలుకొనవయ్యా ॥

శ్లో॥ భ్రమేణాహంభ్రమేణత్వం । భ్రమేణోపాసకం జనః ।
భ్రమేణేశ్వరభావత్వం । భ్రమమూలమిదంజగత్ ॥ 1

భ్రాంతి చేతను నేను నీవును । భ్రాంతియే యీశ్వర జగత్తని । భ్రాంతియే సర్వంబటంచు, విభ్రాంతులను జేయా । యీ జగద్భ్రాంతి విడదీయా ॥ దేవా . . . మేలుకొనవయ్యా ॥

శ్లో॥ త్యజధర్మమధర్మంచ । ఉభేసత్యాఽనృతేత్యజ ।
ఉభేసత్యాఽనృతేత్యక్త్వా । యేనత్యజసితత్త్యజ ॥ 2

ధర్మధర్మములాలో రెంటిలో । మర్మమును బోధించి విడుమని । మర్మమెరిగిన జ్ఞాతయౌ నన్నసలు విడుమనగా । గురుకట్నమునుగొనగా ॥ దేవా . . మేలుకొనవయ్యా ॥

శ్లో॥ గురుణావరణత్యాగః । అనావరణ ముత్తమం ।
పరిపూర్ణం పూర్ణమేవ । పూర్ణాచల సముద్రవత్ ॥ 3

సరగునను సద్గురుని గొల్చెటి । ధీరవరులా వరణ రహితుల । జేసి పరిపూర్ణాచల సాంద్రులఖండులుగజేయా ॥ యీ శరీరాత్మలను దీయా ॥ దేవా... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ అభీజం వృక్షసంపన్నం । శాఖాపల్లవ వర్జితం ।
పుష్పంనాస్తి ఫలంనాస్తి । సంపూర్ణం వృక్ష వర్జితం ॥ 4

అష్టవిధ ప్రకృతుల చేతను । సృష్టికారణ మాయెననుచును । స్పష్టముగ శోధించి చూచిన । బీజరహితమనీ । నిర్బీజ బ్రహ్మమనీ ॥ దేవా .... మేలుకొనవయ్యా॥

శ్లో॥ సర్వశూన్యం మయారూపం । జన్మశూన్యం స్వభావతః ।
జన్మభావేన మృత్యుశ్చ । పరిపూర్ణం స్వభావతః ॥ 5

జరయు మృతులును లేని పూర్ణము । విరివిగను జన్మంబుశూన్యము । తరచదానందేమి లేకను । దండిగున్నదనీ ॥ పరిపూర్ణ బ్రహ్మమనీ ॥ దేవా...... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ జన్మభావే కర్మంనాస్తి । కర్మభావే ఫలం నహి ।
ఫలాభావేభయంకుత్ర । భయాభావేనసంశయః ॥ 6

దేశికా మీకరుణచేతను । ఈశరీరద్వయము పోయిన । నాశమౌ జన్మకర్మ ఫలభీతులు, లేశమైనానూ ॥ నిశ్శంశయముగానూ । దేవా ... మేలుకొనవయ్యా॥

శ్లో॥ ఇంద్రజాలమిదం సర్వం । యధామరుమరీచికా ।
అఖండితమనాకారం । వర్తతే కేవలం శివం ॥ 7

ఉండిలేనిది ఇంద్రజాలము । ఎండమావుల వలెను తోచును । ఖండితముగానట్టి అచల, పూర్ణబ్రహ్మమునా । పరిపూర్ణ గురుడనినా ॥ దేవా ... మేలుకొనవయ్యా॥

శ్లో॥ శుద్దేసుషుప్తావివచ । తస్మిన్నాహం కదాచన ।
తద్వ్యత్సదాపి యస్యాస్తి । ప్రపంచం నాస్తితస్యవై ॥ 8

షుప్తియందున నేను లేనటు । జ్ఞప్తిలేనా పూర్ణ బ్రహ్మని । జ్ఞప్తి లేక నిర్లిప్తుడవై । షుప్తి జెందకనూ ॥ సౌజ్ఞప్తి విడచియును ॥ దేవా .... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ యధానాహం తధాశుద్ధం। తస్మాత్సుద్ధేన నిర్ణయః। జగదస్తీతి కోవేద। నాస్తికోనచ నిర్ణయః ॥ 9

లేనినేనను నేను యెన్నడు। లేకపోవును గాని దెన్నడు। నేను గానాపూర్ణ బ్రహ్మను। నిర్ణయించదనీ ॥ వర్ణించలేనిదనీ। దేవా... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ। దేహోనాస్తి కదాచన। అస్తినాస్తీతి కోవేద। నిర్ణయోనాస్తి సర్వదా ॥ 10

అద్వితీయము అచల పూర్ణము।ప్రకృతి ద్వయ దోషరహితము। సద్విచారణ కేవలాత్మను। యెవ్వరెరుగుదురు ॥ నివ్వెరను పొందెదరూ॥ దేవా ........ మేలు కొనవయ్యా ॥

శ్లో॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం।బుద్ధేశ్చలన కారణం। ఉపదేశాద్ధరే ర్బుద్ధ్వా। రమతే సర్వకర్మసు ॥ 11

బుద్ధి చాంచల్యమును జేసును । శాస్త్రజ్ఞానము బహు క్లేశము । హద్దు మీరక గురుని ముఖమున । పద్ధతిని వినిన ॥ శుద్ధైన మార్గమునా ॥ దేవా .... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ ఉల్కాహస్తోయధాకశ్చి । ద్రవ్యమాలోక్యతాంత్యజేత్ ।
జ్ఞానేన జ్ఞేయమాలోక్య । పశ్చాత్ జ్ఞానం వినశ్యతి ॥ 12

తిమిరమందున నున్న వస్తువు । అమల జ్యోతి చెవెదకి విడచును । జ్యోతి నటువలె నున్న జ్ఞప్తిచె । జ్ఞేయమెరుగుమనీ ॥ తత్ జ్ఞప్తి విడువుమనీ ॥ దేవా ... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ జ్ఞానమజ్ఞానినంద్రుష్ట్వా । ద్వయోస్త్యజతినిశ్చయం
ద్వయోస్త్యజతియత్జ్ఞానం । తత్ జ్ఞానంచ పరిత్యజేత్ ॥ 13

తిమిరమందున నున్న వస్తువు । అమలజ్యోతి చెవెదకి విడచును । జ్యోతినటువలె నున్న జ్ఞప్తిచె । జ్ఞేయమెరుగుమనీ ॥ తత్ జ్ఞప్తి విడువుమనీ ॥ దేవా... మేలుకొనవయ్యా ॥

శ్లో॥ విద్యాంతం।బ్రహవిద్యాంతం । వార్తికాంతమగోచరం ।
పూర్ణబోధం ప్రవక్ష్యామి । శృణుశిష్యమహోత్తమం ॥ 14

విద్యకంతము బ్రహ్మవిద్య । దీనికంత మెవార్తి కంబగు । వార్తికాంతమె అగోచర మవ్యక్తమదియనుచు ॥ తద్దరి నిపూర్ణబోదనుచూ ॥ దేవా ... మేలుకొనవయ్యా ॥

వాసిగా తొస్పూడిపురమున । స్థాపితంబౌ పీఠమందున । దోసిలొగ్గియు । రామరావిటులేక మేల్కోల్పే ॥ గురుబృందమున మేల్కో । దేవా .... మేలుకొనవయ్యా॥ మేలుకోఓదేశికేంద్రా ...

## మేలుకొలుపు

**కటకటా మోసమాయెను । మోసమాయెను జీవచూడగ । మోహపాశము లధికమాయెను । గాశిజెందక జేసెనీగతి । కర్మమేమందున్ ॥ జీవామేలుకొనవే ॥**

1) కల్పశతములకన్న మిక్కిలి । కాలమాయెను తిరిగి చూడర । అల్ప సుఖమనె, కలలో మురయుచు । నాడుచున్నావూ ॥ జీవా ... మేలుకొనవే ॥

2) కోటి జన్మము లెత్తియును । శతకోటి దుఃఖము లనుభవించిన । నాటి మాటలు దలచుకొంటివె । నాటు నీ మదికీ ॥ జీవా .... మేలుకొనవే ॥

3) యిరువదొక వెయ్యారు నూరులు । జరుగుహంసలు తరగునాయువు । హరిహరాదులువచ్చి నిలిపిన । ఆగదీతనువూ ॥ జీవా ... మేలుకొనవే ॥

4) లేనిపోని దుఃఖజాలము । లోనబడి చెడిపోవు టెందుకు । మానమవమానంబు లన్నీ । మమతలిడలేవూ ॥ జీవా .... మేలుకొనవే ॥

5) నిజగురుండను సూర్యుడిప్పుడు । నిజముగా నుదయించె చూడుము । త్రిజగములలో వారు మేల్కొని । తెలివి గన్నారూ ॥ జీవా ... మేల్కొనవే ॥

6) బట్టబయలును గురుడు జూపిన । నట్టులేకను పుడమియందున । పట్టువీడక గుట్టు మరువక । దిట్టమైపోవే । జీవా ... మేలుకొనవే ॥

7) మాయతనువై మాయతానై । మాయపనులనుజేయుచును మరి । మాయ తన మర్మంబుగననే । మాయమైపోవున్ ॥ జీవా .... మేలుకొనవే ॥

8) ద్వాదశీషోడశులనే జల । ధారకర్ణములందు సోకిన । బాధలన్నియు తొలగినీవిక । భ్రాంతులొదిలేవూ ॥ జీవా .... మేలుకొనవే ॥

9) భాగవత శ్రీకృష్ణ దేశిక । ప్రభువరుండిటురానె వచ్చెను । వేగనితను మనధనంబులు । వీడిశరణనవే ॥ జీవా ..... మేలుకొనవే ॥

10) పీల్ఖానాశంకరుండని । పిలచి ప్రభువరుడేలినాడట । మూలములేనట్టి యెరుకను । ముంచివేసిరటా ॥ జీవా .... మేలుకొనవే ॥

# కీర్తన

**గాయతి గురునామం । హం రహితం , రహితం ॥**

**గాయతి గురునామం ॥**

1) నిర్విశేషరస నిర్గుణరూపం । సర్వబలాత్మపరాత్పర సహితం ॥ గాయతి ॥

2) బ్రహ్మవిష్ణు రుద్రాత్మకతీతం । బ్రహ్మాండాంతర స్వయంప్రకాశం ॥ గాయతి ॥

3) జన్మకర్మభవనాశన దైవం । అమలస్వరూపం ఆనందరహితం ॥ గాయతి॥

4) పలువిధ జన్మానికృత పాపపుణ్యం । కలుషిత బంధద్వయ దోషరహితం॥ గాయతి ॥

5) సాధన రహిత జిజ్ఞాసువేద్యం । ఆదికారణ మద్వయరూపం । గాయతి॥

6) రామరాయశ్రీ సద్గురుచరణం । కామరహితయన్ రామం శరణం ॥ గాయతి ॥

# సభావిజ్ఞాపన కీర్తన

ఎందరో మహానుభావులు । అందరికి వందనములు ॥ ఎందరో ॥

1) ఆగమనిగమాంతవేద్యులు । భోగమోక్షవిరాగశ్రేష్ఠులు । సద్గురూపదిష్టులు యీ జగమెరుకలు రోసినట్టివా ॥ రెందరో ॥

2) హరిహరులకు వశముగాని । వరగురు పరిపూర్ణభావము । స్థిరముగ నెరిగియు నెరుగక । గుర్తురహిత దేశికవరు ॥ లెందరో ॥

3) దేహి దేహముగాకను । సోహంకస్త్య మెయెరుకని । సోహం కస్త్యము గాకను। అహరహిత అశరీర గురువరు ॥ లెందరో ॥

4) సమరసబోధానందుకు । భూమజూపి భ్రమనుబాపి । జన్మ జరామరణ వర్జిత, రామరాయగురుదేవతుల్యు ॥ లెందరో ॥

# జెండా వందన గీతము

1) జెండాను పైకెత్తు మన్నా । అచల జెండా
క్రింద నిలచి దండ మిడుమన్నా ॥జెండాను॥

2) అన్నివేల్పులకన్న మిన్నా । దీని కన్నా
వేరొండు లేదన్నా మాయన్నాజెండాను॥

3) వేదాంత సారమోయన్నా । మాయవాద
రహితంబైన బోధ గనుమన్నా ॥జెండాను॥

4) మోక్షమే బట్ట బయలన్నా । అందు సాక్షి
తత్వము లేని సంజ్ఞనే సున్నా ॥జెండాను॥

5) బ్రహ్మ విష్ణు మహేశులన్నా । పరబ్రహ్మ
తత్వంబిదే బయలు గనిరన్నా ॥జెండాను॥

6) శివరామ దీక్షితుల జెండా । ఇది భవనాశ
స్థితిలేని పరిపూర్ణ జెండా ॥జెండాను॥

## పరంపర మంగళహారతి

యే మహనీయుడు, ఆ మహాబయలెరిగి, కామించి యెరుకనుకడకుద్రుంచి। ప్రేమతో శ్రీదేవి ప్రాణవల్లభుడైన భూమ సమాన శ్రీమహావిష్ణునకూ ॥ మంగళం మంగళం ॥ సద్గురుదేవా మంగళం మంగళం ॥

ఆ విష్ణుసేవకుడై, ఆవరణరహితుడై, అవని లోరవిసొంజ్ఞ యాజ్ఞవల్క్య । భవనాశస్థితిలేని పరిపూర్ణబోధను, చొరంగ వినిపించె జనకునకూ ॥ మంగళం మంగళం ॥ సద్గురుదేవా మంగళం - మంగళం ॥

శ్రీ శుక ఋషివరుడు, ఆశతో జనక, మహారాజ సన్నిధిజేరి, అచల బోధా । భాసురంబుగన్వడసె నొసగెసాందీపునకు । శ్రీ సాందీపుడు శ్రీశకేశవునకు ॥ మంగళం । మంగళం । సద్గురుదేవా మంగళం - మంగళం ॥

గోవిందుడును, ఆనందరహితుడగుచు, సుందరి పరమపతివ్రతకు । అందముగ రుక్మిణి నందలోలుండయై । ముందుగ బయలుద్ధ వర్జనులకూ । మంగళం - మంగళం । సద్గురుదేవా మంగళం - మంగళం ॥

శ్రీధరుని శివరామ, దీక్షితులు పూజించి, ఆద్యంతరహిత అశరీరులైరి । ఈధర రామలింగార్యుల కరుణచే బోధ జెందిన పరమా రాధ్యులకూ ॥ మంగళం - మంగళం ॥ సద్గురుదేవా, మంగళం - మంగళం ॥

స్థిరముగ పరమారాధ్యులను సేవించి, యెరిగే యెరుకను విడచే, దేశికయ్యా। వరదేశికయ్యాకు పరగ శిష్యుండైన, నాగయ్య యను నామాంకితునకూ ॥ మంగళం - మంగళం ॥ సద్గురు దేవా ॥ మంగళం మంగళం ॥

**ఇల నాగయ్యా గురుని, వలన బోధను పొంది, బలరామ పండితులు బాగుగను । అల బలరామార్యులచే కలనెడబాసిన । కృష్ణమాచార్యుల కిష్టముగ ॥ మంగళం - మంగళం ॥ సద్గురుదేవా। మంగళం - మంగళం ॥**

కృష్ణమాచార్యులకు । ఇష్టసేవకులై, ప్రతిష్ఠ నొందిన సన్యసార్యులిలను । తుష్టి చెందిన యట్లు, స్పష్టముగను బోధ । శిష్యులకొసగెనుత్కృష్టముగ । మంగళం - మంగళం ॥ సద్గురుదేవా, మంగళం - మంగళం ॥

**ప్రియముతో దుర్గా, నంద పంచదశియనుచు, దయతో దీక్షా నామమొసగి । భయపడకుమని ఋజుపునయమున ద్వాదశి, సూచన నిచ్చిన సద్గురునకు ॥ మంగళం - మంగళం ॥ సద్గురుదేవా, మంగళం - మంగళం ॥**

దుర్గానందునిసేవ, దీర్ఘముగా గావించి, అర్ఘ్యపాద్యములచే యెరుకన్ విడచి । మార్గదర్శియైన, సమరస నిర్మల ప్రజ్ఞాన్విలక్షణ, రామప్రభునకూ । మంగళం - మంగళం ॥ సద్గురుదేవా, మంగళం - మంగళం ॥

**పరమగు రామ, ప్రభు చరణసేవను జేసి, యెరుకపరముల రెంటి మరుగు నెరిగి । వరసుందరాంబ సహా ధర్మపత్ని సహిత, సమరస్బోధానంద రామప్రభునకూ । మంగళం - మంగళం ॥ సద్గురుదేవా - మంగళం, మంగళం ॥**

**జై సద్గురు ప్రభు మహారాజుకి జై**